FOR FAVOUR OF REVIEW

# ప్రాచీన భారతదేశ చరిత్ర

'చరిత్ర' విద్యార్థులు, ఉపాధ్యాయులకు
ఉపయోగపడే పుస్తకం.


ఆంగ్లమూలం రామ్‌శరణ్ శర్మ

తెలుగు సేత వల్లంపాటి వెంకటసుబ్బయ్య





విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్ 4 1 435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్ 500 001

ANCIENT INDIA by Prof Ram Sharan Sharma
English to Telugu Translation by Vallampati Venkatasubbaiah

ప్రచురణ నెం 2298

ప్రతులు 1000

ప్రథమ ముద్రణ జనవరి, 2002



లోపలి చిత్రాలు, మ్యాపులు ఎన్ సి ఇ ఆర్ టి న్యూఢిల్లీ
వారు ప్రచురించిన ఆంగ్ల ప్రచురణలోనివి, వారి సౌజన్యంతో

ముఖచిత్రం రాజా

వెల రూ 90-00

ప్రతులకు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి

ముద్రణ కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29 ఫోన్ 3224831

# కృతజ్ఞతలు

ప్రస్తుత ముద్రణ కోసం ఇందులోని విషయాన్ని పరిష్కరించే సందర్భంలో ఆచార్య బిడి ఛటోపాధ్యాయ, యంజియస్ నారాయణన్, కెకె సిన్హా, శ్రీమతి ఇందిరా అర్జున్ దేవ్‌ల సూచనలు బాగా ఉపకరించాయి ఆచార్య అర్జున్ దేవ్ రాతప్రతిని ఆమూలాగ్రం సునిశితంగా చదవడమేగాదు విలువైన సూచనలూ చేశారు ముద్రణ సందర్భంలో సూచికను తయారుచేయడమేగాక, అచ్చు తప్పులను కూడా డాక్టర్ సీతారామరాయ్ సరిదిద్దారు వీరందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు అయితే గ్రంథంలో వచ్చిన కొన్ని గ్రామాలకూ, చిత్రాలకింద ఇచ్చిన అవే గ్రామనామాలకూ కొన్ని ముద్రణలో ఉచ్చారణపరమైన తప్పులు దొర్లాయి దానికి పాఠకులు క్షమించాల్సిందిగా ప్రార్థన

ఆర్ యస్ శర్మ

# విషయసూచిక

* * *

# మనిషికి మహాత్ముడిచ్చిన తాయెత్తు

"మీకో తాయెత్తిస్తాను ఎప్పుడు మీరు సందేహాలకు గురౌతుంటారో, ఎప్పుడు మీలో అహంభావం ప్రకోపిస్తుందో అప్పుడు మీకు మీరే ఈ పరీక్షను చేసుకోండి

ముందుగా గతంలో మీరు చూసిన అతి నిరుపేద – అతి బలహీనుడి ముఖం గుర్తుకు తెచ్చుకోండి మీరు చేపట్టనున్న ఏ చర్యనా అతనికి ఏ మాత్రమైనా ఉపయోగకరంగా ఉంటుందా? అనీ, ఆ చర్య అతనికి లాభిస్తుందా? అనీ, అతని జీవితం మీదా – జీవిత లక్ష్యం మీదా అజమాయిషీ చేసే శక్తి అతనికి అందిస్తుందా? అనీ, మరో మాటలో చెప్పాలంటే ఆకలీ ఆధ్యాత్మిక శక్తులూ కొరవడిన లక్షలాది మందిని స్వరాజ్యం దిశగా నడిపిస్తుందా? అనీ ప్రశ్నించుకోండి

అప్పుడు, మీ అనుమానాలూ, మీలో తలెత్తిన అహంభావం క్రమంగా కరిగిపోవడం చూడచ్చు"

M K Gandhi

# అధ్యాయం: 1

# ప్రాచీన భారతదేశ చరిత్ర ప్రాధాన్యత

ప్రాచీన భారతదేశ చరిత్రను అధ్యయనం చేయటానికి అనేక కారణాలున్నాయి మనదేశంలో అత్యంత ప్రాచీనమైన సంస్కృతుల్ని ఎవరు, ఎలా, ఎప్పుడు, ఎక్కడ అభివృద్ధి చేశారో ఆ అధ్యయనం మనకు చెబుతుంది వారి జీవితాలకు స్థిరత్వాన్నీ, భద్రతనూ ఇచ్చిన వ్యవసాయాన్ని వారు ఎలా ప్రారంభించారో అది సూచిస్తుంది ప్రాచీన భారతీయులు ప్రకృతి వనరుల్ని ఎలా కనుగొన్నారో, వాటిని తమ అవసరాలకు ఎలా ఉపయోగించుకున్నారో, నిత్యావసరవస్తువుల్ని ఎలా సమకూర్చుకున్నారో చూపుతుంది వ్యవసాయం, నూలు వడకటం, బట్టలు నేయటం మొదలైన వృత్తుల్ని వారు ఎలా నేర్చుకున్నారో ప్రాచీన చరిత్రను అధ్యయనం చేయటంద్వారా మనం తెలుసుకోవచ్చు పల్లెల్నీ, పట్టణాలనీ, చివరగా పెద్ద రాజ్యాలనీ వారు ఎలా స్థాపించారో కూడా మనం అర్థం చేసుకోవచ్చు

రాత నేర్చుకోనంతవరకూ ఎవరూ ఎవర్నీ నాగరికులుగా పరిగణించరు ఈనాడు భారతదేశంలో వాడుకలో ఉన్న రాతపద్ధతులన్నీ ప్రాచీన లిపుల్లోనుంచి వచ్చినవే ఈనాడు మనం ఉపయోగిస్తూ ఉన్న భాషలు కూడా అలా వచ్చినవే ఈనాడు మనం ఉపయోగిస్తున్న భాషలకు వేళ్ళు ప్రాచీన కాలంలోనే ఉన్నాయి ఈ భాషలు ఆనాటినుంచీ క్రమక్రమంగా అభివృద్ధి చెందుతూ వచ్చినవే

## భిన్నత్వంలో ఏకత్వం

భారతదేశం అనేక జాతుల నివాసభూమి కాబట్టి ప్రాచీన భారతదేశ చరిత్ర ఆసక్తికరంగా ఉంటుంది ఆర్యులకు పూర్వులూ, ఇండో – ఆర్యులూ, గ్రీకులూ, సీధియాన్లూ, హూణులూ, తురుష్కులూ మొదలైన జాతులవారు భారత దేశాన్ని తమ నివాసభూమిగా చేసుకున్నారు భారతీయ సామాజిక వ్యవస్థా, కళలూ, సాహిత్యమూ అభివృద్ధి చెందటానికి ప్రతి జాతీ తన వంతు దోహదాన్ని చేసింది ఈ ప్రజలూ, వారి సంస్కృతీ విడదీయటానికి వీలులేనంతగా కలిసిపోయాయి ఈనాడు వాటిలో ఒక్క అంశాన్నికూడా దాని అసలు రూపంలో గుర్తించటానికి వీలులేదు

ఉత్తర దక్షిణాల, తూర్పు పడమరల సాంస్కృతిక లక్షణాలు ఒకటిగా సమ్మేళనం చెందటం ప్రాచీన భారతదేశ చరిత్రలోని ఆశ్చర్యకరమైన అంశం ఆర్య లక్షణాలు ఉత్తర భారతానికి చెందిన వైదిక, సంస్కృతభాషా సంస్కృతికి చెందినవి పూర్వ ఆర్య లక్షణాలు దక్షిణ భారతానికి చెందిన ద్రావిడ, తమిళ సంస్కృతికి చెందినవి క్రీ పూ 1500–500 కాలానికి చెందిన వైదిక సాహిత్యంలో అనేక ద్రావిడ భాషా పదాలూ, సంస్కృతేతర పదాలూ కనిపిస్తాయి అవి అవైదిక దక్షిణ భారతానికి చెందిన భావాలనూ, వ్యవస్థలనూ, ఉత్పత్తులనూ, జానపదాలనూ సూచిస్తాయి అలాగే క్ర పూ 300 – క్రీ శ 600 సంవత్సరాలకు చెందిన అత్యంత ప్రాచీన "సంగం" తమిళ సాహిత్యగ్రంథాల్లో అనేక పాళీ, సంస్కృత పదాలు కనిపిస్తాయి అవి గంగామైదానాల్లో అభివృద్ధి చెందిన భావాలనూ, వ్యవస్థలనూ సూచిస్తాయి ఆర్యులకు పూర్వులైన గిరిజన జాతుల నివాస భూమి అయిన తూర్పుప్రాంతంకూడా ఈ ఉమ్మడి సంస్కృతికి తన వంతు దోహదం చేసింది ఈ ప్రాంతం ప్రజలు ముండా, కొలారియన్ భాషల్ని మాట్లాడుతారు పత్తి ఉపయోగం, సముద్రయానం, తవ్వకపుకర్ర మొదలైన వాటిని సూచించే ఇండో–ఆర్యన్ పదాలు ముండా భాషల్లోనుంచే వచ్చాయని భాషాశాస్త్రవేత్తలు భావిస్తారు ఛోటానాగపూర్ పీఠభూమిలో అనేక ముండా జనపదాలు కనిపించినా, ముండా సంస్కృతి అవశేషాలు ద్రావిడ సంస్కృతి అవశేషాలంత బలంగా లేవు బ్రాహ్మణ సంస్కృతీ, ముండాసంస్కృతీ ఒకదానితో మరొకటి కలిసిపోయాయి వైదిక భాషయొక్క ఉచ్చారణలో, పదప్రయోగంలో వచ్చిన మార్పులకు ద్రావిడ ప్రభావం కంటే ముండా ప్రభావమే ముఖ్యమైన కారణం ఆ మార్పుల్ని ముండా ప్రభావం ఆధారంగానే మరింత చక్కగా, సమగ్రంగా వివరించవచ్చు

ప్రాచీన కాలం నుంచీ కూడా భారత దేశంలో మతాలున్నాయి హిందూమతం, జైనమతం, బౌద్ధమతం

ప్రాచీన భారతదేశంలో పుట్టాయి ఈ మతాలూ, వాటి సంస్కృతులూ ఒకదానితో మరొకటి కలిసి, పరస్పరం ప్రభావితం చేసుకున్నాయి వీటిని అనుసరిస్తున్న ప్రజలు విభిన్నమైన భాషల్ని మాట్లాడినా, విభిన్నమైన మతాలనూ, ఆచార వ్యవహారాలనూ అనుసరించినా దేశం మొత్తం మీద వీరంతా కొన్ని సాధారణ జీవిత పద్ధతుల్ని అనుసరిస్తారు మన దేశంలో గొప్ప భిన్నత్వం ఉన్నా అంతర్లీనంగా అగాధమైన ఏకత్వం ఉంది

మన ప్రాచీనులు ఐక్యత కోసం గట్టిగా ప్రయత్నించారు ఈ విశాలమైన ఉప ఖండాన్ని వారు ఒకటిగా పరిగణించారు "భరతులు" అనే ఒక ప్రాచీన తెగ పేరు మీద వారు మొత్తం దేశాన్ని "భారత వర్షం" అని పిలిచారు ఈ దేశంలోని ప్రజలను "భారత సంతతి" లేదా "భరతుల సంతానం" అని పిలిచారు మన ప్రాచీన కవులూ, తత్త్వవేత్తలూ ఈ దేశాన్ని అఖండమైన ఒకే దేశంగా పరిగణించారు హిమాలయాలనుంచీ హిందూ మహాసముద్రం వరకూ ఉన్న దేశాన్ని ఒకే రాజు పరిపాలించవలసిన ప్రాంతంగా భావించారు హిమాలయాలనుంచీ కన్యాకుమారి వరకూ, తూర్పున బ్రహ్మపుత్ర లోయనుంచీ పడమట సింధూనదికి అవలవైపు వరకూ ఈ దేశాన్ని పరిపాలించిన రాజుల్ని అందరూ ముక్తకంఠంతో పొగిడారు అలాంటి రాజుల్ని చక్రవర్తులన్నారు ఇలాంటి రాజకీయ ఐక్యత ఈ దేశంలో కనీసం రెండుసార్లు సాధించబడింది క్రీ పూ మూడవ శతాబ్దంలో అశోకుడు దక్షిణ భారతంలోని చిట్టచివరి భాగాన్ని తప్ప మొత్తం భారతదేశంలో తన సామ్రాజ్యాన్ని విస్తరింపచేశాడు మళ్ళీ క్రీ శ నాలుగవ శతాబ్దంలో సముద్రగుప్తుడు గంగాతీరం నుంచీ తమిళదేశం సరిహద్దులవరకూ తన ఖడ్గాన్ని విజయవంతంగా ఝుళిపించాడు ఏడవ శతాబ్దంలో చాళుక్యరాజు పులకేసి ఉత్తరాపథ చక్రవర్తి అయిన హర్షవర్ధనుణ్ణి ఓడించాడు రాజకీయ ఐక్యత లేకపోయినా దేశమంతా రాజకీయ వ్యవస్థలు దాదాపు ఒకే రూపాన్ని ధరించాయి భౌగోళికంగా భారతదేశం ఒకటేనన్న భావం రాజ్యకాంక్షాపరుల మనస్సుల్లోనూ సాంస్కృతిక నాయకుల మనస్సుల్లోనూ కొనసాగుతూనే వచ్చింది భారతదేశ ఐక్యతను విదేశీయులు కూడా గుర్తించారు వీరికి మొట్టమొదట సింధూనదీప్రాంతంలో నివసించే ప్రజలతో సంపర్కం కలిగింది వీరు ఈ దేశానికి ఆ నదిపేరే పెట్టారు "హిందు" అన్న పదం "సింధు" అన్న సంస్కృతపదంలో నుంచీ వచ్చిందే కాలక్రమానం గ్రీకు పదానికి దగ్గరగా ఉన్న "ఇండియా" అన్న పేరు స్థిరపడింది ఈ దేశాన్ని పర్షియన్, అరబిక్ భాషల్లో "హింద్" అని పిలవటం ప్రారంభించారు

భాషాపరంగా, సాంస్కృతికంగా ఈ దేశాన్ని ఏకం చేయటానికి ప్రయత్నాలు కొనసాగుతూనే వచ్చాయి క్రీ పూ మూడవ శతాబ్దంలో ప్రాకృతం అనుసంధాన భాషగా ఉపయోగపడింది దాదాపు భారతదేశమంతా అశోకుడు తన శాసనాలను ప్రాకృత భాషలో, బ్రాహ్మీ లిపిలో వేయించాడు తరువాత కాలంలో సంస్కృతం అదే స్థాయికి ఎదిగింది దేశంలోని మూలమూలల్లోనూ రాజభాషగా గౌరవాన్ని పొందింది ఈ పరిణామం క్రీ శ నాలుగవ శతాబ్దంలో గుప్త రాజుల కాలంలో ఎక్కువ ప్రసిద్ధిని పొందింది గుప్త రాజుల తరువాత భారతదేశం చిన్న చిన్న రాజ్యాలుగా విభజించబడినా రాజపత్రాలన్నీ సంస్కృతంలోనే రాయబడేవి

ఈ సందర్భంలో మరొక విశేషాన్ని కూడా గమనించాలి ప్రాచీన మహాకావ్యాలైన రామాయణ, భారతాలను తమిళదేశంలోని విద్వాంసులు – వారణాసి, తక్షశిలల్లోని విద్వాంసులలాగే – ఎంతో భక్తి శ్రద్ధలతో అధ్యయనం చేసేవారు ఈ మహాకావ్యాలు మొదట సంస్కృతంలో రాయబడ్డా – కాలక్రమాన అనేక స్థానిక భాషల్లోకి అనువాదం అయ్యాయి ఏ రూపంలో ఉన్నా భారతీయ సాంస్కృతిక విలువలూ, భావాలూ భారతదేశమంతా ఒకే విషయాన్ని ప్రబోధించాయి

భారతదేశంలో ఒక ప్రత్యేక సామాజిక వ్యవస్థ రూపొందింది అది కూడా భారతదేశ చరిత్రను మనం అధ్యయనం చేయవలసిన అవసరాన్ని తెలియచేస్తూ మన దృష్టిని ఆకర్షిస్తుంది ఉత్తర భారతదేశంలో అవతరించిన వర్ణ – కుల వ్యవస్థ దాదాపు భారతదేశమంతా విస్తరించింది ఈ వ్యవస్థ క్రైస్తవులనూ, ముస్లిములనూ కూడా ప్రభావితం చేసింది ఒక కులానికి చెందిన హిందువులు మతం మార్చుకొని మరోమతాన్ని స్వీకరించినా తమ హిందూకులానికి చెందిన ఆచార వ్యవహారాలను కొనసాగిస్తూనే వచ్చారు

## వర్తమానానికీ గతానికీ మధ్య సంబంధం

ఆధునిక కాలంలో మనం ఎదుర్కొంటున్న సమస్య వెలుగులో గతాన్ని అధ్యయనం చేయటం ఒక ప్రత్యేకతను సంతరించుకుంటుంది ప్రాచీన సంస్కృతినీ, నాగరికతనూ పునరుద్ధరించాలని కొందరు గొంతుచించుకుంటూ ఉంటారు భారతదేశ చరిత్రలో గతించిపోయిన స్వర్ణయుగాలను తలుచుకొని చాలా మంది ఆవేశంతో ఉగ్రూత లూగిపోతుంటారు దీనికీ, ప్రాచీన సంప్రదాయాల్నీ, కళల్నీ భద్రపరచాలన్న శ్రద్ధకూ సంబంధం లేదు వీరు పునరుద్ధరించాలనుకుంటున్నది పాత సామాజిక వ్యవస్థనూ, సంస్కృతినీ మాత్రమే కాబట్టి మనం గతాన్ని మరింత బాగా అర్థం చేసుకోవాలి ప్రాచీన కాలంలో భారతీయులు అనేక రంగాల్లో అద్భుతమైన ప్రగతిని సాధించారనటానికి సందేహం లేదు

కాని ఆధునిక శాస్త్రవిజ్ఞానంతో, సాంకేతిక విజ్ఞానంతో పోటీ పడటానికి అవి చాలవు ప్రాచీన భారతీయ సమాజంలో దారుణమైన సామాజిక దురన్యాయం ఉండేదన్న వాస్తవాన్ని మనం విస్మరించలేము సమాజంలో తక్కువ స్థాయి వాళ్ళు – ముఖ్యంగా శూద్రులూ, అస్పృశ్యులూ – ఎన్నో ప్రతిబంధకాల బరువుతో కుంగిపోయారు వాటిని తలుచుకుంటే ఆధునికులు ఆశ్చర్యపోతారు పాత జీవిత పద్ధతిని పునరుద్ధరిస్తే ఈ అసమానతలు పునర్జన్మ పొంది, బలాన్ని పుంజుకుంటాయి ప్రాచీన భారతదేశంలో నాగరిక తవైపుగా జరిగిన ప్రయాణం – సామాజిక అసమానతలతో చేయి చేయి కలిపి జరిగింది మన ప్రాచీనులు ప్రకృతి సృష్టించిన ప్రతిబంధకాలను అధిగమించటంలో సాధించిన విజయాలు మనకు భవిష్యత్తులో ఆశనూ, ఆత్మవిశ్వాసాన్నీ కలుగ చేస్తాయి కానీ గతాన్ని ఆధునిక కాలంలోకి ఆహ్వానించటమంటే మన దేశాన్ని పట్టి పీడించిన సామాజిక అసమానతలను ఆహ్వానించటమే అందుచేత గతమంటే ఏమిటో తెలుసుకోకతప్పదు

ప్రాచీన కాలానికీ, మధ్య యుగాలకూ, ఆ తరువాత కాలానికి చెందిన అవశేషాలు ఈనాటికీ మన మధ్య కొనసాగుతూనే ఉన్నాయి పాత నియమాలూ, విలువలూ, సామాజిక ఆచార వ్యవహారాలూ ప్రజల మనస్సుల్లో పాతుకు పోయాయి వాటిని సులభంగా వదిలించుకోవటం సాధ్యం కాదు దురదృష్టవశాత్తు ఈ అవశేషాలు వ్యక్తి అభివృద్ధికీ, దేశాభివృద్ధికీ ప్రతిబంధకంగా తయారయ్యాయి వలస విధానం మన దేశంలో అమలులో ఉన్న కాలంలో వీటిని అదేపనిగా ప్రోత్సహించారు ఈ అవశేషాలను మన సమాజంలో నుంచీ తొలగిస్తే తప్ప భారతదేశం త్వరత్వరగా అభివృద్ధి చెందలేదు మనదేశం ప్రజాస్వామ్య పద్ధతిలో అభివృద్ధి చెందటానికీ, ఐకమత్యాన్ని సాధించటానికీ కులాల వ్యవస్థా, శాఖల వ్యవస్థా అడ్డంగా నిలబడుతున్నాయి కులాల అడ్డుగోడలూ, దురభిప్రాయాలూ విద్యావంతుల మనస్సుల్ని కూడా కలుషితం చేసి శారీరక శ్రమలోని ఔన్నత్యాన్ని గుర్తించనీయకుండా చేస్తున్నాయి స్త్రీలకు ఓటు హక్కు ఇచ్చినా – వారి తరతరాల సామాజిక బానిసత్వం సామాజికాభివృద్ధిలో వారు భాగస్వాములు కావటానికి అడ్డం వస్తోంది ప్రాచీన భారతదేశ చరిత్రను అధ్యయనం చేయటం ఈ దురభిప్రాయాలను లోతుగా అర్థం చేసుకోవటానికి ఉపయోగపడుతుంది కులవ్యవస్థకు బలాన్నిస్తున్న, స్త్రీల దైన్యానికి దోహదం చేస్తున్న, సంకుచిత మత శాఖలను కొనసాగిస్తున్న కారణాలేమిటో అర్థం చేసుకోవచ్చు గతాన్ని మళ్ళీ బతికించాలని కోరుకునేవారికి మాత్రమే కాకుండా, గతం యొక్క అసలు స్వభావాన్ని అర్థం చేసుకొని, మన దేశ అభివృద్ధికి ఎదురౌతున్న ఆటంకాల అసలు రూపాన్ని గురించి తెలుసుకోవాలని ఆశించేవారికి కూడా ప్రాచీన చరిత్రను అధ్యయనం చేయటంవల్ల ప్రయోజనం ఉంది

* * *

# అధ్యాయం: 2

# ప్రాచీన భారతదేశ చరిత్ర ఆధునిక చరిత్రకారులు

## వలసవాదుల అభిప్రాయాలు, వారు చేసిన దోహదం

విద్యావంతులైన భారతీయులు తమ సాంప్రదాయిక చరిత్రను మహాకావ్యాలుగా, పురాణాలుగా, ఆత్మకథల్ని పోలిన గ్రంథాలుగా రాతప్రతుల రూపంలో భద్రపరచారు కానీ బ్రిటీష్ వలస యంత్రాంగం అవసరాలకోసం పద్దెనిమిదవ శతాబ్దం రెండవ సగంలోనే ప్రాచీన భారతదేశ చరిత్రను గురించిన ఆధునిక పరిశోధన ప్రారంభమైంది 1765లో బెంగాల్, బీహార్ రాష్ట్రాలు తూర్పు ఇండియాకంపెనీ పరిపాలన కిందికి వచ్చినప్పుడు వారు హిందూ వారసత్వ చట్టాన్ని అమలు చేయటం కష్టమని తెలుసుకున్నారు కాబట్టి అత్యంత ప్రామాణికంగా పరగణించబడుతూ ఉన్న "మనుధర్మశాస్త్రం"ను 1776లో "ఎ కోడ్ ఆఫ్ జెంటూ లాస్" అన్న పేరుతో అనువదించారు బ్రిటీష్ న్యాయాధిపతులు హిందువులకు సంబంధించిన సివిల్ వ్యాజ్యాలను విచారించేటప్పుడు హిందూపండితులూ, ముస్లిముల సివిల్ వ్యాజ్యాలను విచారించేటప్పుడు ముస్లిం మౌల్వీలూ వారికి సహకరించేవారు ప్రాచీన చట్టాలనూ, ఆచారాలనూ అర్థం చేసుకోవటం కోసం ప్రారంభమైన ప్రయత్నం పద్దెనిమిదవ శతాబ్దమంతా కొనసాగింది చివరకది 1784లో కలకత్తాలో "ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్"ను స్థాపించేవరకూ వెళ్ళింది దీన్ని సర్ విలియ్ జోన్స్ (1746-1794) అన్న తూర్పుఇండియా కంపెనీ ఉద్యోగి ప్రారంభించాడు 1789లో "అభిజ్ఞాన శాకుంతలం" నాటకాన్ని ఆంగ్లంలోకి అనువాదం చేసినవాడు ఇతడే హిందువుల్లో విస్తృత ప్రచారంలో ఉన్న "భగవద్గీత"ను 1785లో విల్కిన్స్ ఆంగ్లంలోకి అనువదించాడు 1804లో "బాంబే ఏషియాటిక్ సొసైటీ", 1823లో "ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్"లు ప్రారంభమయ్యాయి మౌలికంగా యూరోపియన్ భాషలు సంస్కృతానికీ, ఇరానియన్ భాషలకూ చాలా సన్నిహితంగా ఉన్నాయన్న సిద్ధాంతాన్ని విలియం జోన్స్ నొక్కి చెప్పాడు ఈ ప్రతిపాదన జర్మనీలో, ఫ్రాన్స్‌లో, రష్యాలో, ఇతర యూరోపియన్ దేశాల్లో "ఇండాలజీ" (భారతీయ విషయాల అధ్యయనం) గురించి ఎంతో ఉత్సాహాన్ని రేపింది ఇంగ్లండ్‌లోనూ, అనేక ఇతర యూరోపియన్ దేశాల్లోనూ విశ్వవిద్యాలయాలు సంస్కృత అధ్యయనానికి ఆచార్య పీఠాలను ఏర్పాటు చేశాయి

భారతీయ విషయాల అధ్యయనానికి ఇతరులకంటే ఎక్కువగా దోహదం చేసిన విద్వాంసుడు ఎఫ్ మాక్స్ ముల్లర్ (1823-1902) ఇతడు జర్మనీలో జన్మించి, తన జీవితకాలంలో ఎక్కువ భాగాన్ని ఇంగ్లండ్‌లో గడిపాడు 1857లో జరిగిన తిరుగుబాటు అందరికీ కనువిప్పు కలిగించింది తాము పరిపాలిస్తున్న పరదేశీయుల ఆచార వ్యవహారాలను గురించీ సామాజిక వ్యవస్థను గురించీ మరింత లోతైన పరిజ్ఞానం తమకు ఉండవలసిన అవసరం ఉందని ఇంగ్లండ్ గుర్తించింది అలాగే బ్రిటీష్ సామ్రాజ్యాన్ని మరింత శక్తిమంతంగా చేయటం కోసం హిందూమతంలోని లోపాలనూ, బలహీనతలనూ క్రైస్తవ మిషనరీలు అన్వేషించటం ప్రారంభించారు మతం మార్పిడికి ప్రయత్నించారు ఈ అవసరాలను తీర్చటం కోసం మాక్స్‌ముల్లర్ సంపాదకత్వంలో ప్రాచీన గ్రంథాలను పెద్ద ఎత్తున అనువదింప చేశారు మొత్తం యాభై సంపుటాలు (కొన్ని సంపుటాల్లో అనేక భాగాలున్నాయి) "సేక్రెడ్ బుక్స్ ఆఫ్ ది ఈస్ట్" అన్న మాలికగా ప్రచురితమయ్యాయి ఏవో కొన్ని చైనా గ్రంథాలూ, ఇరాకీ గ్రంథాలూ అందులో చోటు చేసుకున్నా ఈ మాలికలో ప్రధానంగా భారతీయ గ్రంథాలే ఉన్నాయి

ఈ గ్రంథాలకు రాసిన ముందుమాటల ఆధారంగానూ, వాటిమీద ఆధారపడ్డ ఇతర గ్రంథాల ఆధారంగానూ మాక్స్

ముల్లర్, ఇతర పాశ్చాత్య విద్వాంసులూ ప్రాచీన భారతీయ సమాజాన్ని గురించీ, చరిత్రను గురించీ కొన్ని సాధారణీకరణాలు చేశారు వారు ప్రాచీన భారతీయులకు నియంతృత్వ ప్రభుత్వాలు అలవాటన్నారు భారతీయులు ఆధ్యాత్మిక సమస్యలతో, పరలోక సమస్యలతో సతమతమయ్యారే కానీ ఈ లోకం యొక్క సమస్యల్ని పట్టించుకోలేదన్నారు వర్ణవ్యవస్థ అత్యంత విషపూరితమైన సామాజిక పీడనాపద్ధతి అన్నారు భారతీయులకు జాతీయతాభావాన్ని గురించి కానీ, స్వపరిపాలనను గురించి కానీ ఎలాంటి అనుభూతులూ లేవని ఈ పాశ్చాత్య విద్వాంసులు గట్టిగా చెప్పారు

1904లో విన్సెంట్ ఆర్థర్ స్మిత్ "అర్లీ హిస్టరీ ఆఫ్ ఇండియా" అన్న గ్రంథాన్ని ప్రచురించాడు ప్రాచీన భారతదేశ చరిత్రను గురించిన మొట్టమొదటి క్రమబద్ధమైన పుస్తకం ఇదే ఇందులో ఈ సాధారణీకరణాల్లో చాలా భాగం కనిపిస్తాయి అనాటికి అందుబాటులో ఉన్న ఆధారాలను ఈ గ్రంథం లోతుగా అధ్యయనం చేసింది ఈ గ్రంథం దాదాపు యాభై సంవత్సరాలకాలం పాఠ్యగ్రంథంగా ఉపయోగపడింది ఈనాటికీ విద్వాంసులు దాన్ని ఉపయోగిస్తూనే ఉన్నారు స్మిత్ దృక్పథం సామ్రాజ్యవాదానికి అనుకూలమైనట్టిది అతడు నమ్మకస్తుడైన బ్రిటీష్ ఉద్యోగి కాబట్టి ప్రాచీన భారత దేశ చరిత్రలో పరదేశీయుల పాత్రను నొక్కి చెప్పాడు ఉదాహరణకు ఈ గ్రంథంలో మూడవ భాగాన్ని అలెగ్జాండర్ దండయాత్రలకు కేటాయించాడు భారతదేశాన్ని నియంతల దేశంగా, బ్రిటీష్ పరిపాలన ఏర్పడే వరకూ రాజకీయ ఐక్యతలేని దేశంగా విన్సెంట్ స్మిత్ చిత్రించాడు "ఏకవ్యక్తి పరిపాలన మాత్రమే భారతదేశ చరిత్రను రాసే చరిత్రకారుడు ఆలోచించదగ్గ పరిపాలనా విధానం" అన్నాడు విన్సెంట్ స్మిత్

మొత్తంమీద భారతదేశ చరిత్రను గురించిన బ్రిటీష్ వ్యాఖ్యానం భారతదేశ స్వభావాన్నీ, గతంలో సాధించిన విజయాలనూ తక్కువ చేయటానికీ, బ్రిటీష్ వలస పాలనను సమర్థించుకోవటానికీ చక్కగా ఉపయోగపడింది కానీ ఈ అభిప్రాయాల్లో కొన్ని కొంతవరకూ వాస్తవమే కొంతకాలం పాటు గౌతమ బుద్ధుని మరణాన్ని ఆధారంగా చేసుకొని కాలక్రమాన్ని లెక్కకట్టే అలవాటు ఉన్నా భారతీయులు చైనీయుల్లాగా కాలక్రమానికి గొప్ప విలువ ఇవ్వలేదు కానీ బ్రిటీష్ చరిత్రకారుల సాధారణీకరణాల్లో కొన్ని తప్పులనీ, మరికొన్ని విపరీతమైన అతిశయోక్తులనీ అనటానికి సందేహం లేదు బ్రిటీష్ సామ్రాజ్యవాద నిరంకుశత్వాన్ని భారతదేశంలో కొనసాగించటానికి అవి చక్కని ప్రచార సామగ్రిగా ఉపయోగపడ్డాయి భారతదేశ సంప్రదాయంగా వారు నొక్కి చెప్పిన ఏకవ్యక్తి పరిపాలన బ్రిటీష్ వైస్రాయి చేతిలో సర్వాధికారాలూ ఉండటానికి సమర్థనగా ఉపయోగపడింది

అలాగే భారతీయులకు పరలోక విషయాల మీద మాత్రమే ఆసక్తి కాబట్టి ఈ లోకంలో వారి బతుకును గురించి బ్రిటీష్ వలస పాలకులే శ్రద్ధ తీసుకోక తప్పదు కదా! స్వపరిపాలనను గురించి ఎంత మాత్రమూ అనుభవంలేని భారతీయులు ఇప్పుడు తమ వ్యవహారాలను తామే ఎలా చూసుకోగలరు? భారతీయులు తమ దేశాన్ని పరిపాలించుకోలేరనీ, ఆ సమర్థత వారికి లేదనీ నిరూపించటం ఈ సాధారణీకరణాలలోని అసలు సారాంశం

## జాతీయతా దృక్పథం

ఇదంతా భారతీయ విద్వాంసులకూ, మరీ ముఖ్యంగా పాశ్చాత్య దేశాల్లో విద్యాభ్యాసం చేసిన వారికీ సవాలుగా పరిణమించింది వీరు తమ ప్రాచీన చరిత్రను వలస వాదులు వక్రీకరిస్తున్న విధానాన్ని చూసి ఇబ్బంది పడ్డారు అదే సమయంలో భారతదేశంలో పతనమైపోతున్న భూస్వామ్య సమాజానికీ, ఇంగ్లండ్ లో అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ సమాజానికీ మధ్య ఉన్న తారతమ్యాన్ని చూసి బాధపడ్డారు కాబట్టి భారతీయ సమాజాన్ని సంస్కరించటానికీ, సంస్కరణ అవసరాన్నీ, మరీ ముఖ్యంగా స్వపరిపాలనకు భారతీయులకున్న అర్హతనూ నిరూపించే విధంగా ప్రాచీన భారతదేశ చరిత్రను పునర్నిర్మించటానికీ కొందరు భారతీయ విద్వాంసులు నడుము బిగించారు అలా చేయటంలో కొంతమందిని హిందూ మత పునరుద్ధరణ వాద జాతీయ భావాలు నడిపించాయి కానీ నిష్పక్షపాతమైన దృక్పథాన్నీ, హేతువాదాన్నీ అనుసరించిన చరిత్రకారులకు కూడా ఆ కాలంలో కొదువలేదు కొన్ని వేదాలనూ, "ఇండో–ఆర్యన్స్" అన్న గ్రంథాన్నీ ప్రచురించిన రాజేంద్ర లాల్ మిత్రా (1822–1891) వీరిలో రెండవ రకానికి చెందుతాడు ఇతనికి మన ప్రాచీన వారసత్వం పట్ల అపారమైన గౌరవం ఉంది కానీ ఇతడు ప్రాచీన సమాజాన్ని హేతువాద దృష్టితో చూడగలిగాడు ప్రాచీన కాలంలో గోమాంసాన్ని తినటం ఉండేదని నిరూపిస్తూ బలమైన పుస్తకాన్ని రాశాడు యూరోపియన్ సమాజాల్లో పారిశ్రామికీకరణానికి పూర్వం పని విభజన మీద ఆధారపడ్డ వర్గవ్యవస్థకూ, భారతదేశంలోని వర్ణవ్యవస్థకూ – అందులో కొన్ని ప్రత్యేకతలున్నా – మౌలికంగా తేడా లేదని నిరూపించటానికి మరికొందరు ప్రయత్నించారు

విభిన్నమైన ఆధారాలను ఒకచోట చేర్చి మన ప్రాచీన సామాజిక రాజకీయ చరిత్రను పునర్నిర్మించిన మహారాష్ట్ర విద్వాంసులు రామకృష్ణ గోపాల భండార్కర్ (1837–1925), విశ్వనాథ కాశీనాథ రాజ్వాడే (1869–1926) వీరు గొప్ప అంకితభావం ఉన్న చరిత్రకారులు దక్కన్‌లో శాతవాహనుల కాలంనాటి రాజకీయ చరిత్రనూ, వైష్ణవ మత శాఖ చరిత్రనూ,

ఇతర శాఖల చరిత్రనూ భండార్కర్ పునర్నిర్మించాడు అతడు గొప్ప సంఘ సంస్కర్త కూడా తన పరిశోధనల ఆధారంగా విధవా వివాహాలను ఆమోదించాడు బాల్య వివాహాలను నిరసించాడు కుల వ్యవస్థను తిరస్కరించాడు పరిశోధన మీద ఉన్న గొప్ప ఆకాంక్షతో వి కె రాజ్వాడే మహారాష్ట్రలోని గ్రామగ్రామానికీ సంస్కృత రాతప్రతుల కోసమూ, మహారాష్ట్ర చరిత్ర ఆధారాల కోసమూ తిరిగాడు ఈ ఆధారాలు ఇరవై రెండు సంపుటాలుగా ప్రచురణ పొందాయి అతడు ఎక్కువగా రాయలేదు కానీ అతడు మార్చ్ 1926లో మరాఠీ భాషలో రాసిన 'వివాహ వ్యవస్థ చరిత్ర' ఒక ఉద్గ్రంథంగా నిలిచిపోతుంది వేదాల మీదా, ఇతర గ్రంథాలమీదా నమ్మకంగా ఆధారపడటం చేతా, వివాహ వ్యవస్థలోని వివిధ పరిణామదశల్ని గురించి రచయితకున్న లోతైన పరిజ్ఞానంచేతా ఈ గ్రంథానికి ఆ గౌరవం దక్కుతుంది ఈ సంప్రదాయాన్ని సంఘ సంస్కర్తా, సంస్కృత విద్వాం సుడూ అయిన పాండురంగ వామన కాణే కొనసాగించాడు ఈ శతాబ్దంలో అతడు ఐదు సంపుటాలుగా ప్రచురించిన "ధర్మశాస్త్ర చరిత్ర" ధర్మశాస్త్రాలను గురించిన విజ్ఞాన సర్వస్వంలాంటి గ్రంథం ప్రాచీన భారతదేశంలో సామాజిక క్రమ పరిణామాన్ని అధ్యయనం చేయటానికి ఈ గ్రంథం ఎంతగానో ఉపయోగపడుతుంది

భారతదేశానికి రాజకీయ చరిత్రా, భారతదేశంలో నైపుణ్యమూ ఉన్నాయని నిరూపించటంకోసం భారతీయ విద్వాంసులు భారతీయ రాజకీయ వ్యవస్థనూ, రాజకీయ చరిత్రనూ శ్రద్ధగా అధ్యయనం చేశారు ఈ గౌరవం దేవదత్త రామకృష్ణ భండార్కర్ (1875–1957)కు దక్కాలి అతడు శాసన పరిశోధకుడు అతడు అశోకుణ్ణి గురించీ, ప్రాచీన భారతీయ రాజకీయ వ్యవస్థల్ని గురించీ గ్రంథాలు రాశాడు హేమచంద్ర రాయ్ చౌధురి (1892–1957) ఇంతకంటే విలువైన పరిశోధన చేశాడు ఇతడు మహా భారత యుద్ధకాలం నుంచీ (క్రీ పూ 10 వ శతాబ్దం), గుప్త సామ్రాజ్యానంతరకాలం వరకూ ప్రాచీన భారతదేశ చరిత్రను పునర్నిర్మించాడు అతడు యూరోపియన్ చరిత్రను బోధిస్తూ ఉండిన ఉపాధ్యాయుడు కావటంచేత యూరోపి యన్ చరిత్రకారుల అధ్యయన పద్ధతులనూ, తులనాత్మక సిద్ధాంతాలనూ ఈ గ్రంథంలో కొద్దిగా ఉపయోగించాడు అతడు యుగ విభజనను గురించి చర్చించ లేదు అతని అభిప్రాయం ప్రకారం ప్రాచీన భారతదేశ చరిత్ర క్రీ శ 6 వ శతాబ్దంతో అంతమౌతుంది ప్రాచీన భారతదేశ చరిత్రను పునర్నిర్మించటంలో వి ఎ స్మిత్ పాత్రను గుర్తించినా, అతణ్ణి రాయ్‌చౌదరి అనేక సందర్భాల్లో విమర్శించాడు అతని గ్రంథాల్లో గొప్ప పాండిత్యం కనిపిస్తుంది కానీ అశోకుని శాంతి విధానాన్ని విమర్శించే సందర్భంలో అతనిలోని తీవ్రవాద బ్రాహ్మణత్వం ఛాయలు బయట పడతాయి కానీ ఆర్ సి మజుందార్ (1888–1980)లో హిందూ పునరుద్ధరణవాద ఛాయలు మరింత ప్రబలంగా కనిపిస్తాయి మజుందార్ బహుగ్రంథ రచయిత అనేక సంపుటాలుగా వచ్చిన "భారతీయుల చరిత్ర, సంస్కృతి" అన్న సంకలనానికి అతడు సంపాదకుడు కూడా

ప్రాచీన భారతదేశ చరిత్రను గురించి రాసిన రచయితల్లో చాలా మంది దక్షిణ భారతదేశానికి తగిన ప్రాధాన్యతను ఇవ్వలేదు దక్షిణ భారతదేశానికి చెందిన గొప్ప చరిత్రకారుడైన కె ఎ నీలకంఠశాస్త్రి కూడా తాను రాసిన "ప్రాచీన భారతదేశ చరిత్ర" అన్న గ్రంథంలో ఇదే విధానాన్ని అనుసరించాడు కానీ అతడు తరువాత రాసిన "దక్షిణ భారతదేశ చరిత్ర" అన్న గ్రంథంతో ఈ లోపం అద్భుతంగా సర్దుబాటైపోయింది నీలకంఠ శాస్త్రి శైలి చాలా సంక్షిప్తంగా ఉన్నా అతని రచనావిధానం తేటగా ఉంటుంది వాస్తవాలను అందచేయటంలో నీలకంఠశాస్త్రి రాయ్‌చౌధురిలాగే నమ్మ కస్తుడు కానీ దక్షిణ భారతదేశంలో రాజకీయ సామాజిక వ్యవస్థల్ని గురించి అతడు చెప్పిన అభిప్రాయాలతో ఈనాడు చాలా మంది విద్వాంసులు విభేదిస్తున్నారు నీలకంఠశాస్త్రి బ్రాహ్మణుల సాంస్కృతిక ఔన్నత్యాన్ని నొక్కి చెప్పాడు ప్రాచీన భారతీయ సమాజంలోని ఐక్యతను ఆకాశాని కెత్తాడు అతని నేతృత్వంలో దక్షిణ భారతదేశంలోని వివిధ రాజవంశాల పరిపాలనను గురించి అనేక పరిశోధనా పత్రాలు వెలువడ్డాయి

1960 వరకూ రాజకీయ చరిత్ర ఎక్కువ మంది భారతీయ విద్వాంసుల్ని ఆకర్షించింది వీరు తమ ప్రాంతాల చరిత్రనో, లేదా తమ ప్రాంతాలను పరిపాలించిన రాజవంశాలనో ఘనంగా కీర్తించారు అలాకాకుండా మొత్తం భారతదేశాన్ని గురించి రాయాలని ప్రయత్నించినవారు జాతీయభావాలతో ఉత్తేజితులయ్యారు వి ఎ స్మిత్ తన గ్రంథంలో మూడవ భాగాన్ని అలెగ్జాండర్ దండయాత్రలకు కేటాయిస్తే భారతీయ చరిత్రకారులు అదే సంఘటనకు చాలా తక్కువ ప్రాధాన్యత నిచ్చారు వీరు పురుషోత్తమునికీ, అలెగ్జాండర్‌కూ జరిగిన సంభాషణకూ, సెల్యూకస్ ఆక్రమణలో నుంచీ చంద్రగుప్త మౌర్యుడు వాయవ్యరాష్ట్రాలను విముక్తం చేయటానికీ గొప్ప ప్రాముఖ్యత నిచ్చారు కె పి జయస్వాల్ (1881–1937), ఎ ఎస్ అల్టేకర్ (1898–1959) మొదలైన చరిత్రకారులు శకులనుంచీ, కుషానులనుంచీ భారతదేశాన్ని విముక్తం చేయటంలో స్వదేశీరాజవంశాలపాత్రను అతిశయోక్తులతో ఆకాశానికెత్తారు కానీ ఈ మధ్య ఆసియా ప్రజలూ, కొంతమంది ఇతరులూ భారతదేశంలో లీనమై పోయారే కానీ, తమ దేశాల ప్రయోజనం కోసం భారతదేశాన్ని దోచుకుపోలేదని వీరు విస్మరించారు

కానీ భారతదేశం నియంతలదేశం అన్న భ్రమను తొలగించటంలో కె పి జయస్వాల్ ప్రత్యేక ప్రతిభను కనపరిచాడు ప్రాచీన భారతదేశంలో గణతంత్ర రాజ్యాలుం డేవనీ, వాటిలో చెప్పుకోదగ్గ స్వయంపరిపాలన ఉండేదనీ నిరూపించటం కోసం 1910–12 కాలానికే అతడు అనేక వ్యాసాలు రాశాడు అతని పరిశోధనా ఫలితాలు 1924లో రాసిన "హిందూ పరిపాలనా వ్యవస్థ" అన్న గ్రంథంలో చోటు చేసుకున్నాయి కానీ ఆధునిక జాతీయ భావాలను ప్రాచీన వ్యవస్థలలోకి చొప్పిస్తున్నాడని జయస్వాల్‌ను యు ఎన్ ఘోషాల్ (1886–1969) వంటి కొందరు చరిత్రకారులు విమర్శించారు ఎందరు విమర్శించినా జయస్వాల్ చెప్పిన ప్రాచీన గణరాజ్య సిద్ధాంతాన్ని ప్రాథమికంగా దాదాపు అందరూ అంగీకరించారు అతడు రాసిన "హిందూ పాలిటీ" మార్గదర్శక గ్రంథం ఆరు ముద్రణలు పొందిన ఈ గ్రంథం శాశ్వత విలువ కలిగిన గొప్ప గ్రంథం

## రాజకీయేతర చరిత్రవైపు దృష్టి మళ్ళటం

సంస్కృత విద్వాంసుడైన ఎ ఎల్ బాషమ్ (1914–1986) ప్రాచీన చరిత్రను ఆధునిక దృక్పథం నుంచీ పరిశీలించటంలోని ఔచిత్యాన్ని ప్రశ్నించాడు అతని తొలి రచనల్లో కొన్ని సంప్రదాయ వ్యతిరేక తెగలకు చెందిన భౌతికవాద తత్త్వశాస్త్రం పట్ల లోతైన ఆసక్తిని చూపించాడు కానీ ఆ తరువాత గతాన్ని కుతూహలం కోసం, ఆనందం కోసం మాత్రమే అధ్యయనం చేయాలన్న నిర్ణయానికి వచ్చాడు అతడు రాసిన "వండర్ దట్ వాజ్ ఇండియా" (1951) అన్న పుస్తకం ప్రాచీన భారతీయ నాగరికతా సంస్కృతుల్లోని విభిన్నమైన అంశాలకు సానుభూతి పూర్వకమైన సింహావలోకనం

రాజకీయ చరిత్రనుంచీ రాజకీయేతర చరిత్రవైపుకు చరిత్ర కారుల దృష్టి మారటాన్ని బాషమ్ గ్రంథం సూచిస్తుంది ఇదే దృక్పథం డి డి కోశాంబి (1907–1966) రాసిన "ఏన్ ఇంట్రొడక్షన్ టు ది స్టడీ ఆఫ్ ఇండియన్ హిస్టరీ" (1957) అన్న గ్రంథంలో కూడా కనిపిస్తుంది ఈ దృక్పథం అతడు రాసిన "ది సివిలైజేషన్ ఆఫ్ ఏన్షియంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ ఔట్‌లైన్" (1965) అన్న గ్రంథంలో మరింత విస్తృత ప్రచారాన్ని పొందింది కోశాంబి భారతదేశ చరిత్ర రచనలో ఒక కొత్తదారిని వేశాడు అతని మార్గం మార్క్స్‌రచనలమీద ఆధారపడ్డ భౌతిక వాద చారిత్రక దృక్పథాన్ని అనుసరిస్తుంది అతడు ప్రాచీన భారతదేశ సమాజాన్నీ, ఆర్థిక వ్యవస్థనూ, సంస్కృతినీ ఉత్పత్తి శక్తుల, సంబంధాల అభివృద్ధిలో ఒక అవిభాజ్యమైన అంశంగా పరిగణించాడు గిరిజన, వర్గ పరిణామక్రమాల ఆధారంగా సామాజిక, ఆర్థిక పరిణామ దశల్ని ఈ గ్రంథం మొదటిసారిగా సమీక్షించింది బాషమ్‌తోపాటు చాలామంది విద్వాంసులు కోశాంబీని విమర్శించారు కానీ కోశాంబీ గ్రంథం విస్తృతంగా అధ్యయనం చేయబడుతూనే ఉంది

ప్రాచీన భారతదేశాన్ని గురించి అధ్యయనం చేస్తున్న వారు గత పాతికేళ్ళలో అనుసరిస్తున్న విధానంలో బ్రహ్మాండమైన మార్పు వచ్చింది వారు సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక పరిణామాలకు ప్రాధాన్యత నిస్తున్నారు వాటిని రాజకీయ పరిణామాలతో అనుసంధించటానికి ప్రయత్నిస్తున్నారు వారు ప్రాచీన గ్రంథాల తులనాత్మక ప్రాధాన్యతను పరిగణనలోకి తీసుకుంటున్నారు వాటి సాంప్రదాయిక స్వభావాన్ని పురాతత్వ ఆధారాలతో, మానవ శాస్త్ర ఆధారాలతో పోల్చి అధ్యయనం చేస్తున్నారు ఈ పరిణామం చరిత్ర అధ్యయనానికి మంచిరోజులు వస్తున్నాయన్న ఆశను కలిగిస్తోంది కానీ కొంతమంది భారతీయ చరిత్రకారులు – మతం యొక్క పాత్రను భూతద్దంలో చూపుతున్నారు ప్రపంచంలో జరిగిన అన్ని గొప్ప విషయాలూ, మంచి విషయాలూ భారతదేశంలోనే ప్రారంభమయ్యా యంటున్నారు కానీ పాశ్చాత్య చరిత్రకారులు ఇంతకు ముందులాగా అవన్నీ ఇతర దేశాలనుంచీ వచ్చాయనటం లేదు వారిలో కొంత మంది మాత్రం మతభావాలూ, ఆచారవ్యవహారాలూ, కులం, బంధుత్వ సంబంధాలూ, సంప్రదాయమూ భారత చరిత్రలో ప్రధానశక్తులని నమ్ముతున్నారు వీరు చలన రాహిత్యానికి కారణభూతమైన అనేకానేక విచ్ఛిన్నకరశక్తుల పాత్రను అవసరమైనంతగా గుర్తించరు వీరు స్థిరత్వాన్నీ, అవిచ్ఛిన్నతనూ చాలా ఎక్కువగా పట్టించు కుంటారు వీరు చిత్రమైన కొన్ని ప్రాచీన లక్షణాలను చూసి వ్యామోహంలో పడి, వాటిని శాశ్వతంగా భద్రపరచా లంటారు ఈ పద్ధతి భారతీయ సమాజంలో ఏనాడూ మార్పులు రాలేదనీ, ఇక మీదట కూడా రావనీ నమ్మే సిద్ధాంతానికి దారి చూపుతుంది అంటే పేదరికం భారతీయతలో ఒక అవిభాజ్యమైన అంశం అన్నమాట అలా జాతీయ దురహంకారులూ, నవనాగరిక వలసవాదులూ భారతదేశం యొక్క గతాన్ని భవిష్యత్తులో ఈ దేశం అభివృద్ధి చెందకుండా ఉండటానికి ఉపయోగిస్తారు కాబట్టి మనం గతాన్ని గురించి సమదృష్టి కలిగిన, వస్తునిష్ఠమైన దృక్పథాన్ని ఏర్పరుచుకోవటం చాలా ముఖ్యం

★ ★ ★

# అధ్యాయం: 3

# చారిత్రక ఆధారాల్లోని రకాలు, చరిత్ర నిర్మాణం

## భౌతిక అవశేషాలు

ప్రాచీన భారతీయులు అసంఖ్యాకమైన ప్రాచీన అవశేషాలను వదిలి వెళ్ళారు దక్షిణ భారతదేశంలోని రాతితో కట్టిన దేవాలయాలూ తూర్పు భారతదేశంలోని ఇటుకలతో కట్టిన మఠాలూ ప్రాచీన భారతీయుల నిర్మాణ కౌశలానికి సాక్షీభూతంగా ఇంకా నిలచి ఉన్నాయి ఈ అవశేషాల్లో ఎక్కువభాగం భారతదేశంలోని అనేక చోట్లలో మట్టి దిబ్బలకింద పూడిపోయి ఉన్నాయి ప్రాచీన జనని వాసాల అవశేషాలమీద ఎత్తుగా పేరుకు పోయిన మట్టిని దిబ్బలంటారు అవి ఒకే సంస్కృతికి సంబంధించినవీ, ఒక ప్రధాన సంస్కృతికి సంబంధించివవీ, విభిన్న సంస్కృతులకు సంబంధించినవీ అని మూడు రకాలుగా ఉంటాయి కొన్ని దిబ్బలు రంగువేసిన బూడిద రంగు మట్టి పాత్రల సంస్కృతికి సంబంధించినవి మరికొన్ని శాతవాహనుల కాలపు సంస్కృతికి సంబంధించినవి మరికొన్ని కుషానుల కాలపు సంస్కృతికి సంబంధించినవి ప్రధాన సంస్కృతి దిబ్బల్లో ఒక సంస్కృతి ప్రధానంగా ఉంటుంది ఇతర సంస్కృతులు అప్రధానంగా ఉంటాయి భిన్న సంస్కృతుల దిబ్బల్లో అనేక ప్రధాన సంస్కృతులు ఒకదాని తరువాత మరొకటిగా అభివృద్ధి చెంది ఉంటాయి అనేక సందర్భాల్లో అవి కలగలుపుగా కూడా ఉంటాయి వివిధ దశలకు చెందిన భౌతిక సంస్కృతినీ, ఇతర అంశాలనూ అర్థం చేసుకోవడానికి రామాయణ, మహాభారతాలను ఉపయోగించినట్టుగానే ఈ దిబ్బల తవ్వకాలను ఉపయోగించవచ్చు

ఈ దిబ్బల్లో నిలువుగానూ, అడ్డంగానూ తవ్వకాలు చేయవచ్చు నిలువుగా తవ్వటమంటే భూమిలోపలికి తవ్వి, కాలక్రమంలో వరుసగా వచ్చిన సంస్కృతుల్ని వెలుపలికి తీయటం ఇది సాధారణంగా ఒక చిన్న ప్రాంతానికి పరిమితంగా జరుగుతుంది అడ్డంగా తవ్వటమంటే ఒక సంస్కృతి విస్తరించిన మొత్తం ప్రాంతాన్ని కానీ, లేదా అందులో ఎక్కువ భాగాన్ని కానీ తవ్వటం దీని వల్ల ఒక నిర్ణీత కాలంలో అక్కడ వికసించిన సంస్కృతిని గురించి సమగ్రంగా అర్థం చేసుకోవచ్చు

చాలా ప్రాంతాల్లో తవ్వకాలు నిలువుగా జరిగి ఉండటం చేత అక్కడ వర్ధిల్లిన భౌతిక సంస్కృతిని గురించి కాలక్రమంలో బాగా అర్థం చేసుకోవచ్చు అడ్డంగా తవ్వటం చాలా ఖర్చుతో కూడిన పని కావటం చేత ఆ పని చాలా పరిమిత ప్రాంతాల్లో మాత్రమే జరిగింది కాబట్టి ఈ తవ్వకాలు ప్రాచీన భారతదేశ చరిత్రకు సంబంధించిన వివిధ దశల్లో భౌతిక జీవితాన్ని గురించి సమగ్రసమాచారాన్ని కాదుకదా, తగు మాత్రమైన సమాచారాన్ని కూడా మనకు ఇవ్వటం లేదు

తవ్వకాలు జరిగిన దిబ్బల్లో కూడా ప్రాచీన అవశేషాలు ఒకే రకంగా భద్రపరచబడి ఉండవు రాజస్థాన్, ఉత్తర ప్రదేశ్, ఈశాన్య రాష్ట్రాల్లోని పొడి, వేడి వాతావరణంలో అవశేషాలు మెరుగ్గా భద్రపరచబడి లభిస్తాయి మధ్యగంగా తీరంలోనూ, డెల్టా ప్రాంతాల్లోనూ తడిగా ఉన్న చల్లని వాతావరణం ఉండటం చేత ఇనుప వస్తువులు కూడా తుప్పు పడతాయి మట్టితో కట్టిన భవనాలను తవ్వకాల్లో గుర్తించటమే కష్టమైపోతుంది భూమి తేమగానూ, మెత్తగానూ ఉన్న ప్రాంతాల్లో కాల్చిన ఇటుకలతో, రాళ్ళతో భవనాలు కట్టిన దశకు సంబంధించిన శిధిలాలు చక్కని స్థితిలో విస్తృతంగా లభిస్తాయి భారత వాయవ్య ప్రాంతంలో క్రీ పూ 2500 ప్రాంతంలో ప్రజలు నిర్మించుకున్న నగరాలు తవ్వకాల్లో బయట పడ్డాయి అలాగే గంగాపరీవాహక ప్రాంతంలో అభివృద్ధి చెందిన భౌతిక సంస్కృతిని గురించి కూడా తవ్వకాలు మనకు తెలియచేస్తాయి వారు నివసించిన నగరాల

పధకాలను గురించీ, ఉపయోగించిన పాత్రల్ని గురించీ, ఇళ్ళ నిర్మాణాన్ని గురించీ, ఆహారంగా ఉపయోగించిన తృణ ధాన్యాలను గురించీ, ఉపయోగించిన పనిముట్లను గురించీ కూడా ఈ తవ్వకాలు మనకు తెలియచేస్తాయి దక్షిణ భారతదేశంలో కొందరు, చనిపోయిన వారితో బాటు వారు ఉపయోగించిన పనిముట్లనూ, ఆయుధాలనూ, పాత్రలనూ, ఇతర వస్తువులనూ పాతిపెట్టేవారు పెద్దపెద్దరాళ్ళలో కట్టిన ప్రాకారం ఉండేది ఈ నిర్మాణాలను పెద్దబండల సమాధులు (మెగాలిత్స్) అంటారు కానీ కొన్ని మెగాలిత్స్ ఈ రకానికి చెందవు వీటిని తవ్వటం ద్వారా ఇనుపయుగం నుంచి దక్కన్ పీఠభూమిలో ప్రజల జీవితాన్ని గురించి తెలుసుకోగలిగాం పురాతన కాలానికి చెందిన ఈ దిబ్బల్ని ఒక పద్ధతి ప్రకారం తవ్వి, వరసగా కిందికి వెళ్లే పొరల్ని పరిశీలించి, ప్రజాజీవితానికి చెందిన భౌతికాంశాలను అర్థం చేసుకోవటానికి దోహదం చేసే శాస్త్రాన్ని పురాతత్వ శాస్త్రం (ఆర్కియాలజి) అంటారు

తవ్వకాల్లో లభించిన భౌతిక అవశేషాలమీద అనేక శాస్త్రీయ పరీక్షలు చేస్తారు వీటి కాల నిర్ణయం రేడియో ఆక్టివ్ పద్ధతి ద్వారా జరుగుతుంది ప్రాణులన్నిటిలో కార్బన్ ఉంటుందన్న సిద్ధాంతం ప్రకారం ఈ కాలనిర్ణయం జరుగుతుంది చనిపోయిన తరువాత అది కొత్తగా $C^{14}$ అన్న కార్బన్‌ను గ్రహించలేదు అది చనిపోవటానికి పూర్వం అందులో ఉన్న కార్బన్ అది చనిపోయిన తరువాత శిథిలం కావటం ప్రారంభిస్తుంది దీన్ని రేడియో ఆక్టివిటీ అంటారు $C^{14}$ అన్నదాక రేడియోఆక్టివ్ ఐసోటోప్ ఇది $C^{14}$కు సంబంధించిన మూలకం కూడా ఇవి సాధారణంగా సమాన ప్రమాణంలో ఉంటాయి మనం $C^{12}$ ను ప్రమాణంగా తీసుకొని $C^{14}$ శిథిలంకావటం ఎంతకాలం క్రితం ప్రారంభ మైందో నిర్ణయించవచ్చు $C^{14}$ తక్కువగా ఉన్న అవశేషం అది ఎక్కువగా ఉన్న అవశేషం కంటే ప్రాచీనమైంది $C^{14}$ యొక్క సగం జీవితం 5568 సంవత్సరాలన్న సూత్రం మీద ఈ లెక్క ఆధారపడి ఉంటుంది ఈ కాలంలోనే మిగిలిన సగం రేడియో ఆక్టివ్ ధాతువు శిథిలమై పోతుంది దాదాపు అన్ని జీవ పదార్థాలూ శిథిలమైపోతాయి కాబట్టి బొగ్గును – అందులో అత్యధిక కార్బన్ శాతం ఉండటం చేత – రేడియో ఆక్టివ్ కాలనిర్ణయ విధానంలో అత్యంత విస్తృతంగా ఉపయోగిస్తారు

మొక్కల అవశేషాలను – ముఖ్యంగా పుప్పొడి అవ శేషాలను – విశ్లేషించటం ద్వారా వాతావరణం చరిత్రనూ, చెట్లు చేమల చరిత్రనూ తెలుసుకోవచ్చు ఈ విశ్లేషణ ఆధారంగానే రాజస్థాన్‌లో, కాశ్మీర్‌లో క్రీ పూ 7000 – 6000 సంవత్సరాల కాలంలోనే వ్యవసాయం ఉండే దని సూచించటానికి వీలు కలిగింది లోహకళాఖండాల స్వభావాన్నీ, వాటిలోని వస్తువుల కలయికనూ కూడా శాస్త్రీయంగా విశ్లేషిస్తారు దాని ఆధారంగా లోహాలు తయారు చేయబడ్డ విధానాన్నీ, లోహ సాంకేతిక శాస్త్రం అభివృద్ధిలో వివిధ పరిణామదశల్నీ నిర్ణయిస్తారు జంతువుల ఎముకల్ని పరిశీలించటం ద్వారా అవి మచ్చిక చేయబడ్డాయో లేదో నిర్ణయించ వచ్చు వాటిని మానవులు ఎందుకు ఉపయోగించారో కూడా తెలుసుకోవచ్చు

## నాణాలు

కొన్ని నాణాలూ, శాసనాలూ భూమి మీద లభిం చాయి కానీ ఎక్కువభాగం వీటిని భూమిలోంచీ తవ్వితీశారు నాణాలను అధ్యయనం చేసే శాస్త్రాన్ని ఆంగ్లంలో "న్యూమి స్మాటిక్స్" అంటారు ప్రాచీన కాలంలో ఈనాటిలాగా కరెన్సీని కాగితం మీద ముద్రించే వారు కారు వారు లోహ నాణాలను ఉపయోగించారు వీరు రాగి, వెండి, బంగారము, సీసము మొదలైన లోహాలను నాణాలను ముద్రించటానికి ఉపయోగించారు కాల్చిన మట్టి ముద్రికలను గూడా నాణాలుగా ఉపయోగించేవారు వాటిలో ఎక్కువభాగం కుషానుల కాలానికి – అంటే క్రీ పూ మొదటి మూడు శతాబ్దాలకు చెందినవి గుప్తయుగం తరువాత ఇలాంటి ముద్రికలను నాణాలుగా ఉపయోగించటం అదృశ్యమై పోయింది

ప్రాచీన కాలంలో బాంకింగ్ వ్యవస్థలాంటిది లేకపోవటం చేత ప్రజలు తమవద్ద ఉన్న ధనాన్ని మట్టిముంతల్లోనో, లోహపాత్రల్లోనో అవసరం వచ్చేవరకూ దాచుకునేవారు అలా దాచుకున్న ధన సంపదలో భారతీయ నాణాలు మాత్రమే కాకుండా, రోమన్ సామ్రాజ్యం లాంటి ఇతర దేశాల్లో అచ్చయిన నాణాలు కూడా ఉండేవి ఇలాంటి వాటిని మన దేశంలోని అనేక ప్రాంతాల్లో కనుగొన్నారు వీటిని ఇప్పుడు కలకత్తా, పాట్నా, లక్నో, ఢిల్లీ, జయపూర్, బొంబాయి, మద్రాసులో ఉన్న వస్తు ప్రదర్శనశాలల్లో భద్రపరిచారు అనేక భారతీయ నాణాలు నేపాల్, బంగ్లాదేశ్, పాకిస్థాన్, ఆఫ్ఘనిస్థాన్ దేశాల్లోని వస్తుప్రదర్శనశాలల్లో ఉన్నాయి బ్రిటీష్ వారు మన దేశాన్ని చాలా కాలం పరిపాలించటం చేత కొంతమంది బ్రిటీష్ అధికారులు భారతీయ నాణాలను తమ దేశంలోని సంస్థలూ, వ్యక్తులూ నిర్వహిస్తున్న ప్రదర్శనశాల లకు తరలించగలిగారు ముఖ్యమైన రాజవంశాలకు చెందిన నాణాలను కేటలాగులుగా ముద్రించారు ఇలాంటి నాణాల కేటలాగు కలకత్తా మ్యూజియంలో లభిస్తుంది భారతీయ నాణాలకు సంబంధించిన కేటలాగు లండన్‌లోని బ్రిటీష్ మ్యూజియంలోనూ లభిస్తుంది కానీ వర్గీకరించవలసినవీ,

కాటలాగులో ముద్రించవలసినవీ అనేక నాణాలు ఇంకా ఉన్నాయి

మన మొదటి నాణాలమీద కొన్ని చిహ్నాలున్నాయి ఆ తరువాత ముద్రించిన నాణాలమీద దేవుళ్ళ పేర్లూ, రాజుల పేర్లూ, తేదీలు కూడా ఉన్నాయి అవి లభించిన చోటు ఆ నాణాలు చెలామణీలో ఉన్న ప్రాంతాన్ని తెలుపుతుంది ఇది అనేక రాజవంశాల చరిత్రలను – మరీ ముఖ్యంగా ఉత్తర అఫ్ఘనిస్థాన్ మీదుగా క్రీ పూ రెండు, మూడు శతాబ్దాలలో భారతదేశానికి వచ్చిన ఇండోగ్రీకుల చరిత్రను – మనం పునర్నిర్మించుకోవటానికి దోహదం చేసింది

నాణాలు ఆర్థిక చరిత్రను గురించి కూడా మనకు ఎంతో తెలియచేస్తాయి కొన్ని నాణాలను వర్తక సంఘాల వారూ, స్వర్ణకారులూ పాలకుల అనుమతితో ముద్రించారు హస్తకళలూ, వ్యాపారమూ ప్రాముఖ్యం పొందటాన్ని ఇది తెలియచేస్తుంది నాణాలు పెద్దఎత్తున లావాదేవీలను ప్రోత్సహించి వ్యాపారానికి దోహదం చేశాయి మౌర్యయుగానంతర కాలంలో మనకు అత్యధిక సంఖ్యలో నాణాలు లభించాయి ఇవి సీసంతో, రాగితో, కంచుతో, వెండితో, బంగారంతో, పోటిన్ అన్న మిశ్రలోహంతో తయారుచేయబడ్డాయి మౌర్యయుగానంతర కాలంలోనూ, గుప్తుల యుగంలో చాలా కాలమూ వ్యాపారం బాగా అభివృద్ధి చెందటాన్ని ఇది సూచిస్తుంది గుప్తయుగానంతర కాలానికి చెందిన చాలా కొద్ది నాణాలు మాత్రమే లభించటం ఆకాలంలో వ్యాపారం తగ్గటాన్ని సూచిస్తుంది

నాణాల మీద రాజుల చిత్రాలూ, దేవుళ్ళ చిత్రాలూ మాత్రమే కాకుండా కొన్ని మత చిహ్నాలూ, గాథలూ కూడా ముద్రించబడ్డాయి ఆ కాలానికి చెందిన కళల్ని గురించీ, మతాన్ని గురించీ అవి మనకు తెలియచేస్తాయి

## శాసనాలు

నాణాల కంటే శాసనాలు ఎంతో ముఖ్యమైనవి వీటిని అధ్యయనం చేసే శాస్త్రాన్ని "శాసన శాస్త్రం" అంటారు ప్రాచీన శాసనాలలో, ఇతర రికార్డులలో ఉపయోగించిన రాత పద్ధతులను అధ్యయనం చేయటాన్ని ప్రాచీన లిపి శాస్త్రం (పాలియోగ్రఫీ) అంటారు ఈ శాసనాలు సీళ్ళమీదా, రాతిస్తంభాలమీదా, రాతిబండల మీదా, రాగిరేకుల మీదా, దేవాలయాల గోడల మీదా చెక్కబడ్డాయి అంతేకాకుండా ఇటుకలమీదా, విగ్రహాల మీదకూడా శాసనాలు కనిపిస్తాయి

దేశం మొత్తమీద చూస్తే అత్యంత ప్రాచీనమైన శాసనాలు రాళ్ళమీద చెక్కబడ్డాయి క్రీస్తుశకం తొలి శతాబ్దాలనుంచీ రాగిరేకులు శాసన రచనకు ఉపయోగించటం ప్రారంభమైంది కానీ దక్షిణ భారతదేశంలో రాళ్ళమీద శాసనాలు చెక్కడం పెద్ద ఎత్తున కొనసాగుతూనే వచ్చింది దేవాలయాలమీద చెక్కిన శాసనాలు శాశ్వతమైన రికార్డుల రూపంలో దక్షిణ భారతదేశంలోనే అధిక సంఖ్యలో లభించాయి

నాణాలను భద్రపరిచినట్టుగానే శాసనాలను కూడా మన దేశంలోని వివిధ వస్తుప్రదర్శన శాలల్లో భద్రపరిచారు కానీ మైసూరులోని చీఫ్ ఎపిగ్రఫిస్ట్ కార్యాలయంలో చాలా ఎక్కువ సంఖ్యలో శాసనాలు కనిపిస్తాయి అత్యంత ప్రాచీనమైన శాసనాలు క్రీ పూ మూడవ శతాబ్దానికి చెందినవి ఇవి ప్రాకృత భాషలో రచింపబడ్డాయి క్రీ శ రెండవ శతాబ్దంలో సంస్కృతం శాసనభాషగా స్వీకరించబడింది నాలుగు, ఐదుశతాబ్దాల్లో సంస్కృతాన్ని శాసన భాషగా ఉపయోగించటం ఎక్కువైంది కానీ ప్రాకృతం అప్పుడప్పుడూ ఉపయోగించబడుతూనే వచ్చింది శాసనాలను ప్రాంతీయభాషల్లో రాయటం క్రీస్తుశకం తొమ్మిది, పది శతాబ్దాల్లో ప్రారంభమైంది మౌర్యులకాలానికీ, మౌర్యయుగం తరువాత కాలానికీ, గుప్తుల కాలానికీ సంబంధించిన చాలా శాసనాలు "కార్పస్ ఇన్‌స్క్రిప్షనం ఇండికారం" అన్న గ్రంథ సంచయంగా ప్రకటించబడ్డాయి కానీ గుప్తుల యుగానికి తరువాత కాలానికి చెందిన శాసనాలను ఇంత క్రమపద్ధతిలో భద్రపరచటం జరగలేదు దక్షిణ భారతదేశంలో భౌగోళిక పద్ధతిలో శాసనాల పట్టికల్ని ప్రచురించారు కానీ ఇంకా దక్షిణ భారతదేశానికి చెందిన దాదాపు 50,000 శాసనాలు వెలుగు చూడవలసి ఉంది

హరప్పాకు చెందిన శాసనాలు చిత్రలిపిలో రాయబడ్డాయి వాటిలో భావాలనూ, వస్తువులనూ చిత్రాల రూపంలో వ్యక్తం చేశారు వాటి అర్థం ఏమిటో ఇంకా తేల్చవలసి ఉంది అశోకుని శాసనాలను బ్రాహ్మీ లిపిలో చెక్కారు ఈ లిపిని ఎడమ నుంచీ కుడికి రాస్తారు కొన్ని శాసనాలను కుడినుంచీ ఎడమకు రాసే ఖరోష్టీ లిపిలో కూడా చెక్కారు మొత్తం మీద వాయవ్య భారతదేశంలో తప్ప మిగిలిన అన్ని ప్రాంతాల్లోనూ బ్రాహ్మీ లిపే ఉపయోగంలో ఉండేది పాకిస్థాన్‌లోనూ, అఫ్ఘనిస్థాన్‌లోనూ అశోకుడు వేసిన శాసనాలలో గ్రీక్, అరామిక్ లిపులను ఉపయోగించారు గుప్తుల కాలం వరకూ శాసనాల్లో బ్రాహ్మీ లిపే ప్రధానలిపిగా కొనసాగింది బ్రాహ్మీలిపినీ, దానిలోని వైవిధ్యాలనూ అర్థం చేసుకుంటే ఏడవ శతాబ్దం వరకూ వేసిన దాదాపు అన్ని శాసనాలనూ శాసన పరిశోధకులు చదవగలరు ఆ తరువాత ఈ లిపిలో స్థానికంగా అనేక మార్పులు వచ్చాయి అవి వేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరు పేర్లతో పిలువబడ్డాయి

అత్యంత ప్రాచీనమైన శాసనాలు హరప్పా ముద్రికల (సీళ్ళు) మీద కనిపిస్తాయి ఇవి దాదాపుగా క్రీ పూ 2500 సంవత్సరాల కాలానికి చెందినవి వీటిని చదవటం

ఇంతవరకూ సాధ్యం కాలేదు మనం చదవగలిగిన అత్యంత ప్రాచీన శాసనాలు అశోకుని కాలానికి – అంటే క్రీ పూ మూడవ శతాబ్దానికి చెందినవి ఫిరోజ్ షా తుగ్లక్ మీరట్ లోనూ, హర్యానాలోని తోప్రా అన్న ఊళ్ళోనూ అశోకుడు రాతిస్తంభాల మీద చెక్కించిన శాసనాలను కనుగొన్నాడు అతడు వాటిని ఢిల్లీకి తీసుకువచ్చి తన ఆస్థానంలోని పండితుల్ని వాటిని చదవమన్నాడు కానీ ఆ పని వాళ్ళచేత వీలుకాలేదు 18 వ శతాబ్దం చివరి పాదంలో అశోకుని శాసనాలను కనుగొన్న బ్రిటిష్ వారికి కూడా ఇదే ఇబ్బంది ఎదురైంది ఈ శాసనాలను మొదటిసారిగా 1837లో బెంగాల్ తూర్పు ఇండియా కంపెనీ అధికారి అయిన జేమ్స్ ప్రిన్సెప్ చదవగలిగాడు

మనకు అనేక రకాల శాసనాలు లభిస్తున్నాయి వీటిలో కొన్ని సామాజిక, మత విషయాలను గురించి అధికారుల కోసమూ, ప్రజల కోసమూ రాజులు వేయించిన చట్టాలవంటి శాసనాలు అశోకుని శాసనాలు ఇలాంటివి రెండవ రకం శాసనాలు భక్తులు వేయించినవి బౌద్ధ మతం, జైనమతం, వైష్ణవమతం, శైవమతం మొదలైన మతాలకు చెందిన భక్తులు స్తంభాలమీదా, పలకలమీదా, దేవాలయాలమీదా, విగ్రహాల మీదా చెక్కించినవి ఇవి వారి భక్తిని చాటుతాయి మరోరకం శాసనాలు రాజుల, విజేతల గుణగణాలనూ, విజయాలను కీర్తించటం కోసం వేసినవి సముద్రగుప్తుని అలహాబాదు శాసనం ఇలాంటిది ఈ శాసనాలు వారి బలహీనతలనూ, పరాజయాలనూ ప్రస్తావించవు చివరిరకం శాసనాలు దాన శాసనాలు వీటిని రాజులూ, రాజకుమారులూ మాత్రమే కాకుండా వ్యాపారులూ, కళాకారులూ కూడా వేయించారు ఇవి ప్రధానంగా మత అవసరాల కోసం – దానం చేయబడ్డ ధనాన్ని గురించీ, భూమిని గురించీ, పశువుల్ని గురించీ తెలియచేస్తాయి

ప్రాచీన భారతదేశంలో భూ సంబంధాలను గురించీ, పరిపాలనా విధానాన్ని గురించీ తెలుసుకోవటానికి రాజులూ, జమీందారులూ భూదానాలు ఇస్తూ వేసిన శాసనాలు చాలా బాగా ఉపయోగపడతాయి వీటిని ఎక్కువగా రాగిరేకుల మీద చెక్కారు ఇవి సన్యాసులకూ, దేవాలయాలకూ, పురోహితులకూ, మఠాలకూ, అధికారులకూ, సేవకులకూ దానం చేసిన భూముల వివరాలనూ, పన్నుల వివరాలనూ తెలియచేస్తాయి వీటిని ప్రాకృతం, సంస్కృతం, తమిళం, తెలుగు మొదలైన అన్ని భాషల్లోనూ రాశారు

## చారిత్రక ఆధారాలు

ప్రాచీన భారతీయులకు క్రీ పూ 2500 నుంచీ రాత తెలిసినా మన అత్యంత ప్రాచీనమైన రాత ప్రతులు క్రీ శ 4 వ శతాబ్దం తరువాతవే అవి కూడా మధ్య ఆసియాలో లభించాయి భారతదేశంలో వీటిని బిర్చ్‌వృక్షాల చెక్కల మీదా, తాళపత్రాల మీదా రాశారు భారతదేశం నుంచీ ప్రాకృతం, మధ్య ఆసియాకు వ్యాపించింది అక్కడ రాతప్రతుల్ని గొర్రెచర్మాల మీదా, చెక్కపలకల మీదా రాశారు వాటిని శాసనాలని అంటారు కానీ వాటిని రాతప్రతులని కూడా అనవచ్చు ముద్రణా సౌకర్యాలు లేని కాలంలో రాతప్రతులకు గొప్ప విలువ వుండేది ప్రాచీన సంస్కృత రాతప్రతులు భారతదేశమంతా లభించినా అందులో ఎక్కువ భాగం దక్షిణ భారతదేశంలో, కాశ్మీర్ లో, నేపాల్ లో లభించాయి ఇప్పుడు శాసనాలను మ్యూజియంలలోనూ, రాతప్రతులను గ్రంథాలయాల్లోనూ ఎక్కువగా భద్రపరుస్తారు

అత్యంత ప్రాచీనమైన గ్రంథాలు మత సంబంధమైన ఇతివృత్తాలను కలిగి ఉన్నాయి హిందువుల మతసాహిత్యంలో వేదాలూ, రామాయణం, మహాభారతం, పురాణాలూ మొదలైనవి ఉన్నాయి ఆనాటి సాంస్కృతిక, సామాజిక పరిస్థితులను గురించి అవి కొంత వెలుగును ప్రసరింపచేస్తాయి కానీ దేశ, కాలాలను గురించి వాటి ఆధారంగా తెలుసుకోవటం కష్టం వీటిలో ఋగ్వేదం సుమారు క్రీ పూ 1500 – 1000 సంవత్సరాల కాలానికి చెందిందని చెప్పవచ్చు అధర్వణ వేదం, యజుర్ వేదం, బ్రాహ్మణాలూ, ఉపనిషత్తులు సుమారుగా క్రీ పూ 1000–500 సంవత్సరాల కాలానికి చెందినవి దాదాపు ప్రతి వేద గ్రంథంలోనూ ప్రక్షిప్తాలు – అంటే తరువాత కాలంలో అందులోకి చొప్పించబడ్డ భాగాలు – ఉన్నాయి అవి సాధారణంగా గ్రంథం మొదటో, చివరో ఉంటాయి మధ్యలో అరుదుగా మాత్రమే కనిపిస్తాయి ఋగ్వేదంలో ఎక్కువగా ప్రార్థనలున్నాయి తరువాత వేదాల్లో ప్రార్థనలతోబాటు కర్మకాండకు సంబంధించిన మంత్రాలూ, పురాణ గాథలూ ఉన్నాయి కానీ ఉపనిషత్తుల్లో తాత్విక ఆలోచనలున్నాయి

వేదాలను అర్థం చేసుకోవాలంటే వేదాంగాలను అర్థం చేసుకోవాలి వేదాలకు అనుబంధమైన ఈ శాస్త్రాలు శిక్షా, కల్పమూ, వ్యాకరణమూ, నిరుక్తమూ, ఛందస్సూ, జ్యోతిషమూ ఈ వేదాంగాల మీద చాలా గ్రంథాలు వచ్చాయి ఇవి వచనంలో సూత్రరూపంలో ఉన్నాయి వీటిలోని ఆశ్చర్యకరమైన క్లుప్తత కారణంగా వీటిని సూత్రాలని పిలుస్తారు ఈ సూత్ర గ్రంథాలకు అత్యుత్తమ ఉదాహరణం క్రీ పూ 400 సంవత్సరాల ప్రాంతంలో పాణిని రాసిన ప్రసిద్ధ వ్యాకరణ గ్రంథం వ్యాకరణ సూత్రాలను వివరిస్తూనే – పాణిని, ఆనాటి సమాజం గురించీ, ఆర్థిక వ్యవస్థను గురించీ, సంస్కృతిని గురించీ విలువైన విషయాలు చెబుతాడు

రామాయణ, మహాభారత ఇతిహాసాలూ, ప్రధాన పురాణాలూ క్రీ శ 400 ప్రాంతాలకు పూర్తయ్యాయి వ్యాసుడు రాశాడని భావించే మహాభారతం ఇతిహాసాల్లో ప్రాచీనమైంది అది క్రీ పూ పదవ శతాబ్దం నుంచీ క్రీ శ నాలుగవ శతాబ్దం వరకూ ఉన్న పరిస్థితికి అద్దం పడుతుంది మొట్టమొదట ఇందులో 8800 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి అప్పుడు దాన్ని "జయం" అని పిలిచేవారు తరువాత కాలంలో శ్లోకాల సంఖ్య 24,000కు పెరిగింది గ్రంథం పేరు "భారతం"గానూ మారింది అత్యంత ప్రాచీనమైన ఒక వైదిక తెగ పేరు ఆ గ్రంథానికి లభించింది చివరగా ఆ గ్రంథంలోని శ్లోకాల సంఖ్యం 100,000కు పెరిగింది అప్పుడా గ్రంథానికి "మహాభారతం" లేదా "శతసహస్ర సంహిత" అన్న పేరు వచ్చింది ఇందులో కథాభాగం, వర్ణనాభాగం, నీతిబోధభాగం ఉన్నాయి ఇందులో కథాభాగమైన కురుపాండవ పోరాటం బహుశా వేదయుగంలో చివరి భాగానికి చెందింది కావచ్చు వర్ణనా భాగం వేదోత్తర యుగానికీ, నీతిబోధ భాగం మౌర్య, గుప్తయుగాల తరువాతకాలానికీ చెందినవి కావచ్చు అలాగే వాల్మీకి రాసిన "రామాయణం"లో మొదట 6000 శ్లోకాలు మాత్రమే ఉండేవి అవి తరువాత 12000కు పెరిగాయి ఆ సంఖ్య చివరకు 24000కు చేరుకుంది "రామాయణం"లో "భారతం"లో కంటే వస్వైక్యత ఎక్కువగా కనిపిస్తుంది కానీ అందులో కూడా తరువాత చేర్చిన నీతిని బోధించే భాగాలు లేకపోలేదు రామాయణ రచన క్రీ పూ 5 వ శతాబ్దంలో ప్రారంభమైంది అనాటి నుంచీ ఐదు దశలు గడిచి, క్రీ శ 12 వ శతాబ్దానికి దాని సంకలనం పూర్తయింది మొత్తం గ్రంథాన్ని తీసుకుంటే రామాయణ రచన భారత రచన తరువాతనే జరిగిందనిపిస్తుంది

వేదయుగం తరువాత కర్మకాండకు సంబంధించిన సాహిత్యం విస్తారంగా వచ్చింది రాజులకు, గౌరవ స్థానంలో ఉన్న పై మూడు వర్ణాల వారికే పరిమితమైన గొప్ప యజ్ఞయాగాదుల వర్ణన శ్రౌత సూత్రాలలో వస్తుంది ఈ యజ్ఞాలలో ఆడంబరమైన పట్టాభిషేక మహోత్సవాలుంటాయి గృహ్య సూత్రాల్లో కుటుంబానికి సంబంధించిన నామకరణం, ఉపనయనం, వివాహం, అపరకర్మ మొదలైన వాటి వివరాలుంటాయి శ్రౌతసూత్రాలూ, గృహ్యసూత్రాలూ కూడా క్రీ పూ 600–300 మధ్యకాలంలో రచించబడ్డాయి ఈ సందర్భంలో వివిధ యజ్ఞవేదికల కొలతల్ని నిర్ణయించే శుల్వ సూత్రాలను గురించి కూడా మనం జ్ఞాపకం చేసుకోవాలి అవి జ్యామితి, గణితశాస్త్రాల ప్రారంభమని కూడా మనం గుర్తించాలి

జైనుల, బౌద్ధుల మత గ్రంథాలు చారిత్రక వ్యక్తులనూ, సంఘటనలనూ ప్రస్తావిస్తాయి అత్యంతప్రాచీనమైన బౌద్ధ మత గ్రంథాలు మగధ, దక్షిణ బీహార్ ప్రాంతాల్లోని ప్రజలు మాట్లాడుతూ ఉండిన పాళీ భాషలో రాయబడ్డాయి వీటిని క్రీ పూ 2 వ శతాబ్దంలో శ్రీలంకలో చిట్టచివరగా సంకలనం చేయబడ్డాయి కానీ వీటిలోని ధర్మశాస్త్రభాగాలు బుద్ధునికాలంలో, భారతదేశంలోని పరిస్థితుల్ని తెలియచేస్తాయి ఈ గ్రంథాలు బుద్ధుని జీవితాన్ని గురించి మాత్రమే కాకుండా మగధ, ఉత్తర బీహార్, తూర్పు ఉత్తర ప్రదేశ్ ప్రాంతాలను పరిపాలించిన, బుద్ధునికి సమకాలికులైన రాజుల్ని గురించి కూడా మనకు చెబుతాయి ధర్మశాస్త్ర చర్చతో సంబంధంలేని భాగాలు బుద్ధుని పూర్వజన్మ గాథల్ని గురించి తెలియచేస్తాయి ఇది ఈ గ్రంథాల్లో చాలా ఆసక్తికరమైన భాగం మాత్రమే కాకుండా, అత్యంత ముఖ్యమైన భాగం కూడా బుద్ధుడు గౌతముడుగా పుట్టటానికి ముందు అతడు 550 జన్మల నెత్తాడని నమ్ముతారు వీటిలో కొన్ని జంతుజన్మలు కూడా ఈ కథల్ని "జాతక కథలు" అంటారు ఇవి జానపద కథారూపంలో ఉంటాయి ఈ జాతక కథలు క్రీ పూ ఐదవ శతాబ్దం నుంచీ రెండవ శతాబ్దం వరకూ ఆ ప్రాంతంలోని సామాజిక – ఆర్థిక పరిస్థితుల్ని గురించి విలువైన సమాచారాన్ని తెలియచేస్తాయి అవి బుద్ధునికాలంలోని రాజకీయ సంఘటల్ని కూడా అప్పుడప్పుడూ ప్రస్తావిస్తాయి

జైన గ్రంథాలు ప్రాకృతంలో రాయబడ్డాయి వీటిని క్రీ శ 6 వ శతాబ్దంలో గుజరాత్‌లోని "వలభి"లో చివరిసారిగా సంకలనం చేశారు మహావీరుని కాలంలో తూర్పు ఉత్తరప్రదేశ్, బీహార్ ప్రాంతాల రాజకీయ చరిత్రను పునర్నిర్మించుకోవటానికి ఈ గ్రంథాల్లోని కొన్ని భాగాలు దోహదం చేస్తాయి జైన గ్రంథాలు వ్యాపారుల్ని గురించీ, వ్యాపారాన్ని గురించీ అనేక సార్లు పేర్కొంటాయి

మనకు విస్తారమైన లౌకిక సాహిత్యం కూడా ఉంది ధర్మసూత్రాలు, స్మృతులు వాటి వ్యాఖ్యానాలూ ఈ కోవకు చెందుతాయి వీటిని రెండిటినీ కలిపి ధర్మశాస్త్రా లంటారు ధర్మశాస్త్రాలు క్రీ పూ 500–200 కాలంలో సంపుటీకరించబడ్డాయి ప్రధాన స్మృతిగ్రంథాలు క్రీస్తుశకం ప్రారంభమయ్యాక మొదటి ఆరు శతాబ్దాల్లో సంకలనం చేయబడ్డాయి ఇవి వివిధ వర్ణాల ప్రజల ధర్మాలను మాత్రమే కాక, రాజులూ, ఇతర అధికారులూ అనుసరించ వలసిన ధర్మాలను కూడా తెలియజేస్తాయి ఆస్తిని వారసత్వంగా పొందటానికీ, అనుభవించటానికీ, విక్రయించటానికీ సంబంధించిన సూత్రాలను కూడా ఈ గ్రంథాలు తెలియజేస్తాయి దొంగతనం, దౌర్జన్యం, హత్య, వ్యభిచారం మొదలైన నేరాలకు విధించవలసిన శిక్షల్ని కూడా నిర్ణయిస్తాయి

కౌటిల్యుడు రాసిన "అర్థశాస్త్రం" ఒక ప్రధానమైన ధర్మశాస్త్ర గ్రంథం ఇందులో పదిహేను భాగాలున్నాయి వీటిలో రెండు, మూడు భాగాలు ప్రాచీనమైనవి వాటిని

అనేకమంది రచించినట్టుగా కూడా అనిపిస్తుంది ఈ పుస్తకానికి చివరి స్వరూపం క్రీస్తుశకం ప్రారంభంలో వచ్చింది కానీ ఇందులోని ప్రాచీన భాగాలు మౌర్యుల కాలంలోని సామాజిక, ఆర్థిక వ్యవస్థల స్వరూపాన్ని తెలియచేస్తాయి అవి ప్రాచీన భారతదేశంలో రాజ్యాంగ, ఆర్థిక వ్యవస్థలు ఎలా ఉండేవో అధ్యయనం చేయటానికి అవసరమైన విలువైన సమాచారాన్ని అందజేస్తాయి

భాసుడు, శూద్రకుడు, కాళిదాసు, బాణభట్టు రాసిన గ్రంథాలు కూడా మనకున్నాయి వాటి సాహిత్య విలువ అందరికీ తెలిసిందే దాంతోపాటు ఆ గ్రంథాలు ఆయాకవుల కాలాలకు చెందిన పరిస్థితులకు అద్దం పడతాయి కాళిదాసు కావ్యాలూ, నాటకాలూ రాశాడు అతని నాటకాల్లో అత్యంత ప్రసిద్ధమైంది "అభిజ్ఞాన శాకుంతలం" అవి గొప్ప సృజనశక్తిని కలిగి ఉండటమే కాకుండా గుప్తుల కాలంలో ఉత్తరభారతదేశంలోనూ, మధ్య భారతదేశంలోనూ ఉండిన సామాజిక, సాంస్కృతిక జీవితాన్ని గురించి మనకు కొన్ని విషయాలను తెలియజేస్తాయి

సంస్కృత సాహిత్య ఆధారాలతోపాటు "సంగం" యుగానికి చెందిన కొన్ని అత్యంత ప్రాచీన తమిళ గ్రంథాలు కూడా మనకున్నాయి రాజులూ, జమీందారులూ పోషించిన కవులు కళాశాలల్లో సమావేశమై సృష్టించిన సాహిత్యం సంగం సాహిత్యం ఈ కళాశాలలకే "సంగం" అని పేరు ఈ సాహిత్య సృష్టి నాలుగు శతాబ్దాల కాలం కొనసాగింది మరో రెండు శతాబ్దాలకాలంలో వీటి సంకలనం పూర్తయింది ఈ సంగం సాహిత్యంలో 30,000 పాదాల కవిత్వం ఉంది ఇది "ఎట్టుతొగై" అన్న ఎనిమిది సంకలనాలుగా మనకు లభిస్తూ ఉంది ఈ పద్యాలు వందలు వందలుగా "పురానానూరు" (నాలుగువందల పద్యాలు) మొదలైన సంకలనాలుగా చేయబడింది వీటిలో రెండు ముఖ్యమైన పద్యకదంబాలున్నాయి అవి "పదినేన్ కీల్ కణక్కు" (పదునెనిమిది సంకలనాలు), పత్తుపాట్టు (పదిపాటలు) అన్నవి వీటిలో మొదటిది రెండవదాని కంటే ఎక్కువ ప్రాచీనమైందని నమ్ముతారు అందుచేత దానికున్న చారిత్రక విలువ కూడా ఎక్కువే సంగం గ్రంథాల్లో చాలా దశలు ఉన్నాయి కానీ ఈనాడు వాటిలోని వస్తువును,శైలిని ఆధారం చేసుకొని ఏ గ్రంథం ఏ దశకు చెందిందో నిరూపించటం సాధ్యం కాదు కానీ సామాజిక పరిణామాన్ని ఆధారం చేసుకొని ఈ దశల్ని ఎలా గుర్తించవచ్చో తరువాత చూపబడింది

సంగం గ్రంథాలు వేదగ్రంథాల కంటే – ముఖ్యంగా ఋగ్వేదం కంటే భిన్నమైనవి ఇవి మత సాహిత్యం కాదు ఇందులో ఉన్న వివిధ పద్యాలను వివిధ కవులు వీరుల్నీ, వీరవనితల్నీ పొగడుతూ రాశారు కాబట్టి ఈ పద్యాలను లౌకిక సాహిత్యంగా పరిగణించవచ్చు అవి నాజూకు తనంలేని పాటలు కావు, గొప్ప సాహిత్యం ఈ కావ్యాల్లోని అనేక పద్యాలు ఒక యోధుణ్ణో, రాజునో, జమీందారునో పేరుపెట్టి అతని పరాక్రమాన్ని కీర్తిస్తాయి అతడు కవులకూ, వీరులకూ ఇచ్చిన బహుమతుల్నీ ప్రస్తావిస్తాయి బహుశా ఈ పద్యాల్ని రాజస్థానాల్లో గానం చేశారేమో! ఇవి వీరుల్నీ, యుద్ధాలనీ కీర్తించటం చేత వీటిని హోమర్ కాలం నాటి గ్రీక్ వీరగాథా కవిత్వంతో పోల్చుతారు వీటిని చారిత్రక ఆధారాలుగా ఉపయోగించటం కష్టమే వీటిలో పేర్కొనబడ్డ వ్యక్తులూ, బిరుదులూ, వంశాలూ, రాజ్యాలూ, యుద్ధాలూ పాక్షికంగా మాత్రమే వాస్తవం సంగం కాలపు గ్రంథాల్లో పేర్కొనబడ్డ చేరరాజుల్లో కొందరు క్రీ శ ఒకటి, రెండు శతాబ్దాలకు చెందిన శాసనాల్లో దాతలుగా కనిపిస్తారు

సంగం సాహిత్యం కావేరి పట్టణంతోపాటు అనేక ఇతర పట్టణాలను పేర్కొంటుంది వీటి వైభవాన్ని గురించి ఈనాడు మనకు పురావస్తు ఆధారాలు లభిస్తున్నాయి ఈ సాహిత్య గ్రంథాల్లో యవనులు వారి ఓడల్లో మనదేశానికి రావటం, బంగారం ఇచ్చి మిరియాలు కొనటం, మనదేశవాసులకు మద్యాన్నీ, మదవతుల్నీ సరఫరా చేయటం కూడా ప్రస్తావించబడింది ఈ వ్యాపారాన్ని గురించి లాటిన్, గ్రీక్ రికార్డులే కాకుండా పురాతత్వ సాక్ష్యాలు కూడా ధ్రువపరుస్తాయి క్రీస్తుయుగం తొలి శతాబ్దాల్లో డెల్టాప్రాంతపు తమిళనాడులోని సామాజిక ఆర్థిక జీవితాన్ని గురించి తెలుసుకోవటానికి సంగం సాహిత్యం ఒక ప్రధాన ఆధారం అందులో ప్రస్తావించ బడిన వ్యాపార విషయాలను యాత్రికులు రాసిన గ్రంథాలూ, పురాతత్వ ఆధారాలూ ధ్రువపరుస్తాయి

## యాత్రికుల గ్రంథాలు

స్వదేశంలో వచ్చిన సాహిత్యానికి విదేశీయాత్రికుల గ్రంథాలను జతకలిపి ఒక దేశ చరిత్రను తెలుసుకోవచ్చు యాత్రికులుగానో లేక మన మతాలను స్వీకరించినవారుగానో గ్రీకులూ, రోమన్లూ, చైనీయులూ భారతదేశానికి వచ్చారు వీరు తాము చూసిన విషయాలను గురించి రాశారు ఆశ్చర్యమేమిటంటే – భారతీయులెవరూ అలెగ్జాండర్ దండయాత్రల్ని గురించి ప్రస్తావించలేదు మనం గ్రీకుల రాతల ఆధారంగానే అలెగ్జాండర్ భారతదేశంలో సాధించిన విజయాలకు సంబంధించిన చరిత్రను పునర్నిర్మించుకోవాలి క్రీ పూ 326లో భారతదేశం మీద దండయాత్ర చేసిన అలెగ్జాండర్ సమకాలికుడుగా శాండ్రకోటస్ అన్న రాజును గ్రీకులు పేర్కొన్నారు శాండ్రకోటస్‌ను చంద్రగుప్త మౌర్యునిగా గుర్తించారు అతడు క్రీ పూ 322లో సింహాసనాన్ని అధిష్టించాడు ఈ గుర్తింపు ప్రాచీన భారతదేశ

చరిత్రలో కాలక్రమాన్ని (క్రానాలజీ) గుర్తించటానికి అత్యంత ప్రధానమైన ఆధారంగా రూపొందింది చంద్రగుప్త మౌర్యుని పరిపాలనాకాలంలో భారతదేశాన్ని దర్శించిన మెగస్తనీస్ రాసిన "ఇండికా" అన్న గ్రంథంలో ఇతరులు ఉటంకించిన భాగాలు మాత్రమే ఈనాడు మనకు లభిస్తున్నాయి ఈ భాగాలను సమకూర్చి అధ్యయనం చేస్తే మౌర్యుల కాలంనాటి పరిపాలనా విధానాన్ని గురించేకాక, ఆనాడు సమాజంలో ఉన్న వర్గాలను గురించీ, ఆర్థిక కార్యకలాపాలను గురించీ మనకు చాలా విలువైన విషయాలు తెలుస్తాయి కానీ ఇతర ప్రాచీన యాత్రాగ్రంథాలలోలాగే "ఇండికా"లో కూడా అమాయకత్వమూ, అతిశయోక్తీ లేకపోలేదు

క్రీ శ మొదటి, రెండవ శతాబ్దాలకు చెందిన గ్రీక్, రోమన్ యాత్రాగ్రంథాలు అనేక భారతీయ ఓడరేవుల్ని గురించీ, భారతదేశానికీ, రోమన్ సామ్రాజ్యానికీ మధ్య వ్యాపారం జరిగిన అనేక వస్తువుల్ని గురించీ చెబుతాయి "పెరిప్లస్ ఆఫ్ ఎరిత్రియన్ సీ", టాలమీ రాసిన "జియోగ్రఫీ" అన్న గ్రీకుగ్రంథాలు ప్రాచీన భూగోళాన్ని గురించీ, వ్యాపార సంబంధాలను గురించి తెలుసుకోవటానికి అవసరమైన విలువైన సమాచారాన్ని అందిస్తాయి మొదటి గ్రంథం ద్వారా లభించే ఈ సమాచారం క్రీ శ 80–115 సంవత్సరాల కాలానికి చెందింది రెండవ గ్రంథం ద్వారా లభించే సమాచారం క్రీ శ 150 ప్రాంతానికి సంబంధించిందని అంటారు ప్లినీ – లాటిన్ భాషలో రాసిన "నాచురాలిస్ హిస్టోరియా" అన్న గ్రంథం క్రీ శ మొదటి శతాబ్దానికి చెందింది ఇది భారత, ఇటలీ దేశాలమధ్య వ్యాపారాన్ని గురించి మనకు తెలియజేస్తుంది

చైనా నుంచీ వచ్చిన యాత్రికుల్లో ఫాహియాన్‌ను గురించీ హ్యువాన్‌త్సాంగ్‌ను గురించీ చెప్పుకోవాలి వీరిద్దరూ బౌద్ధులు వీరు బౌద్ధ పుణ్యక్షేత్రాలను చూడటానికీ, బౌద్ధ మతాన్ని అధ్యయనం చేయటానికీ భారతదేశానికొచ్చారు ఫాహియాన్ క్రీ శ 5 వ శతాబ్దం ప్రారంభంలోనూ, హ్యువాన్‌త్సాంగ్ క్రీ శ 7 వ శతాబ్దం రెండవ పాదంలోనూ వచ్చారు ఫాహియాన్ గుప్తుల కాలంనాటి సామాజిక, ఆర్థిక, మత విషయాలనూ, హ్యువాన్‌త్సాంగ్ హర్షుని కాలంనాటి జీవితాన్నీ తమ రచనల్లో అభివర్ణించారు

## చారిత్రక చైతన్యం

ప్రాచీన భారతీయులకు చారిత్రక చైతన్యం లేదని అంటుంటారు ఈనాడు చరిత్ర రాయబడుతూ ఉన్న పద్ధతిలో వాళ్ళు చరిత్రను రాయని మాట వాస్తవమే అంతేకాదు గ్రీకులు రాసిన పద్ధతిలో కూడా వాళ్ళు చరిత్రను రాయలేదు మన అష్టాదశ పురాణాల్లో ఒకరకమైన చరిత్ర ఉంది పద్దెనిమిది ఒక సాంప్రదాయిక సంఖ్య కూడా విజ్ఞాన సర్వస్వాల్లా ఉన్నా గుప్తయుగం ప్రారంభం వరకూ ఆ రాజుల వంశావళి చరిత్రను ఇస్తాయి కొన్ని సంఘటనలు ఎక్కడ జరిగాయో అవి అభివర్ణిస్తాయి ఒక్కోసారి ఆ సంఘటనల కార్యకారణ సంబంధాన్ని కూడా చర్చిస్తాయి ఈ సంఘటనలు జరిగిన ఎంతోకాలానికి వాటిని గురించి రాసినా వాటిని అభివర్ణించటానికి ఆ కవులు భవిష్యత్కాల క్రియల్ని ఉపయోగించారు చరిత్ర సారాంశమైన మార్పును గురించి ఈ పురాణ కవులకు తెలియదనుకోవటం కూడా పొరపాటే పురాణాలు కృతయుగం, త్రేతాయుగం, ద్వాపర యుగం, కలియుగం అన్న నాలుగు యుగాలను గురించి చెబుతాయి ఇవి ఒక దానికంటే మరొకటి నైతికంగా హీనమైన వనీ, యుగాలు ముందుకు సాగుతున్న కొద్దీ నైతిక విలువలూ, సామాజిక వ్యవస్థలూ క్రమక్రమంగా పతన మౌతాయనీ పురాణాలు ఉద్ఘోషిస్తాయి చరిత్రలో మరొక ప్రధానాంశమైన కాలాన్ని కూడా పురాణాలు సూచిస్తాయి కాలక్రమంలో సంఘటనలను రికార్డు చేయటానికి ప్రాచీన భారతదేశంలో అనేక యుగాలను ప్రారంభించారు క్రీ పూ 57లో విక్రమశకం ప్రారంభమైంది క్రీ శ 78లో శకయుగం ప్రారంభమైంది క్రీ శ 319తో గుప్తయుగం ప్రారంభమైంది శాసనాలు దేశకాలాల నేపథ్యంలో సంఘటన లను పేర్కొంటాయి క్రీ పూ 3 వ శతాబ్దంలో వేసిన అశోకుని శాసనాల్లో ఎంతో చారిత్రక చైతన్యం కనిపిస్తుంది అశోకుడు 37 సంవత్సరాల కాలం పరిపాలించాడు అతని శాసనాలు అతడు సింహాసనాన్ని అధిష్టించిన ఏడవ సంవత్సరం నుంచీ ఇరవై ఏడవ సంవత్సరం వరకూ జరిగిన సంఘటనలను రికార్డు చేశాయి ఇంతవరకూ అతని పరిపాలనాకాలంలో తొమ్మిది సంవత్సరాలకు సంబంధించిన శాసనాలు మాత్రమే లభించాయి మిగిలిన సంవత్సరాలకు సంబంధించిన వివరాలు భవిష్యత్ పరిశోధనల్లో లభించవచ్చు అలాగే క్రీ పూ మొదటి శతాబ్దంలో కళింగదేశాన్ని పరిపాలించిన ఖారవేలుడు తాను వేయించిన హాతిగుంఫ శాసనాల్లో సంవత్సరం తరువాత సంవత్సరం తన జీవితంలో జరిగిన సంఘటనలను పేర్కొన్నాడు

జీవిత చరిత్రలు రాయటంలో కూడా భారతీయులు ఎంతో చారిత్రక చైతన్యాన్ని ప్రదర్శించారు క్రీ శ 7వ శతాబ్దంలో బాణభట్టు రాసిన హర్షచరిత్ర ఇందుకు చక్కని ఉదాహరణం అది ఆడంబరమైన అలంకారిక శైలిలో రాసిన జీవిత చరిత్రలాంటి గ్రంథం తరువాత కాలంలో దాన్ని అనుకరించాలనుకున్నవారికి అది దుస్సాధ్యమై పోయింది ఈ గ్రంథం హర్షవర్ధనుని జీవితంలోని తొలిదశను వర్ణిస్తుంది అందులో అతిశయోక్తులకు కరువులేదు కానీ హర్షుని కాలం

నాటి సామాజిక మత జీవితాన్ని గురించి ఈ గ్రంథం చక్కని అభిప్రాయాన్ని కలుగచేస్తుంది తరువాత కాలంలో చాలా జీవిత చరిత్ర లొచ్చాయి సంధ్యాకరనంది (12 వ శతాబ్దం) రాసిన "రామచరితం" కైవర్త వ్యవసాయదారులకూ, పాలరాజైన రామపాలునికీ మధ్య జరిగిన సంఘర్షణనూ, రామపాలుని విజయాన్నీ అభివర్ణిస్తుంది బిల్హణుని "విక్రమాంక దేవ చరిత్ర" అతని పోషకుడైన ఆరవ విక్రమాదిత్యుడు (కల్యాణి చాళుక్య రాజు, 1076–1127) సాధించిన విజయాలను గురించి చెబుతుంది క్రీ శ 12–13 శతాబ్దాల్లో గుజరాత్‌లోని కొందరు వ్యాపారుల జీవిత చరిత్రలు కూడా రాయబడ్డాయి దక్షిణభారతదేశంలో కూడా ఇలాంటి గ్రంథం ఒక్కటి లభించింది దీని పేరు "మూషిక వంశం" రచయిత పదకొండవ శతాబ్దానికి చెందిన అతులి ఉత్తర కేరళ ప్రాంతాన్ని పరిపాలించిన మూషికవంశ రాజుల చరిత్రను గురించి ఇది తెలియజేస్తుంది ఇలాంటి చారిత్రక గ్రంథాల్లో ఉత్తమోత్తమమైంది 12 వ శతాబ్దంలో కల్హణుడు రాసిన "రాజ తరంగిణి" ఇది కాశ్మీర్‌ను పరిపాలించిన రాజుల జీవిత చరిత్రల మాలిక ఈనాడు మనం చరిత్ర అంటున్న దానిలోని అనేక లక్షణాలను కలిగిన మొట్టమొదటి గ్రంథం ఇది

## చరిత్ర నిర్మాణం

ఇంతవరకూ చారిత్రక పూర్వదశకూ, చారిత్రక దశకూ చెందిన అనేక స్థలాలు తవ్వకాల్లో బయటపడ్డాయి వాటిని పరిశీలించటం కూడా జరిగింది కానీ ప్రాచీన భారతదేశ చరిత్రకు చెందిన ప్రధానస్రవంతిలో వాటికి స్థానం లేదు భారతదేశంలోని సామాజిక దశల పరిణామాన్ని అర్థం చేసుకోవాలంటే చారిత్రక పూర్వదశకు సంబంధించిన పురాతత్వ శాస్త్రపరిశోధనల ఫలితాలను తెలుసుకోక తప్పదు అలాగే చారిత్రక దశకు సంబంధించిన పురాతత్వ శాస్త్ర ఫలితాలూ అవసరమే ప్రాచీన చారిత్రక దశకు సంబంధించిన దాదాపు 150 స్థలాల్లో పురాతత్వ తవ్వకాలు జరిగాయి కానీ వాటికి సంబంధించిన సర్వే పుస్తకాల్లో ప్రాచీన కాలంలోని సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక జీవిత సరళులకూ, వీటికీ మధ్య ఉన్న సంబంధాన్ని గురించి చర్చించలేదు ప్రాచీన కాలంలో నగర జీవితాన్ని అర్థం చేసుకోవటం కోసం ఈ పని తప్పకుండా జరగాలి, కొన్ని బౌద్ధ, హైందవ స్థలాల ప్రాధాన్యత మాత్రమే ఇంతవరకూ గుర్తించబడింది కానీ మత చరిత్రకూ, ఇతర చారిత్రక పరిణామాలకూ మధ్య ఉన్న సంబంధాన్ని గురించి ఇంకా పరిశీలించవలసి ఉంది

ప్రాచీన చరిత్రను ఇంతవరకూ సాహిత్యాధార సహాయంతోనూ, దేశ, విదేశీయాత్రికులు రాసిన గ్రంథాల సహాయంతోనూ నిర్మించాం నాణాలూ, శాసనాలూ తమవంతు పాత్రను నిర్వహించాయి కానీ ప్రధాన పాత్ర మాత్రం సాహిత్యాధారాలదే మనం ఇప్పుడు కొత్త పద్ధతుల వైపు దృష్టి సారించాలి వేదకాలానికీ, అనేక రకాలకు చెందిన బూడిదరంగు పాత్రలవంటి పురాతత్వ వస్తువులకూ మధ్య ఉన్న సంబంధాన్ని నిర్ణయించాలి అలాగే ప్రాచీన పాళీగ్రంథాలకూ ఉత్తర భారతదేశంలో లభించిన నలుపురంగు వేసిన పాత్రలకూ మధ్య ఉన్న సంబంధాన్ని గురించి ఆలోచించాలి అలాగే సంగం సాహిత్యాన్ని దక్షిణ భారతదేశంలోని శాసనాలతోనూ, పురాతత్వ తవ్వకాల్లో బయట పడిన పెద్ద బండలతోనూ అనుసంధించి అధ్యయనం చేయాలి

పురాణాల్లో కనిపించే సుదీర్ఘమైన వంశవృక్షాల కంటే పురాతత్వ సాక్ష్యాధారాలను ఎంతో ముఖ్యమైనవిగా పరిగణించాలి పురాణసంప్రదాయం ప్రకారం అయోధ్యాధిపతి అయిన రాముడు క్రీ పూ 2000 సంవత్సరాల కాలానికి చెందినవాడు కానీ అయోధ్యలో విస్తృతంగా జరిగిన తవ్వకాల్లోకానీ, పరిశీలనల్లో కానీ ఆ కాలానికి చెందిన జననివాసం బయటపడలేదు అలాగే "మహాభారతం"లో శ్రీకృష్ణుడు నిర్వహించిన పాత్ర ఎంతో ముఖ్యమైనది మధురలో జరిగిన తవ్వకాలలో క్రీ పూ 200 – క్రీ శ 300 కాలానికి సంబంధించిన శిల్పాలెన్నో బయటపడ్డాయి అందులో శ్రీకృష్ణుని జాడే లేదు! గతంలో వచ్చిన ప్రాచీన భారతదేశ చరిత్రగ్రంథాల్లో పురాణ యుగాన్ని ఒక అధ్యాయంగా పరిగణించేవారు కానీ ఇంతవరకూ చర్చించిన కారణాల వల్ల రామాయణ, భారతాల మీద ఆధారపడ్డ పురాణ యుగాన్ని తిరస్కరించక తప్పదు కానీ సామాజిక పరిణామానికి సంబంధించిన వివిధ దశల్ని రామాయణ, మహాభారతాల్లో గుర్తించవచ్చు ఎందుకంటే, ఈ గ్రంథాలు సామాజిక పరిణామంలోని ఒకే దశలో రాసినవి కావు ఇదే అధ్యాయంలో ఇంతకుముందు చెప్పినట్టుగా అవి అనేక సామాజిక దశల్లో రాసినవి

అనేక శాసనాలను చారిత్రక విలువ లేకపోవటం చేత తిరస్కరిస్తారు "చారిత్రక విలువ" అంటే రాజకీయ చరిత్రను పునర్నిర్మించటానికి అవసరమైన సమాచారం పురాణాలతో పోల్చితే శాసనాలు ఎంతో నమ్మదగినవి పురాణాలు శాతవాహనుల కాలాన్ని ఎంతో వెనక్కు తీసుకుపోతాయి కానీ శాసనాధారాలు వారి పరిపాలనా ప్రారంభాన్ని క్రీ పూ మొదటి శతాబ్దంగా నిరూపిస్తాయి శాసనాలు రాజుల పరిపాలనాకాలాన్నీ, అతని విజయాలనూ, సామ్రాజ్య విస్తీర్ణతనూ తెలియచేస్తాయి అంతేకాకుండా, రాజ్యాంగతంత్రం అభివృద్ధి చెందిన విధాన్ని గురించీ, సమాజాన్ని గురించీ, ఆర్థిక వ్యవస్థను గురించీ, మతాన్ని గురించీ కూడా తెలియజేస్తాయి కాబట్టి ఈ గ్రంథంలో శాసనాలను రాజకీయ, మత

చరిత్రను రాయటానికి మాత్రమే ఉపయోగించటం లేదు భూదాన శాసనాలు వంశవృక్షాలనూ, రాజుల విజయాలనూ తెలుసుకోవటానికి ఉపయోగపడే మాట వాస్తవమే కానీ వాటి విలువ అంతమాత్రమే కాదు కొత్త రాజ్యాలు పుట్టటాన్ని గురించీ, వ్యవసాయ సంబంధాల్లో వచ్చిన మార్పుల్ని గురించీ (మరీముఖ్యంగా గుప్తయుగం తరువాత) అవి తెలియజేస్తాయి కాబట్టి వాటి విలువ ఎంతో ఎక్కువ అలాగే నాణాలను ఇండోగ్రీకుల, శకుల, శాతవాహనుల, కుషానుల చరిత్రల్ని పునర్నిర్మించటానికి మాత్రమే కాకుండా – ఆనాటి వాణిజ్య చరిత్రను గురించీ, నగర జీవితాన్ని గురించీ తెలుసుకోవటానికి ఉపయోగించాలి

చరిత్ర పునర్నిర్మాణానికి గ్రంధాలూ, నాణాలూ, శాసనాలూ, పురాతత్వశాస్త్రం లాంటివి ఎన్నో కావాలి వీటిలో వేటి ప్రాధాన్యత ఎంత అన్న సమస్య ఉండనే ఉంది నాణాలూ, శాసనాలూ, పురాతత్వ శాస్త్రమూ – ఇతిహాసాల్లో, పురాణాల్లో కనిపించే గాధలకంటే ఎక్కువ ప్రాధాన్యమైనవి పురాణ గాధలు ప్రధానమైన ప్రమాణాలకు దోహదం చేయవచ్చు సమాజంలోని ఆచార వ్యవహారాలనూ, వర్ణ వ్యవస్థలోని అర్హతలనూ, అనర్హతలనూ సమర్ధించవచ్చు కానీ వాటిలో వర్ణించిన సంఘటనలను వాస్తవాలుగా గ్రహించటానికి వీలులేదు గతకాలపు ఆచారాలను వర్తమానంలో మిగిలిన వాటి అవశేషాల ఆధారంగా కానీ, ఆదిమ వాసుల్ని పరిశీలించటం వల్ల కలిగే భావాల ఆధారంగా కానీ వివరించవచ్చు సమగ్రమైన చరిత్రను పునర్నిర్మించేటప్పుడు ఇతర ప్రాచీన సమాజాల్లో వచ్చిన మార్పుల్ని నిరాదరించటానికి వీల్లేదు ఇలాంటి తులనాత్మక అధ్యయనం మన సమాజానికి మాత్రమే పరిమితమైన లేదా అరుదైన అంశాలున్నాయన్న మొండి తనాన్ని దూరంచేస్తుంది ఇతర దేశాల్లోని ఇతర సమాజాల్లో వచ్చిన ఇలాంటి పరిణామాలను కూడా ఇలాంటి అధ్యయనం వెలుగులోనికి తీసుకు రావచ్చు

★ ★ ★

# అధ్యాయం: 4

# భౌగోళిక నేపథ్యం

భౌగోళిక పరిస్థితుల్ని గురించి కొంతైనా తెలుసుకో కుండా భారతదేశ చరిత్రను అర్థం చేసుకోవటం సాధ్యం కాదు రష్యాలేకుండా యూరప్ ఖండం ఎంత ఉంటుందో భారత ఉపఖండం అంత ఉంటుంది దీని మొత్తం విస్తీర్ణం 4,202,500 చదరపు కిలోమీటర్లు ఈ ఉపఖండంలో భారతదేశం, బంగ్లాదేశ్, నేపాల్, భూటాన్, పాకిస్థాన్ అన్న ఐదు దేశాలున్నాయి భారతదేశం జనాభా 96 కోట్లు ఇందులో ఇరవై ఐదు రాష్ట్రాలూ, ఏడు కేంద్రపాలిత ప్రాంతాలూ ఉన్నాయి కొన్ని రాష్ట్రాలు యూరప్‌లోని ఎన్నో దేశాలకంటే పెద్దవి ఉదాహరణకు బీహార్ ఇంగ్లండుకంటే పెద్దది యూరప్‌లోని చాలా దేశాలు మధ్యప్రదేశ్‌కంటే చిన్నవి

భారత ఉపఖండం ఉష్ణమండలంలో ఉంది దీనికి స్పష్టమైన భౌగోళిక రూపురేఖలున్నాయి భారతదేశ చరిత్రలో రుతుపవనాలకు ముఖ్యమైన స్థానం ఉంది నైరుతీ రుతుపవనాలు జూన్–అక్టోబర్ నెలల మధ్య వచ్చి భారతదేశంలోని అనేక ప్రాంతాల్లో తరతమభేదాలతో వర్షాన్ని తెస్తాయి ప్రాచీన కాలంలో నీటిపారుదలకు ప్రాధాన్యత లేదు వర్షం మాత్రమే వ్యవసాయానికి ఆధారం ఉత్తర భారతదేశంలో ఇప్పుడు మనం ఖరీఫ్ అని పిలుస్తున్నపంటకు ప్రాచీన కాలంలో నైరుతీ రుతుపవనాలు మాత్రమే ఆధారం ఈశాన్య రుతుపవనాలు నవంబర్ – మే నెలల మధ్య వస్తాయి వరి ప్రధాన పంటయిన దక్కన్ పీఠభూమి ప్రాంతానికి ఇవి వర్షాన్ని తెస్తాయి ఉత్తర భారతదేశంలో గోధుమ, బార్లీ మొదలైన ప్రధాన పంటలకు కూడా ఈశాన్య రుతుపవనాలు వర్షాన్ని తెస్తాయి క్రీ శ మొదటి శతాబ్దం ప్రాంతంలో రుతుపవనాల దిశను కనుగొన్న తరువాత వ్యాపారులు నైరుతీ రుతుపవనాల దారిలో ప్రయాణం చేసి మధ్య ఆసియా నుంచీ, మెడిటరేనియన్ సముద్ర ప్రాంతం నుంచీ భారతదేశానికీ, ఆగ్నేయ ఆసియా ప్రాంతానికీ వచ్చేవారు మళ్ళీ ఈశాన్య రుతుపవనాలు ప్రారంభం కాగానే ఆ రుతు పవనాల దారిలోనే తిరిగి వెళ్ళేవారు రుతుపవనాల దారిని కనుక్కోవటం చేత భారతదేశానికి పశ్చిమ ఆసియా, మెడిటరేనియన్, ఆగ్నేయ ఆసియా ప్రాంతాలతో వ్యాపారం చేయటం సాధ్యమైంది

భారతదేశానికి ఒకవైపు హిమాలయ పర్వతాలూ, మూడ వైపుల సముద్రాలూ ఎల్లలుగా ఉన్నాయి సైబీరియానుంచీ మధ్య ఆసియా గుండా వీచే మంచు గాలుల నుంచీ హిమాలయాలు భారతదేశాన్ని రక్షిస్తాయి అందుచేత ఉత్తరభారత దేశంలో వాతావరణం సంవత్సరం పొడువునా కొంతవరకూ వెచ్చగానే ఉంటుంది మైదాన ప్రాంతాల్లో చలి మరీ అంత దుర్భరంగా ఉండదు కాబట్టి ప్రజలకు చాలా మందమైన బట్టలు అవసరం లేదు వాళ్ళు ఎక్కువకాలం ఇళ్ళ బయట గడపటానికి వీలుంది అంతేకాకుండా, పరాయి దేశాలనుంచీ వచ్చే దండయాత్రల్ని ఆపగలిగి నంత సమున్నతంగా ఉన్నాయి హిమాలయ పర్వతాలు వార్తా సౌకర్యాలు చాలా కష్టంగా ఉండిన పారిశ్రామిక యుగానికి ముందుకాలంలో ఇది మరింత సత్యం కానీ హిమాలయాలకు కొనసాగింపుగా కనిపించే సులేమాన్ పర్వతాలను వాయువ్యదిశలో కైబర్, గోమల్ కనుమల గుండా దాటవచ్చు బెలూచిస్థాన్‌లోని దక్షిణ దిశలో సులేమాన్ పర్వతశ్రేణులు కీర్థార్ పర్వత శ్రేణులతో కలుస్తాయి వీటిని బోలన్ కనుమ ద్వారా దాటవచ్చు చారిత్రక పూర్వదశనుంచీ కూడా ఈ కనుమల గుండా భారత, మధ్య ఆసియాల మధ్య రాకపోకలున్నాయి ఇరాక్, ఆఫ్ఘనిస్థాన్, సోవియట్, మధ్యాసియా దేశాల నుంచీ భారతదేశానికి దండయాత్రలు చేయాలనే కాకుండా, స్థిరనివాసం ఏర్పరచుకోవాలని కూడా ఎందరో వచ్చారు భారతీయులు కూడా ఇదే ఉద్దేశాలతో ఆ దేశాలకు వెళ్ళారు హిమాలయాలకు పడమటి కొనసాగింపైన హిందూకుష్ పర్వత శ్రేణులు కూడా సింధూనదీప్రాంతానికీ, ఆక్సస్ నదీప్రాంతానికీ మధ్య అడ్డుగా నిలబడలేకపోయాయి ఈ కనుమలు భారతదేశానికీ, మధ్య ఆశియా, పశ్చిమ ఆసియాల ప్రాంతాలకూ మధ్య వ్యాపార, సాంస్కృతిక సంబంధాలు ఏర్పడటానికి దోహదం చేశాయి




హిమాలయాల ఒడిలో కాశ్మీర్, నేపాల్ లోయలు న్నాయి అన్ని వైపులా ఎత్తైన పర్వతాలు ప్రహరీలాగా ఉండటం చేత కాశ్మీర్‌లోయలో ఒక ప్రత్యేకత కలిగిన జీవిత విధానం అభివృద్ధి చెందింది కానీ కాశ్మీరును అనేక కనుమల గుండా చేరవచ్చు కాశ్మీరులో శీతాకాలంలో చలి ఎక్కువ కావటం చేత కొంతమంది కాశ్మీరీ ప్రజలు మైదాన

ప్రాంతాలకు తరలి వెళ్ళారు కానీ మైదాన ప్రాంతాలకు చెందిన గొర్రెల కాపరులకు కాశ్మీరులో వేసవి కాలపు వాతావరణం ఆకర్షణీయంగా కనిపించింది కాశ్మీరుకూ, మైదాన ప్రాంతాలకూ మధ్య – ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలు కొనసాగుతూనే వచ్చాయి బౌద్ధ మతాన్ని మధ్య ఆసియా ప్రాంతాలకు అందివ్వటానికి పామీర్ పీఠ భూమి కూడా అడ్డు కాలేదు పరిమాణంలో చిన్నదైన నేపాల్ లోయను గంగామైదానం నుంచీ చేరుకోవటానికి ఎన్నో కనుమ దారులున్నాయి కాశ్మీరులాగా నేపాల్ కూడా సంస్కృతాధ్యయనానికి కేంద్రంగా రూపొందింది ఈ రెండు లోయలూ సంస్కృత రాత ప్రతులకు గొప్ప భాండాగారాలుగా కూడా రూపొందాయి

మెత్తని మైదాన ప్రాంతాల్లోని అడవులకంటే హిమాలయ పర్వత పాదాల వద్ద వున్న అడవుల్ని నిర్మూలించటం సులువనిపించింది ఇక్కడున్న చిన్న నదుల్ని దాటటం కూడా సులువే అందుచేత తొలి మార్గాలు హిమాలయ పర్వత పాదాల వెంబడే ఏర్పడ్డాయి అవి పడమర నుంచీ తూర్పుకూ, తూర్పు నుంచీ పడమరకూ ఏర్పడ్డాయి కాబట్టి తొలి వ్యవసాయ ప్రాంతాలు క్రీ పూ 6 వ శతాబ్దంలో ఈ ప్రాంతంలోనే ఏర్పడ్డాయి ఈ దారివెంబడే వ్యాపార మార్గాలు కూడా ఏర్పడ్డాయి

వేసవికాలపు రుతుపవనాల నీటిని గ్రహించి – పొంగి పరవళ్ళు దొక్కే ప్రధానమైన నదులు, భారతదేశంలో కొన్ని ప్రాంతాల్లో చరిత్ర నిర్మాణానికి కారణభూతమయ్యాయి సింధూనదీపరీవాహక ప్రాంతంలోని మైదానాలూ, గంగాసింధూ నదుల మధ్య భాగం, గంగా, బ్రహ్మపుత్రా లోయలు ఈ ప్రాంతాల్లో ఉన్నాయి పడమర నుంచీ తూర్పుకు ప్రయాణం చేస్తే సంవత్సర వర్షపాతం 25 సి ఎం నుంచీ 250 సి ఎం లకు పెరగటాన్ని కూడా మనం గమనించవచ్చు 25 నుంచీ 37 సెంటీమీటర్ల వర్షపాతం కలిగిన సింధూనదీప్రాంతంలోని చెట్లు చేమల్నీ, 37 నుంచీ 60 సెంటీమీటర్ల వర్షపాతం కలిగిన గంగానది పశ్చిమ ప్రాంతంలోని చెట్టు చేమల్నీ రాతితో, రాగితో చేసిన పనిముట్లను ఉపయోగించి చదును చేయగలిగారు వ్యవసాయానికి అనుకూలంగా చేయగలిగారు కానీ 60 నుంచీ 125 సెంటీమీటర్ల వర్షపాతం కలిగిన మధ్యగంగా ప్రాంతంలో ఇది సాధ్యం కాలేదు 125 నుంచీ 250 సెం మీ వర్షపాతం కలిగిన దక్షిణ గంగా ప్రాంతంలోనూ, బ్రహ్మపుత్రాప్రాంతంలోనూ ఈ పని అసలే సాధ్యం కాలేదు ఈ ప్రాంతంలోని దట్టమైన అడవుల్నీ, గట్టి నేలనీ చదును చేయటానికి తరువాత కాలంలో వచ్చిన ఇనుపపనిముట్లు కావలసి వచ్చాయి ఇలా ప్రకృతి వనరుల్ని ఉపయోగించుకోవటం పశ్చిమభారతదేశంలోనే మొదట ప్రారంభమైంది జనం పెద్ద ఎత్తున స్థిరనివాసం ఏర్పరచుకోవటం పడమటి వైపు నుంచి తూర్పు వైపుకు కొనసాగింది

వ్యవసాయానికి అనుకూలంగా మార్చిన తరువాత గంగా సింధూ మైదానం విలువైన పంటల్ని అందించసాగింది ఒకటి తరువాత ఒకటిగా అనేక సంస్కృతులు ఉద్భవించటానికి దోహదం చేసింది సింధూనదీ పరీవాహక ప్రాంతంలోనూ, గంగానదీ పరీవాహక ప్రాంతంలోని పడమటి భాగంలోనూ ప్రధానంగా గోధుమా, బార్లీ పంటలు పండేవి మధ్య, దక్షిణ గంగాపరీవాహక ప్రాంతంలో వరి పండేది గుజరాత్‌లోనూ, వింధ్యపర్వతాలకు దక్షిణ ప్రాంతంలోనూ వరి ప్రధాన ఆహార పదార్థమైంది హరప్పా నాగరికత సింధూనదీ లోయలో అభివృద్ధి చెందింది వేద నాగరికత పంజాబులో ప్రారంభమై, పశ్చిమ గంగా తీరమైదానాల్లో విస్తరించింది వేదకాలం తరువాత ఇనుము ఆధారంగా వచ్చిన నాగరికత గంగామైదానం మధ్యభాగంలో అభివృద్ధి చెందింది గంగా పరీవాహక ప్రాంతంలోని దక్షిణభాగమూ, ఉత్తర బెంగాల్ ప్రాంతమూ గుప్తుల కాలంలో వెలుగులో కొచ్చాయి చిట్టచివరగా అస్సాంలోని బ్రహ్మపుత్రా నదీలోయ మధ్యయుగాల్లో ప్రాధాన్యతను సంతరించుకుంది ఈ మైదానాలనూ, లోయలనూ తమ అధీనంలోకి తెచ్చుకోవటం కోసం బలమైన శక్తులు పోరాటాలు చేశాయి వీటిలో కూడా గంగా–యమునా మైదానం కోసం ఎక్కువ పోటీలూ, పోరాటాలూ జరిగాయి

నదులు వ్యాపారానికీ, సమాచార ప్రసారాలకీ వాహికలుగా పనిచేశాయి ప్రాచీన కాలంలో బాటలు వేయటం కష్టమైన పని కావటం చేత మనుషుల్నీ, సరుకుల్నీ ఒకచోటి నుంచీ మరొక చోటికి పడవలమీదనే చేరవేసేవారు ఈ నదీమార్గాలు వ్యాపార రవాణాకే కాకుండా సైనిక రవాణాకు కూడా ఉపయోగపడ్డాయి అశోకుని శిలాశాసనాలు పడవలమీదనే దేశంలోని వివిధ ప్రాంతాలకు చేరవేసి ఉంటారన్నది స్పష్టంగా కనబడుతూనే ఉంది తూర్పుఇండియా కంపెనీ పరిపాలన వచ్చేవరకూ నదీమార్గాల ప్రాధాన్యత కొనసాగుతూనే వచ్చింది దీనికి తోడు నదులు పొంగి తమ పరీవాహక ప్రాంతాలను సారవంతంగా కూడా చేసేవి అవి తమ నుంచీ తవ్విన కాలువల గుండా నీటిని కూడా సరఫరా చేసేవి కానీ అప్పుడప్పుడూ వరదలు ఉత్తరదేశ మైదానాల్లోని పల్లెలనూ, పట్టణాలనూ, ధ్వంసం చేసేవి ఇలా జరిగినప్పుడు ఎన్నో ప్రాచీన భవనాలు గుర్తుతెలియకుండా కొట్టుకుపోయాయి ఇంత జరిగినా హస్తినాపురం, ప్రయాగ, వారాణసి, పాటలీపుత్రం మొదలైన ప్రాచీన రాజధానీ నగరాలు నదీతీరాల్లోనే వెలిశాయి ఆధునిక యుగంలో రైలుమార్గాల పక్కనా, బాటల కూడలుల్లో,

గనులూ, ఇతర పరిశ్రమలూ ఉన్న ప్రాంతాల్లో నగరాలు వెలుస్తాయి కానీ పారిశ్రామికీరణానికి పూర్వం నగరాలు ప్రధానంగా నదీతీరాల్లోనే ఉండేవి

అంతేకాదు – నదులు ప్రాచీన కాలంలో రాజకీయ, సాంస్కృతిక సరిహద్దులుగా కూడా ఉండేవి పర్వతాలు కూడా ఈ పని చేసేవి అలా పీఠభూమి తూర్పు భాగంలో కళింగ ప్రాంతం మహానదికి దక్షిణంగా, గోదావరికి ఉత్తరంగా ఉండేది అలాగే ఆంధ్రప్రాంతం గోదావరీ, కృష్ణానదుల మధ్య ఉండేది ఈ నదీముఖంలోని డెల్టా ప్రాంతాలు క్రీస్తుశకం ప్రారంభానికే చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకున్నాయి

శాతవాహనుల కాలంలోనూ, ఆ తరువాత వచ్చిన రాజుల కాలంలోనూ ఈ ప్రాంతంలో ఎన్నో పట్టణాలూ, ఓడ రేవులూ వెలిశాయి అంతేకాకుండా తమిళనాడులోని చాలా భాగం కృష్ణా, కావేరీ నదుల మధ్య ఉంది కావేరీ లోయ దక్షిణాన దాదాపు వైగైనది వరకూ, ఉత్తరాన దక్షిణ పెన్నార్ నది వరకూ విస్తరించింది ఇది ఒక ప్రత్యేక భౌగోళిక ప్రాంతంగా రూపొంది క్రీస్తు శకానికి కాస్తముందుగా చోళ సామ్రాజ్యానికి కేంద్రమైంది క్రీస్తుశకం 4–6 శతాబ్దాల్లో ఉత్తర తమిళనాడు మెట్ట ప్రాంతంలో అభివృద్ధి చెందిన పల్లవ రాజ్యప్రాంతానికీ దీనికీ చాలా తారతమ్యం ఉంది



భారతద్వీపకల్పంలోని తూర్పుభాగం కోరమాండల్ తీరం తీరప్రాంతం వెంబడి తూర్పు కనుమలున్నాయి ఇవి ఎత్తుగా ఉన్నా వీటిమధ్య అనేక ఖాళీ ప్రాంతాలున్నాయి అందుచేత అనేక నదులు తూర్పు ముఖంగా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తున్నాయి అందుచేత ప్రాచీన కాలంలో తూర్పుతీరప్రాంతానికీ, ఆంధ్ర, తమిళనాడుల్లోని ఇతర ప్రాంతాలకూ మధ్య సంబంధాలు కష్టంగా ఉండేవి కావు అరికమేడు, మహాబలిపురం, కావేరీపట్టణం ఓడరేవులు కోరమాండల్ సముద్రతీరంలోనే ఉన్నాయి

ద్వీపకల్పం యొక్క పశ్చిమతీరప్రాంతంలో ఇలాంటి స్పష్టమైన ప్రాంతాల విభజన సాధ్యంకాదు కానీ ఉత్తరాన టాపీ (లేదా దామన్ గంగ), దక్షిణాన భీమానదుల మధ్యప్రాంతాన్ని మహారాష్ట్రగా గుర్తించవచ్చు అలాగే భీమా, ఉత్తరాన కృష్ణ, దక్షిణాన తుంగభద్ర నదుల మధ్య ఉన్న ప్రాంతం కర్ణాటక చాలాకాలం పాటు ఉత్తర, దక్షిణాల్లో ఉన్న శత్రురాజ్యాల మధ్య సహజ సరిహద్దుగా తుంగభద్ర పనిచేసింది బాదామి చాళుక్యులూ, రాష్ట్రకూటులూ తుంగభద్రకు దక్షిణంగా తమ రాజ్యాలను విస్తరింపచేయ లేకపోయారు అలాగే పల్లవులూ, చోళులూ తుంగభద్రకు ఉత్తరంగా తమ రాజ్యాలను విస్తరింప చేయలేకపోయారు భారతదేశం యొక్క నైరుతీ తీరం వెంబడి ఉన్న ప్రాంతమే ఆధునిక కేరళరాష్ట్రం ద్వీపకల్పం యొక్క పశ్చిమ తీరాన్ని మలబార్ తీరం అంటారు ఈ ప్రాంతంలో అనేక ఓడరేవులున్నా ఎత్తైన పడమటి కనుమల వల్లా, అందులోని కనుమలు ప్రయాణాలకు సులభంగా లేకపోవటం చేతా మహారాష్ట్ర, కర్ణాటక, కేరళ రాష్ట్రాలమధ్య సంబంధాలు ఏర్పడటం కష్టంగా ఉండేది

గంగా – సింధూ మైదానాలకు మధ్య, వింధ్యపర్వతాలకు ఉత్తరంగా విశాలమైన భూభాగం ఉంది దీన్ని ఆరావళీ పర్వతాలు రెండు భాగాలుగా చేస్తున్నాయి ఆరావళీ పర్వతాలకు పడమర ఉన్న భాగం థార్ ఎడారి (ఇందులో రాజస్థాన్‌కు చెందిన కొంత భాగం కూడా ఉంటుంది) ప్రాచీన కాలంలో ఈ విశాలమైన ఎడారి ప్రాంతంలో జననివాసం అసాధ్యంగా ఉండేది ఎడారిలో అక్కడక్కడా ఉన్న కొన్ని ఒయాసిస్‌ల వద్ద మాత్రమే జనం నివసించేవారు కానీ అనాది నుంచీ కూడా ఒంటెల మీద ఈ ఎడారిని దాటటానికి వీలయ్యేది మొదటి నుంచీ కూడా రాజస్థాన్‌లోని ఆగ్నేయభాగం ఇతరభాగాలకంటే ఎక్కువ సారవంతంగానే ఉంది ఈ ప్రాంతంలో ఖేత్రీ రాగిగనులు కూడా ఉండటం చేత రాగియుగం నుంచీ కూడా ఇక్కడ జన నివాసం ఉంది

రాజస్థాన్ క్రమక్రమంగా గుజరాత్‌లోని సారవంతమైన మైదాన ప్రాంతాల్లోకి అదృశ్యమై పోతుంది ఈ ప్రాంతాల్లో నర్మద, టాపి, మహి, సబర్మతీ నదీజలాలు ప్రవహిస్తాయి దక్కన్ పీఠభూమిలో వాయవ్య దిశలో ఉన్న గుజరాత్‌లో వర్షపాతం తక్కువగా ఉన్న కథియవార్ ద్వీపకల్పం కూడా ఉంది ఈ రాష్ట్రంలోని తీరప్రాంతం చీలి ఉండటం చేత అనేక ఓడ రేవులు ఏర్పడ్డాయి అందుచేత గుజరాత్ మొదటి నుంచీ కూడా సముద్ర వ్యాపారానికీ, విదేశీ వ్యాపారానికీ ప్రసిద్ధి చెందింది ఆ రాష్ట్రంలోని ప్రజలు కూడా తెలివైన వ్యాపారస్తులన్న పేరు తెచ్చుకున్నారు

గంగా–యమునా పరీవాహక ప్రాంతానికి దక్షిణంగా, చంబల్ నదికి తూర్పున, సోన్ నదికి పడమరగా, వింధ్య పర్వతాలకూ, నర్మదానదికీ ఉత్తరంగా మధ్యప్రదేశ్ రాష్ట్రం ఉంది ఆ రాష్ట్రంలోని ఉత్తరభాగంలో సారవంతమైన మైదానాలున్నాయి ఈనాడు భారతదేశంలో మధ్యప్రదేశ్ అన్నిటికంటే పెద్ద రాష్ట్రం ఈ రాష్ట్రాన్ని తూర్పు, పడమర అన్న రెండు ప్రాంతాలుగా విభజించ వచ్చు క్రీ శ 4, 5 శతాబ్దాల వరకూ – అంటే గుప్తులయుగం వరకూ – ఈ రాష్ట్రంలోని తూర్పు ప్రాంతానికి చారిత్రక ప్రాధాన్యత రాలేదు కానీ మధ్యప్రదేశ్‌లోని పడమరభాగం (ఇందులో మాళ్వ కూడా ఉంది) క్రీ పూ 6 వ శతాబ్ది నుంచీ కూడా అనేక చారిత్రక కార్యకలాపాలకు కార్యరంగం గుజరాత్‌లోని ఓడరేవులకు మాళ్వ ముఖ్యమైన వెనుకదన్నుగా ఉండేది మాళ్వప్రాంతం కోసమూ, మొత్తం గుజరాత్ కోసమూ, దక్కన్, ఉత్తర భారత రాజుల మధ్య అనేక యుద్ధాలు జరిగాయి క్రీ శ ఒకటి, రెండు శతాబ్దాల్లో ఈ ప్రాంతం కోసం శకులూ, శాతవాహనులూ యుద్ధాలు చేసుకున్నారు 18 వ శతాబ్దంలో మరాఠాలూ, రాజపుత్రులూ పోరాడుకున్నారు

నదులచేత, కొన్ని సందర్భాల్లో పర్వతాల చేత చుట్టబడి ఉన్న డెల్టాలూ, ద్వీపకల్పాలూ ప్రత్యేకమైన రాజకీయ, పరిపాలక ప్రాంతాలుగా రూపొందాయి వీటిలో అనేక రాజవంశాలు పుట్టాయి, గిట్టాయి సమాచార సౌకర్యాలు తక్కువ కావటం చేతా, సహజమైన సరిహద్దులు రక్షిస్తూ ఉండటం చేతా, ఒక ప్రాంతానికి చెందిన పాలక వర్గాలు మరో ప్రాంతం మీద అధికారాన్ని సంపాదించటం కష్టంగా ఉండేది అందుచేత కాలక్రమాన ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క సంస్కృతి అభివృద్ధి చెందింది వేరు వేరు ప్రాంతాల్లో వేరు వేరు భాషలూ, వేరువేరు జీవన శైలులూ కూడా అభివృద్ధి చెందాయి కానీ ఉత్తర భారతదేశంలోనూ, పశ్చిమ భారతదేశంలోనూ ఉన్న అనేక భాషలు ఇండో–ఆర్యన్ మూలంలో నుంచీ వచ్చినవే అందుచేత వారిలో అనేక పోలికలుంటాయి దేశం మొత్తం మీద సంస్కృతాన్ని నేర్చుకోవటం, అర్థం చేసుకోగలగటం మరొక ముఖ్యమైన అంశం




వింధ్యపర్వతాలు పడమర నుంచీ తూర్పుకు వ్యాపించి దేశాన్ని ఉత్తర – దక్షిణ భాగాలుగా విభజిస్తున్నాయి ద్రావిడ భాషలు మాట్లాడే ప్రజలు దక్షిణ భారతదేశంలోనూ, ఆర్య భాషలు మాట్లాడే ప్రజలు ఉత్తర భారతదేశంలోనూ ఉండే వారు వీరిమధ్య, వింధ్య పర్వతాల్లో గిరిజనులు ఉండేవారు వారు ఇప్పుడు కూడా ఉన్నారు తూర్పు, పడమటి కనుమల

పొడవునా ఉన్న తీరప్రాంతం వ్యాపారులనూ, వలస వచ్చి స్థిరనివాసం ఏర్పరచుకోవాలన్న వారినీ ఆకర్షించింది దక్షిణ భారతదేశం అభివృద్ధి చెందుతూ ఉన్న విదేశీవ్యాపారాన్ని కొనసాగిస్తూనే వచ్చింది వింధ్యపర్వతాలు - ఎంత ఎత్తైనవే అయినా - దాటటానికి అసాధ్యమైనవిమాత్రం కావు ప్రాచీనకాలంలో - ఎన్ని ఇబ్బందులున్నా - ఉత్తర భారతదేశం నుంచీ దక్షిణ భారతదేశానికీ, దక్షిణ భారతదేశం నుంచీ ఉత్తర భారతదేశానికీ ప్రజలు వెళ్ళారు ఈ పరిణామం - సంస్కృతిలో, భాషలో ఇచ్చి పుచ్చుకోవటాలకు దారితీసింది అనేకసార్లు ఉత్తర భారతరాజులు దక్షిణానికీ, దక్షిణ భారత రాజులు ఉత్తరానికీ వెళ్ళారు అలాగే వ్యాపారులూ, మత ప్రచారకులూ, సంస్కృతీ నాయకులూ - మరీ ముఖ్యంగా బ్రాహ్మణులు - ఇలా ప్రయాణం చేశారు ఈ ప్రయాణం రెండువైపులకూ ఉండటం చేత అది ఒక ఉమ్మడి సంస్కృతి అభివృద్ధి చెందటానికి దోహదం చేసింది

చాలా ప్రాంతాలకు స్పష్టమైన సహజ సరిహద్దులున్నా, అన్ని ప్రాంతాలలో జీవితం సుఖంగా సాగటానికి అవసరమైన ప్రకృతి వనరులు లేవు అందుచేత చారిత్రక పూర్వ దశ నుంచీ కూడా లోహాల కోసమూ, ఇతర వనరుల కోసమూ, దేశంలోని వివిధ ప్రాంతాల మధ్య సంబంధ బాంధవ్యాలు ఏర్పడటం అవసరమైంది

ఒక దేశంలోని ప్రకృతి వనరుల్ని ఉపయోగించుకున్న పద్ధతి ఆ దేశ చరిత్ర మీద గొప్ప ప్రభావాన్ని కలిగి ఉంటుంది అధిక వర్షపాతం వల్ల భారతదేశంలోని మైదానాల్లో దట్టమైన అడవులుండేవి వాటిలో వేటాడటానికి జంతువులూ, కలపా, వంట చెరకూ లభించేవి ఈ పరిస్థితి పెద్ద ఎత్తున జన నివాసాలు ఏర్పడేవరకూ కొనసాగింది తొలిరోజుల్లో కాల్చిన ఇటుకలు పెద్దగా ఉపయోగంలో లేవు కలపతోనే ఇళ్ళూ, కంచెలూ కట్టుకునేవారు వీటిని మన అత్యంత ప్రాచీన రాజధానీ నగరమైన పాటలీపుత్రంలో కనుగొన్నారు ఇళ్ళు కట్టుకోవటానికీ, పని ముట్లను తయారు చేసుకోవటానికీ అనేక రకాలైన రాళ్ళు (ఇసుక రాయి కూడా) మనదేశంలో దొరుకుతాయి మనదేశంలో మొదటి జననివాసాలు కొండప్రాంతాల్లోనూ, కొండల మధ్యవున్న నదీలోయల్లోనూ కనిపిస్తాయి చారిత్రక దశలో ఉత్తరభారతదేశంలోకంటే దక్కన్‌పీఠభూమిలోనూ, దక్షిణదేశంలోనూ రాతితో కట్టిన గుడులూ, రాతితో చెక్కిన శిల్పాలూ ఎక్కువగా ఉన్నాయి

మనదేశంలో రాగి విస్తృతంగా లభిస్తుంది ఛోటానాగ పూర్ ద్వీపకల్పంలో - మరీ ముఖ్యంగా సింగ్ భూమ్ జిల్లాలో అత్యుత్తమమైన రాగి లభిస్తుంది 130 కి మీ పొడవున్న ఈ రాగి లభించే ప్రాంతంలో ప్రాచీన కాలానికి చెందిన అనేక చిహ్నాలు లభిస్తున్నాయి మొట్టమొదటిసారిగా బీహార్‌లో రాగి పనిముట్లు ఉపయోగించినవారు - సింగ్ భూమ్, హజారీ బాగ్ గనుల్లో లభించే రాగిని బాగా ఉపయోగించుకున్నారు రాగిపనిముట్లు బీహార్‌లోనూ, మధ్యప్రదేశ్‌లోని కొన్నిప్రాంతాల్లోనూ లభించాయి రాజస్థాన్‌లోని ఖేత్రిగనుల్లో పెద్ద మొత్తంలో రాగి ఉంది నేటి పాకిస్థాన్‌లోనూ, రాజస్థాన్, గుజరాత్, రాష్ట్రాల్లోనూ, గంగా - యమునా పరీవాహక ప్రాంతంలోనూ, వేదపూర్వయుగంలోనూ, వేదయుగంలోనూ జీవించిన ప్రజలు ఈ గనుల్లోని రాగిని బాగా ఉపయోగించుకున్నారు ఖేత్రి ప్రాంతంలో రాగివస్తువుల్ని ఉపయోగించిన అనేక ప్రాంతాలు కనిపించాయి అవి బహుశా క్రీ పూ 1000 సంవత్సరాల ప్రాంతానికి చెందినవి కావచ్చు మనం మొట్టమొదట ఉపయోగించిన లోహం రాగి కావటం చేత హిందువులు ఆ లోహానికి గొప్ప పవిత్రతను ఆపాదించారు మత కార్యక్రమాలలో ఈనాటికీ మనం రాగిపాత్రలనే ఉపయోగిస్తున్నాం

ఈనాడు మనదేశంలో తగరం ఉత్పత్తి కాదు ప్రాచీన కాలంలో కూడా తగరం అరుదైన లోహంగానే ఉండేది రాజస్థాన్‌లోనూ, బీహార్‌లోనూ తగరం లభించేదని నమ్మటానికి ఆధారాలున్నాయి కానీ ఆ గనుల్లోని లోహం పూర్తిగా అయిపోయింది తగరం, రాగిలోహాల మిశ్రమమైన కంచుతో చేసిన వస్తువులు చారిత్రక పూర్వదశలో ఎక్కువగా లభించలేదు హరప్పా వాసులు కొద్దిగా తగరాన్ని రాజస్థాన్ నుంచీ సంపాదించి ఉండవచ్చు కానీ వారు తగరం కోసం ప్రధానంగా ఆఫ్ఘనిస్థాన్ మీద ఆధారపడ్డారు అది కూడా సరిపోయేదికాదు హరప్పా ప్రజలు కంచు పనిముట్లను ఉపయోగించారు కానీ పశ్చిమాసియాలో, ఈజిప్ట్‌లో, క్రీట్ ద్వీపంలో లభించిన వాటి సంఖ్యతో పోల్చిచూస్తే అవి చాలా తక్కువే అంతేకాకుండా హరప్పా కంచు పనిముట్లలో తగరం శాతం చాలా తక్కువగా కూడా ఉండేది అందుచేతనే భారతదేశంలోని ఎక్కువభాగంలో నిజమైన కంచుయుగం లేదు క్రీస్తుశకం ప్రారంభం నుంచీ కూడా భారతదేశం బర్మాతోనూ, మలయా ద్వీపకల్పంతోనూ సన్నిహిత సంబంధాలను ఏర్పరచుకొంది ఆ దేశాల్లో తగరం పుష్కలంగా ఉండటం చేత దాన్ని దిగుమతి చేసుకొని ఎక్కువగా ఉపయోగించ గలిగారు మరీ ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో దేవతా విగ్రహాల తయారీలో తగరం ఉపయోగం ఎక్కువగా కనిపిస్తుంది బీహారులో పాలరాజుల కాలంలో తయారు చేసిన కంచు విగ్రహాలకు ఉపయోగించిన తగరం, గయ, హజారీ బాగ్, రాంచీ గనులనుంచీ లభించి ఉండవచ్చు హజారీ బాగ్‌లో తగరం లోహాన్ని శుద్ధిచేసే పరిశ్రమ 19 వ శతాబ్దం మధ్యవరకూ కూడా ఉండేది

భారతదేశంలో ఇనుపఖనిజం పుష్కలంగా లభిస్తుంది బీహార్, తూర్పుమధ్యప్రదేశ్, కర్ణాటక ప్రాంతాలలో ఇను

పఖనిజం నిలువలున్నాయి కొలిమి తిత్తులు ఉపయోగించి ఇనుమును శుద్ధిచేసి ఉక్కును తయారు చేయటం నేర్చుకున్న తరువాత దాన్ని యుద్ధాల్లో ఉపయోగించటం ప్రారంభించారు మరింత ప్రయోజనకరంగా అడవుల్ని నరికి చదును చేయటానికీ, దున్ని చేసే వ్యవసాయానికీ కూడా ఉపయోగించటం ప్రారంభించారు క్రీ పూ 6–4 శతాబ్దాల మధ్య మగధలో ప్రారంభమైన మొట్టమొదటి సామ్రాజ్యం ఆ ప్రాంతానికి దక్షిణంగా లభించిన ఇనుముకు ఎంతో రుణపడి ఉంది క్రీ పూ 6–5 శతాబ్దాల్లో ఉజ్జయిని రాజధానిగా అభివృద్ధి చెందిన అవంతీ రాజ్యం యొక్క గొప్పదనం కూడా ఇనుమును విస్తృతంగా ఉపయోగించటం మీద ఆధారపడి ఉంది వింధ్యపర్వతాలకు దక్షిణంగా అభివృద్ధి చెందిన శాతవాహన సామ్రాజ్యం కూడా ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాల్లో లభించిన ఇనుపఖనిజాన్ని బాగా ఉపయోగించి ఉండవచ్చు

ఆంధ్రలో సీసం నిలువలు ఎక్కువగా ఉండేవి అందుచేతనే క్రీ శ ఒకటి, రెండు శతాబ్దాల్లో ఆంధ్ర, మహారాష్ట్ర ప్రాంతాలను పరిపాలించిన శాతవాహనుల సామ్రాజ్యంలో సీసంతో చేసిన నాణాలు పెద్ద సంఖ్యలో దొరికాయి కానీ సీసాన్ని రాజస్థాన్ పట్టణాల నుంచీ కూడా దిగుమతి చేసుకొని ఉండే అవకాశం లేకపోలేదు

మొట్టమొదటి నాణాలను "పంచ్ మార్క్డ్ కాయిన్స్" (చిల్లుల నాణాలు) అంటారు వీటిని ఎక్కువగా వెండితో తయారుచేశారు కానీ వెండి మనదేశంలో అరుదుగా మాత్రమే లభించేది మాంఘీర్ జిల్లాలో, ఖరగ్‌పూర్ కొండప్రాంతాల్లో వెండి గనులుండేవని అక్బర్ కాలానికి చెందిన రాతల్లో కూడా పేర్కొనబడింది బీహార్‌లో తా[illegible] వెండి నాణాలు లభించడానికి కారణం ఇదే కావచ్చు

కర్ణాటకలోని కోలారు గనుల్లో బంగారం లభిస్తుంది కర్ణాటకలో క్రీ పూ 1800 ప్రాంతానికి చెందిన కొత్తరాతి యుగంనాటి ఒక స్థలంలో బంగారం ఉన్న లక్షణాలు కనిపించాయి కానీ అక్కడున్న బంగారాన్ని ఆనాటి ప్రజలు ఉపయోగించుకున్న లక్షణాలు మాత్రం కనిపించలేదు క్రీ శ 2 వ శతాబ్దం వరకూ ఆ బంగారాన్ని ఉపయోగించుకున్న దాఖలాలు లేవు దక్షిణ కర్ణాటకకు చెందిన గాంగరాజులకు కోలారు రాజధానిగా ఉండేది ప్రాచీన కాలంలో ఉపయోగించిన బంగారంలో ఎక్కువభాగం మధ్యఆసియా నుంచీ, రోమన్ సామ్రాజ్యం నుంచీ వచ్చింది అందుచేత బంగారునాణాలు క్రీస్తుశకం మొదటి ఐదు శతాబ్దాల్లోనే ప్రాచుర్యంలో కొచ్చాయి స్థానికంగా లభిస్తున్న బంగారం చాలకపోవటంచేతా, ఇతర దేశాలనుంచీ బంగారం దిగుమతి ఆగిపోవటంచేతా బంగారునాణాలు క్రమక్రమంగా అరుదై పోయాయి

ప్రాచీన కాలంలో భారతదేశంలో అనేక రకాల విలువైన మణులు, ముఖ్యంగా ముత్యాలు – మధ్యభారతదేశంలో, ఒరిస్సాలో, దక్షిణభారతదేశంలో లభించేవి క్రీస్తుశకం తొలిశతాబ్దాల్లో రోమన్లు వీటిమీద మోజుపడటం చేత ఈ విలువైన మణులు ఒక ముఖ్యమైన వ్యాపార వస్తువులుగా ఉండేవి

★ ★ ★

# అధ్యాయం: 5

# రాతియుగం - తొలిమానవులు

## పాతరాతి యుగం వేటగాళ్ళు - ఆహారాన్ని సేకరించినవాళ్ళు

భూమి వయస్సు సుమారు 4000 మిలియన్ల సంవత్సరాలు భూమి పైభాగం అభివృద్ధి చెందిన క్రమంలో నాలుగు దశలున్నాయి నాలుగవ దశను "క్వాటర్నరీ" అంటారు దీన్ని ప్లైస్టోసీన్ (అత్యంత ఆధునికం), హోలోసీన్ (సమకాలీనం) అన్న రెండు దశలుగా విభజించవచ్చు వీటిలో మొదటిది పది లక్షల సంవత్సరాల కాలం కొనసాగింది రెండవది పదివేల సంవత్సరాల క్రితం ప్రారంభమైంది మానవుడు ప్లైస్టోసీన్ యుగం తొలినాళ్ళలో అవతరించాడు అదేకాలంలో నిజమైన ఎద్దూ, ఏనుగూ, గుర్రమూ కూడా అవతరించాయి ఈ సంఘటన 26 మిలియన్ల సంవత్సరాల క్రితం ఆఫ్రికాలో జరిగి ఉండవచ్చని భావిస్తున్నారు

తొలి మానవుని శిలాజాలు భారతదేశంలో లభించలేదు రెండవ మంచుయుగానికి - అంటే సుమారు క్రీపూ 2,50,000 ఏళ్ళనాటికి - చెందిన రాతి పనిముట్ల ఆధారంగా పరిశీలిస్తే తొలి మానవుల జాడలు కనిపిస్తున్నాయి కానీ మహారాష్ట్రలోని బోరీలో లభించిన వస్తు సముదాయం ఆధారంగా పరిశీలిస్తే తొలిమానవుని అవతరణ 14 మిలియన్ సంవత్సరాల క్రితమే జరిగి ఉండవచ్చుననిపిస్తుంది భారతదేశంలోనూ, ఆఫ్రికాఖండంలోనూ రాళ్ళు ఏర్పడ్డ విధానం దాదాపు ఒకే రకంగా ఉన్నా - భారతదేశం ఆఫ్రికాఖండం తరువాత స్థిరపడిందని ఈనాడు భావించబడుతోంది భారతదేశంలో తొలి మానవులు నైపుణ్యం లేకుండా చెక్కిన రాతిపనిముట్లను ఉపయోగించారు ఇవి గంగా, యమునా నదుల పరీవాహక ప్రదేశంలోని మెత్తని భూములున్న ప్రాంతాల్లో తప్ప మిగిలిన అన్ని ప్రాంతాల్లోనూ లభించాయి పదును పెట్టిన రాళ్ళనూ, పగలగొట్టిన గులక రాళ్ళనూ, వాళ్ళు వేటకోసమూ, దేన్నయినా తరగటం కోసమూ, ఇతర పనుల కోసమూ ఉపయోగించారు ఈ దశలో మానవుడు కష్టం మీద తనకు కావాల్సిన ఆహారాన్ని సేకరించుకునేవాడు, వేటాడి జీవించేవాడు అతనికి వ్యవసాయాన్ని గురించికానీ, ఇళ్ళు కట్టుకోవటాన్ని గురించి కానీ ఏమీ తెలియదు ఈ



పాతరాతియుగంనాటి పనిముట్లు గొడ్డళ్ళు, నరకటానికీ, చీల్చటానికీ ఉపయోగించినవి

దశ సుమారు క్రీ పూ 9000 సంవత్సరాల వరకూ కొనసాగింది

క్రీ పూ 100,000 సంవత్సరాల నాటి అత్యంత ప్రాచీనమైన పాతరాతియుగం నాటి పనిముట్లు ఛోటానాగ పూర్ ద్వీపకల్పంలో దొరికాయి క్రీ పూ 20,000 – 10,000 సంవత్సరాల నాటి అలాంటి పనిముట్లే ఆంధ్రప్రదేశ్‌లో కర్నూలు జిల్లాలో కర్నూలు పట్టణానికి 55 కి మీ దూరంలో దొరికాయి వీటితోపాటు ఎముకలతో చేసిన పనిముట్లూ, జంతువుల అవశేషాలూ కూడా లభించాయి ఉత్తర ప్రదేశ్‌లోని మీర్జాపూర్ జిల్లాలోని బేలం లోయలో లభించిన అవశేషాలు – గొర్రెలనూ, మేకలనూ, పశువులనూ వాళ్లు మచ్చిక చేసుకొని ఉపయోగించుకున్నారని తెలుపుతాయి కానీ పాత రాతియుగం తొలిదశలో మానవులు వేటమీదా, ఆహారసేకరణ మీదా ఆధారపడి జీవించారు కందమూలాలూ, పళ్ళూ తిని జీవించిన రుషుల్ని గురించి పురాణాలు చెబుతాయి వీరిలో కొంతమంది ఆధునిక కాలం వరకూ కూడా అదేవిధంగా కొండల్లో, గుహల్లో జీవించారు

భారతదేశంలో పాత రాతియుగం నాగరికత మంచు యుగంలో అభివృద్ధి చెందింది ఆఫ్రికాలో మానవ అవశేషాలూ, వాటితోపాటు లభిస్తున్న రాతి పనిముట్లూ దాదాపుగా 2 6 మిలియన్ సంవత్సరాల నాటివని భావిస్తారు కానీ భారతదేశంలో ఈ వృత్తులు – ఆనాటి పనిముట్ల ఆధారంగా చూస్తే – మధ్యరాతియుగం కంటే ప్రాచీనమైనవి కావు మంచుయుగంలో భూగోళం మీదున్న చాలాభాగం – ముఖ్యంగా సముద్రమట్టానికంటే ఎక్కువ ఎత్తుగా ఉన్న ప్రాంతమూ, వాటి పరిసరాలూ – మంచుతో కప్పివుండేవి భూమధ్యరేఖాప్రాంతంలో – కొండల్లో తప్ప – మంచు ఉండేది కాదు అంతేకాకుండా ఆ ప్రాంతంలో సుదీర్ఘమైన కాలంలో వర్షాలు కురిశాయి

## పాతరాతి యుగంలోని దశలు

ప్రజలు ఉపయోగించిన పనిముట్ల స్వభావాన్నీ, వాతావరణంలో వచ్చే మార్పుల పద్ధతినీ ఆధారం చేసుకొని పరిశీలిస్తే భారతదేశంలో పాత రాతియుగాన్ని మూడు దశలుగా విభజించవచ్చు మొదటి దశను తొలి రాతియుగం లేదా కింది రాతియుగం అంటారు రెండవ దశను మధ్యరాతియుగం అనీ, మూడవ దశను పైరాతియుగం అనీ పిలుస్తారు మొదటి దశను క్రీ పూ రెండులక్షల యాభైవేలు, లక్షసంవత్సరాల మధ్యగానూ, రెండవ దశను క్రీ పూ లక్షా, నలభైవేల సంవత్సరాల మధ్యగానూ, మూడవ దశను క్రీ. పూ 4 వేలు, పదివేల సంవత్సరాల మధ్యగానూ ఇంతవరకూ లభించిన శాస్త్ర ఆధారాలను ప్రమాణంగా తీసుకొని నిర్ణయించవచ్చు



పాత, కొత్త రాతియుగాల మధ్యకాలంలో ఉపయోగంలో ఉన్న పనిముట్లు ఇవి బీర్‌బాన్‌పూర్ (పశ్చిమ బెంగాల్), తిరునల్వేలి (తమిళనాడు)లలో లభించాయి

కింది రాతియుగం లేదా తొలి రాతియుగం మంచు యుగంలో ఎక్కువభాగం విస్తరించి ఉండేది దీని ప్రత్యేక లక్షణాలు – చేతి గొడ్డళ్ళూ, చీల్చటానికీ, నరకటానికీ ఉపయోగించిన పనిముట్లు భారతదేశంలో దొరికిన గొడ్డళ్ళు దాదాపుగా పశ్చిమ ఆసియాలో, యూరప్‌లో, ఆఫ్రికాలో లభించిన గొడ్డళ్ళలాగే ఉన్నాయి రాతి పనిముట్లను ప్రధానంగా నరకటానికీ, తవ్వటానికీ, జంతువుల తోళ్ళు ఒలవటానికీ ఉపయోగించారు తొలి పాత రాతియుగం నాటి స్థలాలు ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉన్న సోర్ (సోహర్) నదీతీరంలోనూ, కాశ్మీరులోనూ, థార్ ఎడారిలోనూ బయటపడ్డాయి తొలి రాతియుగానికి చెందిన పనిముట్లు మీర్జాపూర్ జిల్లాలోని బేలంలోయలోనూ, రాజస్థాన్‌లోని దిద్వానాలోనూ, నర్మదా లోయలోనూ, మధ్యప్రదేశ్‌లో భోపాల్‌కు దగ్గరగా ఉన్న భీమ్‌బెట్కాలోని కొండల్లోనూ, రాతి షెల్టర్లలోనూ లభించాయి ఇవి క్రీ పూ 100,000 సంవత్సరాల కాలానికి చెందినవి రాతి షెల్టర్లు మానవులు కొన్ని రుతువుల్లో తల దాచుకోవటానికి ఉపయోగపడి ఉండవచ్చు హిమాలయాలల్లోని మంచుయుగాల మధ్యకాలానికి చెందిన చేతిగొడ్డళ్ళు కూడా

లభించాయి ఈ కాలంలో వాతావరణంలో తేమ బాగా తగ్గింది

మధ్యరాతియుగానికి చెందిన వృత్తులన్నీ రాతిపలకలమీద ఆధారపడి ఉన్నాయి ఈ పలకలు భారతదేశంలోని వివిధ ప్రాంతాల్లో లభిస్తున్నాయి వీటిమధ్యప్రాంతీయ భేదాలు కూడా ఉన్నాయి ఈ కాలానికి చెందిన ముఖ్యమైన పనిముట్లు అనేక రకాలైన కోత పనిముట్లు, మొనదేలిన పనిముట్లు, తవ్వటానికీ, గోకటానికీ పనికి వచ్చే పనిముట్లు వీటిలో కోయటానికి పనికివచ్చే పదును కలిగిన పనిముట్లూ, శూలాల్లాగా మొనదేలిన పనిముట్లూ ఎక్కువగా లభిస్తున్నాయి భౌగోళికంగా తొలి (మొదటి) పాత రాతియుగానికి చెందిన కేంద్రాలు మధ్య రాతియుగానికి చెందిన కేంద్రాలతో కలుస్తున్నాయి హిమాలయాల్లో ముతకగా ఉన్న గులకరాళ్ళు లభించాయి ఈ గులకరాళ్ళు లభించిన భూమి పాత మూడవ మంచుయుగానికి సమకాలికంగా ఉంటుంది ఈ కాలానికి చెందిన వస్తుసముదాయం నర్మదానదీతీరంలో అనేక స్థలాల్లోనూ, తుంగభద్రా నదికి దక్షిణంగానూ లభించింది

పాతరాతియుగం మూడవ దశలో (పైరాతియుగం) తేమ తక్కువ అది మంచుయుగం చివరి దశతో కలుస్తుంది ఆ కాలంలో వాతావరణం వెచ్చగా మారింది ప్రపంచం మొత్తం మీద ఆ దశలో కొత్తరాతి పరికరాలతో పాటు మనం ఈనాడు "హోమోసేపియన్లు" అని పిలిచే ఆధునిక మానవులు కూడా అవతరించారు ఈ దశలో భారత దేశంలో కత్తులూ, పోగరలూ ఉపయోగంలో కొచ్చాయి ఈ పనిముట్లు ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ మధ్యప్రాంతం, దక్షిణ ఉత్తర ప్రదేశ్, దక్షిణ బీహార్ ద్వీపకల్పం మొదలైన ప్రాంతాల్లో లభించాయి పాత రాతియుగం మూడవ దశకు సంబంధించిన గుహలూ రాతి షెల్టర్లూ భోపాల్‌కు దక్షిణంగా 45 కి మీ దూరంలో ఉన్న భీమ్ బెట్కాలో ఉన్నాయి గుజరాత్‌లోని ఇసుకదిబ్బల్లో పాత రాతియుగం మూడవ దశకు చెందిన పెద్ద పలక రాళ్ళూ, కత్తులూ, మొనదేలిన పోగరలూ, గోకటానికి ఉపయోగించే సాధనాలూ లభించాయి ఇవి ఈ దశకు సంబంధించిన ప్రత్యేక లక్షణాలు కలిగిన వస్తుసముదాయం

పాత రాతియుగం కేంద్రాలు భారతదేశంలోని అనేక కొండచరియల్లోనూ, నదీతీరాల్లోనూ మాత్రమే కనిపించాయి మెత్తని భూస్వభావం ఉన్న గంగా సింధూ మైదానంలో ఇవి కనిపించవు

## మధ్యరాతియుగం వేటగాళ్ళూ,పశుపాలకులు

పాత రాతియుగం, కొత్త రాతియుగాల మధ్య ఉన్న సంధికాలాన్ని మధ్యరాతియుగం అంటారు పై రాతియుగం లేదా పాత రాతియుగంలో మూడవ దశ మంచుయుగం అంతం కావటంతో సుమారు క్రీ పూ 9000 ప్రాంతంలో ముగిసింది వాతావరణం వెచ్చగా, పొడిగా తయారైంది వాతావరణంలో వచ్చిన మార్పులవల్ల చెట్లు చేమల్లో, జంతు జాలంలో కూడా మార్పులు వచ్చాయి అందుచేత మానవులు కొత్తప్రాంతాలకు వెళ్ళగలిగారు అంతవరకూ వాతావరణంలో పెద్ద మార్పులు రాలేదు క్రీ పూ 9000 ప్రాంతంలో రాతియుగం సంస్కృతిలో ఒక సంధి యుగం ప్రారంభమైంది దాన్ని మనం మధ్యశిలాయుగం అని కూడా అంటాం ఇది పాత రాతియుగానికీ, కొత్త రాతియుగానికీ మధ్య వచ్చిన సంధికాలం ఈ కాలానికి చెందిన మానవులు వేటమీదా, చేపలు పట్టటం మీదా, ఆహార సేకరణ మీదా జీవించారు తరువాత కొంతకాలానికి వాళ్ళు జంతువుల్ని మచ్చిక చేసుకున్నారు మొదటి మూడు వృత్తులూ పాత రాతియుగం నుంచీ కొనసాగాయి చివరిది కొత్త రాతియుగానికి దారితీసింది

మధ్య రాతియుగానికి చెందిన ప్రత్యేకమైన పనిముట్లు చిన్న పరిమాణంలో ఉన్న పరికరాలు ఈ యుగానికి చెందిన కేంద్రాలు రాజస్థాన్‌లో, దక్షిణ ఉత్తరప్రదేశ్‌లో, కృష్ణానదికి దక్షిణ భాగంలో ఎన్నో బయటపడ్డాయి వీటిలో రాజస్థాన్‌లోని బగోర్‌లో తవ్వకాలు చక్కగా జరిగాయి అక్కడ నివసించిన ప్రజలు చిన్న పరికరాలను ఉపయోగించారు వేటమీదా, పశుపాలనమీదా జీవించారు ఈ కేంద్రంలో క్రీ పూ 5 వ సహస్రాబ్దం నుంచీ 5000 సంవత్సరాలు జన నివాసం ఉండేది మధ్యప్రదేశ్‌లోని ఆదంఘర్, రాజస్థాన్‌లోని బంగోర్‌లలో జంతువుల్ని మచ్చిక చేసుకోవటానికి సంబంధించిన తొలి ఆధారాలు కనిపిస్తాయి ఈ పరిణామం సుమారు క్రీ పూ 5000 ప్రాంతంలో జరిగి ఉండవచ్చు రాజస్థాన్‌లోని సాల్ట్‌లేక్ అవశేషాలను పరిశీలిస్తే మొక్కల పెంపకం క్రీ పూ 7000 – 6000 ప్రాంతంలో ప్రారంభమైన సూచనలు కనిపిస్తాయి

ఇంతవరకూ మధ్యరాతియుగానికి చెందిన కొన్ని వస్తువుల కాలాన్ని మాత్రమే శాస్త్రీయంగా నిర్ణయించటం జరిగింది మధ్య రాతియుగ సంస్కృతికి క్రీ పూ 9000 నుంచీ 4000 వరకూ ప్రాధాన్యత ఉంది కానీ అది కొత్త రాతియుగానికి దారి చూపిందనటానికి ఎలాంటి సందేహం లేదు

## చారిత్రక పూర్వదశలో కళ

పాతరాతియుగంలోనూ, మధ్యరాతియుగంలోనూ నివసించిన మానవులు చిత్రకళను అభ్యసించారు చారిత్రక పూర్వదశకు చెందిన అనేక చోట్ల చిత్రకళ కనిపిస్తుంది కానీ మధ్యప్రదేశ్‌లోని భీమ్‌బెట్కా అత్యుత్తమ ఉదాహరణ

ఇది భోపాల్‌కు దక్షిణంగా 45 కి మీ దూరంలో వింధ్యపర్వత సానువుల్లో ఉంది ఇక్కడ 10 చ కి మీ ప్రాంతంలో 500 కంటే ఎక్కువగా చిత్రకళ ఉన్న రాతి షెల్టర్లున్నాయి ఈ శిలాచిత్రాలు పాతరాతియుగం, మధ్యరాతియుగాలకు చెందినవి వీటిలో కొన్ని ఆధునిక కాలానికి కూడా చెందినవి ఉన్నాయి కానీ వీటిలో ఎక్కువ రాతిషెల్టర్లు మధ్యరాతియుగానికి చెందినవి వీటిలో కనిపించే పక్షులూ, జంతువులూ ఆనాటి మానవులు ఆహారం కోసం వేటాడినవన్నది స్పష్టంగా తెలుస్తూనే ఉంది గింజలు ఏరుకు తినే పక్షుల బొమ్మలు తొలి చిత్రాల్లో లేవు ఈ బొమ్మలు వేట, ఆహారసేకరణ దశకు చెందినవి

మరో ఆసక్తికరమైన అంశం కూడా ఉంది వింధ్యపర్వత సానువుల ఉత్తర భాగంలోని బేలం లోయలో పాతరాతియుగం, మధ్యరాతియుగం, కొత్తరాతియుగం – మూడు యుగాలకూ చెందిన చిత్రాలు ఒక వరుసలో లభిస్తాయి ఇలాగే నర్మదానదీలోయ మధ్యప్రాంతంలో కూడా లభిస్తాయి అనేక ప్రాంతాల్లో మధ్యరాతియుగం తరువాత కొత్తరాతియుగం వచ్చింది అది ఇనుపయుగం దాకా – అంటే క్రీ పూ 1000 సంవత్సరాల దాకా – కొనసాగింది

## కొత్త రాతియుగం ఆహార ఉత్పత్తిదార్లు

ప్రపంచ వ్యాప్తంగా చూస్తే క్రీ పూ 9000 ప్రాంతంలో కొత్త రాతియుగం ప్రారంభమైంది భారత ఉపఖండంలో మనకు లభించిన ఒకేఒక కొత్త రాతియుగం నాటికేంద్రం క్రీ పూ 7000 సంవత్సరాల ప్రాంతానికి చెందింది అది నేటి పాకిస్థాన్‌లోని బెలూచిస్థాన్ రాష్ట్రంలో మెహర్‌ఘర్ అన్నచోట ఉంది మొదటి దశలో – అంటే క్రీ పూ 5000కు ముందు – ఈ ప్రాంతంలోని వారు ఎలాంటి మట్టి పాత్రల్నీ ఉపయోగించలేదు వింధ్యపర్వత ఉత్తర శిఖరాల వద్ద కనుగొన్న కొత్త రాతియుగం కేంద్రాలు క్రీ పూ 5000 నాటివి కానీ దక్షిణ భారతదేశంలో కనుగొన్న కొత్త రాతియుగం కేంద్రాలు క్రీ పూ 2500 నాటికంటే ప్రాచీనమైనవి కావు దక్షిణభారతదేశంలోనూ, తూర్పుభారతదేశంలోనూ కనుగొన్న కొత్త రాతియుగం కేంద్రాలు క్రీ పూ 1000 నాటివి మాత్రమే

ఈ కాలానికి చెందిన మానవులు మెరుగుపెట్టిన రాతిపని ముట్లను ఉపయోగించారు వీరు రాతిగొడ్డళ్ళను ప్రత్యేకంగా ఉపయోగించారు ఇవి భారతదేశంలోని అనేక పర్వత ప్రాంతాల్లో పెద్దసంఖ్యలో లభించాయి ఈ ఆయుధాన్ని అనేక రకాలుగా వారు ఉపయోగించారు ప్రాచీన గాథల్లోని పరశురాముడు గొడ్డలి ధరించిన వీరుడు (పరశువు అంటే గొడ్డలి – అను)



కొత్త రాతియుగంనాటి పనిముట్లు

కొత్త రాతియుగం ప్రజలు ఉపయోగించిన గొడ్డళ్ళ ఆకారం ఆధారంగా ఆ ప్రజలు మూడు ప్రాంతాల్లో నివసించారని గుర్తించవచ్చు అవి వాయవ్యప్రాంతం, ఈశాన్యప్రాంతం, దక్షిణ ప్రాంతం వాయవ్యప్రాంతానికి చెందిన పనిముట్లలో ప్రధానమైనవి నరకటానికి పదునైన వంకర అంచులున్న గొడ్డళ్ళు ఈశాన్య ప్రాంతంలోని పదును పెట్టిన రాతిగొడ్డళ్ళ దీర్ఘచతురస్రాకారంలో ఉన్న గుద్దలిలాగా కూడా కొన్ని సందర్భాల్లో ఉంటాయి దక్షిణ దేశంలో లభించిన గొడ్డళ్ళు అండాకారంలో ఉంటాయి వీటికి కూచిగా ఉన్న పిడి కూడా ఉంటుంది

వాయవ్య ప్రాంతంలో కాశ్మీరులోని కొత్త రాతియుగం ప్రత్యేక లక్షణాలు – జననివాసం కోసం ఉపయోగించిన గుంటలూ, వైవిధ్యం కలిగిన మట్టి పాత్రలూ, రాతితోనూ

ఎముకలతోనూ చేసిన పనిముట్లూ మరో ముఖ్యలక్షణం చిన్న పరిమాణంలో ఉన్న పరికరాలు (మైక్రోలిత్స్) అసలు లభించక పోవటం ఇలాంటి స్థలాల్లో ప్రధానమైంది బూర్జహోం బూర్జహోం అంటే "పుట్టిన చోటు" అని అర్థం ఇది శ్రీనగర్‌కు 16 కి మీ దూరంలో ఉంది ఇక్కడ ఒక సరస్సుతీరంలో కొత్త రాతియుగానికి చెందిన మానవులు గుంటల్లో నివసించారు బహుశా ఆ కాలంలో వేటమీదా, చేపలు పట్టటం మీదా ఆధారపడ్డ ఆర్థిక వ్యవస్థ ఉండేది వీరికి వ్యవసాయంతో పరిచయం ఉన్న ఆధారాలున్నాయి శ్రీనగర్‌కు 41 కి మీ దూరంలో నైరుతి దిక్కులో ఉన్న "గుఫ్‌క్రాల్" (కుమ్మరివాని గుహ) లో నివసించిన ప్రజలు వ్యవసాయాన్నీ, జంతువుల్ని మచ్చిక చేసుకోవటాన్నీ కూడా తెలిసిన వారు కాశ్మీరుకు చెందిన కొత్త రాతియుగం ప్రజలు పదునుపెట్టిన రాతిపనిముట్లనే కాదు – ఎముకలతో చేసిన అనేక పనిముట్లనూ, ఆయుధాలనూ ఉపయోగించారు ఇది చాలా ఆసక్తికరమైన విషయం ఎముకలతో చేసిన పనిముట్లు లభించిన మరొక చోటు గంగకు ఉత్తరంగా, పాట్నాకు పడమరగా 40 కి మీ దూరంలో ఉన్న చిరండ్ మాత్రమే దుప్పి కొమ్ములతో చేసిన ఈ పనిముట్లు కొత్త రాతియుగం చివరిదశలో, సంవత్సరానికి 100 సెం మీ వర్షపాతం ఉన్న ప్రాంతంలో లభించాయి గంగా, సోన్, గండక్, గాగ్రా నదులు కలవటంచేత ఇక్కడ విశాల మైదానం ఏర్పడింది అందుచేత వీరు అక్కడ నివాసం ఏర్పరచుకోవటం సాధ్యమైంది అక్కడ రాతిపనిముట్లు చాలా తక్కువగా దొరకటం మరొక విశేషం



బూర్జహోమ్‌లో బయటపడ్డ ప్రజలు నివసించిన గుంత



బూర్జహోమ్‌లో లభించిన ఎముకలతో చేసిన కొత్తరాతియుగం పనిముట్లు

బూర్జహోంలో నివసించిన ప్రజలు నైపుణ్యం తక్కువగా ఉన్న బూడిదరంగు పాత్రల్ని ఉపయోగించారు అక్కడ యజమాని చనిపోతే అతని పెంపుడుకుక్కను కూడా అతనితో పాతిపెట్టేవారు ఈ అలవాటు లేదా ఆచారం భారతదేశంలో మరెక్కడా కనిపించదు బూర్జహోం కాలం క్రీ పూ 2400 కంటే ముందు ఉండటానికి వీల్లేదు కానీ చిరండ్‌లో లభించిన ఎముకల కాలం క్రీ పూ 1600 కంటే వెనక ఉండటానికి వీల్లేదు ఈ ఎముక పనిముట్లు రాతి – రాగి యుగం దశకు చెందినవి

కొత్త రాతియుగానికి చెందిన మరొక గుంపు ప్రజలు దక్షిణ భారతదేశంలో గోదావరికి దిగువ ఉన్న ప్రాంతంలో జీవించారు వీరు సాధారణంగా రాతికొండల మీద కానీ, నదీతీరాల్లో కానీ స్థిరనివాసం ఏర్పరచుకున్నారు వీరు రాతిగొడ్డళ్ళను మాత్రమే కాకుండా ఒకరకమైన రాతికత్తుల్ని కూడా ఉపయోగించారు వీరికి ఆవులూ, గొర్రెలూ, మేకలూ ఉండేవి వీరు రాతి తిరగళ్ళను ఉపయోగించారు కాబట్టి వీరికి తృణ ధాన్యాలను పండించటం వచ్చని చెప్పవచ్చు

కొత్త రాతియుగం పనిముట్లు లభించిన మూడవ కేంద్రం అస్సాం కొండలు ఈశాన్య భాగంలో మేఘాలయ రాష్ట్రంలోని గారో కొండల్లో కూడా ఇవి లభించాయి ఉత్తర ప్రదేశ్‌లో మీర్జాపూర్, అలహాబాద్ జిల్లాలోని వింధ్యపర్వతాల ఉత్తర ప్రాంతంలో కూడా కొత్తరాతియుగం పనిముట్లు లభించాయి క్రీ పూ 6 వ సహస్రాబ్దంలో వరిసాగు ఉండేదని అలహాబాద్ జిల్లాలోని కొత్త రాతియుగం కేంద్రాలు నిరూపిస్తున్నాయి

కొత్తరాతియుగం సంస్కృతులు
తవ్వకాలు జరిగినచోట్లు ●
ఆధునిక పట్టణాలు ▲

ఇతర రాష్ట్రాల్లోకూడా కొత్త రాతియుగం కేంద్రాలూ లేదా కొత్త రాతియుగం పొరలున్న ప్రాంతాలూ ఇతర రాష్ట్రాల్లో కూడా బయటపడ్డాయి కర్ణాటకలోని మస్కి, బ్రహ్మగిరి, హల్లూరు, కొడిగల్లు, సంగనగల్లు, టి నరసీపూర్, తక్కంకోట, తమిళనాడులోని పేయంపల్లి, ఆంధ్రప్రదేశ్‌లోని పిక్లిహాల్, ఉట్నూరు అలాంటి స్థలాలు దక్షిణ భారతదేశంలోని

కొత్త రాతియుగం కేంద్రాలు క్రీ పూ 2000 నుంచీ 1000 సంవత్సరాల మధ్యకాలానికి చెందినవి

పిక్లిహాల్‌లో నివసించిన కొత్త రాతియుగం మనుషులు పశుపాలకులు వాళ్ళు ఆవుల్నీ, గొర్రెల్ని, మేకల్నీ మచ్చిక చేసుకున్నారు గుంజలు నాటి, దడులు కట్టి పశువుల దొడ్లు ఏర్పాటు చేసుకొని, వాటి చుట్టూరా నివాసం ఏర్పరచుకునేవారు రుతువుల్నిబట్టి వారి నివాస స్థానాలు మారుతుండేవి వారు నివాసాన్ని మార్చేటప్పుడు పాత నివాసాన్ని పూర్తిగా తగలబెట్టేసేవారు ఇలాంటి బూడిద కుప్పలూ, నివాసస్థానాలూ బ్రహ్మగిరి, హల్లూరు, కొడిగల్లు, పిక్లిహాల్, సంగనగల్లు, టి నరసీపూర్, తక్కలకోటలలోనూ, పేయంపల్లిలోనూ బయట పడ్డాయి

తొలిసారిగా వ్యవసాయం చేసినవారు కొత్త రాతియుగానికి చెందిన మానవులే వీరు రాతి గుద్దళ్ళతోనూ, కర్రలతోనూ నేలను తవ్వేవారు దాదాపు అర కిలో బరువున్న ఉంగరం ఆకారంలో ఉన్న రాతికి ఆ కర్రను చెక్కేవారు వారు పదును పెట్టిన పనిముట్లతోపాటు చిన్న రాతికత్తుల్ని కూడా ఉపయోగించారు వారు మట్టితోనూ, రెల్లుతోనూ కట్టిన దీర్ఘచతురస్రాకారపు ఇళ్ళలో కానీ, వర్తులాకారపు ఇళ్ళలో కానీ జీవించారు వారు ఆదిమవాసులు కానీ వారు స్థిరనివాసం ఏర్పరచుకొని జీవించారు వారు రాగుల్నీ, ఉలవల్నీ పండించారు

మెహర్‌ఘర్‌లో జీవించిన కొత్త రాతియుగం మానవులు మరింత నాగరికులు వారు గోధుమల్నీ, పత్తినీ పండించారు ఇటుకలతో కట్టిన ఇళ్ళలో జీవించారు

కొత్త రాతియుగంలో అనేక కేంద్రాల్లో నివసించిన ప్రజలు తృణ ధాన్యాలను పండించటాన్నీ, జంతువుల్ని మచ్చిక చేసుకోవటాన్నీ నేర్చుకున్నారు వీరికి ధాన్యాన్ని నిలువ చేసుకోవటానికి కుండలు కావాల్సి వచ్చాయి అంతేకాకుండా వండుకోవటానికీ, తినటానికి, తాగటానికీ కూడా వీరికి పాత్రలు కావలసి వచ్చాయి అందుచేతనే ఈ దశలో పాత్రల తయారీ ప్రారంభమైంది ఈ యుగంలోని మొదటి దశలో చేతితో తయారుచేసిన పాత్రలు కనిపిస్తాయి తరువాత దశల్లో వీరు సారెను ఉపయోగించి, కుండల్ని తయారుచేశారు వీరు నల్లగా కాల్చిన కుండల్నీ, బూడిదరంగు కుండల్నీ, చాపలతో అచ్చొత్తిన కుండల్నీ తయారుచేయటం నేర్చుకున్నారు

ఒరిస్సాలోని ఛోటా నాగపూర్ కొండ ప్రాంతాల్లో కొత్త రాతియుగంనాటి గొడ్డళ్ళూ, పిడికత్తులూ, ఉలులూ మొదలైన పనిముట్లు లభించాయి మధ్యప్రదేశ్‌లోనూ, ఉత్తర దక్కన్ ప్రాంతంలోనూ కొత్త రాతియుగం నాటి నివాస స్థలాలు చాలా తక్కువగా బయటపడ్డాయి చెక్కటానికీ, పదునుగా చేసుకోవటానికీ అనుకూలంగా ఉన్న రాయి ఆ ప్రాంతాల్లో లభించకపోవటం అందుకు కారణం వ్యవసాయం, నేత, కుండలు తయారుచేయటం, జంతువుల్ని మచ్చిక చేసుకోవటం మొదలైన కళల్ని ప్రజలు నేర్చుకోవటం చేత పశ్చిమ ఆసియాలో క్రీ పూ 9000–3000 సంవత్సరాల మధ్య ఎంతో సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందింది కానీ భారత ఉపఖండంలో కొత్త రాతియుగం క్రీ పూ 6 వ సహస్రాబ్దం ప్రాంతంలో ప్రారంభమైంది వెనువెంటనే వరి, గోధుమ, బార్లీ లాంటి ముఖ్యమైన పంటల్ని పండించటం కూడా ప్రారంభమైంది ఈ కాలంలోనే భారత ఉపఖండంలో కొన్ని గ్రామాలు కూడా ప్రారంభమయ్యాయి ప్రజలు నాగరికత ద్వారంవద్ద నిలబడ్డారు

రాతియుగం ప్రజలు ఒక లోపంతో బాధపడ్డారు వారు పూర్తిగా రాతిపనిముట్లమీద ఆధారపడటంచేత కొండలకు దూరంగా నివాసాలు ఏర్పరచుకోలేకపోయారు వారు కొండవాలుల్లోనూ, రాతిషెల్టర్లలోనూ, పర్వతాల్లోని నదీ లోయల్లోనూ మాత్రమే నివాసం ఏర్పరచుకోగలిగారు తమ జీవితానికి అవసరమైన ఆహారంకంటే ఎక్కువ ఆహారాన్ని ఎంతప్రయత్నించినా – పండించలేకపోయారు

* * *

## అధ్యాయం: 6

# రాగి - రాతి యుగంనాటి వ్యవసాయ నాగరికతలు

### రాగి-రాతియుగంనాటి నివాసస్థలాలు

కొత్త రాతియుగం అంతం కాగానే లోహాల ఉపయోగం ప్రారంభమైంది అలా మొదట ఉపయోగంలోకి వచ్చిన లోహం రాగి రాతితోనూ, రాగితోనూ చేసిన పనిముట్ల మీద అనేక సంస్కృతులు ఆధారపడ్డాయి ఆ కాలాన్ని రాగి - రాతియుగం అనీ తామ్ర శిలాయుగమనీ అంటారు సాంకేతికంగా ఆలోచిస్తే రాగి - రాతి యుగం అన్న పేరు హరప్పా పూర్వయుగంలో నివసించిన ప్రజలకు వర్తిస్తుంది ఈ యుగానికి చెందిన ప్రజలు ఎక్కువగా రాతితోనూ, రాగితోనూ చేసిన పనిముట్లను ఉపయోగించారు కానీ చాలా అరుదుగా చవకరకం కంచును కూడా ఉపయోగించారు వీరు ప్రాథమికంగా పల్లె వాసులు ఆ విశాల ప్రాంతంలో కొండలూ, నదులూ, అందుబాటులో ఉన్న స్థలాల్లో వారు విస్తరించారు కానీ హరప్పావాసులు కంచును ఉపయోగించారు సింధూ నదీ పరీవాహక ప్రదేశంలోని పంటభూముల ఆధారంగా నగరీకరణం పొందారు భారతదేశంలో రాగి-రాతి యుగానికి చెందిన నివాసస్థలాలు ఆగ్నేయరాజస్థాన్‌లోనూ, మధ్యప్రదేశ్ పడమర భాగంలోనూ, పడమర మహారాష్ట్రలోనూ, దక్షిణ భారతంలోనూ, తూర్పు భారతంలోనూ బయట పడ్డాయి రాజస్థాన్ ఆగ్నేయభాగంలో అజర్, గిలుండ్ అన్న రెండు జనపదాలు తవ్వకాల్లో బయటపడ్డాయి అవి బనస్‌లోయలో వర్షపాతం లేని ప్రాంతాల్లో ఉన్నాయి మధ్యప్రదేశ్ పడమర భాగంలో మాళ్వ, కయాథా, ఎరాన్ అన్న నివాస స్థలాలు కూడా బయటపడ్డాయి రాగి-రాతి యుగానికి చెందిన పాత్రల్లో మాళ్వలో లభించిన పాత్రలు ఉత్తమోత్తమ స్థాయికి చెందినవి ఇవి మధ్య, పశ్చిమ భారతదేశంలో ఉండిన రాగి - రాతియుగం సంస్కృతికి నిజమైన ప్రతినిధులు కూడా ఇలాంటి పాత్రలూ, సాంస్కృతిక లక్షణాలూ కొన్ని మహారాష్ట్రలో కూడా కనిపిస్తాయి



అజర్‌లో లభించిన తెల్లరంగుపూసిన నలుపు-ఎరుపు పాత్రలు క్రీ పూ 1500 ప్రాంతం

కానీ మహారాష్ట్ర పశ్చిమభాగంలో తవ్వకాలు అత్యంత విస్తృతంగా జరిగాయి అహమద్‌నగర్ జిల్లాలోని జోర్వే, నెవాసా, దైమాబాద్, పుణె జిల్లాలోని చందోలీ, సొన్‌గాంవ్, ఇనాంగాంవ్ తవ్వకాల్లో బయటపడ్డాయి ఇవి రాగి - రాతి యుగానికి చెందిన స్థలాలే గోదావరికి ఉపనదైన ప్రవరా నదికి ఎడమవైపు బయట పడ్డ జోర్వే సంస్కృతికి ఈ స్థలాలన్నీ చెందుతాయి జోర్వే సంస్కృతి మాళ్వసంస్కృతికి ఎంతో రుణపడి ఉంది కానీ ఇందులో దక్షిణ కొత్తరాతియుగం లక్షణాలు లేకపోలేదు

సుమారు క్రీ పూ 1400-700 కాలానికి చెందిన జోర్వే సంస్కృతి విదర్భలోని కొన్ని ప్రాంతాలనూ, కొంకణ తీరాన్నీ మినహాయించి మిగిలిన మహారాష్ట్ర ప్రాంతం అంతా విస్తరించింది జోర్వే సంస్కృతి ప్రాథమికంగా గ్రామీణ సంస్కృతి కానీ ఈ ప్రాంతంలోని దైమాబాద్, ఇనాంగాంవ్‌లలో ఇది నగర స్థాయిని చేరుకుంది మహారాష్ట్రలోని ఈ స్థలాలన్నీ వర్షపాతం తక్కువగా ఉన్న ప్రాంతాల్లో ఉన్నాయి ఇక్కడ భూమి లేతనలుపురంగులో ఉంటుంది ఇవి నదీ




| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| I | సింధూనదీ వ్యవస్థ | | | | | |
| | 1 | మొహంజదారో | 2 | హరప్పా | 3 | రోపర్ |
| | 4 | సూరత్‌ఘర్ | 5 | హనుమాన్ ఘర్ | 6 | ఛాన్హు–దారో |
| | 7 | ఝుకర్ | 8 | అమ్రి | 9 | ఝుంగర్ |
| II | గంగానదీ వ్యవస్థ | | | | | |
| | 1 | కౌశాంబి | 2 | అలంఘీర్‌పూర్ | | |
| III | బ్రహ్మపుత్రానదీ వ్యవస్థ | | | | | |
| IV | మహానదీ వ్యవస్థ | | | | | |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| V | చంబల్‌నదీ వ్యవస్థ | | | | | |
| | 1 | సివా | 2 | నాగ్దా | 3 | పరమార్–ఖేరి |
| | 4 | తుంగ్నీ | 5 | మెట్వా | 6 | తక్రౌడా |
| | 7 | భిల్ సురి | 8 | మోరీ | 9 | ఘటాబిలోద్ |
| | 10 | బెట్వా | 11 | భిల్వాలీ | 12 | అస్థా |
| VI | రాజపురానా–సౌరాష్ట్ర | | | | | |
| | 1 | రంగపూర్ | 2 | అహర్ | 3 | ప్రకాశ్ పటన్ |
| | 4 | లఖాబావల్ | 5 | లోథల్ | 6 | పిథోడియా |
| | 7 | రోజ్డి | 8 | అడ్కోట్ | | |
| VII | నర్మదానదీ వ్యవస్థ | | | | | |
| | 1 | నవదతోలీ | 2 | మహేశ్వర్ | 3 | భగత్రావ్ |
| | 4 | తెలోడ్ | 5 | మేఘం | 6 | హసన్‌పూర్ |
| VIII | తాపీనదీ వ్యవస్థ | | | | | |
| | 1 | ప్రకాశ్ | 2 | బహల్ | | |
| IX | గోదావరి–ప్రవర వ్యవస్థ | | | | | |
| | 1 | జోర్వే | 2 | నాసిక్ | 3 | కోపర్‌గావ్ |
| | 4 | నెవాసా | 5 | దైమాబాద్ | | |
| X | భీమానదీ వ్యవస్థ | | | | | |
| | 1 | కోరేగావ్ | 2 | బెందోలీ | 3 | ఉమ్రజ్ |
| | 4 | బెనేగావ్ | 5 | అనాచీ | 6 | హింగ్ని |
| | 7 | నగర్‌హల్లి | | | | |
| XI | కర్ణాటక వ్యవస్థ | | | | | |
| | 1 | బ్రహ్మగిరి | 2 | పిక్లీకల్ | 3 | మాస్కి |

ప్రాంతాల్లోనే ఉన్నా ఇక్కడ బేల్, బబూల్ చెట్లు అధికంగా ఉండేవి ఈ ప్రాంతానికి తోడుగా నర్మదాప్రాంతంలో నవ్‌దతోలీ అన్న స్థలం కూడా బయట పడింది దక్షిణ భారతదేశంలో అనేక రాగి – రాతి యుగానికి చెందిన స్థలాలు పాతరాతి యుగం స్థలాల మీదనే ఉన్నాయి

అలహాబాద్ జిల్లాలోని వింధ్యపర్వతప్రాంతంలో ఎన్నో

రాగి – రాతియుగం కేంద్రాలు బయటపడ్డాయి తూర్పు భారతదేశంలో గంగాతీరంలోని చిరండ్‌తో పాటు బర్ద్వార్ జిల్లాలోని ధిబీనీ, పశ్చిమ బెంగాల్‌లో బీర్‌భూమ్ జిల్లాలోని మహిశ్‌దల్‌ను కూడా పేర్కొనాలి ఇవి మాత్రమే కాకుండా మరికొన్ని స్థలాల్లో కూడా తవ్వకాలు జరిగాయి సేర్‌వార్, సోన్‌పూర్, తరాదీ వాటిలో ముఖ్యమైనవి ఇవి బీహారులో ఉన్నాయి తూర్పు ఉత్తరప్రదేశ్‌లో ఇలాంటి చోట్లు ఖైరదీ, నార్‌హోc.

ఈ నాగరికతకు చెందిన ప్రజలు రాతితో చేసిన చిన్న పనిముట్లనూ, ఆయుధాలనూ ఉపయోగించారు వీటిలో రాతికత్తులు (కాస్త పెద్దవి, చిన్నవి) ప్రాముఖ్యతను వహించాయి చాలా చోట్ల – ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో రాతికత్తుల పరిశ్రమబాగా అభివృద్ధి చెందింది కానీ రాతిగొడ్డళ్ళను ఉపయోగించటం కొనసాగుతూనే వచ్చింది అలాంటి ప్రాంతాలు కొండలకు దూరంగా ఉండేవి కావు కొన్ని జన నివాసాలలో పెద్ద సంఖ్యలో రాగివస్తువులు కూడా దొరికాయి రాజస్థాన్‌లోని బనస్ నదీ లోయలో దాదాపుగా నీటిపారుదల సౌకర్యాలు లేని అజర్, గిలుండ్‌లో కూడా అలాంటి వస్తువులే లభించాయి ఆకాలంలోని ఇతర రాగి – రాతి యుగం వ్యవసాయ నాగరికతల్లో లాగా అజర్‌లో నివసించిన ప్రజలు చిన్న సైజు వస్తువుల్ని ఉపయోగించలేదు రాతిగొడ్డళ్ళూ, కత్తులూ ఇక్కడ లభించలేదు బల్లపరుపుగా ఉన్న గొడ్డళ్ళూ, కత్తులూ, గాజులూ, అసంఖ్యాకంగా రేకులూ లభించాయి ఇవన్నీ కూడా రాతితో చేసినవే వీటిలో కొన్ని కంచు రేకులు కూడా ఉన్నాయి రాగి స్థానికంగా లభించేది అజర్‌లో నివసించిన ప్రజలు లోహాలను కరిగించి, శుద్ధిచేయటాన్ని మొదటి నుంచీ అనుసరించారు అజర్‌కు పురాతనమైన పేరు తంబావతి – అంటే రాగి ఉన్న చోటు అజర్ నాగరికతా కాలాన్ని క్రీ పూ 2100–1500 మధ్యకాలంగా నిర్ణయించారు గిలుండ్ అజర్ సంస్కృతికి ఉపకేంద్రంగా భావిస్తున్నారు ఇక్కడ రాతికత్తుల పరిశ్రమ మనకు దర్శన మిస్తుంది జోర్వేలో, చందోలీలో బల్లపరుపుగా ఉన్న రాగిగొడ్డళ్ళూ లభించాయి చందోలీలో రాగి ఉలులు కూడా కనిపించాయి

రాగి – రాతి యుగానికి చెందిన ప్రజలు అనేక రకాల మట్టి పాత్రల్ని ఉపయోగించారు వీటిలో నలుపు – ఎరుపు రకంపాత్రలు క్రీ పూ 2000 నాటి నుంచీ ఉపయోగంలో ఉన్నట్టుగా ఆధారాలున్నాయి వీటిని సారెలమీద తయారుచేసేవారు వీటిమీద కొన్ని సందర్భాల్లో నిలువు లేదా అడ్డగీతలలో డిజైన్లు చిత్రించేవారు ఈ విధానం రాజస్థాన్, మధ్యప్రదేశ్, మహారాష్ట్రల్లోని జననివాసాల్లోనే కాకుండా బీహార్, పశ్చిమబెంగాల్‌లలో కూడా కనిపిస్తుంది మహారాష్ట్రలో, మధ్యప్రదేశ్‌లో, బీహారులో నివసించిన ప్రజలు మెడపొడవుగా వున్న కూజాలవంటి పాత్రల్నీ, కాండాకారంలో ఉన్న ఆధారపీఠం మీద అమర్చిన అర్ధ చంద్రాకారపు పాత్రలనూ ఉపయోగించారు కానీ నలుపు – ఎరుపు రంగుపాత్రల్ని ఉపయోగించిన అందరూ ఇదే సంస్కృతిని కలిగి ఉండేవారని భావించటం మాత్రం పొరపాటు వారు ఉపయోగించిన పాత్రల ఆకారాల్లో తారతమ్యాలను మనం గమనించవచ్చు





నవదటోలీలో లభించిన పాత్రలు
క్రీ పూ 1500 ప్రాంతం



జోర్వేలో లభించిన ఎరుపు మీద నలుపు రంగు పూసిన పాత్రలు క్రీ పూ 1200 ప్రాంతం

మహారాష్ట్రలోని ఆగ్నేయప్రాంతంలోనూ, మధ్యప్రదేశ్ పడమర ప్రాంతంలోనూ, మహారాష్ట్రలోని పడమర ప్రాంతంలోనూ నివసించిన ప్రజలు జంతువుల్ని మచ్చిక చేసుకున్నారు వ్యవసాయాన్ని అనుసరించారు వీరు ఆవుల్నీ, గొర్రెల్నీ, మేకల్నీ, పందుల్నీ, చిర్రెల్నీ పెంచుకున్నారు జింకల్ని వేటాడారు ఒంటె అవశేషాలు కూడా ఈ తవ్వకాల్లో లభించాయి వీరికి గుర్రాన్ని గురించి తెలుసో, తెలియదో మనకు ఈనాడు అర్థం కావటం లేదు అక్కడ తవ్వకాల్లో గుర్రానివో, గాడిదవో, కంచరగాడిదవో అర్థంకాని అవశేషాలు కొన్ని దొరికాయి ఆ ప్రజలు నిస్సందేహంగా గొడ్డు మాంసాన్ని తినేవారు కానీ పందిమాంసాన్ని ఎక్కువగా ఉపయోగించిన ఆధారాలు కనిపించటం లేదు ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే – ఈ ప్రజలు వరినీ, గోధుమల్నీ పండించేవారు ఈ ప్రధాన పంటల్ని మాత్రమేకాక వీరు జొన్నల్ని కూడా పండించారు వీటితోపాటు కాయధాన్యాలైన కందిపప్పు, మినపపప్పు, పెసరపప్పు మొదలైన వాటిని కూడా పండించారు దాదాపు ఈ ఆహారపదార్థాలన్నీ నర్మదాతీరంలోని నవ్‌దటోలీలో లభించాయి భారతదేశంలో తవ్వకాల్లో ఇన్ని ధాన్యాలు ఒకేచోట లభించిన కేంద్రం మరొకటి లేదు అక్కడి ప్రజలు రేగు, అవిసె చెట్లను పెంచారు దక్కన్ పీఠభూమిలోని నల్లపత్తినేలల్లో పత్తిని పండించారు దక్కన్ దక్షిణ భాగంలో రాగి, జొన్నలతోపాటు అనేక తృణ ధాన్యాలను పండించారు తూర్పు భారతదేశంలోని బీహార్, బెంగాల్ ప్రాంతాల్లో చేపలు పట్టటానికి ఉపయోగించే గాలాలు కూడా లభించాయి ఈ ప్రాంతంలో వడ్లు కూడా పండించారు తూర్పు ప్రాంతంలోని ప్రజలు బియ్యం, చేపలు తినేవారని ఇవి సూచిస్తాయి ఈనాటికీ ఆ ప్రాంతంలో అవే ముఖ్యమైన ఆహారపదార్థాలు రాజస్థాన్‌లోని బనస్ నదీలోయలో బయటపడ్డ స్థలాలు సాధారణంగా చిన్నవే, కానీ అజర్, గిలుంద్‌లు మాత్రం దాదాపు నాలుగు హెక్టేర్ల విస్తీర్ణాన్ని కలిగి ఉన్నాయి

క్రీ పూ 1500 ప్రాంతంలో గిలుంద్‌లో ఉపయోగించిన కాల్చిన ఇటుకల్ని గురించి రాగి – రాతి యుగం ప్రజలకు సాధారణంగా తెలియదు వీరు ఇళ్ళు మట్టి ఇటుకలతో కట్టుకునేవారు కర్రల్ని ఉపయోగించేవారు ఇవి పూరిళ్ళని ఈనాడు అనిపిస్తోంది కానీ అజర్‌లో నివసించిన ప్రజలు రాతితో కట్టిన ఇళ్ళలో నివసించారు ఇంతవరకూ బయటపడ్డ 200 జోర్వేసంస్కృతి స్థానాల్లో అన్నిటికంటే పెద్దది గోదావరి లోయలోని దైమాబాద్ దీని విస్తీర్ణం దాదాపు 20 హెక్టేర్లు ఇందులో దాదాపు 4000 మంది ప్రజలు నివసించటానికి వీలుండేది దానికి చుట్టూరా మట్టితో కట్టిన కోట గోడా, రాళ్ళు వేసి కట్టిన బురుజులూ ఉండేవి అధిక సంఖ్యలో రాగివస్తువులు లభించటం చేత దైమాబాద్ ప్రసిద్ధి చెందింది ఈ వస్తువుల్లో కొన్నిటిమీద హరప్పా సంస్కృతి ప్రభావం కనిపిస్తుంది

పశ్చిమ మహారాష్ట్రలో అంతకంటే ముందుదశకు చెందిన ఇనాంగావ్‌లో, పెద్ద ఇళ్ళూ, పొయ్యిలూ బయటపడ్డాయి ఇవి గుండ్రని ఆకారంలో ఉన్నాయి తరువాత దశలో (క్రీ పూ 1300–1000) ఐదు గదులున్న ఇల్లు బయట పడింది అందులో నాలుగు గదులు దీర్ఘచతురస్రాకారంలోనూ, ఒక గది వర్తులాకారంలోనూ ఉన్నాయి అది బహుశా గ్రామ పెద్ద ఇల్లు కావచ్చు ఈ ఇల్లు గ్రామం మధ్యలో ఉంది ఈ భవనానికి పక్కనే ఉన్న ధాన్యాగారం ధాన్యం రూపంలో వచ్చిన శిస్తును భద్రపరచటానికి ఉపయోగించి ఉండవచ్చు ఇనాంగావ్, రాగి – రాతి యుగానికి చెందిన చాలా పెద్ద కేంద్రం ఇందులో వందకంటే ఎక్కువ ఇళ్ళూ, అసంఖ్యాకంగా గోరీలూ బయటపడ్డాయి ఈ గ్రామానికి చుట్టూరా కోట గోడా, కందకమూ కూడా ఉన్నాయి

రాగి – రాతి యుగానికి చెందిన కళల్ని గురించీ, చేతి పనుల్ని గురించీ కూడా మనకు చాలా విషయాలు తెలుసు ఆనాటి ప్రజలు చాలా నైపుణ్యం కలిగిన రాగి పనివారు అంతేకాదు, మంచి రాతి పనివారు కూడా అక్కడ మనకు రాగి పనిముట్లూ, ఆయుధాలూ, గాజులూ లభించాయి వారు కెంపు, అభ్రకము, క్వార్ట్జ్ రాతి స్ఫటికాలతో పూసల్ని తయారుచేసేవారు మాళ్వలో మగ్గం కండెలు కూడా లభించాయి అందుచేత వాళ్ళకు దారం తీయటం, నేతపనీ కూడా తెలుసునని చెప్పవచ్చు మహారాష్ట్రలో పత్తి, లినన్, కృత్రిమ పట్టుదారాలు లభించాయి దీనివల్ల ఆనాటి ప్రజలు వస్త్రాల తయారీని గురించి బాగా తెలిసిన వారని అర్థం చేసుకోవచ్చు ఈ వృత్తుల్ని అనుసరించిన వారికి సంబంధించిన ఆధారాలే కాకుండా ఇనాంగావ్‌లో కుమ్మరులు, కమ్మరులు, దంతశిల్పులు, గారతయారు చేసేవారు – మొదలైనవారినిగురించికూడా ఆధారాలు లభించాయి

రాగి – రాతియుగం దశలో పప్పుదినుసుల ఉపయోగంలో, పాత్రల నిర్మాణంలో ప్రాంతీయ తారతమ్యాలున్నాయి తూర్పుభారతదేశంలో వడ్లు పండించేవారు పశ్చిమభారతదేశంలో బార్లీ, గోధుమలు పండించేవారు కాలక్రమం దృష్టితో చూసినప్పుడు మాళ్వ (కయాధా, ఎరాన్) లోనూ, మధ్యభారతదేశంలోనూ బయటపడ్డ జన నివాసాలు ఎక్కువ ప్రాచీనమైనవి మహారాష్ట్ర పశ్చిమభాగంలోనూ, తూర్పు భారతదేశంలోనూ బయటపడ్డవి తరువాత కాలానికి చెందినవి

ఆ ప్రజలకు చెందిన ఖనన సంప్రదాయాలను గురించీ, మతాచారాలను గురించి కూడా మనం కొన్ని అభిప్రాయాలను ఏర్పరచుకోవచ్చు మహారాష్ట్రలోని ప్రజలు చనిపోయిన బంధువుల్ని పెద్ద మట్టి పాత్రల్లో ఉంచి, వారు నివసించిన

ఇళ్ళ నేలకిందనే ఉత్తర దక్షిణాలుగా ఖననం చేశారు హరప్పా వాసుల్లాగే వీరు కూడా ఇందుకోసం ప్రత్యేకంగా శ్మశానాలను ఉపయోగించలేదు కొన్ని ప్రాంతాల్నీ, రాగివస్తువుల్నీ – పరలోకంలో చనిపోయినవారు ఉపయోగించటంకోసం వారితోపాటు పాతిపెట్టారు

అక్కడ లభించిన మట్టితో చేసిన స్త్రీ విగ్రహాలు రాగి – రాతి యుగం ప్రజలు అమ్మతల్లి (మాతృదేవత) పూజ చేసేవారని సూచిస్తాయి వీరు కాళ్ళని నగ్న స్త్రీ విగ్రహాలను కూడా పూజించేవారు పశ్చిమ ఆసియాలో లభించిన మాతృదేవత విగ్రహాన్ని పోలిన విగ్రహం ఇనాంగావ్‌లో లభించింది మాళ్వలో లభించిన శైలీకరించిన ఆబోతు విగ్రహం – అది వారి మత చిహ్నమని సూచిస్తుంది

నివాసం ఏర్పరచుకున్న విధానమూ, ఖననసంప్రదాయాలూ సామాజిక అసమానతలు ప్రారంభం కావటాన్ని సూచిస్తాయి మహారాష్ట్రలోని అనేక జోర్వే జననివాసాల్లో – స్థిరపడిన ఒకరకమైన హెచ్చుతగ్గుల భూమి సెటిల్మెంటు వ్యవస్థ కనిపిస్తుంది కొన్ని జననివాసాలు ఇరవై హెక్టేర్లుంటే, మిగిలినవి ఐదు హెక్టేర్లు, అంతకంటే తక్కువ ఉన్నాయి అంటే రెండంతస్తుల జననివాసాలున్నాయి పెద్ద జననివాసాలు చిన్న వాటి మీద అధికారాన్ని చెలాయించేవి కానీ జననివాసాలు పెద్దవైనా, చిన్నవైనా దీర్ఘచతురస్రాకారపు భవనాల్లో నివసించిన గ్రామ పెద్దా, అతని బంధువులూ చుట్టు గుడిసెల్లో నివసించే వారిమీద తమ అధికారాన్ని చెలాయించేవారు ఇనాంగావ్‌లో చేతివృత్తులవాళ్ళు పడమటి



ఇనాంగావ్‌లో శంఖాకారంలో పునర్నిర్మించబడిన ఇళ్ళు.

దిక్కులో దూరంగా నివసించారు బహుశా గ్రామపెద్ద గ్రామం మధ్యలో జీవించాడు ఇది గ్రామంలోని ప్రజల మధ్య సామాజికంగా దూరం ఉందనటానికి నిదర్శనం మహారాష్ట్ర పశ్చిమభాగంలోని చందోల్, నెవాసాలలో కొందరు చిన్నపిల్లల్ని రాగి ప్రధానలోహంగా ఉన్న నెక్లెస్‌తోపాటు ఖననం చేశారు మరికొందర్ని ఖననం చేసినప్పుడు కొన్ని పాత్రల్ని మాత్రమే ఉంచారు ఇనాంగాఁవ్‌లో ఒక వయసొచ్చిన వ్యక్తితో పాటు కొన్ని పాత్రల్నీ, కొంత రాగినీ, ఖననం చేసినప్పుడు ఉంచారు కయాథాలోని ఒక ఇంట్లో 29 రాగి గాజులూ, అరుదైన రెండు గొడ్డళ్ళూ, కెంపూ, అభ్రకమూ రంగులో ఉన్న తక్కువ విలువ కలిగిన రాళ్ళతో చేసిన హారాలూ, పాత్రల్లో మరికొన్ని పూసలూ లభించాయి ఈ ఆధారాలు ఈ ఇంటివారు సంపన్నులన్న విషయాన్ని నిరూపిస్తున్నాయి

రాజస్థాన్‌లో ఖేత్రీ రాగి గనుల ప్రాంతంలో శిఖర్ ఝూంఝున్ గనులకు సమీపంలో గణేశ్వర్ అన్నచోటును గురించి ప్రత్యేకంగా ఆలోచించాలి కాలక్రమంలో దీనికి ప్రత్యేకత ఉంది ఈ ప్రాంతంలో తవ్వకాల్లో బయటపడ్డ రాగి వస్తు సముదాయంలో బాణాలూ, బల్లాలూ, చేపలుపట్టే గాలాలూ, గాజులూ, కత్తులూ, ఉలులూ కూడా ఉన్నాయి వీటిలో కొన్నిటి ఆకారాలు సింధూప్రాంతంలో దొరికిన వస్తువుల ఆకారాల్ని పోలి ఉన్నాయి సింధూప్రాంతంలో లభించిన మట్టి ఫలకం లాంటిది కూడా ఇక్కడ లభించింది రాగి – రాతి యుగానికి నిజంగా ప్రాతినిధ్యం వహించే చిన్న రాతి పనిముట్లు కూడా ఇక్కడ లభించాయి ఇక్కడ ఓ సి పి పాత్రలు కూడా లభించాయి ఇవి ప్రధానంగా కూజా ఆకారంలో ఉన్న నల్లరంగు వేసిన ఎర్రమట్టి పాత్రలు, గణేశ్వర్‌లో లభించిన వస్తువులు క్రీ పూ 2800–2200 కాలానికి చెందినవిగా భావించబడుతున్నాయి అందుచేత ఇవి పరిణతమైన హరప్పాసంస్కృతీ కాలానికంటే ఎంతో ప్రాచీనమైనవి గణేశ్వర్, హరప్పాకు రాగిని ఎగుమతి చేసింది కానీ అక్కడనుంచీ ఎక్కువగా దేన్నికానీ తెచ్చుకోలేదు గణేశ్వర్ ప్రజలు వ్యవసాయంమీదా, ప్రధానంగా వేటమీదా జీవించారు వారి ప్రధాన చేతివృత్తి రాగివస్తువుల్ని తయారుచేయటం కానీ వారు హరప్పా ఆర్థికవ్యవస్థలో ఉన్న నగర లక్షణాలను అభివృద్ధి చేయలేకపోయారు హరప్పా ఆర్థికవ్యవస్థ విశాలమైన ముంపు మైదానాలలో పండే పంటల మీద ఆధారపడి ఉండేది కాబట్టి గణేశ్వర్ సంస్కృతి అచ్చమైన ఓ సి పి / రాగి సంస్కృతి కాదు చిన్న రాతి వస్తువులూ, ఇతర రాతివస్తువులూ కలిగిన గణేశ్వర్ సంస్కృతిలో ఎక్కువ భాగం హరప్పా పూర్వకాలానికి చెందిన రాగి – రాతి సంస్కృతికి సంబంధించింది కానీ అది హరప్పా సంస్కృతి పరిణతి చెందటానికి దోహదం చేసింది

కాలక్రమంలో చూస్తే వరసలు వరసలుగా భారతదేశంలో అనేక రాగి – రాతి జన నివాసాలున్నాయి వీటిలో కొన్ని హరప్పా కాలానికి పూర్వంవి మరికొన్ని హరప్పా సంస్కృతికి సమకాలికమైనవి మరికొన్ని హరప్పాకాలానికి తరువాత కాలానికి చెందినవి హరప్పా జోన్‌లోని హరప్పా పూర్వకాలానికి చెందిన పొరల్ని, తొలి హరప్పా కాలానికి చెందినవని చెబుతాం అందుకు కారణం లేకపోలేదు తరువాతకాలానికి చెందిన సింధునాగరికత పరిణత దశకంటే ఇవి భిన్నమైనవని సూచించటానికి వాటినలా పిలుస్తాం కాబట్టి రాజస్థాన్‌లోని కాలీబంగన్, హర్యానాలోని బన్వాలీలలోని హరప్పా పూర్వనాగరికతలు రాగి – రాతి నాగరికతకు చెందిన వనటానికి సందేహం లేదు అలాగే పాకిస్థాన్‌లో సింధురాష్ట్రంలోని కోట్‌దిజి నాగరికత కూడా ఆ కాలానికి చెందిందే భారతదేశంలోని ఉత్తర, పశ్చిమ, మధ్యప్రాంతాల్లో హరప్పా నాగరికతకు ముందూ, వెనకా, సమకాలికంగా ఉండిన రాగి – రాతి యుగం నాగరికతలు బయటపడ్డాయి ఉదాహరణకు క్రి పూ సుమారు 2000–1880 కాలానికి చెందిన కాయత సంస్కృతిని తీసుకోవచ్చు అది హరప్పా సంస్కృతికంటే కొద్దికాలం మాత్రమే వయస్సులో చిన్నది పాత్రల తయారీలో హరప్పా పూర్వదశకు చెందిన లక్షణాలు ఇక్కడ కనిపిస్తాయి అంతేకాకుండా హరప్పా లక్షణాలూ కనిపిస్తాయి. ఈ ప్రాంతంలోని హరప్పా తరువాతి దశకు చెందిన అనేక రాగి – రాతి యుగం కేంద్రాల్లో హరప్పా నగర నాగరికత ప్రభావం కనిపిస్తుంది

పరిణతి చెందిన హరప్పా నాగరికతకంటే వయస్సు తక్కువ ఉన్న రాగి – రాతి యుగం సంస్కృతులు ఎన్నో ఉన్నాయి కానీ వాటికీ, సింధునాగరికతకూ ఎలాంటి సంబంధమూ లేదు నవ్‌దటోలీ, ఎరాన్, నాగ్దాలలో బయటపడ్డ మాళ్వ సంస్కృతి (క్రీ పూ 1700–1200)కీ, హరప్పా సంస్కృతికీ ఎలాంటి సంబంధమూ లేదని భావిస్తున్నారు కొంకణ్, విదర్భలోని కొన్ని ప్రాంతాలు తప్ప మహారాష్ట్రలో అభివృద్ధి చెందిన జోర్వే సంస్కృతిని గురించి కూడా అదే అభిప్రాయం ఉంది మనదేశంలో తూర్పు, దక్షిణ ప్రాంతాల్లో అభివృద్ధి చెందిన రాగి – రాతి యుగం జననివాసాలు హరప్పా సంస్కృతితో సంబంధం లేకుండా అభివృద్ధి చెందాయి దక్షిణ దేశంలో అవి కొత్త రాతియుగం జననివాసాలకు నిస్సందేహమైన కొనసాగింపుగా కనిపిస్తాయి వింధ్యపర్వత ప్రాంతంలోనూ, పశ్చిమబెంగాల్‌లోనూ, బీహార్‌లోనూ ఉన్న రాగి – రాతి యుగం జననివాసాలకూ, హరప్పా సంస్కృతికీ ఎలాంటి సంబంధమూ లేదు

హరప్పా పూర్వయుగానికి చెందిన రాగి – రాతియుగం సంస్కృతులు కొన్ని సింధు, బెలూచిస్థాన్, రాజస్థాన్ మొదలైన రాష్ట్రాల్లో వ్యవసాయదారులు విస్తరించటానికి దోహదం

చేశాయి ఇవి హారప్పాలో నగర సంస్కృతి అభివృద్ధి చెంద టానికి ఎంతగానో సహాయపడ్డాయి సింధురాష్ట్రంలోని అమ్ర, కోట్ ది జీనీ, రాజస్థాన్ లోని కాళీబంగన్, గణేశ్వర్ లనూ ఈ సందర్భంలో పేర్కొనవచ్చు రాగి – రాతియుగానికి చెందిన కొన్ని వ్యవసాయ జనసముదాయాలు సింధూనది పరీవాహక ప్రాంతాలకు వెళ్ళి, రాగికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని సంపాదించుకొని నగరాలను స్థాపించటంతో విజయం సాధించినట్టుగా అనిపిస్తుంది

మధ్యభారతదేశంలోనూ, పశ్చిమ భారతదేశంలోనూ రాగి – రాతి యుగం సంస్కృతులు క్రీ పూ 1200 ప్రాంతంలో అదృశ్యమైపోయాయి జోర్వే సంస్కృతి మాత్రమే క్రీ పూ 700 వరకూ కొనసాగింది కానీ రాగి – రాతి యుగానికి చెందిన నలుపు – ఎరుపు వస్తువులు చారిత్రక దశలో కూడా – అంటే క్రీ పూ రెండవ శతాబ్దం వరకూ – కొనసాగాయి కానీ రాగి – రాతి యుగం సంస్కృతికీ, కాయత, ప్రభాస్, నాసిక్, నెవాసాల్లో కనిపించే తొలి చారిత్రక దశలోని సంస్కృతికీ మధ్య నాలుగు నుంచీ ఆరు శతాబ్దాల అంతరం కనిపిస్తుంది రాగి – రాతి యుగం సంస్కృతులు నశించి పోవటానికి క్రీ పూ 1200 ప్రాంతంలో వర్షపాతం తగ్గిపోవటం కారణమని భావిస్తున్నారు వాస్తవానికి వర్షపాతంలేని కాలంలో నల్లమట్టి పొలాలను కర్రతో తవ్వటం చాలా కష్టమైన పనికావటం చేత రాగి – రాతి యుగం ప్రజలు కొనసాగలేకపోయారు ఎర్రనేలలున్న ప్రాంతాల్లో – ముఖ్యంగా తూర్పుభారత దేశంలో – రాగి రాతి యుగం ఎలాంటి వ్యవధీ లేకుండా ఇనుప యుగానికి దారి చూపింది అది అక్కడి ప్రజలను పూర్తిగా వ్యవసాయదారులుగా మార్చి వేసింది అలాగే దక్షిణ భారతదేశంలోని చాలా కేంద్రాల్లో రాగి – రాతి సంస్కృతి ఇనుపయుగం సంస్కృతికి దారితీసింది

## రాగి-రాతిదశ ప్రాధాన్యత

మెత్తని మైదాన ప్రాంతాల్లోనూ, దట్టమైన అడవుల్లోనూ తప్ప రాగి – రాతియుగం అవశేషాలు దేశంలోని చాలా భాగాల్లో లభించాయి ఈ దశలో మానవులు పర్వతాలకు దగ్గరగా నదీతీరాల్లో గ్రామీణ జనపదాలను ఎక్కువగా ఏర్ప రచుకున్నారు ఈ దశలో వారు చిన్న రాతి పనిముట్లకు తోడుగా కొన్ని రాగి పనిముట్లను కూడా ఉపయోగించారని ఇంతకు ముందే అనుకున్నాం వీరందరికీ కూడా రాగిని శుద్ధి చేయటం తెలుసు రాగి-రాతి యుగానికి చెందిన సమాజాలు దాదాపు అన్నీ సారెమీద నలుపు – ఎరుపు మట్టి పాత్రల్ని తయారు చేసేవి కంచుయుగం పూర్వదశ అభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే పాత్రల మీద తొలిసారిగా చిత్ర రచన చేసినవారు వీరేనని తెలుస్తుంది వీరి పాత్రలు వంట చేసుకోవటానికీ, అన్నం తినటానికీ, నీళ్ళు తాగటానికీ, వస్తువుల్ని నిలువచేసుకోవటానికీ ఉపయోగించబడ్డాయి వాళ్ళు లోటానూ, కంచాన్నీ ఉపయోగించారు దక్షిణ భారతదేశంలో కొత్త రాతి యుగం మనం గమనించటానికి వీల్లేనంత నెమ్మదిగా రాగి – రాతి యుగంగా మారిపోయింది కాబట్టి ఈ సంస్కృతుల్ని కొత్తరాతి – రాగి – రాతి యుగాలంటారు ఇతర ప్రాంతాల్లో – మరీ ముఖ్యంగా పడమటి మహారాష్ట్రలో, రాజస్థాన్ లో నివసించిన రాగి – రాతి యుగం ప్రజలు వలస వచ్చి అక్కడ స్థిరపడినవారుగా కనిపిస్తున్నారు వీరి తొట్టతొలి నివాసం మాళ్వలోనూ, మధ్యభారతదేశంలోనూ ఉన్న కాయధా, ఎరాన్ ప్రాంతాలు మహారాష్ట్ర పడమర ప్రాంతానికి వీరు తరువాత వచ్చారు పశ్చిమబెంగాల్ లోని వీరి నివాసస్థలాలు చాలా ఆలస్యంగా ఏర్పరచుకొన్నవి

రాగి-రాతి యుగం సమాజాలు దక్షిణ భారతద్వీప కల్పంలో పెద్ద జనపదాలను ఏర్పాటు చేసుకున్నాయి ఈ ప్రజలు ఇతర సమాజాలకు చెందిన ప్రజలకంటే ఎక్కువ తృణధాన్యాలను పండించారు వీరు ప్రధానంగా పశ్చిమభారతదేశంలో బార్లీనీ, గోధుమలనూ పండించారు దక్షిణ భారతదేశంలోనూ, తూర్పు భారతదేశంలోనూ వరిని పండించారు పప్పుధాన్యాల ఆహారంతోపాటు వాళ్లు మాంసా హారాన్ని కూడా ఉపయోగించారు మధ్య భారతదేశంలో మాంసాహారాన్ని ఎక్కువగా ఉపయోగించారు తూర్పు భారతదేశంలో బియ్యమూ, చేపలూ ప్రధాన ఆహారాలుగా ఉండేవి మహారాష్ట్రపశ్చిమప్రాంతంలోనూ, మధ్యప్రదేశ్ పశ్చిమ ప్రాంతంలోనూ, రాజస్థాన్ ఆగ్నేయప్రాంతంలోనూ అనేక భవనాల అవశేషాలు బయటపడ్డాయి మధ్యప్రదేశ్ లోని కాయధా, ఎరాన్, పశ్చిమ మహారాష్ట్రలోని ఇనాంగావ్ గ్రామాల చుట్టూరా కోట గోడలున్నాయి కానీ తూర్పు భారతదేశంలోని చిరండ్, పాండురాజర్ దిబి పేదరికంలో ఉండి నట్టుగా అక్కడి చుట్టు గుడిసెలు సూచిస్తున్నాయి అక్కడ ఖనన సంప్రదాయాలు కూడా వేరుగా ఉండేవి మహారాష్ట్రలో శవాన్ని ఉత్తర దక్షిణాలుగా ఉంచేవారు దక్షిణ భారతదేశంలో తూర్పు పడమరలుగా ఉంచి ఖననం చేసేవారు

## రాగి-రాతి యుగం పరిమితులు

రాగి – రాతి యుగానికి చెందిన మానవులు మేకల్నీ, గొర్రెల్నీ మచ్చిక చేసుకొని తమ పెరళ్ళలో కట్టేసుకునేవారు బహుశా వారు ఈ మచ్చిక చేసుకున్న జంతువుల్ని చంపి ఆహారంగా ఉపయోగించేవారేకానీ పాలూ, పెరుగూ, వెన్నా

మొదలైన వస్తువులకోసం ఉపయోగించేవారు కారు ఈనాడు కూడా బస్తర్ ప్రాంతంలో నివసించే గోండులు పాలు దూడలకోసం మాత్రమేనని నమ్ముతారు అందుచేత వారు పాలు పితకరు అలా రాగి – రాతి యుగం ప్రజలు జంతువుల్ని సంపూర్ణంగా ఉపయోగించుకునేవారు కారు అంతేకాకుండా, మధ్యభారతదేశంలోనూ, పశ్చిమభారతదేశం లోనూ నల్లరేగడి మైదానాల్లోనూ నివసించిన రాగి – రాతి యుగం ప్రజలు వ్యవసాయాన్ని చేయలేదు అక్కడ జరిగిన తవ్వకాలలో నాగళ్ళుకానీ, గుద్దళ్ళుకానీ లభించలేదు తవ్వటానికి ఉపయోగించే కర్రలకు రంధ్రం ఉన్న రాతిని అమర్చి, దాని బరువు ఎక్కువచేసి, నేలను తవ్వి "ఝామ్" (పోడు) వ్యవసాయం చేసేవారు అడవులు కాల్చిన బూడిదలో విత్తనాలు నాటటం సులువుగా జరిగేది నల్లరేగడి పొలాల్లో విస్తృతంగా, ఉత్పత్తి ఎక్కువ వచ్చేలా వ్యవసాయం చేయాలంటే ఇనుప పనిముట్లను ఉపయోగించక తప్పదు అది రాగి – రాతి యుగంలో సాధ్యంకాదు తూర్పు భారతదేశంలో ఎర్రనేలల్లో నివసించిన ఆ కాలపు ప్రజలు కూడా ఇదే ఇబ్బందిని ఎదుర్కొన్నారు

రాగి – రాతి యుగానికి చెందిన ప్రజల సంస్కృతిలో ఒక బలహీనత ఉంది పశ్చిమ మహారాష్ట్రలో పెద్ద సంఖ్యలో ఖననం చేసిన చిన్నపిల్లల శవాలను గమనిస్తే ఈ బలహీనత అర్ధమౌతుంది అది ఆహారసంపాదన దశే అయినా శిశుమరణాల శాతం చాలా ఎక్కువగా ఉండేది, ఆహార విలువల్ని గురించిన పరిజ్ఞానం లేకపోవటం, ఆరోగ్య శాస్త్రాన్ని గురించి తెలియకపోవటం, అంటువ్యాధులు రావటం అందుకు కారణాలు కావచ్చు మొత్తం మీద రాగి – రాతి యుగం సామాజిక, ఆర్థిక వ్యవస్థలు జీవితకాలాన్ని పొడిగించ లేకపోయాయి

రాగి – రాతి యుగం సంస్కృతికి నేపథ్యం ప్రధానంగా గ్రామీణ జీవనం ఈ దశలో రాగి చాలా పరిమితంగా లభ్యమయ్యేది అంతేకాకుండా, లోహంగా రాగికి దాని పరిమితులు దానికున్నాయి రాగితో తయారుచేసిన పని ముట్లు ఒంగిపోయేవి రాగికి తగరాన్ని కలిపి మరింత గట్టిగా, ఉపయోగకరంగా ఉండే కంచును తయారుచేయటం వారికి చేతకాదు కంచుపనిముట్లు క్రీట్‌లోనూ, ఈజిప్ట్ లోనూ, మెసపొటేమియాలోనూ, సింధూనదీలోయలోనూ తొలి నాగరికతలు ఉద్భవించటానికి దోహదం చేశాయి

రాగి – రాతి యుగం ప్రజలకు రాత తెలియదు కంచుయుగం ప్రజల్లాగా వారు నగరాల్లో జీవించలేదు ఈ లక్షణాల నన్నిటినీ మనం మొట్టమొదటి సారిగా భారత ఉపఖండంలో సింధూనదీప్రాంతంలో చూడవచ్చు భారత దేశంలోని అనేక ప్రాంతాల్లో కొనసాగుతూ ఉన్న రాగి – రాతి యుగం సంస్కృతులు సింధూ నాగరికతకంటే తరువాత కాలానివే, కానీ అవి సాంకేతికంగా ఎంతో అభివృద్ధి చెందిన సింధూనాగరికత నుంచీ పెద్దగా ఏమీ నేర్చుకోలేదు

## రాగి నిక్షేపాలు, జేగురురంగు పాత్రల దశ

తూర్పున పశ్చిమబెంగాల్, ఒరిస్సా, పడమర గుజరాత్, హర్యానా, దక్షిణంలో ఆంధ్రప్రదేశ్, ఉత్తరాన ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాల మధ్యప్రాంతంలో నలభైకంటే ఎక్కువ రాగి వస్తువుల నిక్షేపాలు లభించాయి వీటిలో ఉంగరాలూ, ఉలులూ, చేతిగొడ్డళ్ళూ, కత్తులూ, బల్లాలూ, మానవుల్ని పోలిన ఆకారాలూ లభించాయి మధ్యప్రదేశ్‌లోని గుంగేరియాలో ఈ పనిముట్లు అత్యధిక సంఖ్యలో లభించాయి అక్కడ 424 రాగి పనిముట్లూ, ఆయుధాలూ, 102 పలుచని వెండి వస్తువులూ లభించాయి కానీ సగం రాగినిక్షేపాలు గంగా – యమునా లోయలోనే లభించాయి ఇతర కేంద్రాల్లో రాగి బల్లాలూ, అంటెనీ ఆకారంలో ఉన్న కత్తులూ, మానవాకారాన్ని పోలిన బొమ్మలూ అరుదుగా మాత్రమే



గంగా–యమునా మైదానంలో లభించిన రాగి పనిముట్లు

లభించాయి ఈ వస్తువులకు అనేక ప్రయోజనాలున్నాయి వీటిని చేపలు పట్టటానికీ, వేటాడటానికీ, పోరాడటానికీ మాత్రమే కాకుండా చేతిపనులకూ, సేద్యపు పనులకు కూడా ఉపయోగించేవారు వాటిని తయారు చేయాలంటే లోహపు పనివానికి చక్కని సాంకేతిక పరిజ్ఞానమూ, నేర్పరితనమూ ఉండితీరాలి కాబట్టి వీటిని తయారుచేసినవారు దేశది

మ్మరులో, నైపుణ్యం లేని పనివారో కావటానికి వీలులేదు పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లోని రెండుచోట్ల ఈ వస్తువులతోపాటు జేగురు రంగు పాత్రలూ, మట్టి నిర్మాణాలూ, అక్కడక్కడా కాల్చిన ఇటుకలు కూడా బయటపడ్డాయి వీటితోబాటు రాతిపనిముట్లు కూడా బయటపడ్డాయి ఈ ఆధారాలు ఈ రాగి నిక్షేపాల్లోని పనిముట్లనూ, రాతిపనిముట్లనూ ఉపయోగించిన ప్రజలు స్థిరనివాసం చేసేవారని స్పష్టంగా సూచిస్తున్నాయి గంగా – యమునా మైదానంలో వ్యవసాయాన్నీ, చేతివృత్తులనూ తెలిసిన తొలి రాగి – రాతి యుగం ప్రజలు కూడా వీరేనని అర్థమౌతుంది జేగురు రంగు మట్టి పాత్రలు లభించిన స్థలాల్లో ఎక్కువభాగం గంగా – యమునా మైదానం ఉత్తర ప్రాంతంలో ఉన్నాయి కానీ చెదురుమదురుగా కొన్ని రాగి నిక్షేపాలు బీహార్ పీఠభూమి ప్రాంతంలోనూ, ఇతర ప్రాంతాల్లోనూ కూడా లభించాయి రాజస్థాన్‌లోని ఖేత్రీప్రాంతంలో కూడా రాగితో చేసిన ఉలివంటి పనిముట్లు లభించాయి

జేగురురంగు మట్టిపాత్రలు లభించిన యుగాన్ని కొంచెం వెనుకముందుగా క్రీ పూ 2000 నుంచీ క్రీ పూ 1500 మధ్యకాలంగా నిర్ణయించవచ్చు ఈ నిర్ణయం ఎనిమిది శాస్త్రీయ నిర్ణయాల ఆధారంగా చేయబడింది జేగురు రంగు పాత్రల్ని ఉపయోగించిన జనపదాలు అదృశ్యమై పోయాక గంగా – యమునా మైదానంలో క్రీ పూ 1000 వరకూ జన నివాసం ఎక్కువగా కనిపించదు నలుపు – ఎరుపు రంగు పాత్రల్ని ఉపయోగించినవారి జనపదాలు అక్కడక్కడా కొన్ని కనిపిస్తాయి కానీ అక్కడ లభించిన వస్తుసముదాయం చాలా తక్కువ కావటం చేతా, వారి గత చరిత్ర దాదాపుగా లభించకపోవటం చేతా వారి సాంస్కృతిక వస్తుసముదాయాన్ని గురించి మనం ఒక స్పష్టమైన అభిప్రాయం ఏర్పాటు చేసుకోవటానికి వీలు కావటం లేదు ఏది ఏమైనా, గంగా – యమునా మైదానం ఉత్తర భాగంలో జేగురురంగు పాత్రల్ని ఉపయోగించిన వారితో జననివాసాలు ప్రారంభమయ్యాయి హర్యానా – రాజస్థాన్ సరిహద్దుల్లోని జోధ్‌పురాలో 11 మీటర్ల పరిమాణం ఉన్న దళసరి ఓ.సి.పి నిక్షేపాలు లభించాయి కానీ ఎక్కడకానీ ఈ జననివాసాలు ఒక శతాబ్దం కంటే ఎక్కువ కాలం కొనసాగినట్లు లేదు అవి విశాల ప్రాంతాల్లో కూడా వ్యాపించలేదు ఈ జననివాసాలు ఎందుకు, ఎప్పుడు నశించిపోయాయో మనకు తెలియదు వరదలు అందుకు కారణం కావచ్చని ఒక సూచన మాత్రం ఉంది ఈ జేగురురంగు పాత్రలు ఈనాడు మెత్తగా ఉండటానికి కారణం అవి ఎంతో కాలం తేమలో ఉండటమేనని శాస్త్రవేత్తలు భావిస్తున్నారు

హరప్పా ప్రజలకూ, ఓ.సి.పి ప్రజలకూ మధ్యచాలా ఎక్కువ కాలవ్యవధి లేదు జేగురురంగు పాత్రలు లభించిన ప్రాంతం హరప్పాకు ఎంతో దూరంలో లేదు కంచును ఉపయోగించిన హరప్పా ప్రజలకూ, ఓ.సి.పి ప్రజలకూ మధ్య ఇచ్చి పుచ్చుకోవటాలు ఉండవచ్చని మనం ఊహించవచ్చు

* * *

## అధ్యాయం: 7

# హరప్పా సంస్కృతి: కంచుయుగం నాగరికత

### భౌగోళిక విస్తృతి

ఇంతవరకూ మనం చర్చించిన రాగి – రాతి యుగం సంస్కృతులకంటే సింధూ నాగరికత (హరప్పా నాగరికత) ప్రాచీనమైంది కానీ సింధూనాగరికత రాగి – రాతి యుగం నాగరికతల కంటే ఎంతో అభివృద్ధి చెందింది అది భారతదేశంలోని వాయవ్యప్రాంతంలో వర్ధిల్లింది దాన్ని ఆధునిక హరప్పా దగ్గర 1921లో కనుగొన్నారు కాబట్టి, ఆ నాగరికతను హరప్పా నాగరికత అని పిలుస్తారు హరప్పా



కాలీబంగన్ తవ్వకాలు జరిగిన ప్రాంతం

ఇప్పుడు పాకిస్థాన్‌లోని పశ్చిమ పంజాబ్ రాష్ట్రంలో ఉంది హరప్పా సంస్కృతి పంజాబ్‌లోని కొన్ని ప్రాంతాల్లో, హర్యానాలో, సింధూలో, గుజరాత్‌లో, రాజస్థాన్‌లో, ఉత్తర ప్రదేశ్‌లోని పశ్చిమ సరిహద్దు ప్రాంతాల్లో విస్తరించి ఉండేది అంటే – ఉత్తరంలో జమ్మూ, దక్షిణంలో నర్మదా సంగమ ప్రాంతం వరకూ, పడమర బెలూచిస్థాన్‌లోని మక్రన్ తీరం నుంచీ ఈశాన్య దిశలో మీరట్ వరకూ హరప్పా నాగరికత వ్యాపించి ఉండేది ఈ త్రిభుజాకార ప్రాంతం యొక్క విస్తీర్ణం దాదాపు 1,299,600 చదరపు కిలో మీటర్లు ఈ ప్రాంతం పాకిస్థాన్‌కంటే, ప్రాచీన ఈజిప్ట్, మెసపొటేమియాలకంటే పెద్దది క్రీ పూ మూడు, రెండు సహస్రాబ్దాల్లో ప్రపంచంలో వర్ధిల్లిన ఏ ఇతర నాగరికత కూడా హరప్పా నాగరికత వ్యాపించినంత పెద్దప్రాంతంలో వ్యాపించి ఉండలేదు

భారత ఉపఖండంలో దాదాపు 1000 హరప్పా నాగరికతా కేంద్రాలు మనకు తెలుసు అవి తొలిదశకూ, పరిణత దశకూ, చివరి దశకూ చెందినవి వీటిలో పరిణత దశకు చెందిన కేంద్రాలు చాలా తక్కువగా ఉన్నాయి వీటిలో దాదాపు అరడజను కేంద్రాలను మాత్రమే నగరాలుగా పరిగణించటానికి వీలుంది వీటిలో ప్రధాన నగరాలు రెండు – అవి పంజాబులోని హరప్పా, సింధూలోని మొహెంజదారో (మొహెంజదారో అంటే "చనిపోయినవారి దిబ్బ" అని అర్థం) ఇప్పుడు ఈ రెండు నగరాలూ పాకిస్థాన్‌లో ఉన్నాయి 483 కిలో మీటర్ల దూరంలో ఉన్న ఈ నగరాలను సింధూనది కలిపేది మూడవ నగరమైన చాన్‌హుదారో సింధూరాష్ట్రంలోనే మొహంజదారోకు 130 కి మీ దూరంలో ఉంది నాలుగవ నగరమైన లోథల్ గుజరాత్‌లోని కాంబే సింధూశాఖ ప్రారంభంలో ఉంది ఐదవ నగరం కాలీబంగన్ రాజస్థాన్‌లో ఉంది బనవాలీ అన్న ఆరవ నగరం హర్యానాలోని హిస్సార్ జిల్లాలో ఉంది ఈ నగరం హరప్పా పూర్వదశనూ, తరువాతి దశనూ కూడా చూసింది కాలీబంగన్ సంస్కృతి కూడా అలాంటిదే ఈ నగరాల్లో హరప్పా దశను అక్కడ లభించిన ఇటుకలతో నిర్మించిన వేదికలూ, వీధులూ, కాలువలూ సూచిస్తాయి హరప్పా సంస్కృతి పరిణత దశను ఈ ఆరు నగరాల్లోనూ చూడవచ్చు సముద్రతీర నగరాలైన సుత్కాజెడోర్, సుర్కొతడల్లో కూడా హరప్పా సంస్కృతి పరిణత దశలోనే కనిపిస్తుంది ఈ నగరాల చుట్టూరా కోటగోడలు కూడా ఉన్నాయి గుజరాత్‌లోని కథియవార్ ద్వీపకల్పంలోని రంగపూర్, రోజ్‌దీ పట్టణాల్లో హరప్పా సంస్కృతియొక్క మలిదశ కనిపిస్తుంది

## నగర పథకం, కట్టడాలు

హరప్పా సంస్కృతి ప్రత్యేకత నగర పథకం హరప్పా, మొహంజదారో నగరాల్లో దుర్గాలు ఉన్నాయి వాటిలో బహుశా పాలకవర్గంవారు నివసించేవారు దుర్గానికి దిగువ



హరప్పా నగరం ప్లాను

భాగంలో ఉన్న ఇటుక ఇళ్ళలో సాధారణ ప్రజానీకం నివసించేవారు ఇళ్ళు ఒక పథకం ప్రకారం కట్టటం ఈ నగరాల్లోని ఆశ్చర్యకరమైన ప్రత్యేకత ఇలాంటి పథకాన్ని "గ్రిడ్ సిస్టం" అంటారు దీని ప్రకారం రోడ్లు ఒకదాన్ని మరొకటి ఒక నిర్ణీతమైన దూరంలో దాదాపు తొంభై డిగ్రీల్లో కలుసుకుంటాయి నగరం కొన్ని బ్లాకులుగా విభజించబడుతుంది పెద్దవైనా చిన్నవైనా సింధూ నాగరికతకు చెందిన అన్ని నగరాల్లో ఇదే పద్ధతి ఉండేది



హరప్పా, మొహంజదారోల్లోని ప్రత్యేకత పెద్ద భవనాలను కలిగి ఉండటం ముఖ్యంగా మొహంజదారోలో చాలా విలువ కలిగిన కట్టడాలున్నాయి పాలక వర్గం వారు నిర్మించిన స్మృతి మందిరాలు వారికి కార్మికుల్ని సమకూర్చుకో గలశక్తీ, పన్నులు వసూలు చేయించగల సామర్థ్యం ఉండేవని నిరూపిస్తున్నాయి తమ పాలకుల కున్న పెద్ద ఇటుక భవంతుల్ని చూచి వారి ప్రాబల్యానికీ, ప్రతిష్టకూ సామాన్య ప్రజానీకం మురిసిపోయేవారు

మొహంజదారోలోని స్నానశాల దృశ్యం






హరప్పాలో సమానదూరాన్ని కొలతగా తీసుకొని కట్టిన ధాన్యాగారం

మొహెంజదారోలో అన్నిటికంటే పెద్ద సార్వజనిక నిర్మాణం అక్కడ బయటపడ్డ గొప్ప స్నాన వాటిక ఇది దుర్గంలోని చెరువులో ఒక భాగం ఇది అందమైన ఇటుక కట్టడానికి చక్కని ఉదాహరణ దీని పొడవు 11 88 మీటర్లు, వెడల్పు 7 01 మీటర్లు, లోతు 2 43 మీటర్లు ఇరువైపుల నుంచి పైకి ఎక్కటానికి మెట్లున్నాయి దీని పక్కనే బట్టలు మార్చుకోవటానికి గదులున్నాయి ఈ స్నానవాటిక అడుగుభాగాన్ని కాల్చిన ఇటుకలతో నిర్మించారు దీని పక్కన ఉన్న గదిలోని బావిలోనుంచి ఇందులోకి నీరు వచ్చేది మరోవైపున ఉన్న కాలువలోకి వెళ్ళేది ఈ స్నాన వాటికను భారతదేశంలో మత కార్యక్రమాలకు ప్రాణ భూతమైన సాంప్రదాయిక స్నానాలకు ఉపయోగించేవారని భావిస్తున్నారు

మొహెంజదారోలోని అత్యంత పెద్ద భవనం ధాన్యాగారం దీని పొడవు 45 71 మీటర్లు, వెడల్పు 15 23 మీటర్లు హరప్పాలోని దుర్గంలో ఆరు ధాన్యాగారాలున్నాయి వీటిలో ఇటుకలతో కట్టిన తిన్నెలున్నాయి వీటి పొడవు వెడల్పులు 15 23 × 6 09 మీటర్లు ఇవి నదీతీరానికి కొన్ని మీటర్ల దూరంలోనే ఉన్నాయి ఈ ఆరు ధాన్యాగారాలనూ కలిపి మొత్తం నేల వైశాల్యం 838 1025 చదరపు మీటర్లుంటుంది ఇది దాదాపుగా మొహెంజదారోలోని పెద్ద ధాన్యాగారానికి సమానంగా ఉంటుంది హరప్పాలో ఈ ధాన్యాగారాలకు దక్షిణంగా గుండ్రంగా ఇటులకతో కట్టిన కళ్ళాలున్నాయి గోధుమలూ, బార్లీ – ఇటుకల మధ్య ఉన్న నెరియల్లో లభించటం చేత ఈ చోట్లు తప్పకుండా కళ్ళాలేనని రుజు వౌతోంది హరప్పాలో రెండు గదులున్న నివాసాలు కూడా బయట పడ్డాయి బహుశా వాటిలో కూలీలు నివసించేవారు

కాలీబంగన్‌లో కూడా దక్షిణం వైపున ఇటుకలతో కట్టిన ప్లాట్‌ఫారాలు బయటపడ్డాయి ఇవి కూడా ధాన్యాగారాలే కావచ్చు కాబట్టి ధాన్యాగారాలు హరప్పాసంస్కృతిలో ఒక ప్రధాన అంశంగా ఉన్నట్టు అనిపిస్తోంది

హరప్పాకు సమకాలీనమైన ఈజిప్ట్ సంస్కృతిలో భవనాలు కట్టటానికి ఎండబెట్టిన ఇటుకల్ని మాత్రమే ఉపయోగించే వారు కాబట్టి హరప్పా సంస్కృతికి చెందిన నగరాల్లో కాల్చిన ఇటుకల్ని ఉపయోగించటాన్ని ఒక ప్రత్యేకతగా భావించాలి ఆ కాలంలో మెసపొటేమియాలో కూడా కాల్చిన ఇటుకల్ని ఉపయోగించారు కానీ హరప్పా నగరాల్లో అది చాలా ఎక్కువగా జరిగింది

మొహెంజదారో మురుగునీటిపారుదల పథకం చాలా చక్కగా ఉంది దాదాపు అన్ని నగరాల్లోనూ చిన్నా పెద్దా ఇళ్ళలో పెరడూ, స్నానాల గదీ ఉండేవి కాలీ బంగన్‌లో చాలా ఇళ్ళలో సొంత బావులున్నాయి మురికి నీరు ఇంట్లోనుంచీ కాలువలున్న వీధిలోకి ప్రవహించేది కొన్నిచోట్ల ఈ కాలువలను ఇటుకలతోకానీ, రాతిపలకతో కానీ కప్పిపెట్టేవారు వీటిల్లోకి దిగి శుభ్రం చేయటానికి వీధుల్లో రంధ్రాలు – మాన్ హోల్స్ – కూడా ఉండేవి బనవాలీలో కూడా వీధుల, కాలువల అవశేషాలు కనిపించాయి మొత్తంమీద ఇళ్ళలోని స్నానాల గదులూ, కాలువలూ ఉన్నత ప్రమాణంలో ఉండేవి హరప్పాలోని మురుగునీటి పారుదల పథకం అసదృశంగా ఉండేది ఇతర ఏ కంచుయుగం నాగరికతలోనూ ఆరోగ్యంమీదా, శుభ్రతమీదా ఇంత శ్రద్ధ చూపించినట్టు కనిపించడం లేదు

## వ్యవసాయం

ఇతర ప్రాంతాలతో పోల్చితే ఇప్పుడు వర్షపాతం తక్కువగా ఉన్న సింధూప్రాంతం అంత సారవంతంగా కనిపించదు

మొహెంజదారోలోని మూత కప్పిన మురుగునీటి కాలువలు



అక్కడ బయటపడ్డ సంపన్నమైన నగరాలూ, పట్టణాలూ ఒకప్పుడు ఆ ప్రాంతం ఎంతో సారవంతంగా ఉండేదని నిరూపిస్తున్నాయి ఇప్పుడు ఆ ప్రాంతంలో సగటు వర్షపాతం 15 సెం మీ మాత్రమే క్రీ పూ 4 వ శతాబ్దంలో అలెగ్జాండర్ చరిత్రకారుల్లో ఒకతను ఆ ప్రాంతం సారవంతమైందని చెప్పాడు ప్రాచీన కాలంలో సింధూ ప్రాంతంలో ఎంతో వృక్ష సంపద ఉండి, వర్షాన్ని ఆకర్షించేది ఆ వృక్షాలనుంచీ ఇటుకలు కాల్చటానికీ, ఇళ్ళు కట్టుకోవటానిః

దండిగా కలప లభించేది వ్యవసాయం విస్తరించటం చేతా, పశుగ్రాసం అవసరాలు పెరగటం చేతా, కలపను వంట చెరుకుగా ఉపయోగించటం చేతా వృక్ష సంపద కాలక్రమాన నశించిపోయింది సింధూనదికి ఏటా వరదలు రావటం చేత ఒండ్రు మట్టి పొలాల మీద పేరుకు పోయేది సింధూప్రాంతం సారవంతం కావటానికి ఇది మరొక ముఖ్యకారణం ఊళ్ళ చుట్టూరా కాల్చిన ఇటుకలతో కట్టిన గోడలు ఏటా వరదలు వచ్చేవని సూచిస్తున్నాయి సింధూనది నైలునది కంటే ఎక్కువ ఒండ్రు మట్టిని మైదానాల మీద పరిచేది నైల్ నది ఈజిప్టును సృష్టించి, అందులోని ప్రజలను పోషించినట్టుగా సింధూనది సింధూ రాష్ట్రాన్ని సృష్టించి, అందులోని ప్రజల్ని పోషించింది వరదనీరు తీసిన తరువాత సింధూ ప్రాంతంలోని ప్రజలు నవంబర్‌లో గోధుమ, బార్లీ విత్తనాలు చల్లి, ఏప్రిల్‌లో పంటలు కోసేవారు ఆ తరువాత మళ్ళీ వరదలొచ్చేవి ఈ ప్రాంతంలో నాగళ్ళూ, గుద్దళ్ళూ లభించలేదు కానీ హరప్పా పూర్వదశలో కాలీబంగన్‌లో బయటపడ్డ నాగటి చాళ్ళు హరప్పాలో పొలాల్ని దున్నే అలవాటు ఉండేదని సూచిస్తున్నాయి బహుశా హరప్పా వాసులు కర్ర నాగలి దుంగను మాత్రమే ఉపయోగించేవారు ఆ నాగలిని మనుషులు లాగేవారా, ఎద్దులు లాగేవా అన్న విషయం మనకు తెలియదు పంటలు కోయటానికి రాతి కొడవళ్ళను ఉపయోగించి ఉండవచ్చు చుట్టూరా కట్టలు పోసిన కుంటల్లో నీళ్ళను నిలువ చేసుకోవటం బెలూచిస్తాన్, ఆఫ్ఘనిస్థాన్‌లోని కొన్ని ప్రాంతాల్లో కనిపిస్తుంది కానీ కాలువల ద్వారా నీటి సరఫరా మాత్రం ఉండేది కాదు హరప్పా సంస్కృతికి చెందిన గ్రామాలు నదీ తీరాలకు దగ్గరగా ఉండటంచేత తమకే కాకుండా దగ్గరలో ఉన్న పట్టణాలకు కూడా సరిపోగలిగినంత ధాన్యాన్ని పండించ గలిగేవి పట్టణాల్లో నివసిస్తూ ఆహారోత్పత్తిలో ఎలాంటి సంబంధమూ లేని చేతివృత్తులవారికోసమూ, వ్యాపారుల కోసమూ, ఇతరులకోసమూ కూడా పంటలు పండించటానికి వీరు చాలా కష్టపడి ఉండాలి

సింధూప్రాంతపు ప్రజలు గోధుమలూ, బార్లీ, రై, బటాణీలూ మొదలైన పంటల్ని పండించారు బనావలీలో పెద్ద మొత్తంలో బార్లీ బయటపడింది వీటికి తోడు వారు నువ్వులూ, ఆవాలూ కూడా పండించారు కానీ లోథల్‌లో నివసించిన హరప్పా సంస్కృతికి చెందిన ప్రజలు అలా చేయలేదు వీరు క్రీ పూ 1800 నాటికే వరిని పండించారు వాటి అవశేషాలు లభించాయి కూడా హరప్పా, మొహంజదారోల్లోనూ, బహుశా కాలీబంగన్‌లోనూ ధాన్యాన్ని పెద్ద పెద్ద ధాన్యాగారాల్లో నిలువచేసేవారు రైతుల వద్ద నుంచి తృణ ధాన్యాలను పన్నుగా వసూలుచేసి, ధాన్యాగారాల్లో నిలువచేసేవారు పనివాళ్ళ జీతాలను ఈ ధాన్యాల రూపంలో చెల్లించేవారు ఈ పద్ధతి, మెసపొటేమియాలో జీతాలను బార్లీ రూపంలో చెల్లించటాన్ని పోలి ఉండేది సింధూప్రాంతం ప్రజలు పత్తిని తొలిసారిగా పండించారు సింధూప్రాంతంలో తొలిసారిగా పత్తిని పండించటం చేత గ్రీకులు పత్తిని "సిండర్" అని పిలిచారు

## జంతువుల్ని మచ్చిక చేసుకోవటం

హరప్పా ప్రజలు వ్యవసాయాన్ని అనుసరించినా పెద్ద సంఖ్యలో జంతువుల్ని పెంచుకునేవారు వీరు ఎద్దుల్నీ, బర్రెల్నీ, గొర్రెల్నీ, మేకల్నీ, పందుల్నీ మచ్చిక చేసుకోగలిగారు పెద్ద మూపురం ఉన్న ఆబోతుల్ని వారు ఇష్టపడేవారు మొదటి నుంచీ కూడా వీరికి కుక్కల్ని పెంచుకోవటమంటే ఇష్టం వీరు పిల్లుల్ని కూడా మచ్చిక చేసుకున్నారు కుక్కల పాదముద్రలూ, పిల్లుల పాదముద్రలూ కూడా అక్కడ బయటపడ్డాయి వీరు గాడిదల్నీ, ఒంటెల్నీ కూడా పెంచుకున్నారు బహుశా ఈ జంతువుల్ని వీరు బరువులు మోయటానికి ఉపయోగించేవారు గుర్రాలను గురించిన ఆధారాలు మనకు మొహంజదారో పైపొరల్లోనూ, సందేహాస్పదమైన లోథల్ ఎర్ర మట్టి బొమ్మల్లోనూ మాత్రమే లభిస్తాయి పశ్చిమ గుజరాత్‌లోని సుర్‌కొటాడాలో క్రీ పూ 2000 సంవత్సరాల ప్రాంతానికి చెందిన గుర్రం అవశేషాలు లభించాయని చెబుతారు కానీ ఆ అవశేషాలు గుర్రానివేనా అన్నది సందేహాస్పదమే ఏది ఏమైనా హరప్పా సంస్కృతి కాలంలో గుర్రం సాధారణ ఉపయోగంలో ఉండేది కాదన్న విషయంమాత్రం స్పష్టమే ఆ కాలం ప్రజలకు ఏనుగుల్ని గురించీ, ఖడ్గమృగాలను గురించీ బాగా తెలుసు హరప్పాలో ఏ ధాన్యాలను పండించారో, ఏ జంతువుల్ని మచ్చిక చేసుకున్నారో సుమేరియన్ నగరాల్లో కూడా అవే పంటల్ని పండించారు, అవే జంతువుల్ని మచ్చిక చేసుకున్నారు కానీ మెసపొటేమియాలోని నగరాల్లో అలా జరగలేదు

## సాంకేతిక పరిజ్ఞానం - చేతిపనులు

హరప్పా సంస్కృతి కంచుయుగానికి చెందింది హరప్పా ప్రజలు అనేక రాతి పనిముట్లను ఉపయోగించారు కానీ వారికి కంచును తయారుచేయటం, ఉపయోగించటం బాగా తెలుసు కమ్మరులు రాగితో తగరాన్ని కలిపి కంచును తయారు చేసేవారు ఈ రెండు లోహాలూ కూడా విరివిగా లభించకపోవటంచేతనే హరప్పాలో కంచుపనిముట్లు ఎక్కువగా బయటపడలేదు లోహాలను శుభ్రం చేయటం తరువాత మిగిలిన మట్టిని పరిశీలిస్తే అక్కడ లభించే రాగిని రాజస్థాన్‌లోని ఖేత్రీ గనులనుంచీ సేకరించారని తెలుస్తోంది ఆ రాగిని బెలూచిస్థాన్ నుంచీ కూడా దిగుమతి చేసుకొని ఉండే అవకాశం ఉంది బీహార్‌లోని హజారీ బాగ్‌లో

తగరపు కొలుములు కనిపించాయి కానీ, హరప్పా ప్రజలు తగరాన్ని ఆఫ్ఘనిస్థాన్ నుంచీ ఎంతో కష్టపడి దిగుమతి చేసుకొని ఉండవచ్చు హరప్పా తవ్వకాల్లో బయటపడ్డ పనిముట్లలోనూ, ఆయుధాల్లోనూ తగరం తక్కువ శాతంలో కనిపిస్తుంది కానీ హరప్పా వాసులు వదిలివెళ్ళిన పనిముట్లు గణనీయంగానే ఉన్నాయి హరప్పా సమాజంలోని చేతివృత్తుల వారిలో కంచుపనివారు ఒక ముఖ్యమైన భాగంగా ఉండేవారని అవి సూచిస్తున్నాయి వారు విగ్రహాలనూ, పాత్రలనూ మాత్రమే కాకుండా పనిముట్లనూ, గొడ్డళ్ళూ, రంపాలూ, చాకులూ, బల్లాలూ మొదలైన ఆయుధాలను కూడా తయారుచేసేవారు అనేక ఇతర చేతివృత్తులు కూడా హరప్పా ప్రాంతంలోని నగరాల్లో అభివృద్ధి చెందాయి మొహెంజదారోలో ప్రత్తితో నేసిన బట్ట లభించింది అంతేకాకుండా, అనేక వస్తువులమీద బట్టల డిజైన్లు కనిపించాయి నూలు వడకటానికి కండెల్ని కూడా వారు ఉపయోగించారు నేతపనివాళ్ళు ప్రత్తితోనూ, ఉన్నితోనూ వస్త్రాలను తయారుచేశారు అక్కడ బయటపడ్డ పెద్ద ఇటుక భవనాలు తాపీపని ఒక ప్రధాన వృత్తిగా ఉండేదని సూచిస్తున్నాయి హరప్పా వాసులు పడవల్ని కూడా తయారుచేసేవారు సీళ్ళు తయారుచేయటమూ, ఎర్రమట్టి బొమ్మల్ని తయారుచేయటమూ కూడా ప్రధాన చేతివృత్తులుగా ఉండేవి కంసాలులు బంగారంతోనూ, వెండి తోనూ విలువైన రాళ్ళు పొదిగిన నగల్ని తయారుచేసేవారు వీటిలో వెండి బంగారాలు ఆఫ్ఘనిస్థాన్ నుంచీ, విలువైన రాళ్ళు దక్షిణదేశం నుంచీ వచ్చి ఉండవచ్చు హరప్పా వాసులకు పూసల్ని తయారు చేయటంలో కూడా చక్కని నైపుణ్యం ఉండేది కుమ్మరిసారె విస్తృతంగా ఉపయోగంలో ఉండేది హరప్పా వాసులు ప్రత్యేక లక్షణాలను కలిగిన మట్టి పాత్రల్ని తయారు చేసేవారు తరువాత వీటికి తళతళలాడే పూత పూసేవారు

## వ్యాపారం

సింధూప్రాంతపు ప్రజల జీవితాల్లో వ్యాపారానికుండిన ప్రాధాన్యతను హరప్పా, మొహెంజదారో, లోథల్‌లలో లభించిన ధాన్యాగారాలు మాత్రమేకాకుండా అక్కడ లభించిన అసంఖ్యాకమైన సీళ్ళూ, అందరూ ఉపయోగించిన లిపీ, తూనికలూ, కొలతలు కూడా చాటుతున్నాయి ఇవి విస్తృతమైన ప్రాంతంలో కూడా లభించాయి హరప్పా ప్రజలు సింధూప్రాంతంలో రాళ్ళూ, లోహాలూ, గవ్వలూ మొదలైన వస్తువులను అమ్మటం, కొనటం చేశారు కానీ వారి నగరాల్లో వారు ఉత్పత్తి చేసిన వస్తువులకు అవసరమైన ముడిసరుకు లభించేది కాదు వారు లోహాలతో తయారుచేసిన నాణాలను కూడా ఉపయోగించేవారు కాదు వారు బహుశా తమ వ్యాపారాన్ని వస్తుమార్పిడి పద్ధతిలో సాగించేవారు తయారుచేసిన వస్తువులకూ, బహుశా ఆహారధాన్యాలకూ మారుగా వారు లోహాలను బళ్ళమీదా, పడవలమీదా చుట్టుపట్ల ప్రాంతాలనుంచీ తెప్పించుకునేవారు అరేబియా సముద్ర తీరాన్ని వారు నౌకాయానానికి ఉపయోగించారు వారికి చక్రాన్ని ఉపయోగించటం తెలుసు హరప్పాలో గట్టి చక్రాలున్న బళ్ళు ఉపయోగంలో ఉండేవి హరప్పా వాసులు ఒకరకమైన ఆధునిక జట్కాబండిని కూడా ఉపయోగించినట్లు అనిపిస్తోంది

హరప్పావాసులకు రాజస్థాన్‌లోని ఒక ప్రాంతంతోనూ, ఆఫ్ఘనిస్థాన్, ఇరాక్ దేశాలతోనూ వ్యాపార సంబంధాలు ఉండేవి వారు ఆఫ్ఘనిస్థాన్‌లోని ఉత్తర ప్రాంతంలో ఒక వ్యాపార కేంద్రాన్ని కూడా స్థాపించారు అక్కణ్ణుంచీ మధ్య ఆసియా ప్రాంతంతో వ్యాపారం సాధ్యమయ్యేది యూఫ్రటీస్, టైగ్రిస్ నదుల ప్రాంతంతో కూడా హరప్పా ప్రాంత నగరాలు వ్యాపారం చేసేవి మెసపొటేమియాలో ఎన్నో హరప్పా సీళ్ళు లభించాయి మెసపొటేమియాలోని నగరవాసులు ఉపయోగించిన కొన్ని సుగంధద్రవ్యాలను హరప్పావాసులు అనుకరించేవారు

హరప్పావాసులు సుదూర ప్రాంతాలతో నీలమణుల వ్యాపారాన్ని కొనసాగించేవారు స్థానిక పాలకవర్గ కుటుంబాల వారు ఈ నీలమణుల్ని గౌరవ సూచకంగా భావించేవారు క్రీ పూ 2350 నుంచీ మెసపొటేమియన్ రికార్డులు మెలూహాతో వ్యాపార సంబంధాలున్నట్టుగా చెబుతున్నాయి మెలూహా అన్నది సింధూప్రాంతానికున్న ప్రాచీన నామం మెసపొటేమియన్ రికార్డులు మెసపొటేమియాకూ, సింధూ ప్రాంతానికీ మధ్య దిల్‌మున్, మకన్ అన్న వ్యాపార కేంద్రాలున్నట్టుగా చెబుతాయి వీటిలో దిల్‌మున్ పర్షియన్ సింధూశాఖలోని బెహరిన్ కావచ్చు ఈ సముద్రతీర నగరంలో తవ్వకాలు జరగవలసిన గోరీలు వేలాదిగా ఉన్నాయి

## రాజకీయ వ్యవస్థ

హరప్పా ప్రజలు అనుసరించిన రాజకీయ వ్యవస్థను గురించి మనకు స్పష్టమైన అభిప్రాయం లేదు

హరప్పా సంస్కృతి విస్తరించిన ప్రాంతాన్ని ఒక రాజకీయ మండలంగా గుర్తిస్తే అంత పెద్ద రాజకీయ మండలం మౌర్య సామ్రాజ్యం ఉద్భవించే వరకూ ఉండేది కాదని చెప్పవచ్చు దాదాపు 600 సంవత్సరాల కాలం అవిచ్ఛిన్నంగా అది కొనసాగటం దాని స్థిరత్వానికి నిదర్శనమని కూడా చెప్పవచ్చు

ఈజిప్టు, మెసపొటేమియాలలోలాగా హరప్పా ప్రాంతంలో దేవాలయాలు బయటపడలేదు స్నానవాటిక తప్ప ఇతర మత సంబంధమైన నిర్మాణం లేదు స్నాన వాటికను కూడ పవిత్ర స్నానాలకు మాత్రమే ఉపయోగించి ఉండవచ్చు దక్షిణ మెసపొటేమియాలో లాగా హరప్పా ప్రాంతాన్ని మతాధిప

తులూ, పూజారులూ పాలించారని భావించటం పొరపాటు గుజరాత్‌లోని లోథల్‌లో అగ్నిపూజకు సంబంధించిన కొన్ని సూచనలు బయటపడ్డాయి కానీ, వారు అందుకోసం దేవాలయాలను ఉపయోగించలేదు అంతేకాకుండా, హరప్పా పాలకులకు వ్యాపారం మీదన్న ఆసక్తి సామ్రాజ్య విస్తరణమీద లేదు బహుశా హరప్పాను సాంకేతిక నిపుణులు పరిపాలించి ఉండవచ్చు

## మత కర్మలు



మాతృదేవత (అమ్మతల్లి) మొహంజదారో

హరప్పాలో ఎర్రమట్టితో చేసిన అనేక స్త్రీవిగ్రహాలు బయటపడ్డాయి అలాంటి విగ్రహాల్లో ఒకటి గర్భంలోని పిండం నుంచీ ఒక మొక్క ఎదుగుతున్నట్టుగా చిత్రించబడింది బహుశా ఈ విగ్రహం మొక్కల పుట్టుకకూ, పెరుగుదలకూ ఆధారమైన భూదేవికి ప్రతిరూపం కావచ్చు హరప్పా వాసులు భూమిని – ఈజిప్ట్ వాసులు నైల్ నదీ దేవత ఐసిస్‌ను పూజించినట్టుగా – పునరుత్పత్తి దేవతగా భావించి పూజించారు కానీ హరప్పా వాసులు ఈజిప్టియన్లలాగే మాతృస్వామ్య వ్యవస్థను అనుసరించారో లేదో మనకు తెలియదు ఈజిప్ట్‌లో రాజ్యానికీ, ఆస్తికీ వారసురాలు కూతురే హరప్పా సమాజంలో ఉండిన వారసత్వ పద్ధతిని గురించి మనకు తెలియదు

కొన్ని వైదిక గ్రంథాలు భూదేవతకు గౌరవాన్నిచ్చినా ఎలాంటి ప్రాధాన్యతనూ ఇవ్వలేదు పరాదేవత ఆరాధన హిందూమతంలో అభివృద్ధి చెందటానికి చాలాకాలం పట్టింది క్రీ శ 6 వ శతాబ్దం తరువాతనే దుర్గ, అంబ, కాళి, చండి మొదలైన మాతృదేవతలు పురాణాల్లోనూ, తాంత్రిక సాహిత్యంలోనూ దేవతలుగా పరిగణించబడ్డారు కాలక్రమాన ప్రతి గ్రామంలోనూ ఒక గ్రామదేవత వెలిసింది

## సింధూలోయలో పురుషదేవత

ఈ పురుష దేవత రూపం ఒక సీలు మీద చిత్రించబడింది ఈ దేవునికి కొమ్ములున్న మూడు తలలున్నాయి అతడు యోగముద్రలో కూచొని ఉన్నాడు ఈ దేవుని చుట్టూ ఒక పులీ, ఒక ఏనుగూ, ఒక ఖడ్గమృగమూ ఉన్నాయి అతని సింహాసనం కింద ఒక బర్రె ఉంది అతని పాదాల వద్ద రెండు జింకలు కూడా ఉన్నాయి ఈ బొమ్మ మనకు పశుపతి మహాదేవుణ్ణి గుర్తుకు తెస్తుంది ఈ దేవుని చుట్టూరా ఉన్న నాలుగు జంతువులూ భూమి నాలుగు దిక్కులకూ చూస్తున్నాయి ఆ తరువాతి కాలంలో ప్రతి హిందూ దేవునికీ ఒక వాహనం ఏర్పడింది కాబట్టి, ఈ జంతువులు ఆ బొమ్మలోని దేవుని వాహనాలు కావచ్చు ఈ శివుని బొమ్మతోపాటు లింగ పూజ ఆనాడు అమలులో ఉన్నట్టుగా ఆధారాలు లభించాయి ఈ లింగపూజ తరువాతి కాలంలో శివునితో దగ్గర సంబంధాన్ని సంతరించుకుంది హరప్పాలో అనేక లింగాకారాలూ, రాతితో చేసిన స్త్రీ జననేంద్రియ రూపాలూ లభించాయి బహుశా ఇవి పూజకోసమే ఉద్దేశించబడి ఉండవచ్చు లింగారాధకులైన అనార్యులను గురించిన ప్రస్తావన ఋగ్వేదంలో వస్తుంది హరప్పా సంస్కృతి కాలంలో ప్రారంభమైన లింగపూజ తరువాతి కాలంలో హిందూమతంలో గౌరవనీయమైన పూజగా స్థిరపడింది

## చెట్లనూ, జంతువులనూ పూజించటం

సింధూప్రాంత ప్రజలు చెట్లను కూడా పూజించేవారు రాగిచెట్టు మధ్యలో ఒక దేవత వున్నట్టుగా చిత్రించిన ఒక సీలుకూడా ఇక్కడ లభించింది రాగి చెట్టు ఈనాటికీ పూజ లందుకుంటూనే ఉంది



పశుపతి చిత్రం ఉన్న ముద్రిక మొహంజదారో

హరప్పావాసులు జంతువుల్ని కూడా పూజించేవారు ఈ పూజను వారు ఎన్నో సీళ్ళమీదకూడా చిత్రించారు ఇలాంటి పూజలందుకున్న జంతువుల్లో అన్నిటికంటే ముఖ్యమైంది మూపురం ఉన్న ఎద్దు ఈనాటికీ అలాంటి ఎద్దు ఎదురుపడితే రద్దీ బజార్లలో కూడా శ్రద్ధాళువులైన హిందువులు దానికి దారి వదులుతారు పశుపతి మహాదేవుని చుట్టూరా ఉన్న జంతువులు కూడా పూజలందుకునేవి సింధూప్రాంతపు ప్రజలు భగవంతుణ్ణి చెట్ల రూపంలోనూ, జంతువుల రూపంలోనూ, మానవుల రూపంలోనూ కొలిచేవారు కానీ వీరు ఈజిప్ట్, మెసపొటేమియా వాసుల లాగా దేవుళ్లను దేవాలయాల్లో ఉంచేవారు కారు హరప్పా వాసుల మత విశ్వాసాలను గురించి వారు ఉపయోగించిన లిపిని చదవకుండా ఏమీ చెప్పలేము హరప్పా తవ్వకాల్లో పెద్ద సంఖ్యలో రక్షరేకులు లభించాయి దయ్యాలూ, దుష్టశక్తులూ తమకు అపకారం చేస్తాయన్న నమ్మకం వారికి ఉండవచ్చు వాటికి పరిహారంగా వారు రక్షరేకులనూ, తాయెత్తులనూ ఉపయోగించి ఉండవచ్చు అనార్య సంప్రదాయంతో సంబంధం ఉన్న అథర్వవేదంలో వ్యాధులనూ, దుష్టశక్తులనూ దూరం చేసుకోవటానికి ఎన్నో మంత్ర తంత్రాలూ, తాయెత్తులూ, రక్షరేకులూ సూచించబడ్డాయి

## హరప్పా లిపి

ప్రాచీన మెసపొటేమియాలో లాగా హరప్పా ప్రజలు కూడా లిపిని కొనుగొన్నారు దాని తొలి నమూనాలు 1853లోనే కనిపించినా, దాని సంపూర్ణ స్వరూపం 1923లో లభించినా – ఇంతవరకూ దాన్ని చదవటం సాధ్యం కాలేదు కొందరు దీనికీ, ద్రావిడ భాషకూ లేదా ఆదిమ ద్రావిడ భాషకూ సంబంధాన్ని కలుపుతారు మరికొందరు సంస్కృతంతో ఈ లిపికి సంబంధం ఉందంటారు మరికొందరు సుమేరియన్ లిపితో దీనికి సంబంధం ఉందని చెబుతారు కానీ ఇవేవీ సరైన వాదాలు కావు ఆ లిపిని చదవటం ఇంతవరకూ వీలు కాలేదు కాబట్టి సాహిత్యానికి హరప్పా వాసులు చేసిన సేవ ఏమిటో చెప్పటం సాధ్యం కాదు అలాగే వారి విశ్వాసాలను గురించీ, భావాలను గురించీ కూడా మనం ఏమీ చెప్పలేం

ఈజిప్షియన్ల లాగా, మెసపొటేమియన్ల లాగా హరప్పా ప్రజలు సుదీర్ఘమైన శాసనాలను రాయలేదు వారు తమ శాసనాలను సీళ్ళమీద రాశారు అందులో కొన్ని మాటలు మాత్రమే ఉన్నాయి ఈ సీళ్ళను ధనికులు తమ ఆస్తిపాస్తులమీద ముద్రించటానికీ, తమ ఆస్తిపాస్తుల్ని గుర్తించటానికీ ఉపయోగించి ఉండవచ్చు మనకు దాదాపు 250 నుంచీ 400 సీళ్లు లభించాయి వాటిమీదున్న చిత్రం ఒక భావానికో, శబ్దానికో, వస్తువుకో సంకేతంగా ఉపయోగించబడింది హరప్పాలిపి అకారాదిగా ఉన్న లిపి కాదు అది చిత్రలిపి దాన్ని – దానితో సమకాలీనమైన మెసపొటేమియా, ఈజిప్ట్ లిపులతో పోల్చి చూసే ప్రయత్నం జరిగింది హరప్పా లిపి పూర్తిగా దేశీయమైంది దీనికీ మధ్య ఆసియా లిపులకూ ఎలాంటి సంబంధం లేదు

## తూనికలూ, కొలతలు

సొంత ఆస్తి వివరాలను రికార్డు చేయటానికీ, జమాఖర్చు లెక్కల్ని రాయటానికీ లిపిజ్ఞానం దోహదం చేసి ఉంటుంది సింధూనాగరికతకు చెందిన నగరవాసులు తమ వ్యాపార లావాదేవీల కోసం కొలతల్నీ, తూనికల్నీ ఉపయోగించవలసి వచ్చింది అలా తూనికలుగా ఉపయోగించిన ఎన్నో వస్తువులు బయట పడ్డాయి తూనికల కోసం వారు 16 గానీ, లేదా దాని గుణకాలను కానీ – (అంటే 16, 64, 160, 320, 640) ఉపయోగించేవారు 16ను ప్రాతిపదికగా ఉపయోగించటం భారతదేశంలో ఇటీవలి కాలం వరకూ కొనసాగేది ఇటీవలి వరకూ రూపాయకు 16 అణాలుండేవి హరప్పా వాసులకు కొలతలు కూడా తెలుసు కొలతల గుర్తులున్న బద్దలు అక్కడ దొరికాయి వీటిలో ఒకటి కంచుతో కూడా చేయబడింది

## హరప్పా పాత్రలు

కుమ్మరిసారెను ఉపయోగించటంలో హరప్పా వాసులకు గొప్ప నైపుణ్యం ఉండేది ఇక్కడ మనకు రకరకాల డిజైన్లలో ఉన్న అనేక పాత్రలు దొరికాయి సాధారణంగా హరప్పా పాత్రలమీద వర్తులాకారంలో చెట్ల డిజైన్లను చిత్రించేవారు మానవాకారాలు చిత్రించిన పాత్రల ముక్కలుకూడా కొన్ని లభించాయి



లోథల్‌లో లభించిన మట్టిపాత్ర

## సీళ్ళు

హరప్పా సంస్కృతినుంచీ ఉద్భవించిన ఉత్తమోత్తమ కళాఖండాలు సీళ్ళు ఇలాంటివి దాదాపు 2000 లభించాయి అనేక సీళ్ళమీద ఒంటికొమ్ము ఎద్దును కానీ, బర్రెనుకానీ, పులినికానీ, ఖడ్గమృగాన్ని కానీ, గొర్రెనుకానీ, ఏనుగునుకానీ చిత్రించారు వీటిమీద సంక్షిప్తమైన శాసనాలవంటివి కూడా ఉన్నాయి

## విగ్రహాలు

హరప్పా కళాకారులు లోహాలతో అందమైన బొమ్మల్ని తయారుచేశారు కంచుతో చేసిన నర్తకి విగ్రహం వాటిలో



వృషభ చిహ్నంఉన్న ముద్రిక, మొహంజదారో



కాలీబంగన్‌లో లభించిన ముద్రికలు (సీళ్ళు)

ఉత్తమోత్తమమైంది ఒక హారం తప్ప ఆవిడ శరీరంమీద మరే ఆచ్ఛాదనా లేదు హరప్పాకాలానికి చెందిన రాతిశిల్పాల ముక్కలు కూడా లభించాయి అక్కడ ఒక రంగురాతి విగ్రహం లభించింది నగిషీ చెక్కిన వస్త్రాన్ని కుడి చేతి కిందనుంచీ ఎడమ భుజం మీద కప్పుకున్నట్టుగా, పొట్టి వెంట్రుకల్ని రబ్బర్ బాండ్‌లాంటి వస్తువుతో ముడి వేసుకున్నట్టుగా ఆ విగ్రహం చెక్కబడింది

## ఎర్రమట్టి విగ్రహాలు

కాల్చినమట్టి విగ్రహాలు కూడా అక్కడ ఎన్నో లభించాయి వాటిని ఆటబొమ్మలుగానో, పూజావిగ్రహాలుగానో ఉపయోగించి ఉండవచ్చు వీటిలో పక్షులు, కుక్కలు, గొర్రెలు, పశువులు, కోతులు ఉన్నాయి ఇవి కాకుండా స్త్రీ పురుషుల విగ్రహాలు కూడా లభించాయి పురుషుల

విగ్రహాలకంటే స్త్రీ విగ్రహాలే ఎక్కువగా ఉన్నాయి ఎర్రమట్టి బొమ్మల్లో గొప్పనైపుణ్యం కనిపించదు కానీ సీళ్ళూ, ఇతర బొమ్మలూ తయారుచేయటంలో చాలా గొప్ప పనితనం కనిపిస్తుంది ఈ బొమ్మల మధ్య కనిపించే తేడా వాటిని ఉపయోగించిన ప్రజల మధ్య ఉన్న వర్గ తారతమ్యాన్ని సూచిస్తుంది వీటిలో మొదటిరకం బొమ్మల్ని సాధారణ ప్రజలూ, రెండవ రకం బొమ్మల్ని ఉన్నత వర్గానికి చెందిన ప్రజలూ ఉపయోగించి ఉండవచ్చు రాతి విగ్రహాలను తయారుచేయటంలో హరప్పా సంస్కృతి గొప్ప అభివృద్ధి సాధించలేదు ఈజిప్ట్, మెసపొటేమియాల్లోలాగా హరప్పాలో రాతితో చెక్కిన పెద్ద విగ్రహాలేవీ లభించలేదు

## ఆరంభం, పరిణామం, అంతం

హరప్పాసంస్కృతి క్రీ పూ 2500–1800 సంవత్సరాలమధ్య వర్ధిల్లింది అందులో క్రీ పూ 2200 – 2000 సంవత్సరాల కాలంలో ఉన్నత దశను అందుకుంది కానీ హరప్పా సంస్కృతి అమలులో ఉన్న మొత్తం కాలంలో అక్కడి ప్రజలు ఉపయోగించిన పనిముట్లలో, ఆయుధాలలో, ఇళ్లలో మార్పులు రాలేదు మొత్తం జీవన శైలి ఒకే విధంగా ఉంది ఒకేరకమైన నగర నిర్మాణ పథకం, ఒకేరకమైన సీళ్ళు, ఒకేరకమైన ఎర్రమట్టి బొమ్మలూ, ఒకేరకమైన రాతి కత్తులూ ఇక్కడ లభించాయి కానీ మార్పు రాకపోవటాన్ని మనం ఎక్కువగా సాగదీయటానికి వీల్లేదు మొహంజదారోలో కాలక్రమాన పాత్రల నిర్మాణంలో మార్పు వచ్చింది క్రీ పూ 18వ శతాబ్దానికల్లా ప్రధాన నగరాలైన హరప్పా, మొహంజదారో అదృశ్యమైపోయాయి కానీ గుజరాత్, రాజస్థాన్, హర్యానా, ఉత్తరప్రదేశ్‌లోని పశ్చిమప్రాంతాల్లో హరప్పా సంస్కృతి క్షీణదశలో కొంతకాలం కొనసాగి, క్రమక్రమంగా నశించిపోయింది

హరప్పా సంస్కృతి అంతాన్ని గురించి వివరించటం ఎంత కష్టమో ఆదిని గురించి వివరించటమూ అంతే కష్టం బెలూచిస్థాన్‌లో, రాజస్థాన్‌లోని కాలీబంగన్‌లో హరప్పా సంస్కృతి పూర్వదశకు చెందిన ప్రాంతాలు బయటపడ్డాయి కానీ వాటికీ, పరిణత స్థితిలోని హరప్పా సంస్కృతికీ మధ్య ఉన్న సంబంధాన్ని గురించి స్పష్టంగా ఏమీ చెప్పటం సాధ్యం కాదు హరప్పా సంస్కృతి ఈ దేశీయ జనపదాల ఆధారంగా అభివృద్ధి చెంది ఉండే అవకాశం లేకపోలేదు మన ఉపఖండంలో హరప్పా సంస్కృతికి చెందిన నగరాలు అభివృద్ధి చెందటానికి పర దేశాల దోహదం ఎంతో కూడా తేల్చి చెప్పలేము మెసపొటేమియా నగరాలతో ఉన్న సంబంధం హరప్పా సంస్కృతి అభివృద్ధి చెందటానికి ప్రోత్సాహాన్ని ఇచ్చి ఉండవచ్చు ఏది ఏమైనా హరప్పా సంస్కృతిలోని భారతీయత పట్ల ఎలాంటి సందేహమూ లేదు పశ్చిమ ఆసియా సంస్కృతికి విభిన్నమైన లక్షణాలు కొన్ని హరప్పా సంస్కృతిలో ఉన్నాయి చదరంగ బల్ల పద్ధతిలో ఉన్న నగర నిర్మాణ పథకం (వీధులూ, మురుగు నీటి కాలువలూ, మురుగుదొడ్డి గుంటలూ) హరప్పా నాగరికత ప్రత్యేకత మెసపొటేమియన్ నగరాలు అడ్డదిడ్డంగా అభివృద్ధి చెందాయి దీర్ఘ చతురస్రాకారంలో ఉన్న ఇళ్ళూ, ఇటుకలు పరిచిన స్నానాల గదులూ, మెట్లున్న దిగుడుబావులూ – అన్ని హరప్పా నగరాల్లోనూ కనిపిస్తాయి పశ్చిమ ఆసియాలోని నగరాల్లో ఇలాంటి పథకం కనిపించదు క్రీట్‌లోని ప్రజలు తప్ప, ప్రాచీన కాలపు ప్రజ లెవరూ అలాంటి మురుగు నీటి కాలువల పథకాన్ని నిర్మించలేదు అంతేకాకుండా పశ్చిమ ఆసియా ప్రజలు హరప్పా ప్రజలలాగా కాల్చిన ఇటుకలతో భవనాలు నిర్మించటంలో నైపుణ్యాన్ని చూపించలేదు హరప్పా వాసులు తమకు మాత్రమే ప్రత్యేకమైన పాత్రలనూ, సీళ్ళనూ రూపొందించారు సీళ్ళమీద స్థానిక జంతుప్రపంచాన్ని చిత్రించారు అన్నిటినీ మించి వీరు తమకు మాత్రమే ప్రత్యేకమైన లిపిని సృష్టించారు దానికీ ఈజిప్ట్, మెసపొటేమియా లిపులకూ ఎలాంటి పోలికలూ లేవు హరప్పా సంస్కృతి కంచుయుగం సంస్కృతే అయినా, హరప్పా ప్రజలు కంచును చాలా పరిమితంగా మాత్రమే ఉపయోగించారు వారు ఎక్కువగా రాతి పనిముట్లనే ఉపయోగిస్తూ వచ్చారు అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే – హరప్పా సంస్కృతి వ్యాపించినంత విశాల ప్రాంతంలో దానికి సమకాలీనమైన సంస్కృతులేవీ వ్యాపించలేదు హరప్పా నగరం చుట్టుకొలత ఐదు కిలోమీటర్లు కాబట్టి కంచు యుగానికి చెందిన పెద్ద నగరాల్లో హరప్పా కూడా ఒకటి హరప్పా అంత వైశాల్యం ఉన్న నగరం ఇంతవరకూ బయటపడలేదు

మెసపొటేమియాలోని ప్రాచీన సంస్కృతి క్రీ పూ 1800 తరువాత కూడా కొనసాగింది దాదాపు అదేకాలంలో హరప్పా సంస్కృతి అదృశ్యమైపోయింది అందుకు అనేక కారణాలను సూచిస్తున్నారు సింధూప్రాంతంలో క్రీ పూ 3000 ప్రాంతంలో వర్షపాతం కొద్దిగా పెరిగిందనీ, రెండవ సహస్రాబ్దం ప్రారంభంలో తగ్గిందనీ చెబుతున్నారు ఇలా వర్షపాతం తగ్గటం వ్యవసాయాన్నీ, పశుపాలననూ దెబ్బ తీసి ఉండవచ్చు ప్రక్కనే ఉన్న ఎడారి విస్తరించటంచేత భూసారం తగ్గిపోయి, భూమి చవిటిపర్రగా మారిపోయి ఉండవచ్చని కొందరు ఊహిస్తున్నారు వరదలవల్ల భూమి పల్లంగానో, మిట్టగానో మారిపోయి ఉండవచ్చని మరికొందరు అంటున్నారు భూకంపాలు వచ్చి సింధూనది ప్రవహించే మార్గం మారిపోయి మొహంజదారో మునిగిపోయి ఉండవచ్చని ఇతరులు భావిస్తున్నారు మరికొంతమంది హరప్పా సంస్కృతిని ఆర్యులు నాశనం చేశారని అంటున్నారు

అత్యంత విస్తృతమైన ఈ కంచుయుగం నాగరికత శిథిలం కావటానికి కారణాలేమిటో ఇంకా నిర్ధారించవలసి ఉంది నగర నాగరికతకు గ్రహణం పట్టాక, వ్యాపారులూ, చేతివృత్తుల వారూ పల్లె ప్రాంతాలకు తరలిపోవటంచేత ఆ ప్రాంతాల్లో సాంకేతిక పరిజ్ఞానం వ్యాపించిందేమో కచ్చితంగా చెప్పలేము సింధూ, పంజాబ్, హర్యానాల్లో ఈ నగర నాగరికత తరువాతి పరిస్థితుల్ని గురించి మనకు కొద్దిగా తెలుసు సింధూపరీవాహక ప్రాంతంలోనే వ్యవసాయక్షేత్రాలు కనిపించాయి కానీ వాటికీ, అంతకు పూర్వం వర్ధిల్లిన హరప్పానాగరికతకూ మధ్య ఉన్న సంబంధం ఏమిటో మనకు స్పష్టంగా తెలియదు మనకింకా స్పష్టమైన సమాచారం చాలినంతగా అందవలసి ఉంది

## హరప్పా నగర నాగరికత తరువాతి దశ

హరప్పా నాగరికత క్రీ పూ 1800 వరకూ వర్ధిల్లింది ఆ తరువాత కచ్చితమైన నగర నిర్మాణ పథకమూ, ఇటుకలతో భవన నిర్మాణమూ, రాతా, తూనికలూ, కొలతలూ, కోటలో, కోటబయటా తేడా ఉన్న నగర జీవితమూ, కంచు పనిముట్ల ఉపయోగమూ, నల్లరంగు చిత్రాలున్న ఎర్రమట్టి పాత్రలూ ప్రాతినిధ్యం వహించిన ఈ నాగరికత అదృశ్యమై పోయింది అందులో కనిపించిన ఏకరూపత – హోమోజినిటి – అదృశ్యమైపోయింది హరప్పా నాగరికత తరువాతి దశలో పైన పేర్కొన్న అంశాల శైలిలోనూ బహురూపత – భిన్నత్వం – చోటు చేసుకుంది హరప్పా నాగరికత తరువాతి దశకు చెందిన కొన్ని అంశాలు పాకిస్థాన్‌లోనూ, భారతదేశంలోని పశ్చిమ, మధ్యప్రాంతాల్లోనూ, పంజాబ్‌లోనూ, రాజస్థాన్‌లోనూ, హర్యానాలోనూ, జమ్మూ – కాశ్మీర్‌లోనూ, ఢిల్లీలోనూ, ఉత్తర ప్రదేశ్ పశ్చిమభాగంలోనూ బయటపడ్డాయి ఇవి సుమారు క్రీ పూ 1800–1200 మధ్యకాలానికి చెందినవి ఈ దశను "ఉప సింధూ సంస్కృతి" అని కూడా అంటారు దీనికి మరింత ఎక్కువ ప్రచారంలో ఉన్న పేరు "హరప్పా సంస్కృతి తుది దశ"

తుదిదశలోని హరప్పా సంస్కృతులు ప్రాథమికంగా రాగి – రాతి యుగం సంస్కృతులు ఈ దశలో రాతితో, రాగితో తయారుచేసిన పనిముట్లు ఉపయోగంలో ఉన్నాయి ఈ దశలో గొడ్డళ్ళు, ఉలులూ, చాకులూ, గాజులూ, వంకరగా ఉన్న బాకులూ, చేపలు పట్టే గాలాలూ, బల్లెం మొనలూ మొదలైన వస్తువుల్ని వారు ఉపయోగించినా – వాటిని తయారుచేయటంలో గొప్ప లోహ శాస్త్ర నైపుణ్యం కనిపించటం లేదు రాగి – రాతి యుగానికి చెందిన హరప్పా తుది దశనాటి ప్రజలు పల్లెల్లో నివసిస్తూ – వ్యవసాయం మీదా, పశుపాలన మీదా, వేటమీదా, చేపలు పట్టటం మీదా జీవించారు లోహ శాస్త్ర విజ్ఞానం గ్రామాలకు వ్యాపించటంతో జనపదాలు ఏర్పడటం, వ్యవసాయం అభివృద్ధి చెందటం జరిగి ఉండవచ్చు గుజరాత్‌లోని సోమనాథ్, రంగపూర్ హరప్పా సంస్కృతిని నేరుగా వారసత్వంగా గ్రహించాయి కానీ ఉదయపూర్ వద్ద ఉన్న అహర్‌లో హరప్పా లక్షణాలు కొద్దిగా మాత్రమే కనిపించాయి అహర్ సంస్కృతికి ప్రాంతీయ కేంద్రంలా కనిపించే గిలుంద్‌లో ఇటుకతో కట్టిన భవనాలు కనిపించాయి వీటిని క్రీ పూ 2000–1500 కాలానికి చెందినవిగా భావించవచ్చు హరప్పా సంస్కృతి తుదిదశకు చెందిన ప్రాంతాల్లో ఒక్క భగవాన్‌పురా (హర్యానా)లో తప్ప మరెక్కడా కాల్చిన ఇటుకల్ని ఉపయోగించలేదు ఉత్తరప్రదేశ్ పశ్చిమ భాగంలోని బులంద్ షహర్ జిల్లాలోని లాల్‌ఖిల్లాలో కొన్ని ముక్కలు కనిపించాయి మాళ్వప్రాంతంలో రాగి – రాతి యుగం సంస్కృతి (సుమారు క్రీ పూ 1700 – 1200)ని చెందిన అత్యంత పెద్ద జనవివాసమైన "నవదతోలీ"లో కానీ, తాప్తీ, గోదావరీ, భీమా నదీ లోయల్లోని అసంఖ్యాకమైన జోర్వే సంస్కృతీ స్థలాల్లో కానీ హరప్పా లక్షణాలు కనిపించటం లేదు ఈ విషయాన్ని మనం గట్టిగా నొక్కి చెప్పవచ్చు జోర్వే జననివాసాలలో అన్నిటికంటే పెద్దది దైమాబాద్ దీని విస్తీర్ణం దాదాపు 22 హెక్టార్లు ఉండేది దీని జన సంఖ్య దాదాపు 4000 దీన్ని ఆదిమ నగర సంస్కృతిగా భావించవచ్చు కానీ ఇతర జోర్వే జననివాసాలన్నీ పల్లెలు మాత్రమే

హరప్పా నగర సంస్కృతి చివరిదశకు చెందిన జననివాసాలు స్వాత్‌నదీ లోయలోకూడా బయటపడ్డాయి ఇక్కడి ప్రజలు ఉన్నత స్థాయి వ్యవసాయాన్నీ, పశుపాలననూ అనుసరించారు కానీ అవి గ్రామీణ జీవితంతో పాటుగానే కొనసాగాయి మెల్లగా తిరిగే సారె మీద వీరు నలుపు – బూడిదరంగు పాత్రల్ని తయారుచేశారు క్రీ పూ 3 వ సహస్రాబ్దంలోనూ, ఆ తరువాతా ఉత్తర ఇరానియన్ పీఠభూమిలో లభించిన మట్టి పాత్రల్ని ఇవి పోలి ఉన్నాయి స్వాత్‌నదీ లోయ ప్రజలు సింధూ నాగరికత తుదిదశ ప్రారంభ కాలంలో సారెమీద తయారు చేసిన పాత్రలతో దగ్గర సంబంధం ఉన్న పాత్రల్ని తయారు చేశారు ఈ పాత్రలు ఎర్ర రంగులో ఉండేవి వీటి మీద నల్లరంగును పూసేవారు వీటికి హరప్పా నగర నాగరికత తరువాతి కాలంతో సంబంధం ఉంది కాబట్టి స్వాత్ నదీలోయను హరప్పా సంస్కృతి చివరి దశకు చెందిన సుదూరమైన ఉత్తర సరిహద్దుగా భావించ వచ్చు హరప్పా నాగరికత చివరిదశకు చెందిన అనేక స్థలాలు భారతదేశంలోని పంజాబ్‌లో, హర్యానాలో, ఉత్తర ప్రదేశ్‌లో, జమ్మూలో

బయటపడ్డాయి జమ్మూలోని మండానూ, పంజాబ్‌లోని చండీఘర్, సంఘోల్‌నూ, హర్యానాలోని దౌలత్‌పూర్, మిటేథల్‌లనూ, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని అలంగీర్‌పూర్, హులాస్‌లనూ ఈ సందర్భంలో పేర్కొనవచ్చు హర్యానాలోని దౌలత్‌పూర్‌కూ, ఉత్తర ప్రదేశ్‌లో షహరాన్‌పూర్ జిల్లాలోని హులాస్‌కు వచ్చిన తరువాత హరప్పా ప్రజలు బియ్యం తినటం ప్రారంభించారు రాగులు కానీ, జొన్నలు కానీ అనాటికి హరప్పా ప్రజలకు తెలియవు హరప్పా తుది దశలో అలంగీర్‌పూర్‌లో పత్తి పండించారు ఈ విషయాన్ని హరప్పా పాత్రల మీదున్న పత్తిబట్టల ముద్రల్ని చూసి గ్రహించవచ్చు

ఉత్తర ప్రాంతంలోనూ, తూర్పు ప్రాంతంలోనూ కని పించే హరప్పా తుది దశకు సంబంధించిన పాత్రల స్థానంలో ఆ తరువాత తక్కువ నిర్మాణ కౌశలం ఉన్న పాత్రలు కనిపిస్తాయి కానీ కొన్ని కొత్త ఆకారంలో ఉన్న పాత్రలు కూడా కనిపిస్తాయి హరప్పా తుది దశకు చెందిన కొన్ని పాత్రలు బూడిదరంగు పాత్రలతో కలిసి భగవాన్‌పురా శిథిలాలలో బయటపడ్డాయి కానీ ఆసరికి హరప్పా సంస్కృతి సంపూర్ణంగా శిథిలమై పోయినట్టుగా అనిపిస్తుంది

హరప్పా తుదిదశలో పొడవును కొలచే పరికరమేదీ లభించలేదు గుజరాత్‌లో – ఈ దశలో ఘనరూపంలో ఉన్న రాతి తూనిక రాళ్ళు కానీ, ఎర్రమట్టి తూనిక దిమ్మెలు కానీ బయట పడలేదు హరప్పా నాగరికతకు చెందిన తుది దశలో ఎక్కడకానీ మానవాకారంలో ఉన్న బొమ్మలుకానీ, రంగు డిజైన్లు ఉన్న పాత్రలు కానీ లేకపోవటం సాధారణ అంశం గుజరాత్‌లో అందమైన మట్టి పాత్రల్ని నాగరిక లక్షణంగా పరిగణించటం మానివేసినా ఉత్తరదేశంలో అవి నాగరిక లక్షణంగానే కొనసాగాయి ఈ కాలంలోనే పశ్చిమ ఆసియాదేశాలతో సింధూ ప్రాంతం చేసిన వ్యాపారం ఆగిపోయింది నీలమణులతో, స్ఫటికాలతో, కురువిందాలతో చేసిన పూసలూ, రాగితో, కంచుతో చేసిన పాత్రలూ చాలా అరుదుగా మాత్రమే వ్యాపారవస్తువులుగా ఉండేవి లేదా అసలు ఉండేవికావు పంజాబులో, హర్యానాలో, ఉత్తరప్రదేశ్‌లో బయటపడ్డ హరప్పా చివరి దశకు చెందిన స్థలాలు గ్రామీణ ప్రాంతాలు కావటం చేత ఇది సహజ పరిణామమే

హరప్పా సంస్కృతి చివరిదశల్లో కొన్ని విదేశీ పనిముట్లూ, పాత్రలూ కనిపించటం – ఆ దశలో సింధూప్రాంతానికి కొత్త ప్రజలు రాకను సూచిస్తుంది మొహెంజదారో చివరి దశలో భద్రతారాహిత్యం ఉండిన చిహ్నాలూ, హింస జరిగిన చిహ్నాలూ కనిపిస్తున్నాయి పెద్దమొత్తంలో నగలు పూడ్చిపెట్టిన చోట్లు బయటపడ్డాయి అలాగే అనేక మానవ కపాలాలు ఒకే చోట దొరికాయి కొత్తరకమైన గొడ్డళ్ళూ, బాకులూ, చాకులూ – ముఖ్యంగా మధ్యలో ఎత్తుగా ఉన్నవీ, పిడులు చెక్కినవీ – మొహెంజదారోలోని పైపొరల్లో దొరికాయి అవి పరదేశీయులు మన దేశంలోకి చొరబడి రావటాన్ని సూచిస్తాయి హరప్పా చివరిదశకు చెందిన సమాధుల్లో ఈ కొత్తవారి జాడలు లభించాయి అక్కడ చిట్టచివరి పొరల్లో కొత్తపాత్రలు కూడా లభించాయి బెలూచిస్థాన్‌లోని హరప్పా నాగరికతా కేంద్రాల్లో కూడా ఈ కొత్తరకాల పాత్రలు దొరికాయి పంజాబులోనూ, హర్యానాలోనూ అనేక స్థలాల్లో బూడిద రంగు పాత్రలూ, రంగువేసిన బూడిదరంగు పాత్రలూ (సాధారణంగా వైదిక ప్రజలతో సంబంధం ఉందని భావించ బడేవి) క్రీ పూ 1200 ప్రాంతానికి చెందిన హరప్పా చివరి దశకు చెందిన పాత్రలతో కలిసి బయటపడ్డాయి ఈ పరిణామాలన్నిటికీ బహుశా ఇరాన్ ప్రాంతం నుంచీ పర్వతాల గుండా వచ్చిన అశ్వారూఢులైన అనాగరిక గుంపులు కారణం కావచ్చు కానీ ఈ కొత్త ప్రజలు పంజాబులోనూ, సింధూలోనూ ఉన్న హరప్పా సంస్కృతికి చెందిన నగరాల ప్రజలను ఓడించ గలిగినంత పెద్ద సంఖ్యలో రాలేదు ఋగ్వేద ఆర్యులు ఒకనాడు హరప్పా సంస్కృతి వర్ధిల్లిన సప్తసింధూప్రాంతంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నా, పరిణత దశలో ఉన్న హరప్పా ప్రజలకూ, వీరికీ పెద్ద ఎత్తున సంఘర్షణలు జరిగినట్టుగా పురాతత్వ ఆధారాలు లభించలేదు వైదిక ప్రజలు హరప్పా నాగరికత చివరి దశకు చెందిన ప్రజలను క్రీ పూ 1800–1200 మధ్యకాలంలో కలుసుకొని ఉండవచ్చు

★ ★ ★

# అధ్యాయం: 8

# ఆర్యుల రాక - రుగ్వేద యుగం

## మూలనివాసం

ఈనాడు యూరప్‌లోనూ, ఇరాన్‌లోనూ, భారత ఉప ఖండంలోని ఎక్కువభాగంలోనూ మారిపోయిన రూపంలో ఉపయోగిస్తున్న ఇండో–యూరోపియన్ భాషల్ని ఆర్యులు మాట్లాడేవారు దక్షిణ రష్యానుంచీ, మధ్య ఆసియా వరకూ విస్తరించి ఉన్న స్టెప్పీలలో ఎక్కడో ఆర్యులు మొదట నివసించి ఉండవచ్చు గొర్రెలూ, కుక్కలూ, గుర్రాలూ మొదలైన జంతువులకూ, పైన్, మేపుల్ మొదలైన చెట్లకూ ఇండోయూరోపియన్ భాషల్లో ఉన్న పేర్లు ఒకేరకంగా ఉన్నాయి సమానంగా ఉన్న ఈ పదాలు యూరేషియా ప్రాంతంలోని జంతువృక్షజాతుల్ని గురించి తెలియజేస్తాయి వీటివల్ల ఆర్యులకు నదులను గురించీ, అడవుల్ని గురించీ తెలుసునని మనకు అర్థమౌతుంది ఆర్యులు అనేక కొండల్ని దాటి ప్రయాణం చేసినా కొండల్ని గురించి సమానమైన పదాలు కొన్ని ఆర్యభాషల్లోనే ఉండటం ఆసక్తికరంగా ఉంది ఆర్యుల ప్రారంభజీవితం పశుపాలకులుగానే ఉన్నట్టు అనిపిస్తోంది వ్యవసాయం వారి రెండవ వృత్తి మాత్రమే ఆర్యులు స్థిరమైన జీవితాన్ని జీవించలేదు అందుచేత వారు తామునివసించిన ప్రాంతాలలో గట్టి సాక్ష్యాధారాలను వదిలి వెళ్ళలేదు ఆర్యులు అనేక జంతువుల్ని ఉపయోగించినా వారి జీవితంలో గుర్రం ప్రధాన పాత్రను నిర్వహించింది గుర్రం వేగం వారికీ, వారితో కలిసి ఉన్న ఇతర ప్రజలకూ క్రీ పూ 2000 ప్రాంతం నుంచీ కూడా, పశ్చిమ ఆసియాదేశాల మీద విజయవంతంగా దండయాత్రలు చేయటానికి దోహదం చేసింది

ఆర్యులు భారతదేశానికి వస్తూ మొదటిసారిగా ఇరాన్‌లో కనిపిస్తారు అక్కడ ఎంతోకాలంగా ఇండో–ఇరానియన్లు నివసించేవారు భారతదేశంలో ఆర్యుల్ని గురించి మనకు రుగ్వేదం చెబుతుంది "రుగ్వేదం" ఇండో–యూరోపియన్ భాషల్లో లభించే మొట్టమొదటి గ్రంథం అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు మొదలైన దేవతల్ని గురించి స్తోత్రాలు ఇందులో ఉన్నాయి వీటిని అనేక కుటుంబాలకు చెందిన మునులూ, రుషులూ రాశారు ఇందులో పది మండలాలున్నాయి వీటిలో రెండవ మండలంనుంచి ఏడవ మండలం దాకా అత్యంత ప్రాచీనమైనవి మొదటి మండలం, పదవ మండలం చాలా ఆలస్యంగా చేర్చబడ్డవి ఇరానియన్ భాషలో అత్యంత ప్రాచీన గ్రంథమైన "అవెస్తా"కూ రుగ్వేదానికి చాలా పోలికలున్నాయి ఈ రెండు గ్రంథాల్లోనూ అనేకమంది దేవతలకు ఒకే పేర్లున్నాయి సామాజిక వర్గాలకు కూడా ఒకే పేర్లు ఉపయోగించబడ్డాయి క్రీ పూ 1600 ప్రాంతానికి చెందిన కస్సైట్ శాసనాల్లోనూ, క్రీ పూ 1400 ప్రాంతానికి చెందిన మిటన్ని శాసనాల్లోనూ కనిపించే ఆర్యుల పేర్లు – ఒక శాఖ ఆర్యులు ఇరాన్ నుంచీ పశ్చిమ దిక్కుకు వెళ్ళారని సూచిస్తున్నాయి

క్రీ పూ 1500 కాస్త ముందుగా ఆర్యులు భారతదేశంలోకి వచ్చారు వారి రాకకు సంబంధించిన స్పష్టమైన, నిశ్చితమైన పురాతత్వ ఆధారాలు మాత్రం లభించలేదు బహుశా వీరు పిడిరంధ్రం ఉన్న గొడ్డళ్ళనూ, కంచుబాకులనూ, కత్తులనూ ఉపయోగించేవారు వీటిని భారతదేశంలోని వాయవ్యప్రాంతంలో కనుగొన్నాం తొలి ఆర్యులు తూర్పు ఆఫ్ఘనిస్థాన్, పంజాబ్, పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌ల మధ్యలోఉన్న భౌగోళిక ప్రాంతంలో నివసించారు ఆఫ్ఘనిస్థాన్‌లోని కుభా, సింధు, దాని ఐదు ఉప నదులూ రుగ్వేదంలో ఉదాహరించబడ్డాయి ఆర్యుల దృష్టిలో సింధు (ఇండస్) అసామాన్యమైన నది దాన్ని వారు మరీ మరీ ప్రస్తావించారు అలా వారు ప్రస్తావించిన మరొక నది సరస్వతి అది ఇప్పుడు రాజస్థాన్ ఎడారుల్లో ఇంకిపోయింది సరస్వతీ నదీ ప్రాంతాన్ని గగ్గర్ నదీ ప్రాంతంగా గుర్తించవచ్చు రాజస్థాన్‌లోని ఖేత్రీ గనులనుంచీ ఆర్యులు రాగిని గ్రహించి ఉండవచ్చు ఆర్యులు భారతదేశంలో మొదటిసారిగా నివాసం ఏర్పరచుకున్న ప్రాంతాన్ని మొత్తంగా సప్తసింధూప్రాంతం అంటారు

ఆర్యులు భారతదేశానికి అలలు అలలుగా వచ్చారు క్రీ పూ 1500 ప్రాంతంలో వచ్చిన రుగ్వేద ఆర్యులది మొదటి అల వీరు ఆ ప్రాంతంలో నివాసం ఉన్న దాసులతో లేదా దస్యులతో సంఘర్షణ పడవలసి వచ్చింది ప్రాచీన ఇరానియన్ సాహిత్యంలో కూడా దాసుల ప్రస్తావన ఉంది కాబట్టి వారు వీరి తొలిఆర్యులలో ఒక శాఖ కావచ్చు భరత తెగకు నాయకుడైన దివోదాసు చేతిలో శంబరు డన్న

వ్యక్తి ఓడిపోవటాన్ని రుగ్వేదం వర్ణిస్తుంది ఇక్కడ దివోదాసు అన్న పేరులో 'దాసు' అన్నమాట ఉంది రుగ్వేదంలో కనిపించే దస్యులు ఈ దేశంలోని ఆదిమ వాసులు కావచ్చు వారిని ఓడించిన ఆర్యనాయకుని పేరు త్రాసదస్యు ఈ ఆర్యనాయకుడు దాసులపట్ల కాస్త మెత్తగానూ, దస్యులపట్ల చాలా కఠినంగానూ ఉండేవాడు "దస్యుహత్య" అన్నమాట రుగ్వేదంలో మాటిమాటికీ వినిపిస్తుంది బహుశా ఈ దస్యులు లింగారాధకులు కావచ్చు వారు గోవులను పాల ఉత్పత్తుల కోసం ఉపయోగించి ఉండకపోవచ్చు

## తెగలమధ్య పోరాటాలు

ఆర్యుల శత్రువులను ఇంద్రుడు అనేక పోరాటాలలో జయించినట్టు మనకు తెలిసినా ఆర్యుల శత్రువులు ఏ ఆయుధాలను ఉపయోగించేవారో మనకు తెలియదు రుగ్వేదం ఇంద్రుణ్ణి పురందరుడు (అంటే కోటల్ని ధ్వంసం చేసినవాడు) అన్న పేరుతో పిలుస్తుంది కానీ ఆర్యులకు పూర్వం ఉన్నవారి స్వాధీనంలో ఉన్న కోట లేవో మనకు తెలియదు వీటిలో కొన్ని హరప్పా తుది దశకు చెందిన జనపదాలు కావచ్చు ఆర్యులు ప్రతిచోటా జయించగలిగారు ఎందుకంటే వారికి గుర్రాలను పూన్చిన రథాలుండేవి పశ్చిమాసియాలోనూ, భారతదేశంలోనూ ఆర్యులే వీటిని తొలిసారిగా ప్రవేశపెట్టారు బహుశా ఆర్యసైనికులకు కవచాలూ, మెరుగైన ఆయుధాలూ కూడా ఉండేవి

ఆర్యులు రెండురకాలైన సంఘర్షణలకు దిగారు మొదటిది తమకంటే ముందుగా ఈ దేశంలో ఉన్న ప్రజలతో, రెండవది తమలో తామే సంఘర్షించుకోవటం అంతఃకలహాలు ఆర్యులను చాలా కాలం కుదిపివేశాయి "పంచజనులు" అన్న పేరులో ఐదు తెగలుగా విడిపోయిన ఆర్యులు – తమలో తాము పోరాడుకున్నారు కొన్ని సందర్భాలలో వీరు అనార్యుల సహాయాన్ని కూడా తీసుకున్నారు భరతులూ, త్రిదశులూ పాలక తెగలు వీరిని వసిష్ఠుడన్న పురోహితుడు బలపరిచాడు ఈ దేశానికి 'భారతవర్షం' అన్న పేరు ఈ తెగ పేరు మీదనే వచ్చింది ఈ విషయం మనకు మొదటిసారిగా రుగ్వేదంలో కనిపిస్తుంది భరతులన్న ఈ తెగను పదిమంది నాయకులు వ్యతిరేకించారు వీరిలో ఐదుగురు ఆర్యులు, మిగిలిన ఐదుగురూ అనార్యులు ఆర్యులకూ, ఈ పది మంది రాజులకూ మధ్య జరిగిన యుద్ధానికి దశరాజ్ఞ యుద్ధమని పేరు ఈ యుద్ధం పరుష్ణీనదీతీరంలో (ఆధునిక రావీనది) జరిగింది ఈ యుద్ధంలో సుదాసు జయించి, భరతుల ఆధిపత్యాన్ని స్థాపించాడు ఓడిపోయిన తెగలలో ప్రధానమైన తెగపేరు "పురు" కాలక్రమేణా భరతులు, పురులతో చేయికలిపి "కురు" అన్న పాలక తెగను స్థాపించారు "కురు" తెగకు చెందిన వీరు 'పాంచాల' తెగకు చెందిన వారితో కలిసి ఉత్తర గంగామైదానంలో తమ పరిపాలనను స్థాపించి, వేదయుగం చివరిదశలో గొప్ప పాత్రను వహించారు

## భౌతిక జీవితం

రుగ్వేదార్యుల భౌతిక జీవితాన్ని గురించి మనం ఒక అభిప్రాయం ఏర్పాటు చేసుకోవటానికి అవకాశం ఉంది భారతదేశంలో వారి విజయానికి కారణం గుర్రాలూ, రథాలూ, కంచుతో చేసిన మెరుగైన ఆయుధాలూ కావచ్చు కానీ వీటిని గురించి ఎలాంటి పురావస్తు ఆధారమూ లేదు పశ్చిమ భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నప్పుడు వారు రాజస్థాన్‌లోని ఖేత్రీ గనులనుంచీ రాగిని సంపాదించుకొని ఉండవచ్చు రుగ్వేదకాలం నాటి ప్రజలకు వ్యవసాయాన్ని గురించి మెరుగైన జ్ఞానం ఉండేది రుగ్వేదంలోని తొట్టతొలి భాగంలోనే నాగలిని గురించిన ప్రస్తావన ఉంది కానీ కొందరు ఇది ప్రక్షిప్తమని భావిస్తున్నారు బహుశా ఈ నాగలి కర్ర నాగలి కావచ్చు వారికి విత్తనాలు నాటటాన్ని గురించీ, కోతల్ని గురించీ, నూర్పిళ్ళను గురించీ తెలుసు వారికి వివిధ రుతువుల్ని గురించిన జ్ఞానం కూడా ఉండేది ఆర్యులకు ముందు అదే ప్రాంతంలో నివసించిన ప్రజలకు కూడా వ్యవసాయాన్ని గురించి బాగా తెలుసు

కానీ రుగ్వేదంలో గోవును గురించి ఉన్న అనేక ప్రస్తావనల్ని చూస్తే రుగ్వేద ఆర్యులు ప్రధానంగా పశుపాలకులేనని తెలుస్తుంది వారు చేసిన అనేక యుద్ధాలు గోవుల కోసమే 'యుద్ధం' అన్న మాటకు రుగ్వేదంలో "గవిష్ఠి" అన్న పదం వాడబడింది ఆ మాటకు గోవుల్ని వెదకడం అని అర్థం వారికి గోవులే ప్రధాన సంపద పురోహితులకు ఇచ్చిన దానాలు, గోవులూ, బానిసస్త్రీలూ మాత్రమే భూమిని దానం చేసిన ప్రస్తావన కనిపించదు రుగ్వేదకాలపు ప్రజలు పశువుల్ని మేపుకోవటంకోసమో, వ్యవసాయంకోసమో, నివాసంకోసమో కొంత భూమిని అప్పుడప్పుడూ ఆక్రమించుకునేవారు కానీ భూమిని వారు సొంత ఆస్తికి ఒక ముఖ్యమైన రూపంగా పరిగణించలేదు

'రుగ్వేదం' వడ్రంగులూ, రథాలను తయారు చేసేవారూ, సాలెలూ, కుమ్మరులూ, చర్మకారులూ మొదలైన చేతివృత్తుల వారిని పేర్కొంటుంది ఈ వృత్తులన్నీ ఆనాడు ఉండేవని దీని మూలంగా గ్రహించవచ్చు రాగికీ లేదా కంచుకూ ఉపయోగించిన "అయస్" అన్నపదం ఆనాటి ప్రజలకు లోహవిజ్ఞానం ఉండేదని సూచిస్తుంది కానీ వ్యాపారం అమలులో ఉన్నట్టుగా మాత్రం ఆధారాలు లభించలేదు ఆర్యులకు కానీ, వేదకాలపు ప్రజలకు కానీ సముద్రాలను గురించీ, మహా సముద్రాలను గురించీ తెలుసా అన్నది సందేహాస్పదమే ఎందుకంటే "రుగ్వేదం" లో కనిపించే

'సముద్రం' అన్న పదానికి నీటిసముదాయం అని మాత్రమే అర్థం మొత్తం మీద ఆర్యులు నగరాల్లో నివసించలేదు మట్టిగోడలున్న ఒకవిధమైన పల్లెల్లో వారు జీవించి ఉండవచ్చు వాటిని పురాతత్వ శాస్త్రవేత్తలు ఇంకా గుర్తించవలసి ఉంది

హర్యానాలో భగవాన్ పురా అన్నచోటా, పంజాబులో మరి మూడు చోట్లలోనూ ఈలోగా తవ్వకాలు జరిగాయి ఈ చోట్లలో రంగువేసిన మట్టి పాత్రలతోపాటు హరప్పా తుది దశకు చెందిన పాత్రలు కూడా లభించాయి భగవాన్‌పురా కాలాన్ని సుమారుగా క్రీ పూ 1600–1000 అని నిర్ణయించారు ఇది దాదాపుగా రుగ్వేదకాలం భౌగోళికంగా ఈ నాలుగు స్థలాల మధ్య ఉన్న ప్రాంతం సుమారుగా రుగ్వేద ప్రాంతమని చెప్పవచ్చు ఈ స్థలాలన్నిటిలోనూ రంగువేసిన మట్టి పాత్రలు దొరికాయి కానీ ఇనుప వస్తువులూ, తృణ ధాన్యాలూ దొరకలేదు కాబట్టి రంగువేసిన మట్టిపాత్రల కాలంలో ఇనుపయుగం పూర్వదశ ఒకటి ఉండేదనీ, దానికాలమూ రుగ్వేద యుగం కాలమూ ఒకటేననీ అనుకోవచ్చు భగవాన్‌పురాలో పదమూడు గదులున్న ఒక పెద్ద మట్టి ఇల్లు బయటపడటం చాలా ఆసక్తికరమైన అంశం అది ఒక పెద్ద ఉమ్మడి కుటుంబం యొక్క నివాసం కావచ్చు లేదా తెగ నాయకుని నివాసం కావచ్చు ఈ అన్ని స్థలాల్లోనూ పశువుల ఎముకలు పెద్ద మొత్తంలో లభించాయి

## తెగలలో పరిపాలనావ్యవస్థ

తెగ నాయకుడు – అతడు యుద్ధాలలో విజయం సాధించాడు కాబట్టి – కేంద్రంగా రుగ్వేదకాలపు ఆర్యుల పరిపాలనా యంత్రాంగం పనిచేసేది అతణ్ణి "రాజు" అని పిలిచేవారు రుగ్వేదకాలానికి రాజ్యాధికారం వంశపారంపర్యంగా స్థిరపడినట్లు అనిపిస్తోంది కానీ రాజుకు (లేదా నాయకుడికి) హద్దులేని అధికారాలు ఉండేవి కావు అతడు తెగయొక్క సంఘాలకు జవాబు చెప్పవలసిన అవసరం ఉండేది 'సమితి' అన్న ప్రతినిధి సభ రాజును ఎన్నుకున్న సందర్భాలు కూడా కొన్ని తెగలలో లేకపోలేదు రాజును తెగయొక్క రక్షకుడు అని పిలిచేవారు అతడు పశువులను రక్షించేవాడు యుద్ధాలలో పాల్గొనేవాడు తెగ తరఫున దేవతలకు పూజలు చేసేవాడు

'సభ', 'సమితి', 'విధాత', 'గణం' అన్న పేర్లతో తెగల ప్రతినిధి సంఘాలు 'రుగ్వేదం'లో ప్రస్తావించబడ్డాయి వాటికి – చర్చలు చేయటం, సైనిక మత కార్యక్రమాలను నిర్వహించటం విధులుగా ఉండేవి రుగ్వేదకాలంలో 'సభ', 'విధాత' సమావేశాలకు స్త్రీలు కూడా హాజరయ్యేవారు వీటిలో 'సభ', 'సమితి' అత్యంత ప్రధానమైన సంఘాలు వీటి ప్రాధాన్యత ఎంత ఎక్కువగా ఉండేదంటే – వీటి సహకారాన్ని పొందటానికి రాజులూ, నాయకులూ ఉత్సాహాన్ని చూపించేవారు

రోజువారీ పరిపాలనలో రాజుకు కొంతమంది ఉద్యోగులు సాయం చేసేవారు వీరిలో ప్రధానమైన వ్యక్తి పురోహితుడు రుగ్వేదకాలంలో గొప్ప పాత్రను నిర్వహించిన ఇద్దరు పురోహితులు వశిష్ఠుడు, విశ్వామిత్రుడు అనేక కార్యాలకు నాయకులను ప్రోత్సహించి, వారి విజయాలను కీర్తించి, ప్రతిఫలంగా గోవులనూ, స్త్రీబానిసలనూ పెద్ద సంఖ్యలో వీరు గ్రహించేవారు పురోహితుని తరువాత ప్రధాన ఉద్యోగి సేనాని ఇతడు బల్లాలనూ, గొడ్డళ్ళనూ, కత్తులనూ ఉపయోగించేవాడు ఆ కాలంలో పన్నులు వసూలు చేసే అధికారి ఎవరూ కనిపించటం లేదు బహుశా ఆనాటి నాయకులు ప్రజలనుంచీ వారే ఇచ్ఛికంగా ఇచ్చే 'బలి' అన్న చందాలను గ్రహించేవారు కొన్ని వైదిక సమితులలో బహుమతులనూ, యుద్ధాలలో దోపిడీ చేసిన వస్తువులనూ పంచిపెట్టేవారు 'రుగ్వేదం'లో న్యాయాధికారి ప్రస్తావన కూడా లేదు కానీ వైదిక సమాజం ఆదర్శ సమాజం ఎంతమాత్రమూ కాదు దొంగతనాలూ, దోపిడీలూ ఉండేవి మరీ ముఖ్యంగా గోవుల దొంగతనాలు జరిగేవి ఇలాంటి సమాజ వ్యతిరేక కార్యక్రమాల మీద కన్నువేసి ఉంచటం కోసం గూఢచారులను ఉపయోగించేవారు

ఉద్యోగులకున్న బిరుదులు (పేర్లు) వారి ఉద్యోగాల స్వభావాన్ని కానీ, ప్రాంతాన్ని కానీ తెలియచేయవు కానీ కొందరు ఉద్యోగులు కొన్ని ప్రాంతాలకు అనుబంధంగా ఉండేవారనటానికి సందేహం లేదు వారు పశుగ్రాసం కోసం వదిలిన మైదానాల మీదా, స్థిర నివాసం ఉన్న గ్రామాలమీదా అధికారాన్ని కలిగి ఉండేవారు గడ్డి మైదానాలమీద అధికారం కలిగిన అధికారిని వ్రజపతి అనేవారు ఇతడు కుటుంబ పెద్దలకూ (కులపతి), వీరుల సమూహాలకూ (గ్రామణులు) యుద్ధంలో నాయకత్వం వహించేవాడు మొదట గ్రామణులు చిన్న వీరుల దళాలకు నాయకులుగా ఉండేవారు కానీ ఆ దళాలు స్థిర నివాసం ఏర్పరచుకున్న తరువాత గ్రామణులు ఆ గ్రామాలకు నాయకులయ్యారు కాలక్రమాన వారు వ్రజపతులయ్యారు

రాజు శాశ్వతమైన సైన్యాన్ని పోషించేవాడు కాదు యుద్ధ సమయంలో వ్రాతం, గ్రామం, గణం, సార్థం మొదలైన తెగలోని గుంపుల నుంచీ పోరాట వీరుల్ని తీసుకొనేవాడు ఆనాటి ప్రభుత్వం గిరిజన ప్రభుత్వం అందులో సైనిక ప్రభావం ఎక్కువగా ఉండేది అప్పుడు ఒక పౌర విధానం కానీ, ప్రాంతీయ పరిపాలన కానీ ఉండేవికావు ఆనాటి ప్రజలు విస్తరిస్తున్న దశలో, ఒక ప్రాంతం నుంచీ మరొక ప్రాంతానికి వలస పోతున్న దశలో ఉండటం చేత అవి సాధ్యం కాలేదు

## తెగ, కుటుంబం

బంధుత్వం మీద సామాజిక నిర్మాణం ఆధారపడి ఉండేది మనిషిని అతని వంశం ఆధారంగా గుర్తించే వారు రుగ్వేదకాలం నాటి రాజుల పేర్లను పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది ప్రజలు మొట్టమొదట తమ తెగకు విధేయులుగా ఉండేవారు తెగను "జన" అనేవారు "రుగ్వేదం"లో జన అన్న పదం 275 సార్లు ప్రస్తావించబడింది కానీ 'జనపదం' అన్న మాట ఒకసారి కూడా లేదు ప్రజలు తెగకు అనుబంధంగా మాత్రమే ఉండేవారు కానీ ప్రాంతమూ, రాజ్యమూ అప్పటికింకా రూపుదిద్దుకోలేదు

తెగ అన్న అర్థంలో రుగ్వేదంలో ఉపయోగించబడిన మరొక పదం "విశ్" ఈ పదం 'రుగ్వేదం'లో 170 సార్లు వస్తుంది బహుశా "విశ్"ను "గ్రామం" అన్న చిన్న విభాగాలుగా విభజించేవారు ఒక్కొక్క 'గ్రామం' ఒక్కొక్క పోరాట సముదాయంగా ఉండేది గ్రామాలు ఒకదానితో మరొకటి సంఘర్షించుకున్నప్పుడు "సంగ్రామం" జరిగేది ఎక్కువ జన సంఖ్య కలిగిన వైశ్యవర్ణం "విశ్" అన్న తెగలో నుంచే ఉద్భవించింది

కుటుంబానికి పర్యాయపదమైన 'కులం' రుగ్వేదంలో అరుదుగా ప్రస్తావించబడింది అందులో తల్లీ, తండ్రీ, కొడుకులూ, బానిసలూ కాకుండా ఇతరులు చాలా మంది ఉండేవారు వేదయుగం తొలి నాళ్ళలో "గృహం" అన్న పదం కుటుంబాన్ని సూచించేది "రుగ్వేదం"లో ఈ పదం అనేకసార్లు వస్తుంది తొలి ఇండో – యూరోపియన్ భాషల్లో మేనల్లుడికీ, మనవడికీ, అన్నదమ్ముల పిల్లలకీ ఒకే పదాన్ని ఉపయోగిస్తారు కుటుంబసంబంధాల్లోని తారతమ్యాలు వేరు కాపురాలు పెట్టుకోవటం వరకూ అప్పటికింకా వెళ్ళలేదని ఇది సూచిస్తుంది అప్పటికింకా కుటుంబం పెద్ద ఉమ్మడి వ్యవస్థే రోమన్ సమాజంలో లాగా ఇక్కడ కూడా పితృస్వామ్య వ్యవస్థే ఉండేది తండ్రి కుటుంబానికి పెద్దగా ఉండేవాడు అనేక తరాలకు చెందిన కుటుంబ సభ్యులు ఒకే కప్పు కింద కాపురం చేసేవారు అది పితృస్వామ్య సమాజం కాబట్టి మళ్లీ మళ్లీ కొడుకులే పుట్టాలని అందరూ ఆశించేవారు మరీ ముఖ్యంగా యుద్ధాల్లో పోరాడటం కోసం ధైర్యశాలులైన కొడుకుల్ని ఇవ్వమని దేవుళ్ళని కోరుకోవటం మాటిమాటికీ ఎదురయ్యే విషయమే కానీ, కూతుర్ని ఇవ్వమని కోరటం ఎక్కడా కనిపించదు

స్త్రీలు సమావేశాలకు రావచ్చు, పాల్గొనవచ్చు వారు భర్తలతోపాటు యజ్ఞాలలో పాల్గొనవచ్చు వేదమంత్రాలను రాసిన ఐదుమంది స్త్రీలను గురించి మనకు తెలుసు, తరువాతి గ్రంథాలు అలాంటి స్త్రీలు 20 మంది ఉన్నారని అంటాయి ఆ మంత్రాలను ఆశువుగా, మౌఖికంగా కూర్చి ఉండవచ్చు ఆ కాలంలో రాత లేదు

కొంతవరకూ అనాగరిక సంప్రదాయాలు కొనసాగినా వివాహ వ్యవస్థ అప్పటికే స్థిరపడిపోయింది యముని కవలసోదరి యమి తనతో ప్రేమ సంబంధం కలపమని యముణ్ణి కోరటం, అతడు సంయమనంతో తిరస్కరించటం మనకు తెలుసు ఉదాహరణకు మరుత్తులు రోదసిని అనుభవించారు అశ్వినీ సోదరులు ఇద్దరూ సూర్యభగవానుని కూతురైన "సూర్య"తో కలిసి జీవించారు కానీ ఇలాంటి సంఘటనలు ఎన్నో లేవు బహుశా అవి మాతృస్వామిక వ్యవస్థ అవశేషాలు కావచ్చు మామతేయుని లాగా తల్లి పేరు కొడుక్కు పెట్టటం కూడా కొన్ని సందర్భాల్లో జరిగేది

అన్న చనిపోతే వదినను వివాహం చేసుకోవటం, విధవా పునర్వివాహం "రుగ్వేదం"లో కనిపిస్తాయి బాల్య వివాహాలు ఎక్కడా 'రుగ్వేదం'లో లేవు ఆ కాలంలో వివాహ వయస్సు 16 లేక 17 సంవత్సరాలుగా వున్నట్టు అనిపిస్తుంది

## సామాజిక విభజన

క్రీ పూ 1500–1000 ప్రాంతంలో వాయవ్య భారతదేశంలో నివసించిన మనుషుల రూపాన్ని గురించిన చైతన్యం 'రుగ్వేదం'లో కనిపిస్తుంది వర్ణమంటే రంగు ఆర్యులు తెల్లని శరీరవర్ణం కలిగినవారు అనార్యులైన స్థానిక ప్రజలు నల్లనివారు శరీరవర్ణం సామాజిక స్థాయిని గుర్తించటానికి కొంతవరకూ ఉపయోగ పడి ఉండవచ్చు కానీ జాతి విచక్షణను నమ్మే పాశ్చాత్యులు శరీరవర్ణానికున్న ప్రాధాన్యతను అతిశయోక్తుల పాలు చేశారు సామాజిక విభజన సృష్టికావటానికి ప్రధానకారణం ఆర్యులు స్థానిక ప్రజలను జయించటం ఆర్యుల చేత జయించబడిన స్థానిక ప్రజలు దాసులు, దశ్యులు వీరిని ఆర్యులు బానిసలుగా, శూద్రులుగా చూశారు తెగలనాయకులూ, పురోహితులూ దోపిడీధనంతో ఎక్కువ భాగాన్ని తీసుకున్నారు వీరు సామాన్యప్రజానీకం కంటే ఎక్కువగా అభివృద్ధిలోకి రాగలిగారు ఈ పరిణామం తెగలో సామాజిక అసమానతలను సృష్టించింది క్రమక్రమంగా తెగలో మూడు గుంపులు తయారయ్యాయి వారు యోధులు, పురోహితులు, సామాన్య ప్రజలు ఇదే సామాజిక విభజన ఇరాన్‌లో కూడా ఉండేది నాలుగవ వర్ణమైన శూద్రులు రుగ్వేదయుగం చివరలో మొదటిసారిగా కనిపిస్తారు వారిని గురించిన ప్రస్తావన మొదటిసారిగా 'రుగ్వేదం' యొక్క పదవ మండలంలో వస్తుంది

పురోహితులకు బానిసలుగా ఇవ్వబడిన బానిసల్ని గురించి కూడా మనకు తెలుసు వీరు ప్రధానంగా స్త్రీ బానిసలు వీరిని ఇంటిపనులు చేయటానికి వినియోగించేవారు రుగ్వేద కాలంలో బానిసల్ని వ్యవసాయం లాంటి ఉత్పత్తి రంగాలలో ఉపయోగించలేదన్నది మాత్రం స్పష్టమే

రుగ్వేదయుగంలోనే వృత్తిమీద ఆధారపడ్డ సామాజిక విభజన ప్రారంభమైంది కానీ ఆ విభజన మరీ తీవ్రంగా ఉండేదికాదు "నేను కవిని, మా నాన్న వైద్యుడు, మా అమ్మవృత్తి పిండి రుబ్బటం ఇలా వివిధ వృత్తుల్ని అనుసరిస్తూ అవసరమైనంత సంపాదించుకుంటూ మేము కలిసి జీవిస్తున్నాము" అని తన కుటుంబాన్ని గురించి ఒక సభ్యుడు చెబుతాడు పశువుల్నీ, రథాలనూ, గుర్రాలనూ, బానిసలను బహుమతులుగా ఇవ్వటం గురించి 'రుగ్వేదం' లో ఉంది యుద్ధాలలో దోచి తెచ్చిన సంపదను పంచుకోవటంలోని అసమానతలు సామాజిక అసమానతలకు దారితీశాయి ఈ పరిణామం రాజులూ, పురోహితులూ – సాధారణ గణప్రజలను తోసుకొని ముందుకు వెళ్ళి, అభివృద్ధి చెందటానికి వీలు కలిగించింది కానీ ఆర్థికవ్యవస్థ ప్రధానంగా ఆహార ఉత్పత్తి మీదకాక పశుపాలన మీద ఆధారపడి ఉండటంచేత క్రమంగా ప్రజలనుంచి కప్పాలు గ్రహించటం చాలా తక్కువగా ఉండేది భూమిని దానం చేయటం ఆ కాలంలో ఉండేది కాదు అంతేకాకుండా తృణ ధాన్యాలను దానం చేయటం కూడా అరుదుగా మాత్రమే జరిగేది ఆ కాలంలో ఇంటిపనులు చేసే బానిసలు మాత్రమే ఉండేవారు జీతం తీసుకునేవారు ఉండేవారుకారు సమాజంలో గిరిజన సంప్రదాయాలే బలంగా ఉండేవి పన్నుల్ని వసూలు చేయటం మీదా, భూమిని సమకూర్చుకోవటం మీదా ఆధారపడ్డ సామాజిక విభజన ఉండేది కాదు సమాజం అనాటికింకా తెగ మీదనే ఆధారపడి ఉండేది ప్రధానంగా అది సమ సమాజం కూడా

## రుగ్వేద దేవతలు

ప్రతి మానవ సమూహమూ తాను జీవిస్తున్న దేశ కాల పరిస్థితుల ఆధారంగా తన మతాన్ని రూపొందించుకుంటుంది వానలు రావటం, సూర్యుడూ చంద్రుడూ ఉదయించటం, నదులు ప్రవహించటం, పర్వతాలు ఉండటం మొదలైన పరిణామాలను అర్థం చేసుకోవటానికి ఆర్యులు ఇబ్బంది పడ్డారు కాబట్టి ప్రకృతి శక్తులకు రూపాన్నీ, ప్రాణాన్నీ ఇచ్చి, వాటికి మానవ లక్షణాలనో, జంతులక్షణాలనో కల్పించారు "రుగ్వేదం"లో అలాంటి దేవతలు సంఖ్యాకంగా ఉన్నారు అలాంటి దేవతలను గురించిన మంత్రాలు "రుద్వేగం"లో పుష్కలంగా ఉన్నాయి "రుగ్వేదం"లోని ప్రధాన దేవత ఇంద్రుడు అతణ్ణే పురందరుడు (కోటల్ని పగలగొట్టేవాడు) అని కూడా అంటారు రాక్షసుల మీదికి ఆర్య సైన్యాలను నడిపించి, విజయాలను సాధించటం అతని పని "రుగ్వేదం"లో అతని మీద 250 మంత్రాలున్నాయి అతడు వానదేవుడు కూడా అతడే వానల్ని కురిపిస్తాడని వారు నమ్మేవారు రెండవస్థానం అగ్నిది అతనిమీద దాదాపు 200 మంత్రాలున్నాయి ఆదిమవాసుల జీవితాలలో అగ్నికి చాలా ప్రాధాన్యత ఉండేది అడవుల్ని తగలబెట్టటానికీ, వంట చేసుకోవటానికీ, ఇతర పనులకూ అగ్ని అవసరం ఉండటంచేత దానికా ప్రాముఖ్యత వచ్చింది అగ్నిపూజ భారతదేశంలోనే కాకుండా ఇరాన్‌లో కూడా ప్రధాన స్థానాన్ని సంపాదించుకుంది వేదకాలంలో అగ్ని సాధారణ ప్రజానీకానికీ, దేవతలకూ మధ్య ఒకరకమైన రాయబారిగా వ్యవహరించాడు అగ్నికి అర్పించిన హవిస్సుల్ని అగ్ని పొగరూపంలో ఆకాశంగుండా దేవతలకు తీసుకువెళ్తాడని భావించేవారు దేవతలలో మూడవస్థానం వరుణుడిది అతడు నీటికి మరోరూపం అతడు ప్రకృతి నియమాలను రక్షిస్తాడనీ, ప్రపంచంలో జరిగే ప్రతి కార్యమూ అతని అభీష్టం ప్రకారమే జరుగుతుందనీ ప్రజలు నమ్మేవారు సోముడు మొక్కల దేవుడు ఒక మత్తుపానీయం అతనిపేరు మీద ఉంది (సోమరసం) ఈ మత్తుపానీయాన్ని మొక్కలనుంచీ తయారుచేసే విధానాన్ని వర్ణించే మంత్రాలు 'రుగ్వేదం'లో చాలా ఉన్నాయి కానీ ఆ మొక్కలేవో సంతృప్తికరంగా ఇంతవరకూ మనం గుర్తించలేకపోయాం మరుత్తులు తుపానులకు ప్రతిరూపాలు ఇలా రుగ్వేదకాలంలో ప్రకృతి శక్తులకు ప్రాధాన్యత వహించే దేవతలు చాలా మంది ఉన్నారు వీరికి మానవులు చేసే కార్యకలాపాలు ఆపాదించబడ్డాయి

ఉషోదేవతైన ఉషస్, అదితి మొదలైన స్త్రీ దేవతలను కూడా మనం 'రుగ్వేదం'లో చూడవచ్చు కాని, అనాటి పితృస్వామిక వ్యవస్థలో వీరికి పురుష దేవతలకున్న ప్రాధాన్యత ఉండేదికాదు

దేవతారాధనలో అనాడున్న ప్రధాన పద్ధతులు మంత్రాలను చదవటం, యజ్ఞాలను చేయటం రుగ్వేదకాలంలో వేద మంత్రాలకు గొప్ప ప్రాధాన్యత ఉండేది దేవతారాధన వ్యక్తిగతంగానూ, సామూహికంగానూ కూడా ఉండేది మొదట ప్రతి తెగా ఒక ప్రత్యేక దేవుణ్ణి ఆరాధించేవారు ఆ తెగకు చెందిన అందరూ కలిసి సామూహికంగా మంత్రాలు చదివేవారు యజ్ఞాలలో కూడా ఇలాగే జరిగేది తెగలోని ప్రజలు ("జనం") సమర్పించిన హవిస్సులను గ్రహించమని ఇంద్రుణ్ణీ, అగ్నినీ ఆవాహన చేసేవారు కూరగాయలూ, బార్లీ మొదలైన వస్తువుల్ని యజ్ఞాలలో సమర్పించేవారు రుగ్వేదకాలంలో ఆ కార్యక్రమంలో కర్మకాండ విధానాలేవీ ఉండేవి కావు రుగ్వేదకాలంలో శబ్దానికి మంత్రశక్తి ఉందన్న అభిప్రాయం బలంగా ఉండేదికాదు ఈ అభిప్రాయం తరువాతి కాలంలో బలాన్ని పుంజుకుంది రుగ్వేదకాలంలో మానవులు ఎందుకు దేవతల్ని ఆరాధించారు? ఆధ్యాత్మిక ఉన్నతి కోసమో, బాధలనివారణ కోసమో కాదు వారు భగవంతుణ్ణి పిల్లల్నీ ("ప్రజ"), పశువుల్నీ, ఆహారాన్నీ, సంపదనూ, ఆరోగ్యాన్నీ ఇవ్వమని కోరుకునేవారు

అధ్యాయం: 9

# మలి వేదయుగం: రాజ్యానికీ, సామాజిక వ్యవస్థకూ పరిణామం

## మలి వేదయుగంలో విస్తరణ (సుమారు క్రీ పూ 1000-600)

మలి వేదయుగం చరిత్ర ప్రధానంగా 'రుగ్వేదం' తరువాత సంకలనం చేయబడిన వేదగ్రంధాలమీద ఆధారపడి ఉంది వేదమంత్రాల సంకలనాలకు 'సంహితలు' అని పేరు రుగ్వేద సంహిత అత్యంత ప్రాచీనమైన వైదిక గ్రంధం దాని ఆధారంగానే తొలివేదయుగాన్ని అభివర్ణించాము గానంకోసం రుగ్వేద మంత్రాలకు స్వరాన్ని అమర్చారు ఈ కొత్త సంకలనానికి "సామవేదసంహిత" అనిపేరు "సామవేదం" కాకుండా మరి రెండు గ్రంథాలను సంకలనం చేశారు వీటికి "యజుర్వేదం"లో మంత్రాలు మాత్రమే కాకుండా మంత్రాలను చదివేటప్పుడు అనుసరించాల్సిన కర్మకాండను గురించిన విశేషాలు కూడా ఉంటాయి ఈ కర్మకాండకు సంబంధించిన ఆచారాలు ఆవిర్భవించిన సామాజిక, రాజకీయ వాతావరణానికి అద్దం పడతాయి "అధర్వవేదం"లో చెడునూ, వ్యాధులను దూరం చేసుకోవటానికి పనికి వచ్చే తాంత్రిక ప్రక్రియలున్నాయి "అధర్వవేదం"లోని విషయం అనార్యుల నమ్మకాలను గురించీ, ఆచారాలను గురించీ తెలియచేస్తుంది వేదసంహితల తరువాత బ్రాహ్మణాలన్న గ్రంధాలు వరసగా వచ్చాయి వీటినిండా కర్మకాండ సూత్రాలున్నాయి ఆ సూత్రాలు కర్మకాండ వెనక ఉన్న సామాజిక, మత విషయాలను వివరిస్తాయి ఈ మలి వేదయుగ గ్రంధాలన్నీ గంగామైదానంలో సుమారు క్రీ పూ 1000–600 సంవత్సరాల మధ్యకాలంలో సంకలనం చేయబడ్డాయి అక్కడ జరిగిన తవ్వకాలలో అదేకాలానికీ, అదే ప్రాంతానికీ చెందిన దాదాపు 700 జననివాసాలు బయటపడ్డాయి వీటిలో మొదటిసారిగా మానవులు నివసించారు వీటిని "రంగువేసిన మట్టి పాత్రల స్థలాలు" అంటారు అక్కడ నివసించిన ప్రజలు రంగువేసిన మట్టి పాత్రల్ని ఉపయోగించటం చేత వాటికి ఆ పేరు వచ్చింది వీరు ఇనుప ఆయుధాలను కూడా ఉపయోగించారు మలి వేదయుగానికి చెందిన గ్రంధాలూ, రంగువేసిన మట్టి పాత్రల ద్వారా లభించే పురాతత్వ ఆధారాలూ కలిసి యిచ్చే సాక్ష్యాల ఆధారంగా మనం క్రీ పూ మొదటి సహస్రాబ్దంలోని తొలిసగంలో ఉత్తరప్రదేశ్ పశ్చిమభాగంలోనూ, దానికి ఆనుకొని ఉన్న పంజాబ్, హర్యానా, రాజస్థాన్ ప్రాంతాల్లోనూ జనజీవనం ఎలా ఉండేదో తెలుసుకోవచ్చు



రంగువేసిన బూడిదరంగు పాత్రలు

ఆర్యులు పంజాబ్ నుంచీ పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోని గంగా – యమునా మైదానంలోకి వ్యాపించినట్టుగా ఈ గ్రంధాలు చెబుతాయి వీరిలో భరత, పురు అన్న ప్రధాన తెగలకు

చెందిన ప్రజలు కలిసి "కురు" అన్న తెగగా మారారు మొదట వీరు సరస్వతి, ద్రిషద్వతి నదుల మధ్య – అంటే గంగా మైదానం శివార్లలో జీవించేవారు త్వరలోనే "కురు" తెగవారు గంగా సింధూమైదానంలోని ఉత్తర భాగంలో ఉన్న ఢిల్లీనీ, కురుక్షేత్రమూ ("కురు" తెగవారి నివాసం) ఆక్రమించుకున్నారు క్రమక్రమంగా వారు పాంచాల ప్రజలతో చేతులు కలిపారు వారు గంగా – యమునా ప్రాంతాన్ని ఆక్రమించుకొని ఉండేవారు అలా కురు – పాంచాల తెగల ఆధిపత్యం ఢిల్లీకీ, గంగా – యమునా మైదానం పశ్చిమ, మధ్యప్రాంతాలకూ వ్యాపించింది వారు మీరట్ జిల్లాలో ఉన్న హస్తినాపూర్‌లో రాజధానిని ఏర్పాటు చేసుకున్నారు "మహాభారతం"లో ప్రధానాంశమైన కురుక్షేత్ర సంగ్రామానికి కురు తెగవారి చరిత్ర ముఖ్యం ఈ యుద్ధం కౌరవులకూ పాండవులకూ మధ్య (వీరిద్దరూ 'కురు' తెగకు చెందినవారే) క్రీ పూ 950లో జరిగినట్టుగా భావించబడుతూ ఉంది దీని ఫలితంగా కురువంశం తుడిచిపెట్టుకుపోయింది

హస్తినాపూర్‌లో జరిగిన తవ్వకాల్లో క్రీ పూ 900–500 కాలంలో అప్పుడప్పుడే పట్టణ జీవితం ప్రారంభమౌతున్న జననివాసాలు బయటపడ్డాయి అవి "మహాభారతం"లో హస్తినాపుర వర్ణనకు ఎంతమాత్రమూ సరిపోవు భౌతిక జీవితంలో ఎంతో అభివృద్ధి సాంధించిన తరువాత ఎంతో కాలానికి సుమారు క్రీ శ 4 వ శతాబ్దం ప్రాంతంలో ఈ గ్రంథం రాయబడటం అందుకు కారణం మలి వేదయుగం ప్రజలకు కాల్చిన ఇటుకల్ని ఉపయోగించటం దాదాపుగా తెలియదు హస్తినాపురం తవ్వకాల్లో బయటపడిన మట్టి నిర్మాణాలు పెద్దవీకావు, ఎక్కువ కాలం మన్నిక కలిగినవీ కావు హస్తినాపురం వరదల్లో కొట్టుకుపోయిందనీ, కురుతెగ వారు అలహాబాదుకు దగ్గరగా ఉన్న కౌశాంబీ పట్టణానికి తమ నివాసం మార్చారనీ ఒక జనశృతి కూడా ఉంది

ఆధునిక బెరైలీ, బాదూన్, ఫరూకాబాద్ జిల్లాలలో విస్తరించి ఉండిన పాంచాల రాజ్యం రాజులుగా ఉండిన తత్త్వవేత్తలకూ, మతశాస్త్రకారులకూ ప్రసిద్ధి చెందింది

మలి వేదయుగం చివరి దశలో – అంటే క్రీ పూ 600 కాలంలో – వైదిక ప్రజలు మైదానాన్ని దాటి తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోని కోసల ప్రాంతానికీ, ఉత్తర బీహార్ ప్రాంతంలోని విదేహ ప్రాంతానికీ విస్తరించారు కోసల ప్రాంతం రామకథతో ముడిపడి ఉన్నా – దాన్ని గురించిన ప్రస్తావన వైదిక సాహిత్యంలో కనిపించదు కోసలలోనూ, విదేహాలోనూ వైదిక ప్రజలు రాగి పనిముట్లనూ, నలుపు ఎరుపు మట్టి పాత్రలనూ ఉపయోగించిన ప్రజలతో సంఘర్షించవలసి వచ్చింది పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో వారు కాషాయరంగు లేదా ఎరుపురంగు మట్టి పాత్రల్నీ, రాగి పనిముట్లనీ ఉపయోగించినవారితో ఘర్షణకు దిగి ఉండవచ్చు నలుపూ ఎరుపు పాత్రల్ని ఉపయోగిస్తూ జన సాంద్రత ఎక్కువగాలేని పల్లెల్లో నివసిస్తూ ఉండిన ఒకరకమైన ప్రజలతో కూడా వీరు సంఘర్షణకు దిగి ఉండవచ్చు అంటే – వీరు హరప్పా సంస్కృతి చివరి దశకు చెందిన ప్రజలతో అక్కడక్కడా పోరాటానికి దిగి ఉండవచ్చు కానీ ఈ ప్రజలు పూర్తిగా హరప్పా సంస్కృతికి చెందినవారు కూడా కారు వీరు పరిశుద్ధమైన హరప్పా సంస్కృతిని కాక ఏదో సంకర సంస్కృతిని అనుసరించారు వైదిక ప్రజల్ని ఎదిరించినవారు ఎవరో కానీ – వారు విశాలమైన చిక్కటి ప్రాంతంలో నివసించిన వారు కారు గంగామైదానంలో వీరి సంఖ్య ఎక్కువగా ఉన్నట్టుగా కూడా అనిపించటం లేదు వైదిక ప్రజలు తమ విస్తరణ రెండవ దశలో విజయాన్ని సాధించారు అందుకు కారణం వారు ఇనుప ఆయుధాలనూ, గుర్రాలు పూన్చిన రథాలనూ ఉపయోగించటం

## రంగువేసిన బూడిదరంగు పాత్రల - ఇనుపయుగం మలి వేదయుగం ఆర్థిక వ్యవస్థ

పాకిస్తాన్‌లోని గాంధార ప్రాంతంలో క్రీ పూ 1000 కాలం నుంచీ ఇనుము ఉపయోగించబడింది శవాలతోపాటు పాతిపెట్టిన ఇనుప ఆయుధాలు పెద్ద సంఖ్యలో అక్కడ బయటపడ్డాయి ఇలాంటి ఆయుధాలు బెలూచిస్తాన్‌లో కూడా లభించాయి దాదాపు అదేకాలంలో తూర్పు పంజాబ్‌లో, పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లో, రాజస్థాన్‌లో యినుము ఉపయోగం ప్రారంభమైంది క్రీ పూ 800 నుంచీ కూడా పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లో ఇనుముతో చేసిన బాణపు మొనలూ, బల్లెపు మొనలూ ఉపయోగంలో ఉన్నట్టు పురాతత్వ తవ్వకాలు నిరూపిస్తున్నాయి గంగా మైదానం ఉత్తర భాగంలో తమకు ఎదురు నిలిచిన కొద్దిమందిని వైదిక ప్రజలు తమ ఇనుప ఆయుధాల సహాయంతో ఓడించి ఉండవచ్చు వీరు ఇనుప గొడ్డలిని అడవుల్ని నరకటానికి ఉపయోగించి ఉండవచ్చు అక్కడ వర్షపాతం 35–65 సెం మీ మధ్య ఉండటం చేత అడవులు కూడా మరీ దట్టంగా ఉండి ఉండక పోవచ్చు వేదయుగం చివరి దశలో ఇనుమును గురించిన విజ్ఞానం తూర్పు ఉత్తరప్రదేశ్‌కూ, విదేహాకూ వ్యాపించి ఉండవచ్చు ఈ ప్రాంతంలో లభించిన అత్యంత ప్రాచీనమైన ఇనుప పనిముట్లు క్రీ పూ 7 వ శతాబ్దానికి చెందినవి వేదగ్రంధాలలో ఈ లోహాన్ని "శ్యామ" అనీ, "కృష్ణ అయస్" అనీ పేర్కొన్నారు ఆ కాలానికి సంబంధించిన ఇనుప వ్యవసాయ పనిముట్లు చాలా తక్కువగానే లభించినా – మలి వేదకాలపు ప్రజలకు జీవనాధారం వ్యవసాయమే ననటానికి ఎలాంటి సందేహమూ లేదు కొన్ని మలియుగపు

వేదగ్రంథాలు ఆరు, ఎనిమిది, పన్నెండు, ఇరవై నాలుగు ఎద్దుల్ని పూన్చిన నాగళ్ళను గురించి ప్రస్తావించాయి బహుశా ఇది అతిశయోక్తి కావచ్చు కర్ర నాగలితో భూమిని దున్నేవారు గంగామైదానం ఉత్తర భాగంలోని మెత్తని

పొలాల్లో బహుశా దానితో పని జరిగేది యజ్ఞాలలో ఎద్దుల్ని బలి ఇస్తూ ఉండటం చేత తగినన్ని ఎద్దులు లభించేవి కావు వ్యవసాయం – విస్తృతంగా అమలులో ఉన్నా – పాత పద్ధతిలో మాత్రమే జరిగేది "శతపథ బ్రాహ్మణం"

రంగువేసిన బూడిదరంగు
పాత్రల విస్తరణ



పొలందున్నే ఆచారాలను గురించి సుదీర్ఘంగా చర్చిస్తుంది ప్రాచీన గాథల ప్రకారం విదేహ రాజు, సీత తండ్రి అయిన జనక మహారాజు కూడా పొలాన్ని దున్నటంలో చేయికలిపే వాడు ఆ కాలంలో రాజులూ, రాజకుమారులూ కూడా కాయకష్టం చేయటానికి వెనుకాడలేదు కృష్ణుని అన్న అయిన బలరాముణ్ణి "హలధారి" అంటారు తరువాతి కాలంలో ఉన్నత వర్ణాల వారు పొలాలను దున్న కూడదన్న నిషేధం వచ్చింది



అత్రంజికెరలో పి.జి.డబ్లియు పొరల్లో లభించిన ఇనుప వస్తువులు

వేదకాలపు ప్రజలు బార్లీని పండించటం కొనసాగించారు కానీ ఈ యుగంలో వరీ, గోధుమ కూడా వారి ప్రధాన పంట లయ్యాయి పంజాబ్, పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లలోని ప్రజలకు గోధుమ మరికొంతకాలానికి ప్రధాన ఆహారమైంది వేదకాలపు ప్రజలు మొదటిసారిగా గంగామైదానంలోనే వరి పంటను గురించి తెలుసుకున్నారు వరిని వైదిక గ్రంథాలలో "వ్రిహి" అన్నారు హస్తినాపూర్‌లో లభించిన వరి అవశేషాలు క్రీ పూ 8 వ శతాబ్దానికి చెందినవి మతకర్మలలో బియ్యాన్ని ఉపయోగించేవారు గోధుమల్ని ఉపయోగించటం అరుదుగా మాత్రమే జరిగేది అనేక రకాలైన చిక్కుళ్ళను కూడా మలి వేదయుగ ప్రజలు పండించేవారు

మలి వేదయుగంలో అనేక కళలూ, చేతివృత్తులూ అభివృద్ధి చెందాయి క్రీ పూ 1000 నుంచీ కూడా ఇనుమును శుద్ధిచేయటంలోనూ, ఇనుముతో వస్తువుల్ని తయారుచేయటంలోనూ నైపుణ్యం ఉన్నవారిని గురించి ప్రస్తావనలు మనకు వినిపిస్తున్నాయి అంతకు ముందుకాలంలో అంటే క్రీ పూ 1000 కి ముందు – బీహారులోనూ, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోనూ లభించిన అసంఖ్యాకమైన రాగిపనిముట్లు – వైదిక, అవైదిక సమాజాల్లో ఆ ప్రాంతంలో రాగి పనివారు ఉండేవారని సూచిస్తున్నాయి వేదకాలపు ప్రజలు రాజస్థాన్‌లోని ఖేత్రీ గనుల నుంచీ వచ్చిన రాగిని ఉపయోగించి ఉండవచ్చు మొత్తం మీద వేదకాలపు ప్రజలు ఉపయోగించిన తొలిలోహాలలో రాగి ఒకటి రాగివస్తువులు రంగువేసిన బూడిదరంగు మట్టి పాత్రలు లభించిన చోట్లలో లభించాయి వీటిని ప్రధానంగా యుద్ధాలలోనూ, వేటలోనూ ఉపయోగించారు నగలుగా కూడా కొన్నిటిని ఉపయోగించారు

బట్టలు నేయటం స్త్రీలకు మాత్రమే పరిమితంగా ఉన్నా – విస్తృతమైన పరిధిలో జరిగేది చర్మకారవృత్తి, కుమ్మరం, వడ్రంగం బాగా అభివృద్ధి చెందాయి మలి వేదయుగం ప్రజలకు నాలుగు రకాలైన మట్టిపాత్రల్ని తయారుచేయటం తెలుసు అవి నలుపూ – ఎరుపూ పాత్రలు, నల్లని చిత్రాలున్న పాత్రలు, రంగు వేసిన బూడిదరంగు పాత్రలూ, ఎర్రరంగు పాత్రలూ వీటిలో ఎర్రరంగుపాత్రలు అన్నిటికంటే ఎక్కువ ఉపయోగంలో ఉండేవి ఇవి పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లో దాదాపు అన్నిచోట్లలోనూ లభించాయి కానీ ఈ కాలానికి చెందిన ప్రత్యేక పాత్రలు రంగువేసిన బూడిదరంగు పాత్రలు వీటిలో సాసర్లవంటి గిన్నెలూ, ఇతరపాత్రలూ ఉన్నాయి వీటిని మత కర్మలకో, అన్నం తినటానికో లేదా రెండింటికో ఉపయోగించారు వీటిని సమాజంలో పైఅంతస్తులకు ఎదుగుతున్నవారు ఉపయోగించి ఉండవచ్చు రంగుపూసిన బూడిద రంగు పాత్రలు లభించిన పొరల్లో గాజునిక్షేపాలనూ, గాజులనూ చాలా కొద్దిమంది తమ ఉన్నత స్థాయిని తెలిపే గౌరవప్రదమైన వస్తువులుగా ఉపయోగించి ఉండవచ్చు మొత్తం మీద వైదిక గ్రంథాలూ, ఆ చోట్లలో జరిగిన తవ్వకాలూ ఆనాటి ప్రజలు కొన్ని ప్రత్యేక చేతివృత్తుల్ని నేర్చుకొని ఉన్నట్టు నిరూపిస్తాయి మలి వేదగ్రంథాలు నగలు తయారు చేసేవారిని కూడా పేర్కొంటాయి బహుశా వీరు ఆనాటి సమాజంలోని ధనికవర్గాల అవసరాలను తీర్చుతూ ఉండవచ్చు

వ్యవసాయమూ, ఇతరచేతివృత్తులూ మలి వేదయుగం ప్రజలు స్థిరనివాసం ఏర్పరచుకోవటానికి దోహదం చేశాయి తవ్వకాలూ, పరిశోధనలూ ఆనాటి ప్రజల నివాసస్థలాలను గురించి ఒక అభిప్రాయాన్ని ఇవ్వగలవు రంగువేసిన బూడిదరంగు పాత్రలు కురు – పాంచాల రాజ్యమైన

ఢిల్లీ, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోనే కాకుండా, మద్ర రాజ్యమైన పంజాబ్ సరిహద్దుల్లోనూ, మత్స్యదేశమైనరాజస్థాన్‌లో కూడా లభించాయి మొత్తం మీద మనం ఉత్తర గంగా మైదానంలో 700 స్థలాలను గుర్తించవచ్చు వీటిలో హస్తినాపూర్, అత్రంజిఖేర, నో మొదలైన కొన్ని స్థలాల్లో మాత్రమే తవ్వకాలు జరిగాయి ఇక్కడ నివాసాల మందం ఒక మీటరు నుంచీ మూడు మీటర్ల దాకా ఉండటం చేత అవి ఒకటి నుంచీ మూడు శతాబ్దాలకాలం కొనసాగినట్లు అనిపిస్తోంది ఈ స్థలాలు అంతకు ముందు ప్రజలు నివసించిన స్థలాలు కావు, పూర్తిగా కొత్తవి ఇక్కడి ప్రజలు మట్టితో చేసిన ఇటుకలతో కట్టిన ఇళ్ళలోనూ, కర్రలతో కట్టిన పూరిళ్ళలోనూ జీవించారు ఈ ఇళ్ళు పేదరికాన్ని సూచిస్తూ ఉన్నా – అక్కడ బయటపడ్డ పొయ్యిలూ, తృణధాన్యాలూ – వీరు వ్యవసాయాన్ని అనుసరించారనీ, స్థిరంగా ఒకచోట నివసించారనీ చాటుతున్నాయి రంగు వేసిన బూడిద రంగు పాత్రల కాలానికి చెందిన ఈ ప్రజలు మలి వేదయుగం ప్రజలేనని కూడా అనిపిస్తోంది వీరు కేవలం కర్రనాగలితో వ్యవసాయం చేయటంచేత ఇతర వృత్తులలో ఉన్నవారికికూడా సరిపడే ప్రమాణంలో ఆహార ధాన్యాలను పండించలేకపోయారు అందుచేత రైతులు పట్టణాల అభివృద్ధికి పెద్దగా దోహదం చేయలేకపోయారు

"నగరం" అన్న పదం మలి వేదయుగానికి చెందిన గ్రంథాల్లో కనిపించినప్పటికీ ఆ యుగం చివరిదశలో పట్టణ జీవితం ప్రారంభమైందని చెప్పటానికి అవసరమైన సాక్ష్యాధారాలు లీలగా మాత్రమే కనిపిస్తున్నాయి హస్తినాపూర్, కౌశాంబి (అలహాబాద్ సమీపంలో ఉంది) పట్టణాలను వేదయుగం చివరిదశలో అప్పుడప్పుడే ప్రారంభమైన పట్టణాలుగా పేర్కొనవచ్చు వీటిని ఆదిమ నగరాలు అనవచ్చు వేదగ్రంథాలలో సముద్రాలను గురించీ, సముద్రప్రయాణాన్ని గురించీ ప్రస్తావనలున్నాయి కొత్త చేతివృత్తుల ఆధారంగా ఏదో ఒక రకమైన వ్యాపారం జరిగి ఉండవచ్చునని ఈ ప్రస్తావనలు సూచిస్తాయి

మొత్తం మీద మలి వేదయుగంలో ప్రజల భౌతిక జీవనంలో గొప్ప అభివృద్ధి జరిగింది పశుపాలనా, సంచార జీవితంలాంటి పద్ధతులూ పాతవై పోయాయి వ్యవసాయం ప్రధాన జీవనాధారమైంది స్థిరనివాసం, విశ్రాంత జీవనం ప్రారంభమైనాయి చేతి వృత్తులూ, హస్తకళలూ అదనపు సహాయం చేయగా, వేదకాలపు ప్రజలు ఉత్తరగంగామైదానంలో స్థిరపడ్డారు ఈ మైదానాలలో నివసించిన ప్రజలు తమ అవసరాలకు సరిపోయినంత పండించారు అంతేకాకుండా, తమ పంటలో కొంత భాగాన్ని వారి నాయకుల, రాజకుమారుల, పురోహితుల పోషణ కోసం ఇవ్వగలిగారు

## రాజకీయ వ్యవస్థ

మలి వేదయుగంలో ప్రజాదరణ పొందిన సభలకు ప్రాముఖ్యత లేకుండా పోయింది వీటి స్థానంలో రాజ్యాధికారం పుంజుకొంది "విధాత" పూర్తిగా అదృశ్యమైపోయింది "సభలూ", "సమితులూ" కొనసాగినా – వాటి స్వభావం మారిపోయింది నాయకులూ, ధనిక రాజబంధువులూ వాటిమీద పెత్తనం చేయటం ప్రారంభించారు సభల్లో స్త్రీలు పాల్గొనటం నిషేధించబడింది ఇప్పుడు వాటిమీద రాజబంధువుల, బ్రాహ్మణుల పెత్తనం ఏర్పడింది

విశాలమైన రాజ్యాలు ఏర్పడటం చేత నాయకుడికి లేదా రాజుకు అధికారాలు పెరిగాయి తెగమీద అధికారం ఒక ప్రాంతం మీద అధికారంగా పరిణామం చెందింది రాజులు తెగలను పరిపాలించారు కానీ వీరిలో బలవంతులైన తెగలు విశాలప్రాంతాలను ఆక్రమించుకున్నాయి ఆ ప్రాంతంలో ఆ తెగతోపాటు ఇతర తెగలు కూడా ఉండేవి ప్రాంతానికి, అక్కడ మొట్టమొదట స్థిరనివాసం ఏర్పరచుకున్న తెగ పేరే ఉండేది కాలక్రమాన ప్రాంతం పేరూ, తెగ పేరూ కూడా ప్రచారంలోకి వచ్చాయి మొదట "పాంచాల" అన్నది ఒక ప్రాంతంలో నివాసం ఏర్పరచుకున్న ప్రజల తెగ పేరు తరవాతి కాలంలో అది ప్రాంతంపేరుగా ప్రచారంలోకి వచ్చింది మొదటిసారిగా ప్రాంతాన్ని సూచిస్తూ "రాష్ట్రం" అన్న పదం ఈ కాలంలోనే ఉపయోగించబడింది

మలి వేదయుగానికి చెందిన గ్రంథాల్లో రాజునూ లేదా నాయకుణ్ణీ ఎన్నుకున్న సాక్ష్యాధారాలు లీలగా కనిపిస్తాయి శారీరకంగానూ ఇతర లక్షణాల్లోనూ ఉత్తమోత్తముడైన వ్యక్తిని రాజుగా ఎన్నుకునేవారు అతడు బంధువుల నుంచీ "బలి" అన్న పేరుతో బహుమతుల్ని పొందేవాడు "విశ్" అని పిలవబడుతూ ఉన్న సాధారణ ప్రజలు కూడా బహుమతుల్ని ఇచ్చేవారు కానీ అలా ఎన్నుకోబడిన రాజు రాజరికాన్ని వంశపారంపర్యంగా మార్చి – బహుమతుల్ని స్వీకరించటాన్నీ, ఇతర వసతుల్ని అనుభవించటాన్నీ తన కుటుంబానికున్న హక్కుగా కొనసాగించే ప్రయత్నం చేసేవాడు ఇలా జరిగినప్పుడు రాజరికం అతనిపెద్ద కొడుక్కు దక్కేది కానీ అన్ని సందర్భాలలో ఈ అధికార మార్పిడి సున్నితంగానే జరగదు ధర్మరాజు పెద్దనాన్న కుమారుడైన దుర్యోధనుడు రాజ్యాధికారాన్ని గుంజుకున్నట్టుగా "మహాభారతం" చెబుతోంది రాజ్యం కోసమే కౌరవులూ, పాండవులూ తమ కుటుంబాలను సర్వనాశనం చేసుకున్నారు భారతయుద్ధం రాజ్యాధికారానికీ రక్తసంబంధానికీ పొత్తులేదని చెబుతోంది

యజ్ఞయాగాలు రాజు పలుకుబడిని వృద్ధిచేసేవి రాజులు సాధారణంగా రాజసూయ యాగాన్ని చేసేవారు దానివల్ల తమకు అత్యున్నతమైన శక్తి లభిస్తుందని నమ్మేవారు వారు

అశ్వమేధ యాగాన్ని కూడా చేసేవారు తమ గుర్రంఅటంకం లేకుండా తిరిగినంతమేర తమ రాజ్యంగా భావించేవారు రాజులు వాజపేయాన్ని కూడా నిర్వహించేవారు ఇందులో జరిగే పందెంలో రాజుగారి రథం అతని బంధువుల రథాల్ని జయించాలి ఈ ఈ యజ్ఞయాగాలు ప్రజలలో రాజ గౌరవాన్నీ, ప్రతిష్ఠనూ పెంచేవి

ఈ దశలో పన్నులనూ, కప్పాలనూ వసూలుచేయటం అలవాటైనట్టుగా కనిపిస్తోంది వీటిని "సంగ్రిహిత్రి" అన్న అధికారి వద్ద చెల్లించవలసి వచ్చేది గొప్ప యజ్ఞయాగాలు జరిగినప్పుడు రాజులు దాన ధర్మాలు పెద్ద ఎత్తున చేసేవారనీ, అన్ని వర్గాల ప్రజలకు సంతృప్తిగా అన్నదానం చేసేవారనీ పురాణాలు చెబుతున్నాయి పరిపాలనను నిర్వహించటంలో రాజుకు పురోహితుడూ, సేనానీ, పట్టపురాణీ, మరికొందరు ఉన్నతాధికారులూ సాయం చేసేవారు కిందిస్థాయిలో పరిపాలనను గ్రామసభలు చూసుకునేవి బహుశా వీటిమీద అధిపత్యంలో ఉన్న తెగల నాయకులు అధికారాన్ని కలిగి ఉండేవారు ఈ గ్రామ సభలు స్థానిక నేరాలను కూడా విచారించేవి మలి వేదయుగంలో కూడా రాజుకు స్థిరమైన సైన్యం ఉండేదికాదు తెగలోని ప్రజలతో సైనిక పటాలాలను ఏర్పాటు చేసుకునేవారు యుద్ధంలో విజయాన్ని కోరుతూ రాజు ప్రజలతో కలిసి (ఒకే కంచంలో) భోజనం చేయాలని ఒక ఆచారం చెబుతోంది

## సామాజిక వ్యవస్థ

మలి వేదయుగం సమాజం బ్రాహ్మణులు, రాజన్యులు (క్షత్రియులు) వైశ్యులు, శూద్రులు అన్న నాలుగు వర్ణాలుగా విభజించబడింది మొట్టమొదట బ్రాహ్మణులు పదహారు పౌరోహిత వర్గాలలో ఒకరు మాత్రమే కాలక్రమాన వీరు ఇతర పురోహిత వర్గాలను తోసివేసి, ప్రధానమైన వర్గంగా తయారయ్యారు వీరు యజ్ఞయాగాలను తమకోసం చేసేవారు, ఇతరులకోసం చేయించేవారు వ్యవసాయానికి సంబంధించిన పండుగలను నిర్వహించేవారు తమ పోషకులైన రాజుల విజయం కోసం ప్రార్థనలు చేసేవారు దానికి ప్రతిగా రాజు తాను వారికి ఎలాంటి హానీ చేయనని ప్రతిజ్ఞ చేసేవాడు అప్పుడప్పుడూ బ్రాహ్మణులు యుద్ధవీరులూ, రాజబంధువులూ అయిన రాజన్యులతో అధిపత్యం కోసం సంఘర్షణకు దిగేవారు కానీ కిందివర్గాలతో సంఘర్షణ వచ్చినప్పుడు మాత్రం ఇద్దరూ కలిసిపోయేవారు మలి వేదయుగం చివరి దశనుంచీ సమాజాన్ని పరిపాలించటం కోసం వీరిద్దరూ ఒకరితో ఒకరు సహకరించుకోవాలన్న విషయం నొక్కి చెప్పబడుతూ వచ్చింది

వైశ్యులు సాధారణ ప్రజలు వీరు వ్యవసాయం, పశు పాలనలాంటి ఉత్పత్తి కార్యక్రమాలను నిర్వహించాలి వీరిలో కొందరు చేతివృత్తుల్నికూడా అనుసరించారు వేదయుగం చివరి దశలో వీరు వ్యాపారంలోకి కూడా దిగారు మలి వేదయుగంలో పన్నులు చెల్లించేజనం వైశ్యులు మాత్రమే. క్షత్రియులు, వైశ్యులు చెల్లించిన పన్నులమీద జీవించేవారుగా ఆనాటి సాహిత్యంలో చిత్రించబడ్డారు అధికసంఖ్యలో ఉన్న ఇతర ప్రజల్ని కప్పాలూ, పన్నులూ చెల్లించేలా లొంగదీసే కార్యక్రమం చాలాకాలం కొనసాగింది తిరగబడే స్వభావం కలిగిన ప్రజలు ("విశ్" లేదా "వైశ్య") రాజులకూ, వారి సమీప బంధువులైన రాజన్యులకూ లొంగేలా చేయటానికి అనేక మతకర్మలను విధించారు ఇది పురోహిత వర్గం సహాయంతో జరిగింది సాధారణ ప్రజల, వైశ్యుల ఖర్చుతో పురోహితవర్గం కూడా బలపడింది పై మూడు వర్ణాల వారికే వేదోక్తంగా 'ఉపనయనం' (యజ్ఞోపవీతాన్ని ధరించటం) అర్హత కల్పించబడింది నాలుగవ వర్ణానికి ఆ అర్హత లేదు దీంతో శూద్రుల మీద విధించబడిన అనర్హతలు కార్యరూపం దాల్చాయి

రాజన్య సంప్రదాయానికి ప్రతినిధి అయిన రాజు మిగిలిన మూడు వర్ణాలమీదా తన అధికారాన్ని ప్రతిష్ఠించుకోవటానికి ప్రయత్నించాడు మలి వేదయుగానికి చెందిన గ్రంథమైన "ఐతరేయబ్రాహ్మణం" ప్రకారం బ్రాహ్మణుడు తన జీవన భృతిని రాజునుంచే పొందేవాడు అతడు రాజు ఇచ్చే బహుమతుల్ని స్వీకరించాలి రాజు బ్రాహ్మణునికిచ్చే బహుమతుల్ని తనకు ఇష్టం లేకపోతే ఆపివేయవచ్చు వైశ్యుడు పన్నులు చెల్లించేవాడు అతణ్ణి రాజు కొట్టవచ్చు అణగదొక్కవచ్చు అందరికంటే హీనమైన స్థానం శూద్రులది అతడు భృత్యుడు ఇతరులకు, అతనిచేత పని చేయించుకునే అధికారమూ, కొట్టే అధికారమూ ఉంటాయి

సాధారణంగా మలి వేదయుగానికి చెందిన గ్రంథాలు పై మూడు వర్ణాలకూ, శూద్రులకూ మధ్య ఒక సరిహద్దు గీతను గీస్తాయి కానీ రాజు పట్టాభిషేకానికి చెందిన సామాజిక కార్యక్రమాల్లో శూద్రులు పాల్గొన్నట్టు ఆధారాలున్నాయి వీరు బహుశా మూల ఆర్యన్ తెగకు చెందినఅవశేషాలవంటి వారు కావచ్చు "రథకారుడు" (రథాలు నిర్మించేవారు) వంటి కొందరు చేతివృత్తుల వారికి సమాజంలో ఉన్నత స్థానం ఉండేది వీరికి ఉపనయనం చేసుకునే అర్హత కూడా ఉండేది కాబట్టి మలి వేదయుగం కాలానిక్కూడా వర్ణతారతమ్యాలు మరీ ఎక్కువగా ఉండేవి కావని తెలుస్తోంది

ఈ కాలంలో కుటుంబంలో తండ్రి ప్రాబల్యం పెరగటం కనిపిస్తుంది అతడు తన కొడుకును కూడా వారసుడు కాదని తిరస్కరించవచ్చు రాజకుటుంబాలలో పెద్ద కొడుక్కు రాజ్యాధికారం సంక్రమించే సంప్రదాయం బలపడుతోంది పూర్వీకులలో పురుషుల్ని ఆరాధించే సంప్రదాయం ప్రారంభ

మైంది స్త్రీల స్థానం నెమ్మదిగా దిగజారసాగింది కొందరు స్త్రీలు తాత్త్విక చర్చల్లో పాల్గొన్నా, మరికొందరు రాణులు పట్టాభిషేకాల్లో పాలుపంచుకున్నా సాధారణంగా స్త్రీలస్థానం పురుషులకంటే తక్కువగా ఉండేది

మలి వేదయుగంలోనే "గోత్రసంప్రదాయం" కూడా ప్రారంభమైంది "గోత్రం" అన్నపదానికి గోశాల, లేదా ఒక తెగకు చెందిన గోవుల నన్నిటినీ ఉంచే చోటు అని అర్థం కాలక్రమాన వంశానికి మూలపురుషుణ్ణి సూచించే పదంగా ఇది పరిణామం చెందింది తరువాతి కాలంలో ఒకే గోత్రానికి చెందిన కుటుంబాల మధ్య వివాహాలను (సగోత్రవివాహాలు) నిషేధించటం ప్రారంభించారు

వేదకాలంలో మానవ జీవితాన్ని 'ఆశ్రమాలు' అన్న నాలుగు దశలుగా విభాగించటానికి గొప్ప ప్రాచుర్యం లేదు వేదయుగం తరువాత వచ్చిన గ్రంథాలలోనే ఆశ్రమాల ప్రస్తావన ఉంది బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం అన్నవి ఈ నాలుగు ఆశ్రమాలు మలి వేదయుగానికి చెందిన గ్రంథాల్లో మొదటి మూడు ఆశ్రమాలు మాత్రమే పేర్కొనబడ్డాయి నాలుగవ ఆశ్రమం (సన్యాసం) ఉండేది కానీ, ప్రసిద్ధంగా మాత్రం ఉండేది కాదు వేదకాలం తరువాత కూడా అన్ని వర్ణాలకూ చెందిన ప్రజలు గృహస్థ ధర్మాన్నే ఎక్కువగా పాటించారు

## దేవతలు, యజ్ఞాలు, తత్త్వశాస్త్రం

మలి వేదయుగంలో గంగామైదానం ఉత్తర భాగం ఆర్యసంస్కృతికీ, బ్రాహ్మణ ప్రాబల్యానికీ పంటపొలంగా తయారైంది ఈ ప్రాంతంలోని కురు – పాంచాల రాజ్యంలో మొత్తం వేదసాహిత్యం సంకలనం చేయబడింది ఈ సంస్కృతికి యజ్ఞం కేంద్రం దానికి అనుబంధంగా అనేక కర్మలూ, ఆచార నియమాలూ ఉండేవి

ఋగ్వేదంలోని అధిదేవతలైన ఇంద్రుడూ, అగ్నీ తమ ప్రాబల్యాన్ని తరువాతి కాలంలో పోగొట్టుకున్నారు మలి వేదయుగంలో సృష్టికర్తయిన ప్రజాపతికి అత్యున్నత స్థానం ఇవ్వబడింది ఋగ్వేదకాలానికి చెందిన కొందరు అప్రధాన దేవతలకు ప్రాధాన్యత వచ్చింది పశువుల దేవతైన రుద్రునికి మలి వేదయుగంలో ప్రాధాన్యత పెరిగింది ఋగ్వేదకాలంలో సగం సంచార జీవనులుగా ఉన్న వారు, ఇప్పుడు స్థిరనివాసం ఏర్పరచుకొని ఉండటం చేత విష్ణువు వారికి రక్షకుడయ్యాడు దీనికితోడు దైవత్వానికి చిహ్నాలుగా కొన్ని వస్తువుల్ని పూజించటం కూడా మలి వేదయుగంలో ప్రారంభమైంది విగ్రహారాధన లక్షణాలు కూడా ఆ కాలంలోనే మొదలయ్యాయి సమాజం బ్రాహ్మణులు, రాజన్యులు, వైశ్యులు, శూద్రులు అన్న వర్గాలుగా చీలిపోయిన తరువాత కొన్ని వర్గాలవారికి సొంత దేవతలు ఏర్పడ్డారు ఋగ్వేదకాలంలో ఆర్యుల ప్రధానవృత్తి పశుపాలనే అయినా పశుపాలకుడైన పుషన్ శూద్రుల దేవు డయ్యాడు

అంతకు క్రితంలాగే ప్రజలు భౌతిక లాభాలకోసమే దేవతల్ని ఆరాధించేవారు కానీ ఆరాధించే పద్ధతి మాత్రం బాగా మారిపోయింది ప్రార్థనల్ని గానం చేసేవారు కానీ అది దేవతల్ని సంతృప్తిపరచటానికి ఉపయోగించే ప్రధానమైన పద్ధతిగా ఉండేదికాదు యజ్ఞాలకు ప్రాధాన్యత పెరిగింది కానీ అవి సార్వజనికంగానూ, కౌటుంబికంగానూ మారాయి సార్వజనిక యజ్ఞాల్లో రాజుతోబాటు మొత్తం సమాజం పాల్గొనేది సమాజం చాలావరకూ తెగకు సంబంధించినదిగానే ఉండేది ఈ కాలంలో ప్రజలు స్థిరనివాసాన్ని ఏర్పాటు చేసుకోవటంచేతా కుటుంబాలను ఒక పద్ధతిలో నిర్వహించుకోవటంచేతా వ్యక్తిగతంగా యజ్ఞాలు చేసుకోవటానికికూడా విలు కలిగింది వీరు అగ్నికి బలులూ, నైవేద్యాలూ సమర్పించినప్పుడల్లా అవి యజ్ఞం రూపాన్ని ధరించాయి

యజ్ఞాల్లో విస్తారంగా జంతుబలి జరిగి, పశుసంపదకు నష్టం జరిగేది అతిథిని ఆ కాలంలో "గోఘ్న" (అంటే గోమాంసం అరగించేవాడు) అని పిలిచేవారు

యజ్ఞాలలో యజ్ఞ సూత్రాలను చాలా జాగ్రత్తగా, తప్పులేకుండా ఉచ్చరించవలసి ఉండేది యజ్ఞాన్ని చేస్తున్న వ్యక్తిని "యజమానుడు" అనేవారు యజ్ఞం యొక్క ఫలితం మంత్రాలను తప్పులేకుండా ఉచ్చరిస్తే ఉద్భవించే పదాల శక్తిమీద ఆధారపడి ఉంటుందని నమ్మేవారు వైదిక ఆర్యులు అనుసరించిన కొన్ని ఆచారాలను ఇండో – యూరోపియన్లు అందరూ అనుసరించారు కానీ అనేక ఆచారాలూ, మతకర్మలూ భారతదేశంలోనే ప్రారంభమయ్యాయి

ఈ సూత్రాలనూ, యజ్ఞాలనూ కనిపెట్టినవారూ, అభివృద్ధి చేసినవారూ బ్రాహ్మణులనబడే పురోహితులు వీరు పౌరోహిత జ్ఞానం మీదా, నైపుణ్యం మీదా గుత్తాధిపత్యాన్ని ప్రకటించారు వీరు అనేక మతకర్మల్ని సృష్టించారు వీటిలో కొన్ని అనార్యులవద్దనుంచీ కూడా గ్రహించారు ఈ మతకర్మలను సృష్టించటానికీ, అభివృద్ధిచేయటానికీ కారణం ఏమిటో స్పష్టంగా తెలియదు కానీ ధనాశ కారణం కాదని కొట్టి పారవేయలేము రాజసూయ యాగం చేయించిన ప్రధాన పురోహితునికి 240,000 గోవుల్ని దక్షిణగా ఇచ్చినట్టు ఆధారాలున్నాయి

గోవులతోపాటు బంగారాన్నీ, బట్టలనూ, గుర్రాలనూ కూడా పురోహితునికి ఇచ్చేవారు కొన్ని సందర్భాల్లో రాజ్యంలో కొంత భాగాన్ని కూడా దక్షిణగా ఇవ్వమని అడిగేవారు కానీ మలి వేదయుగం కాలానికి యజ్ఞం చేయించినందుకు దక్షిణగా భూమిని ఇచ్చే ఆచారం బాగా

పొదుకోలేదు అశ్వమేధం చేసినప్పుడు నాలుగు దిక్కుల లోనూ పురోహితునికి భూదానం చేయాలని "శతపథ బ్రాహ్మణం" చెబుతుంది ఇదే జరిగితే రాజుకు ఏం మిగులుతుంది? సాధ్యమైనంత భూమిని గుంజుకోవాలన్న పురోహితుల కోరికకు ఈ నియమం అడ్డం పడుతుంది మొత్తంమీద పెద్ద మొత్తంలో పురోహితులకు భూమిని బదిలీ చేసినట్టుగా అనిపించటం లేదు పురోహితులకు బదిలీ చేయబడ్డ భూమి తాను బదిలీ కానని తిరస్కరించినట్టుగా కూడా ఒక ప్రస్తావన ఉంది

క్రీ. పూ 600 ప్రాంతంలో – అంటే, వేదయుగం చివరిదశలో – పాంచాల, విదేహ రాజ్యాలలో పౌరోహితుల అధిపత్యానికీ, యజ్ఞ యాగాదుల వంటి మత కర్మలకూ వ్యతిరేకంగా తీవ్రమైన ప్రతిస్పందన వచ్చింది ఈ దశలోనే ఉపనిషత్తుల సంకలనం జరిగింది ఈ తాత్త్వికగ్రంథాలు యజ్ఞయాగాలను విమర్శించాయి సరైన విశ్వాసమూ, సరైన విజ్ఞానమూ ఉండవలసిన అవసరాన్ని నొక్కి చెప్పాయి ఆత్మజ్ఞానం ఉండాలనీ, ఆత్మకూ బ్రహ్మకూ ఉన్న సంబంధాన్ని సరిగ్గా అర్థం చేసుకోవాలనీ ఉపనిషత్తులు నొక్కి చెప్పాయి "బ్రహ్మ" అనాటి బలవంతులైన రాజులతో పోల్చదగిన బలమైన శక్తిగా రూపొందింది పాంచాల, విదేహ ప్రాంతాల్లోని కొందరు క్షత్రియరాజులు ఈ రకమైన అలోచనా విధానాన్ని అలవాటు చేసుకున్నారు పురోహితుల అధిపత్యంలో ఉన్న మతాన్ని సంస్కరించటానికి అవసరమైన వాతావరణాన్ని కల్పించారు వీరి బోధనలు స్థిరత్వాన్నీ, ఐక్యతనూ సాధించటానికి దోహదం చేశాయి ఆత్మ మార్పు లేనిదనీ, ధ్వంసం చేయటానికి వీలులేనిదనీ, మరణం లేనిదనీ చెప్పటం క్షత్రియుల రాజరిక శక్తి అభివృద్ధి చెందటానికి అవసరమైన సామాజిక స్థిరత్వాన్ని ప్రసాదించింది ఆత్మ, బ్రహ్మలమధ్య ఉండవలసిన సంబంధాన్ని నొక్కి చెప్పటంచేత తమకంటే ఉన్నతమైన అధికారంపట్ల ప్రజల విధేయత వృద్ధి చెందింది

మలి వేదయుగంలో కొన్ని ముఖ్యమైన మార్పులు వచ్చాయి ప్రాంతీయ రాజ్యాలు ప్రారంభమయ్యాయి. యుద్ధాలు పశుసంపదకోసంమాత్రమే కాకుండా రాజ్య విస్తరణకోసం కూడా జరగటం మొదలైంది ప్రసిద్ధమైన మహాభారతయుద్ధం ఈ కాలంలోనే జరిగినట్టుగా చెబుతారు. ప్రాథమికంగా పశుపాలన మీద ఆధారపడ్డ తొలి వేదయుగ సమాజం ఈ కాలంలో వ్యావసాయిక సమాజంగా పరిణామం చెందింది పశుపాలకులు తమకౌలుతో రాజును పోషించే వ్యవసాయదారులయ్యారు రాజులు తమ తెగలోని రైతుల శ్రమతో అభివృద్ధి చెందారు వీరు పురోహితులకు పుష్కలంగా బహుమతులిచ్చి, వారు సామాన్య ప్రజలైన వైశ్యులకు వ్యతిరేకంగా తమను బలపరిచేలా చేసుకున్నారు అనాటికింకా శూద్రులు దాసులే తెగలోని సమాజం వర్ణాల ఆధారంగా విభజించబడింది కానీ వర్ణ తారతమ్యాలను మరీ ఎక్కువ దూరం తీసుకెళ్ళటానికి వీలు లేకపోయింది బ్రాహ్మణుల వెన్నుదన్ను ఉన్నా క్షత్రియులు ఒక రాజ్య వ్యవస్థ (స్టేట్)ను ఏర్పాటు చేయలేకపోయారు రాజ్య వ్యవస్థను ఏర్పాటు చేయాలంటే పన్నుల వ్యవస్థా, జీతాలను తీసుకునే సైన్యమూ తప్పకుండా ఉండాలి సైన్యాన్ని పోషించాలంటే మళ్ళీ పన్నులుండాలి కానీ అనాటి వ్యవసాయపద్ధతి కౌలూ, పన్నులూ అవసరమైనంత మొత్తంలో చెల్లించగల స్థితిలో ఉండేది కాదు

★ ★ ★

# అధ్యాయం: 10

# జైనమతం - బౌద్ధమతం

క్రీ. పూ 6 వ శతాబ్దంలో గంగామైదానంలో మత శాఖలు అసంఖ్యాకంగా వెలిశాయి మనకు అలాంటివి 62 తెలుసు ఈశాన్య భారతదేశంలో వేరు వేరు ప్రజలు అనుసరించిన వేరు వేరు ఆచార వ్యవహారాలలో నుంచీ వీటిలో ఎక్కువభాగం ఉద్భవించాయి వీటిలో జైనమతం, బౌద్ధమతం ప్రధానమైనవి ఇవి అత్యంత బలీయమైన మత సంస్కరణోద్యమాలుగా ఉద్భవించాయి

## పుట్టుకకు కారణాలు

వేదకాలం తరువాత సమాజం బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అన్న నాలుగు వర్ణాలుగా చీలిపోయింది ప్రతి వర్ణానికీ కచ్చితమైన బాధ్యతలు వుండేవి వర్ణం పుట్టుక వల్లనే వస్తుందని నొక్కి చెప్పినా మొదటి రెండు వర్ణాలకూ కొన్ని ప్రత్యేకమైన అదనపు హక్కులుండేవి పురోహితులుగా, ఉపాధ్యాయులుగా బ్రాహ్మణులకు బాధ్యత అప్పగించబడింది వీరు సమాజంలో అత్యున్నతస్థానం తమకే దక్కాలన్నారు అదికాకుండా సమాజంలో అనేక ప్రత్యేక హక్కులు తమకు ఉండాలన్నారు బహుమతుల్ని స్వీకరించటం, పన్నులు చెల్లించటం, శిక్షలు అనుభవించటం నుంచీ మినహాయింపు ఉండాలన్నారు అలాంటి ప్రత్యేకమైన హక్కుల్ని వారు అనుభవించినట్టుగా వేదకాలం తరువాత వచ్చిన గ్రంథాల్లో అనేక ఉదాహరణలున్నాయి

వర్ణవ్యవస్థలో రెండవస్థానం క్షత్రియులది వీరు యుద్ధాలు చేశారు తమ ప్రాంతాన్ని పరిపాలించారు రైతుల వద్దనుంచీ వసూలు చేసిన పన్నులమీద జీవించారు వైశ్యులు వ్యవసాయాన్నీ, పశుపాలననూ, వ్యాపారాన్నీ అనుసరించారు వీరే ప్రధానమైన పన్ను చెల్లింపుదారులు కానీ పై రెండు వర్ణాలవారితోపాటు వీరికి కూడా ద్విజత్వం (అంటే ఉపనయనం చేసుకునే అర్హత) కల్పించబడింది ద్విజుడు యజ్ఞోపవీతాన్ని ధరించవచ్చు, శూద్రుల్లా కాకుండా వేదాలను కూడా చదవ వచ్చు శూద్రులు పై మూడు వర్ణాలవారికీ దాస్యం చేసే వారు స్త్రీలతో పాటు వీరికి కూడా వేదాధ్యయన అర్హత లేదు ఆ కాలంలో వీరు ఇంటిపనులూ, వ్యవసాయపు పనులూ చేసే బానిసలుగా, కూలీలుగా చేతివృత్తుల వారుగా కనిపిస్తారు వీరిని క్రూరులుగా, దురాశాపరులుగా, దొంగతనాలు చేసే అలవాటు ఉన్నవారుగా



విద్ధాంక నాణాలు

ఆనాటి గ్రంధాలు చిత్రించాయి వీరిలో కొందరిని అస్పృశ్యులుగా చూశారు వర్ణం ఉన్నతమైనకొద్దీ మనుషులు ఎక్కువ పవిత్రులుగా గుర్తించబడ్డారు వర్ణం తక్కువైనకొద్దీ అతనికిచ్చే శిక్షకూడా ఎక్కువయ్యేది

వర్ణం కారణంగా చీలిపోయిన సమాజంలో సహజంగానే ఉద్రిక్తతలు పుట్టుకొచ్చాయి వైశ్యులూ, శూద్రులూ ఈ వ్యవస్థకు ఎలా ప్రతిస్పందించారో తెలుసుకోవటానికి మనకు ఆధారాలు లేవు పరిపాలకులైన క్షత్రియులు మాత్రం బ్రాహ్మణుల కర్మకాండ ప్రాబల్యానికి వ్యతిరేకంగా తీవ్రంగా ప్రతిస్పందించారు వర్ణం పుట్టుకతోనే వస్తుందన్న భావానికున్న ప్రాధాన్యతకు వ్యతిరేకంగా వీరు ఒక విధమైన నిరసనోద్యమాన్ని నడిపినట్టుగా అనిపిస్తోంది తమకు ప్రత్యేక హక్కులుండాలన్న బ్రాహ్మణ పురోహిత వర్గానికి వ్యతిరేకంగా క్షత్రియులు చేసిన తిరుగుబాటు కొత్తమతాలు పుట్టటానికి ఒక కారణం జైనమతాన్ని స్థాపించిన వర్ధమాన మహావీరుడూ, బౌద్ధమతాన్ని స్థాపించిన గౌతమబుద్ధుడూ క్షత్రియ వర్ణానికి చెందినవారే వీరిద్దరూ కూడా బ్రాహ్మణాధిపత్యాన్ని సవాలు చేసినవారే

ఈ మతాలు పుట్టటానికి అసలు కారణం ఈశాన్య భారతదేశంలో వ్యవసాయ ఆర్థిక విధానం ప్రవేశించటం ఈశాన్య భారతదేశం, తూర్పు ఉత్తర ప్రదేశ్, ఉత్తర దక్షిణ బీహారు ప్రాంతాల్లో సగటు వర్షపాతం 100 సెం మీ ఉండేది ఈ ప్రాంతాలు ఆక్రమించుకోబడటానికి ముందు చిక్కని అడవి ప్రాంతాలుగా ఉండేవి దట్టమైన అడవుల్ని నిర్మూలించటానికి ఇనుపగొడ్డళ్ళు కావలసి వచ్చాయి ఈ ప్రాంతంలో క్రీ పూ 600 సంవత్సరాలకు పూర్వం కొందరు ప్రజలు నివసించినా – వారు రాతితోనూ, రాగితోనూ చేసిన పనిముట్లను మాత్రమే ఉపయోగించారు వారు నదీజలాలు కోసుకుపోయి, అడవులు లేకుండా పోయి, జననివాసానికి యోగ్యంగా తయారైన ప్రాంతాల్లో అనిశ్చితమైన, ప్రమాదకరమైన జీవితాన్ని జీవించారు మధ్యగంగా మైదానంలో క్రీ పూ 600 తరువాతనే పెద్ద ఎత్తున జననివాసాలు ప్రారంభమయ్యాయి ఈ ప్రాంతంలో అప్పుడే ఇనుము ఉపయోగం ప్రారంభమైంది ఇది తేమ స్వభావం కలిగిన నేల కావటంచేత తొలినాళ్ళ ఇనుప పనిముట్లు ఎక్కువగా ఈనాడు లభించటం లేదు కానీ, క్రీ పూ 600–500 కాలానికి చెందిన పొరల్లో కొన్ని గొడ్డళ్ళు లభించక పోలేదు ఇనుప పనిముట్లను ఉపయోగించటంచేత అడవుల్ని నిర్మూలించటం, వ్యవసాయం, స్థిరనివాసం సాధ్యమయ్యాయి ఇనుప కర్రున్న నాగళ్ళ మీద ఆధారపడ్డ వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థ ఎద్దుల్ని ఉపయోగించటం మీద ఆధారపడి ఉంటుంది అది పశుసంవర్ధక పద్ధతులు తెలియకపోతే సాధ్యం కాదు కానీ పశువుల్ని విచక్షణా రహితంగా యజ్ఞాలలో బలి ఇచ్చే ఆచారం కొత్త వ్యవసాయ విధానానికి అడ్డంగా నిలిచింది వైదిక యజ్ఞకాండలలో ఆవుల్నీ, ఎద్దుల్నీ బలి ఇవ్వటం చేత పశుసంపద గణనీయంగా తగ్గిపోయింది మగధ దక్షిణ, తూర్పు సరిహద్దుల్లో నివసించిన ప్రజలు ఆహారం కోసం కూడా పశువుల్ని చంపేవారు కానీ కొత్త వ్యవసాయ ఆర్థిక వ్యవస్థ స్థిరంగా ఉండాలంటే ఈ బలుల్ని ఆపక తప్పని పరిస్థితి ఏర్పడింది

ఈ కాలంలోనే ఈశాన్య భారతదేశంలో నగరాలు పెద్దసంఖ్యలో అభివృద్ధి చెందాయి అలహాబాద్ సమీపంలో నగరాలు పెద్ద సంఖ్యలో అభివృద్ధి చెందాయి అలహాబాద్ సమీపంలో ఉన్న కౌశాంబి, ఉత్తరప్రదేశ్‌లోని కుశీనగరం, బెనారస్, బీహార్‌లోని వైశాలి, పరన్ జిల్లాలోని చిరంద్, పాట్నాకు 100 కి మీ ఆగ్నేయంగా ఉన్న రాజ్‌గీర్ అలాంటి నగరాల్లో కొన్ని ఈ నగరాల్లో అనేకమంది చేతివృత్తుల వారూ, వ్యాపారులూ ఉండేవారు వీరు మొదటిసారిగా నాణాలను ఉపయోగించటం ప్రారంభించారు మనకు లభిస్తున్న తొట్టతొలి నాణాలు క్రీ పూ 5 వ శతాబ్దానికి చెందినవి వాటిని విద్ధాంక నాణాలు (పంచ్‌మార్క్డ కాయిన్స్) అంటారు ఇవి తూర్పు ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహార్‌లోనూ మొదటిసారిగా చెలామణీలో కొచ్చాయి వీటి ఉపయోగం వ్యాపారానికి దోహదం చేసింది వైశ్యుల ప్రాధాన్యతను అధికం చేసింది వర్ణసమాజంలో వైశ్యులు మూడవమెట్టుకు చెందినవారు మొదటి ఇద్దరూ బ్రాహ్మణులు, క్షత్రియులు తమ స్థాయిని అభివృద్ధి చేసే మతం కోసం వారు ఎదురు చూడటం సహజమే మహా వీరునికీ, గౌతమబుద్ధునికీ వైశ్యులు ఉదారమైన ప్రోత్సాహాన్నిచ్చారు "సెట్టి" అన్న పేర్లతో పిలవబడే ఈ వ్యాపారులు బుద్ధునికీ, అతని శిష్యులకూ గొప్ప దానాలను కూడా చేశారు ఇందుకు అనేక కారణాలున్నాయి 1 జైనమతమూ, బౌద్ధమతమూ తొలినాళ్ళలో ఆనాడు అమలులో ఉన్న వర్ణ వ్యవస్థను పట్టించుకోలేదు 2 వీరు అహింసా సిద్ధాంతాన్ని బోధించారు దానివల్ల రాజ్యాల మధ్య యుద్ధాలు సమసిపోయి, వ్యాపారం అభివృద్ధి చెందుతుంది 3 బ్రాహ్మణీయ ధర్మశాస్త్రగ్రంధాలు వడ్డీకి అప్పులివ్వటాన్ని నిరసించాయి వడ్డీ మీద జీవించే వ్యక్తిని అవి అసహ్యించుకున్నాయి వ్యాపారం అభివృద్ధి చెందటంచేత వడ్డీ వ్యాపారాన్ని కూడా ప్రారంభించిన వైశ్యులకు గౌరవం ఉండేదికాదు అందుచేత వారు తమస్థాయిని అభివృద్ధి చేసుకోవాలని ఆశించారు

దీనికితోడు వ్యక్తిగత ఆస్తి యొక్క అనేక రూపాలకు వ్యతిరేకంగా కూడా తీవ్రమైన ప్రతిస్పందన రావటాన్ని మనం గమనించవచ్చు పాతరకం మనుషులు వెండితోనూ, రాగితోనూ, బహుశా బంగారంతోనూ చేసిన నాణాలను ఉపయోగించటాన్నీ, కూడబెట్టుకోవటాన్నీ

ఆమోదించలేకపోయారు కొత్తరకం నివాస గృహాలనూ, దుస్తులనూ, విలాసవంతమైన ప్రయాణసౌకర్యాలనూ కూడా వారు ఆహ్వానించలేకపోయారు యుద్ధాన్నీ, హింసనూ వారు అసహ్యించుకున్నారు ఆస్తియొక్క వివిధరూపాలు సమాజంలో అసమానత్వాన్ని సృష్టించాయి సాధారణ ప్రజానీకం జీవితాన్ని బాధామయం చేశాయి కాబట్టి సాధారణ ప్రజలు పాత పద్ధతి జీవితానికి తిరిగి వెళ్ళటం మంచిదనుకున్నారు కొత్త జీవిత పద్ధతినీ, ఆస్తియొక్క కొత్త రూపాలనూ పరిత్యజించే సన్యాస జీవితాదర్శం వైపుగా తిరిగి వెళ్లాలనుకున్నారు జైన, బౌద్ధమతాలు రెండూ విలాసాలను తిరస్కరించే సరళమైన జీవితాన్ని ప్రతిపాదించాయి బౌద్ధ, జైన సన్యాసులు జీవిత సుఖాలను పరిత్యజించాలన్నారు వారు బంగారాన్నీ, వెండినీ స్పృశించ కూడదన్నారు తమ ప్రాణాన్ని కాపాడుకోవటానికి అవసరమైనంత ఆహారాన్ని మాత్రమే వారు గృహస్థుల వద్దనుంచీ స్వీకరించాలన్నారు అలా ఈ రెండు మతాలూ గంగామైదానంలో కొత్తగా అలవాటులో కొచ్చిన భౌతిక జీవిత విలాసాలకు వ్యతిరేకంగా తిరగబడ్డాయి

ఈశాన్య భారతదేశంలో క్రీ పూ 6 వ శతాబ్దంలో భౌతిక జీవితానికి వ్యతిరేకంగా వచ్చిన స్పందన ఆధునిక కాలంలో పారిశ్రామిక విప్లవం తెచ్చిన మార్పులకు వ్యతిరేకంగా వచ్చిన స్పందన వంటిది పారిశ్రామిక విప్లవం చాలా మందిలో యంత్రాలు రాకపూర్వం ఉండిన జీవితానికి తిరిగి వెళ్లాలన్న కోరికను కలిగించింది అలాగే ప్రాచీన కాలంలో వేదయుగం తరువాత కాలానికి చెందిన ప్రజలు ఇనుపయుగం పూర్వదశలోని జీవితానికి వెళ్ళాలని కోరుకున్నారు

## వర్ధమాన మహావీరుడూ - జైనమతం

తీర్థంకరులన్న పేరుతో మహావీరుడికంటే ముందు ఇరవై మూడు మంది గురువులు వుండేవారని జైనులు నమ్ముతారు మహావీరుడు వీరికి అత్యంత ప్రధానమైన గురువు మహావీరుణ్ణి ఇరవైనాలుగవ లేదా చివరి గురువుగా గుర్తిస్తే జైనమత ప్రారంభాన్ని క్రీ పూ 9 వ శతాబ్దం వరకూ వెనక్కుతీసుకెళ్ళవచ్చు కానీ పదిహేనవ గురువు వరకూ అందరూ తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోనూ, బీహారులోనూ జన్మించారని చెప్పటంచేత వారి చారిత్రక అస్తిత్వం చాలా సందేహాస్పదంగా ఉంది ఎందుకంటే, మధ్యగంగామైదానం లోని ఏ భాగంలోనూ క్రీ పూ 6 వ శతాబ్దం వరకూ జన నివాసం లేదు ఈ సిద్ధాంతం జైన మతానికి ప్రాచీనతను ఇవ్వటానికి కల్పించిందిగా అనిపిస్తోంది తొలి జైన మత బోధనలు 23 వ తీర్థంకరుడైన పార్శ్వనాధుని పేరుతో ఉన్నాయి అతడు బెనారస్‌కు చెందినవాడు అతడు రాజరిక జీవితాన్ని త్యజించి సన్యాసిగా మారిపోయాడు అతని ఆధ్యాత్మిక వారసుడు వర్ధమాన మహావీరుడు అతడే జైనమతానికి నిజమైన ప్రారంభకుడు

వర్ధమాన మహావీరుడు వైశాలీ నగరానికి దగ్గరలో ఉన్న ఒక పల్లెలో క్రీ పూ 540 లో జన్మించాడు ఇప్పుడు ఉత్తర బీహార్‌లో వైశాలీ జిల్లాలోని బిసర్ అన్న గ్రామం అది అతని తండ్రి సుప్రసిద్ధ క్షత్రియ నాయకుడైన సిద్ధార్థుడు తల్లి పేరు త్రిశాల ఆమె లిచ్ఛవీ రాజైన చేతకుని చెల్లెలు అతని కూతురు బింబిసారుని భార్య అలా మహావీరుని కుటుంబానికీ, మగధ రాజకుటుంబానికీ దగ్గర చుట్టరికం ఉండేది అతని కుటుంబ సంబంధాలు అతడు తన మతప్రచారంలో రాజులనూ, రాజకుమారులనూ తేలికగా కలుసుకోవటానికి ఎంతగానో సహాయపడ్డాయి

మొదట మహావీరుడు గృహస్థాశ్రమాన్ని గడిపాడు ముప్పై సంవత్సరాల వయస్సులో సత్యాన్వేషణ కోసం సన్యాసిగా మారిపోయాడు అతడు 12 సంవత్సరాల కాలం దేశసంచారం చేశాడు 42 సంవత్సరాల వయస్సులో కైవల్యాన్ని పొందిన తరువాత దేశసంచారాన్ని మానివేశాడు అతడు కైవల్యాన్ని పొంది సుఖదుఃఖాలను జయించాడు ఈ విజయం వల్లనే అతడు "మహావీరుడు" లేదా "జినుడు" అయ్యాడు అతని అనుయాయులు "జైనులు" అయ్యారు మహావీరుడు తన మతాన్ని 30 ఏళ్ళపాటు ప్రచారం చేశాడు అతడు ప్రచారనిమిత్తం కోసల, మిధిల, మగధ, చంప మొదలైన రాజ్యాలకు వెళ్ళాడు అతడు క్రీ పూ 468 లో 72 వ ఏట చనిపోయాడు ఆధునిక రాజ్‌గిర్ దగ్గరున్న పావాపురి అన్న గ్రామంలో అతనికి మరణం సంభవించింది

## జైనమత సిద్ధాంతాలు

జైనమతం ఐదు సూత్రాలను బోధించింది 1 హింస చేయవద్దు, 2 అసత్యం చెప్పవద్దు, 3 దొంగతనం చేయవద్దు, 4 ఆస్తిని సంపాదించవద్దు, 5 బ్రహ్మచర్యాన్ని పాటించాలి ఐదవ సూత్రాన్ని మాత్రమే మహావీరుడు కలిపాడనీ, మొదటి నాలుగింటినీ అతడు పూర్వ ఆచార్యుల నుంచీ గ్రహించాడనీ చెబుతారు జైనమతం ప్రాణులపట్ల అహింసకు అత్యంత ప్రాధాన్యత నిచ్చింది ఈ సూత్రం కొన్ని సందర్భాల్లో చాలా వక్రమైన పరిణామాలకు దారి తీసింది జంతువుల్ని చంపిన వారికి కొంతమంది జైన రాజులు మరణ శిక్ష విధించేవారు మహావీరునికంటే ముందు వచ్చిన పార్శ్వనాధుడు తన అనుయాయుల్ని తమ శరీరాల్లోని కింది, పైభాగాలను కప్పుకోమన్నాడు కానీ మహావీరుడు బట్టల్ని పూర్తిగా త్యజించమన్నాడు అంటే మహావీరుడు తన అనుయాయుల్ని మరింత కఠోరమైన జీవితం జీవించాలని ఆదేశించాడు దానికారణంగా జైనమతం

రెండుగా చీలిపోయింది తెల్లని వస్త్రాలను ధరించేవారిని శ్వేతాంబరులనీ, ఎలాంటి బట్టలూ ధరించకుండా నగ్నంగా ఉండేవారిని దిగంబరులనీ అంటారు

దేవతల అస్తిత్వాన్ని జైనమతం అంగీకరించింది కానీ వారిని జినులకంటే తక్కువ స్థాయిలో ఉంచింది బౌద్ధమతం లాగా జైనమతం వర్ణవ్యవస్థను తిరస్కరించలేదు మహావీరుని అభిప్రాయం ప్రకారం మానవులు పై వర్ణాలలోనో, కింది వర్ణాలలోనో – వారు గత జన్మలో చేసిన పాపపుణ్యాల ఆధారంగా జన్మిస్తారు మహావీరుడు చండాలుల్లో కూడా మానవతావిలువల్ని చూశాడు అతని అభిప్రాయం ప్రకారం పవిత్రమైన, శ్రేష్టమైన జీవితాన్ని గడిపి, తక్కువ వర్ణాలకు చెందిన వారు కూడా ప్రాపంచిక బంధాలనుంచీ విముక్తిని సాధించవచ్చు జైనమతం ప్రధానంగా ప్రాపంచిక బంధాలనుంచీ విముక్తిని ఆదర్శంగా ఉంచుకుంది దాన్ని సాధించటానికి ఎలాంటి కర్మకాండా అవసరం లేదు దాన్ని సరైన జ్ఞానం ద్వారా, సరైన విశ్వాసం ద్వారా, సరైన ఆచరణ ద్వారా పొందవచ్చు ఈ మూడింటినీ జైనమతంలో "త్రిరత్నాలు" అంటారు

జైనమతం యుద్ధాన్నేకాదు, వ్యవసాయాన్ని కూడా నిషేధించింది ఈ రెంటిలోనూ జీవుల్ని చంపటం ఉందని వీరి విశ్వాసం దీని పర్యవసానంగా జైనులు వ్యాపారానికి పరిమితమై పోయారు

## జైనమతం విస్తరణ

జైనమతాన్ని విస్తరింప చేయటానికి మహావీరుడు ఒక శిష్య గణాన్ని ఏర్పాటుచేశాడు అందులో పురుషులనూ, స్త్రీలనూ కూడా చేర్చుకున్నాడు వారి సంఖ్య 14,0008 ఉండేది అదేమీ మరీ పెద్దసంఖ్యకాదు జైనమతం బ్రాహ్మణీయ హిందూమతం నుంచీ స్పష్టంగా వేరుపడలేక పోవటంచేత అది సాధారణ ప్రజానీకాన్ని ఆకర్షించ లేకపోయింది కానీ అది నెమ్మదిగా దక్షిణ, పశ్చిమ భారత దేశాలకు వ్యాపించ గలిగింది ఆలస్యంగా ఏర్పడ్డ సంప్రదాయం ప్రకారం కర్ణాటకలో జైనమతం వ్యాపించటానికి కారకుడు చంద్రగుప్తమౌర్యుడు (క్రీ పూ 322 – 298) ఈ చక్రవర్తి జైనుడై, సింహాసనాన్ని త్యజించి, తన చివరి రోజుల్ని జైన సన్యాసిగా కర్ణాటకలో గడిపాడని జనశృతి ఉంది కానీ దానికి బలంగా ఎలాంటి ఇతర ఆధారాలూ లేవు మహావీరుడు మరణించిన 200 సంవత్సరాల తరువాత మగధలో వ్యాపించిన భయంకరమైన కరువు దక్షిణ దేశంలో జైనమతం వ్యాపించటానికి రెండవ కారణం పన్నెండు సంవత్సరాల కాలం కొనసాగిన ఈ కరువు కాలంలో భద్రబాహు నాయకత్వంలోని జైనులు దక్షిణ దేశానికి వలస పోయారు స్థలబాహు నాయకత్వంలోని జైనులు మగధలోనే ఉండిపోయారు

కరువు తరువాత వలస వెళ్ళిన జైనులు మగధకు తిరిగి వచ్చారు వారికీ స్థానిక జైనులకూ విభేదాలు వచ్చాయి వలస వెళ్ళిన జైనులు కరువు కాలంలో కూడా మత సంప్రదాయాలను నియమ బద్ధంగా పాటించారు మగధలోనే ఉండిపోయిన జైన సన్యాసులు నియమాలను ఉల్లంఘించటంచేత వారిలో శ్రద్ధ తగ్గిపోయింది దక్షిణ దేశం నుంచీ తిరిగి వచ్చిన వారు ఇలా భావించటం చేత భేదాభిప్రాయాలను సర్దుబాటు చేసుకోవటానికీ, జైనమత ముఖ్య సూత్రాలను క్రోడీకరింటానికీ పాటలీపుత్రంలో ఒక సదస్సు జరిగింది కానీ దక్షిణాది జైనులు ఆ సదస్సును బహిష్కరించారు ఆ సదస్సు తీర్మానాలను తిరస్కరించారు అనాటి నుంచీ దక్షిణాది జైనుల్ని దిగంబరులనీ, మగధ జైనుల్ని శ్వేతాంబరులనీ పేర్కొనటం ప్రారంభమైంది కానీ కర్ణాటకలో జైనమత వ్యాప్తికి సంబంధించిన శాసనాధారాలు క్రీ శ 3 వ శతాబ్దానికి పూర్వం లభించటం లేదు ఆ తరువాతి శతాబ్దాలలో – ముఖ్యంగా ఐదవ శతాబ్దం తరువాత 'బసదులు' (వసతులు) అన్న పేరుతో జైనమఠాలు అసంఖ్యాకంగా వ్యాపించాయి వీటిని నిర్వహించటం కోసం అనాటి రాజులు భూదానాలు కూడా చేశారు

క్రీ పూ 4 వ శతాబ్దంలో జైనమతం ఒరిస్సాలోని కళింగ దేశానికి కూడా విస్తరించింది ఆంధ్రరాజులనూ, మగధరాజులనూ ఓడించిన ఖారవేలుడు జైనమతాన్ని పోషించాడు క్రీ పూ రెండవ, మొదటి శతాబ్దాల్లో జైనమతం తమిళనాడులోని దక్షిణ జిల్లాలకు కూడా చేరినట్టు అనిపిస్తోంది తరువాతి కాలంలో జైనమతం మాళ్వ, గుజరాత్, రాజస్థాన్‌లలో ప్రవేశించింది ఈ నాటికీ ఈ ప్రాంతాలలో వ్యాపార కార్యక్రమాలలో నిమగ్నులై ఉన్న జైనులు చాలా మంది ఉన్నారు జైనమతానికి బౌద్ధమతం లాగా రాజాదరణ లభించక పోయినా, త్వర త్వరగా వ్యాపించలేకపోయినా అది వ్యాపించిన ప్రాంతాలలో ఇంకా అనుసరించబడుతూనే ఉంది కానీ బౌద్ధ మతం మాత్రం భారతదేశం నుంచీ తుడిచిపెట్టుకుపోయింది

## జైనమతం చేసిన దోహదం

జైనమతం మొట్టమొదటిసారిగా వర్ణవ్యవస్థలోనూ, వైదిక కర్మకాండలోనూ ఉన్న చెడును తగ్గించడానికి గట్టి ప్రయత్నాన్ని చేసింది బ్రాహ్మణులు పోషించిన సంస్కృత భాషను జైనులు తిరస్కరించారు తమ భావాలను ప్రచారం చేయటానికి వారు సామాన్య ప్రజల భాషయిన ప్రాకృతాన్ని స్వీకరించారు వారి మత సాహిత్యం అర్ధమాగధిలో రచింపబడింది

అనాడు గుజరాత్‌లోని గొప్ప విద్యాకేంద్రమైన వలభిలో క్రీ శ 6 వ శతాబ్దంలో ఈ గ్రంథాలన్నీ సంకలనం చేయబడ్డాయి జైనులు ప్రాకృతాన్ని స్వీకరించటంచేత ఆ భాషా, దాని సాహిత్యమూ అభివృద్ధి చెందాయి ప్రాకృత భాషనుంచీ ప్రాంతీయ భాషలెన్నో అభివృద్ధి చెందాయి వీటిలో సౌరశేని ముఖ్యమైంది దీనిలోంచే మరాఠీ భాష వచ్చింది జైనులు అపభ్రంశ భాషలో తొలి ప్రధాన గ్రంథాలను రాశారు దానికి తొలి వ్యాకరణాన్ని కూడా రాశారు జైన సారస్వతంలో మహాకావ్యాలూ, పురాణాలూ, నాటకాలూ, వచన ప్రబంధాలూ ఉన్నాయి ఈ నాటికీ జైన సాహిత్యంలో ఎక్కువ భాగం రాతప్రతుల రూపంలోనే ఉంది ఇది గుజరాత్‌లోనూ, రాజస్థాన్‌లోనూ ఉన్న జైన మందిరాల్లో ఉంది మధ్య యుగాల తొలిరోజుల్లో జైనులు సంస్కృతాన్ని కూడా విస్తృతంగా ఉపయోగించారు అందులో అనేక గ్రంథాలు రాశారు అన్నిటికంటే ముఖ్యంగా వీరు కన్నడ భాష అభివృద్ధికి ఎంతో కృషి చేశారు అందులో ఎన్నో గ్రంథాలు రాశారు

మొదట బౌద్ధులలాగే జైనులుకూడా విగ్రహారాధకులు కారు తరువాత కాలంలో వారు మహావీరుణ్ణీ, ఇరవై మూడు మంది తీర్థంకరుల్నీ పూజించటం ప్రారంభించారు అందమైన, సమున్నతమైన రాతి విగ్రహాలను పూజలకోసం చెక్కారు ఇది ఎక్కువగా కర్ణాటక, గుజరాత్, రాజస్థాన్‌లలో జరిగింది జైన కళ బౌద్ధ కళంత సంపన్నంగా లేకపోయినా కళకు జైనులు చేసిన దోహదం – ముఖ్యంగా మధ్యయుగాల్లో – గొప్పదనే చెప్పుకోవాలి

## గౌతమ బుద్ధుడు - బౌద్ధమతం

గౌతమ బుద్ధుడు లేదా సిద్ధార్థుడు మహావీరుని సమకాలికుడు నేపాల్ పర్వతపాదాల చెంత ఉన్న కపిల వస్తు పట్టణంలో అతడు క్రీ పూ 563 లో ఒక శాక్యక్షత్రియ కుటుంబంలో జన్మించాడు గౌతముని తండ్రి కపిలవస్తుకు ఎన్నికైన పరిపాలకునిలా కనిపిస్తున్నాడు అతడు ప్రజా ప్రభుత్వవాదులైన శాక్యవంశ నాయకుడు సిద్ధార్థుని తల్లి కోసల రాజపుత్రిక అలా గౌతముడు కూడా మహావీరునిలాగా రాజ వంశానికి చెందినవాడే ప్రజాతంత్ర రాజ్యంలో జన్మించటంచేత అతనికి సమానత్వ భావాలు వారసత్వంగా అబ్బాయి

గౌతముడు చిన్నతనంనుంచీకూడా ఆలోచన వైపు మొగ్గేవాడు అతడు చిన్నతనంలోనే పెళ్ళి చేసుకున్నాడు కానీ వైవాహిక జీవితం మీద అతనికి ఆసక్తి లేకుండా పోయింది అతడు ప్రపంచంలో మానవులు అనుభవిస్తూ ఉన్న దైన్యాన్ని చూసి చలించిపోయాడు దానికి పరిష్కారమార్గాలను అన్వేషించటంలో నిమగ్నుడయ్యాడు 29 సంవత్సరాల వయస్సులో మహావీరుని లాగే ఇల్లు వదిలి వెళ్ళిపోయాడు దాదాపు ఏడు సంవత్సరాల యాత్రల తరువాత – అంటే 35 సంవత్సరాల వయస్సులో – బోధగయలోని ఒక రాగి చెట్టుకింద అతనికి జ్ఞానోదయం కలిగింది ఆ సమయం నుంచి అతడు బుద్ధుడు అని పిలువబడ్డాడు

గౌతమ బుద్ధుడు తన మొదటి ఉపదేశాలను బనారస్‌కు దగ్గరున్న సారనాథ్‌లో ప్రవచించాడు అతడు తన బోధనలను వినిపించటానికి సుదీర్ఘ ప్రయాణాలు చేశాడు అతనికి గొప్ప శరీరపటుత్వం ఉండేది అతడు రోజుకు 20 నుంచీ 30 కిలోమీటర్లు నడవ గలిగేవాడు అతడు వర్షాకాలంలో మాత్రమే ప్రయాణాలు ఆపి విశ్రాంతి తీసుకునేవాడు ఈ కాలంలో అతడు వ్యతిరేక మతాలకు చెందిన వారిని కలుసుకునేవాడు వీరిలో బ్రాహ్మణులు కూడా ఉండేవారు వారిని అతడు చర్చల్లో ఓడించేవాడు అతడు తన ప్రచార కార్యక్రమంలో ధనికులకూ, పేదలకూ, పైవర్గాలవారికీ, కింది వర్గాలవారికీ, పురుషులకూ, స్త్రీలకూ మధ్య తారతమ్యాన్ని పాటించేవాడు కాదు బుద్ధుడు 80 సంవత్సరాల వయస్సులో తూర్పు ఉత్తర ప్రదేశ్‌లో దేవరియాజిల్లాలోని కుశీనగర్ (ఆధునిక కసియా)లో తనువు చాలించాడు

## బౌద్ధమత సిద్ధాంతాలు

ఆనాటి జీవిత వాస్తవాలను గుర్తించిన సంస్కర్తగా బుద్ధుడు మనకు కనబడతాడు ఆనాడు ఆత్మను గురించీ, బ్రహ్మను గురించీ ప్రచలితంగా ఉన్న నిష్ఫలమైన వివాదాల్లోకి అతడు ప్రవేశించలేదు అతడు ఇహలోక సమస్యల్ని గురించే ఆలోచించాడు ప్రపంచం దుఃఖమయమనీ, మానవులు కోరికల కారణంగా దుఃఖాలు అనుభవిస్తున్నారనీ భావించాడు కోరికల్ని జయిస్తే నిర్వాణం సాధ్యమౌతుందన్నాడు నిర్వాణమంటే జననమరణాలనుంచీ విముక్తి అన్నమాట

మానవ జీవితంలోని దుఃఖాన్ని దూరం చేసుకోవటానికి గౌతమబుద్ధుడు అష్టాంగమార్గాన్ని ప్రతిపాదించాడు క్రీ పూ 3 వ శతాబ్దంలో వచ్చిన ఒక గ్రంథంలో ఈ మార్గాన్ని బుద్ధుడు ప్రతిపాదించినట్టుగా ఉంది ఈ ఎనిమిది మార్గాలూ 1 సమ్యగ్ దృష్టి, 2 సమ్యగ్ ఆలోచన, 3 సమ్యగ్ వాక్కు, 4 సమ్యగ్ క్రియ (సత్ప్రవర్తన), 5 సమ్యగ్ జీవనం 6 సమ్యగ్ శ్రమ, 7 సమ్యగ్ నిశ్చయం (మంచి మనస్సు), 8 సమ్యగ్ ధ్యానం ఈ ఎనిమిది మార్గాలనూ పాటించేవ్యక్తి పురోహిత వర్గం మీద ఆధారపడాల్సిన అవసరం లేదు అతడు తప్పకుండా తన గమ్యాన్ని చేరుకుంటాడు

బుద్ధుడు అతి విలాసవంతమైన జీవితాన్నీ, అతి పొదుపరి జీవితాన్నీ కూడా దూరంగా ఉంచాలని బోధించాడు అతడు మధ్యేమార్గాన్ని ప్రతిపాదించాడు

జైనగురువులలాగే బుద్ధుడుకూడా తన శిష్యులకు ఒక ప్రవర్తన నియమావళిని తయారు చేశాడు వారి సామాజిక ప్రవర్తనలో ప్రధానమైన అంశాలు 1 ఇతరుల ఆస్తిని ఆశించకూడదు, 2 హింస చేయకూడదు, 3 మత్తుపదార్థాలు ఉపయోగించకూడదు, 4 అసత్యాలు చెప్పకూడదు, 5 లంచగొండిపనులు చేయకూడదు ఈ నియమాలు ఒకరకంగా అన్ని మతాల సామాజిక ప్రవర్తనకూ సమానమే

## బౌద్ధమతం ప్రత్యేకతలు - బౌద్ధమతం విస్తరణకు కారణాలు

బౌద్ధమతం దేవుని ఉనికినీ, ఆత్మనూ గుర్తించదు భారతదేశంలోని మతాల చరిత్రలో దీన్నొక రకమైన విప్లవంగా భావించవచ్చు తొలినాళ్ళ బౌద్ధమతం తాత్విక చర్చల వలలో ఇరుక్కుపోకపోవటంచేత సామాన్య ప్రజలకు అది ఆకర్షణీయంగా కనిపించింది వర్ణవ్యవస్థను వ్యతిరేకించటంచేత అది కింది వర్గాల ప్రజల మద్దతును ప్రత్యేకంగా పొందింది వర్ణంతో సంబంధం లేకుండా ప్రజలను బౌద్ధమతంలోకి స్వీకరించారు స్త్రీలను కూడా "సంఘం" లోకి స్వీకరించి, పురుషులతో సమానస్థాయికి తీసుకువచ్చారు బ్రాహ్మణీయ మతంతో పోల్చినప్పుడు బౌద్ధమతంలో ఎంతో ఉదారతత్వమూ, ప్రజాస్వామ్యమూ ఉండేవి

అవైదిక జీవితాన్ని గడుపుతున్న ప్రాంతాల్లోని ప్రజల్ని బౌద్ధమతం ప్రత్యేకంగా ఆకర్షించింది మత మార్పిడికి అనుకూలమైన వాతావరణాన్ని సృష్టించింది సంప్రదాయవాద బ్రాహ్మణుల చేత తక్కువగా చూడబడుతూ ఉండటం చేత మగధ ప్రజలు బౌద్ధ మతానికి అనుకూలంగా ప్రతిస్పందించారు మగధను పవిత్ర ఆర్యావర్తంలో (ఆధునిక ఉత్తరప్రదేశ్) భాగంగా ఆనాటి సంప్రదాయవాదులు పరిగణించలేదు ఈ పాత సంప్రదాయం ఇంకా కొనసాగుతూనే ఉంది ఉత్తర బీహారుకు చెందిన ప్రజలు ఈ నాటికీ గంగకు దక్షిణంగా మగధ ప్రాంతంలో తమ ఉత్తర క్రియలు జరగటానికి అంగీకరించరు

బుద్ధుని వ్యక్తిత్వమూ, మత ప్రచారంలో అతడు అనుసరించిన విధానమూ బౌద్ధమతం విస్తరించటానికి దోహదం చేశాయి అతడు చెడును మంచితోనూ, ద్వేషాన్ని ప్రేమతోనూ జయించాలని ప్రయత్నించాడు అతడు తిట్లనూ, నిందలనూ విని కోపగించుకోలేదు చాలా క్లిష్టమైన పరిస్థితిలో కూడా ప్రశాంతంగా ఉండటానికి ప్రయత్నించాడు గాంభీర్యాన్ని నిలుపుకున్నాడు. తన ప్రత్యర్థులను తెలివితోనూ, చమత్కారంతోనూ, బుద్ధికుశలతతోనూ ఎదుర్కొన్నాడు ఒకసారి ఒక మూర్ఖుడు అతణ్ణి తిట్టాడట బుద్ధుడు ఓపికగా విని, అతడు తిట్టటం ఆపిన తరువాత ఇలా అడిగాడట, "బాబూ, ఇతరులిచ్చే బహుమతిని స్వీకరించకపోతే ఏమౌతుంది?" "ఇవ్వాలనుకొన్న వాడి దగ్గరే ఉండిపోతుంది" అన్నాడట ఆ మూర్ఖుడు "చూడుబాబూ, నేను నీ తిట్లను స్వీకరించటం లేదు" అన్నాడట బుద్ధుడు

ప్రజల భాషయిన పాళీని ఉపయోగించటం కూడా బౌద్ధమతం విస్తరణకు దోహదం చేసింది సామాన్య ప్రజానీకంలో బౌద్ధమతం విస్తరించటానికి పాళీ దోహదం చేసింది గౌతమ బుద్ధుడు కూడా 'సంఘం'ను ఏర్పాటు చేశాడు వర్ణంతోనూ, లింగంతోనూ సంబంధం లేకుండా అందరినీ సంఘంలోనికి ఆహ్వానించాడు సంఘ నియమావళిని నిజాయితీగా అనుసరించటం ఒక్కటే భిక్షువు కావటానికి అర్హత బౌద్ధ ఆరామంలో సభ్యులుకాగానే వారు పరిశుద్ధమైన శీలాన్నీ, పేదరికాన్నీ పాటిస్తామని ప్రతిజ్ఞ చేయాలి అంటే - బౌద్ధమతంలో మూడు ప్రధానాంశాలువున్నాయన్నమాట అవి బుద్ధుడు, సంఘము, ధర్మము సంఘం నేతృత్వంలో ఒక పద్ధతిలో జరిగిన ప్రచారం కారణంగా బౌద్ధమతం బుద్ధుని కాలంలోనే చాలా ముందుకు వెళ్ళింది మగధ, కోసల, కౌశాంబి మొదలైన రాజ్యాలుమాత్రమేకాకుండా అనేక గణతంత్రరాజ్యాలూ, వాటిలోని ప్రజలూ బౌద్ధమతాన్ని స్వీకరించారు

బుద్ధుడు చనిపోయిన తరువాత రెండువందల సంవత్సరాలకు సుప్రసిద్ధ మౌర్యచక్రవర్తి అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించాడు అదొక చారిత్రక సంఘటన అతడు తన ప్రతినిధుల సహకారంతో బౌద్ధమతాన్ని మధ్య ఆసియాలోనూ, పశ్చిమ ఆసియాలోనూ, శ్రీలంకలోనూ వ్యాపింపజేసి, దాన్ని అంతర్జాతీయ మతంగా మార్చివేశాడు ఈనాటికీ శ్రీలంకలో, బర్మాలో, టిబెట్‌లో, చైనాలోని కొన్ని ప్రాంతాలలో, జపాన్‌లో బౌద్ధమతం అవలంబించబడుతూ ఉంది తాను పుట్టినదేశంనుంచీ అదృశ్యమై పోయినా - బౌద్ధమతం ఆసియాలోని దక్షిణ, ఆగ్నేయ, తూర్పుప్రాంతాల్లో ఇంకా బలంగానూ, స్థిరంగానూ ఉంది

## బౌద్ధమతం పతనానికి కారణాలు

క్రీ శ 12 వ శతాబ్దానికి భారతదేశంలో బౌద్ధమతం లేకుండాపోయింది బీహార్‌లోనూ, బెంగాల్‌లోనూ ఒకరకమైన - మారిపోయిన రూపంలో కొనసాగిన బౌద్ధమతం క్రీ శ 12 వ శతాబ్దం తరువాత భారతదేశం నుంచీ పూర్తిగా అదృశ్యమైపోయింది దీనికి కారణాలేమిటి?

మొదట ప్రతి మతమూ సంస్కరణ వాదంతో స్ఫూర్తిని పొందుతుంది కానీ క్రమక్రమంగా తాను నిరసించిన ఆచారాల లోనూ, కర్మకాండలోనే కూరుకుపోతుంది బౌద్ధమతంలో కూడా ఇలాంటి సమూలమైన మార్పే వచ్చింది తాను బ్రాహ్మణీయ మతంలో ఉన్న ఏ దుష్ట సంప్రదాయాలకు వ్యతిరేకంగా మొదట పోరాడిందో వాటికే బౌద్ధమతం చివరికి లోబడిపోయింది బౌద్ధుల సవాలును ఎదుర్కోవటా నికి బ్రాహ్మణులు తమ మతాన్ని సంస్కరించుకున్నారు పశుసంపదను రక్షించుకోవాల్సిన అవసరాన్ని గురించి వారు కూడా నొక్కి చెప్పటం ప్రారంభించారు స్త్రీలకూ, శూద్రులకూ స్వర్గానికి వెళ్ళే అవకాశాన్ని కల్పించారు ఇది ఇలా ఉండగా బౌద్ధమతంలో పతనోన్ముఖమైన మార్పులూ వచ్చాయి క్రమక్రమంగా బౌద్ధభిక్షువులు ప్రధాన జన జీవన స్రవంతికి దూరమైపోయారు ప్రజల భాషయిన పాళీని వదిలిపెట్టి, పండిత భాషయిన సంస్కృతాన్ని స్వీకరించారు క్రీ శ మొదటి శతాబ్దం నుంచీ వారు పెద్ద ఎత్తున విగ్రహారాధన ప్రారంభించారు భక్తులవద్ద నుంచీ కానుకలు గ్రహించటం ప్రారంభించారు ఈ కానుకలతోపాటు రాజులు బౌద్ధారామాల కిచ్చిన మాన్యాలు భిక్షువుల జీవితాల్లోని కష్టాన్ని తగ్గించాయి కొన్ని బౌద్ధారామాలు – ఉదాహరణకు నలందా బౌద్ధారామం – దాదాపు 200 గ్రామాలనుంచీ పన్నులు వసూలు చేశాయి క్రీ శ 7 వ శతాబ్దానికల్లా బౌద్ధారామాలు సుఖాన్ని ఆశించేవారితోనూ, గౌతమబుద్ధుడు తీవ్రంగా నిషేధించిన అవినీతి చర్యలకు బానిసలైపోయిన వారితోనూ నిండిపోయాయి ఈ కొత్త తరహా బౌద్ధమతాన్ని వజ్రయానం అంటారు బౌద్ధారామాలలో పుష్కలంగా ఉన్న సంపదలూ, అక్కడే నివసిస్తున్న స్త్రీలూ మరింత పతనానికి దారి చూపారు బౌద్ధులు స్త్రీలను కాముక దృష్టితో చూడటం ప్రారంభించారు బుద్ధుడు అతని ప్రియశిష్యుడైన ఆనందునితో "స్త్రీలను ఆరామాల్లోకి అనుమతించకుండా ఉంటే బౌద్ధమతం మరో వెయ్యేళ్ళు బతికేది అనుమతించాం కాబట్టి ఐదువందల ఏళ్ళు మాత్రమే బతుకుతుంది" అని అన్నాడని చెబుతారు

బ్రాహ్మణ రాజైన పుష్యమిత్ర శుంగుడు బౌద్ధులను హింసించాడని చెబుతారు క్రీ శ 6–7 శతాబ్దాలలో బౌద్ధులమీద జరిగిన హింసకు అనేక నిదర్శనాలు కనిపిస్తాయి శివారాధకుడైన హూణరాజు మిహిరకులుడు వందలాది బౌద్ధు లను చంపాడు శైవుడైన శశాంక గౌడుడు బుద్ధ గయలోని బోధివృక్షాన్ని నరికేశాడు ఈ వృక్షం కిందనే బుద్ధునికి జ్ఞానోదయం కలిగింది హువాన్‌సాంగ్ కథనం ప్రకారం 1600 స్తూపాలూ, ఆరామాలూ ధ్వంసం చేయబడ్డాయి వేలాదిమంది భిక్షువులూ, వారి సాధారణ అనుయాయులూ చంపి వేయబడ్డారు ఈ కథనంలో సత్యం ఉండకపోదు

దీనికి బౌద్ధుల ప్రతిక్రియకూడా ఉంది కొన్నిచోట్ల బౌద్ధ దేవతలు హిందూ దేవతలను తొక్కుతున్నట్టుగా వారు చిత్రించారు దక్షిణ దేశంలో మధ్యయుగాల తొలిరోజుల్లో శైవులూ, వైష్ణవులు కూడా బౌద్ధులనూ, జైనులనూ తీవ్రంగా ఎదుర్కొన్నారు అలాంటి సంఘర్షణలు కూడా బౌద్ధమతాన్ని బలహీనపరిచి ఉండవచ్చు

బౌద్ధారామాలలో ఉన్న సిరిసంపదలు తురుష్క దురా క్రమణదారులను ఆకర్షించాయి వారి దురాశకు అవి ప్రత్యేకంగా గురయ్యాయి తురుష్కులు నలందాలో పెద్ద సంఖ్యలో బౌద్ధ భిక్షువుల్ని చంపారు మరికొందరు భిక్షువులు నేపాల్‌కూ, టిబెట్‌కూ పారిపోగలిగారు మొత్తంమీద క్రీ శ 12 వ శతాబ్దానికల్లా తాను పుట్టిన దేశంలో బౌద్ధమతం తుడిచిపెట్టుకుపోయింది

## బౌద్ధమతం ప్రాధాన్యత - ప్రభావం

మత వ్యవస్థగా బౌద్ధమతం చివరకు అదృశ్యమైపోయింది కానీ భారతదేశ చరిత్రమీద అది తన శాశ్వతముద్రను వదిలి పోయింది క్రీ పూ 6 వ శతాబ్దిలో ఈశాన్య భారతదేశంలో ప్రజలు ఎదుర్కొన్న సమస్యలను బౌద్ధులు లోతుగా అర్థం చేసుకున్నారు ఇనుప కర్రు కలిగిన నాగలి రావటం, వ్యాపారం అభివృద్ధి చెందటం, నాణాలు ఉప యోగంలోకి రావటంచేత వ్యాపారులూ, రాజబంధువులూ సంపదను సేకరించుకునే వీలు కలిగింది ఆ కాలంలో ఎనిమిది కోట్ల సంపద ఉన్నవాళ్ళను గురించి కూడా మనకు ఆధారాలున్నాయి ఇవన్నీ కలిసి సమాజంలో తీవ్రమైన అసమానతల్ని సృష్టించాయి కాబట్టి బౌద్ధమతం సంపదను సమకూర్చుకోవద్దని చెప్పింది బౌద్ధమతం ప్రకారం, పేదరికం ద్వేషానికీ, క్రౌర్యానికీ, హింసకూ కారణభూతమౌతుంది కాబట్టి బుద్ధుడు రైతులకు ధాన్యాన్నీ, ఇతర సౌకర్యాలనూ, వ్యాపారులకు సంపదనూ, కూలీలకు జీతాలను ఇవ్వాలన్నాడు ఈ ప్రపంచంలో పేదరికాన్ని తొలగించటానికి వీటిని మార్గంగా చెప్పాడు అంతేకాకుండా, పేదలు బౌద్ధభిక్షువులకు దానం చేస్తే మరో లోకంలో ఆ దాతలు ధనికులుగా పుడతారని బౌద్ధమతం బోధించింది

భిక్షువులకు విధించిన నియమ నిబంధనలు క్రీ పూ 6, 5 వ శతాబ్దాల్లో ఈశాన్య భారతదేశంలోని భౌతిక పరిస్థితులకు అద్దం పడతాయి వారి ఆహారం, వస్త్రధారణ, లైంగిక ప్రవర్తనలమీద కఠినమైన నియమాలున్నాయి వారు బంగారాన్నీ, వెండినీ గ్రహించకూడదు కొనటం, అమ్మటం చేయకూడదు ఈ నియమాలు బుద్ధుడు చనిపోయిన తరువాత సడలింపబడ్డాయి ఈ తొలి కాలపు నియమాలు గిరిజన సమాజ ప్రత్యేక లక్షణమైన ఆదిమ కమ్యూనిజానికి

తిరిగి వెళ్ళటాన్ని సూచిస్తాయి అ వ్యవస్థలో వ్యాపారమూ, అభివృద్ధి చెందిన వ్యవసాయమూ ఉండేవికావు బౌద్ధ భిక్షువులకు విధించిన ప్రవర్తన నియమావళి కొంతవరకూ డబ్బు ఉపయోగానికీ, సొంత ఆస్తికీ, విలాస జీవితానికీ వ్యతిరేకంగా వచ్చిన ప్రతిక్రియగా భావించవచ్చు అ రోజుల్లో - క్రీ పూ 6 వ శతాబ్దకాలంలో ఆస్తినీ, డబ్బునూ విలాస వస్తువులుగా పరిగణించేవారు

బౌద్ధమతం క్రీ పూ 6 వ శతాబ్దం ప్రాంతంలో భౌతిక జీవితంలో ప్రారంభమైన దుష్పరిణామాల ప్రభావాన్ని తగ్గించటానికి ప్రయత్నించింది అంతేకాకుండా, అకాలంలో ప్రజల సామాజిక, ఆర్థిక జీవితంలో వచ్చిన మార్పుల్ని స్థిరీకరించటానికి కూడా ప్రయత్నించింది రుణగ్రస్తులు "సంఘం"లో సభ్యులుగా ఉండరాదన్న నియమం - వడ్డీ వ్యాపారుల కబంధ హస్తాలలోనుంచీ రుణగ్రస్తుల్ని విముక్తి చేయలేకపోవటంచేత - వడ్డీవ్యాపారులకూ, ధనిక వర్గాలకూ సహాయపడింది బానిసలకు కూడా ఈ అర్హత లేదన్న నియమం బానిసల యజమానులకు ఉపయోగపడింది అలా బుద్ధుని బోధనలు భౌతిక జీవితంలో వచ్చిన నూతన పరిణామాలను బాగా అర్థం చేసుకొని, వాటిని భావజాలం సహాయంతో బలపరిచాయి

బౌద్ధభిక్షువులు భౌతిక జీవితాన్ని త్యజించినా, బ్రాహ్మణుల దురాశను మాటిమాటికీ విమర్శించినా - వారికీ, బ్రాహ్మణులకూ పెద్ద తేడా ఉండేది కాదు ఇద్దరూ కూడా ప్రత్యక్షంగా ఉత్పత్తి కార్యక్రమాలలో పాల్గొనేవారు కారు ఇద్దరూ కూడా సమాజం నుంచీ లభించే దాన ధర్మాలమీదా, బహుమతులమీదా ఆధారపడి జీవించేవారు ఇద్దరూ కుటుంబ బాధ్యతల్ని నిర్వహించటాన్నీ, సొంత ఆస్తిని రక్షించుకోవటాన్నీ, రాజకీయాధికారాన్ని గౌరవించటాన్నీ సుగుణాలుగా నొక్కి చెప్పారు వర్గాలమీద ఆధారపడ్డ సామాజిక వ్యవస్థను ఇద్దరూ సమర్థించారు బౌద్ధ భిక్షువుల అభిప్రాయం ప్రకారం వర్ణం గుణాలమీదా, చర్యల మీదా ఆధారపడుతుంది కానీ బ్రాహ్మణుల అభిప్రాయం ప్రకారం వర్ణం పుట్టుకతో వస్తుంది

బౌద్ధమత బోధనల ఆదర్శం వ్యక్తియొక్క నిర్వాణం అనటానికి సందేహం లేదు తెగమీద ఆధారపడ్డ ప్రాచీన సమాజం శిథిలమైపోవటంతోనూ, వ్యక్తిగత ఆస్తికారణంగా ఏర్పడ్డ భయంకరమైన సామాజిక అసమానతలతోనూ సర్దుబాటు చేసుకోలేనివారికి నిర్వాణం ఒక రకమైన ఊరటగా కనిపించి ఉండవచ్చు కానీ అది బౌద్ధ భిక్షువులకు మాత్రమే ప్రత్యేకించబడింది కొత్త జీవితాన్ని అర్థం చేసుకోవాలని ప్రయత్నిస్తున్న సాధారణ అనుయాయులకు "నిర్వాణం" ఎలాంటి ఊరటా కల్పించలేకపోయింది

స్త్రీలనూ, శూద్రులనూ ఆహ్వానించటం ద్వారా బౌద్ధ మతం సమాజం మీద చాలా ముఖ్యమైన ప్రభావాన్ని చూపింది బ్రాహ్మణ మతం వీరినిద్దరినీ ఒకేగాట కట్టింది ఇద్దరికీ ఉపనయనం చేసుకునే అర్హతా, వేదాధ్యయనం చేసే అర్హతా లేకుండా చేసింది వారు బౌద్ధమతంలో చేరటం ద్వారా ఆత్మన్యూనతాభావాన్ని జయించగలిగారు

అహింసనూ, జంతువుల పవిత్రతనూ నొక్కి చెప్పటం ద్వారా బౌద్ధమతం పశుసంపద అభివృద్ధిచెందటానికి దోహదం చేసింది "సుత్తనిపాత" అన్న తొలి బౌద్ధ గ్రంథం పశువులు ఆహారాన్నీ, అందాన్నీ, ఆనందాన్నీ (అనందదం, వన్నదం, సుఖదం) ఇస్తాయని ప్రకటించింది అందుచేత వాటిని రక్షించాలని కోరింది అనార్యులు ఆహారం కోసమూ ఆర్యులు మతం కోసమూ పశువుల్ని చంపుతూవున్నతరుణంలో ఈ బోధన వచ్చింది గోవుల పవిత్రతనూ, అహింసనూ బ్రాహ్మణ మతం తరువాత నొక్కి చెప్పటానికి మూలం, బౌద్ధమతం బోధనలే నన్నది తేటతెల్లంగా తెలిసే విషయం

బౌద్ధిక, సాంస్కృతిక విషయాల్లో బౌద్ధమతం ఒక కొత్త చైతన్యానికి బాటలు వేసింది దేన్నీ అంగీకరించవద్దనీ, మంచి చెడ్డల్ని గురించి వాదించి, ఒక నిర్ణయానికి రావాలనీ బౌద్ధమతం చెప్పింది కొంతవరకూ మూఢ విశ్వాసానికి బదులుగా తర్కాన్ని ప్రవేశపెట్టింది ఇది ప్రజల్లో హేతువాదాన్ని ప్రచారంలోకి తెచ్చింది బౌద్ధులు తమ కొత్త మతాన్ని ప్రచారం చేయటంకోసం ఒక కొత్త సాహిత్యాన్ని సంకలనం చేశారు వారు పాళీ భాషను ఎంతో సుసంపన్నం చేశారు తొలినాళ్ళ పాళీ సాహిత్యాన్ని మూడు రకాలుగా విభజించవచ్చు మొదటి రకం సాహిత్యం బుద్ధుని సూక్తులూ, ప్రబోధాలు రెండవ రకం సాహిత్యం "సంఘం"లోని సభ్యులు అనుసరించవలసిన ప్రవర్తనా నియమావళి మూడవ రకం సాహిత్యం "ధమ్మం" (ధర్మం) మీద తాత్త్విక చర్చ

బౌద్ధ భిక్షువుల సాహిత్య కృషి మధ్యయుగాలలో కూడా కొనసాగుతూనే ఉంది తూర్పు భారతదేశంలో అపభ్రంశ భాషల్లో ఉన్న కొన్ని ప్రసిద్ధ గ్రంథాలు వారు రాసినవే బౌద్ధారామాలు గొప్ప విద్యాకేంద్రాలుగా అభివృద్ధి చెందాయి వాటిని ఆవాస విశ్వవిద్యాలయాలు - రెసిడెన్షియల్ యూనివర్సిటీస్ - అని పిలవవచ్చు ఈ సందర్భంలో మనం బీహార్‌లోని నలందానూ, విక్రమశిలనూ, గుజరాత్‌లోని వలభీనీ జ్ఞాపకం చేసుకోవాల్సిన అవసరం ఉంది

ప్రాచీన భారతదేశంలోని కళల మీదకూడా బౌద్ధమతం తన శాశ్వత ప్రభావముద్రను వేసింది బహుశా భారతదేశంలో పూజించబడిన మొట్టమొదటి మానవ విగ్రహాలు బుద్ధునివే కావచ్చు బుద్ధుని శిష్యులు అతని జీవితంలోని వివిధ ఘట్టాలను శిలలమీద చెక్కారు ఇలాంటి శిలాఫలకాలు బీహార్‌లోని

గయలోనూ, మధ్యప్రదేశ్‌లోని సాంచీ, భార్‌హుత్‌లలోనూ లభించాయి అవి వారి శిల్పకళావైభవానికి ధగద్ధగాయమైన ఉదాహరణలు క్రీ శ మొదటి శతాబ్దంనుంచీకూడా బుద్ధుని ప్రతిమలు చేయటం ప్రారంభమైంది వాయవ్య భారతదేశంలో భారత, గ్రీకుశిల్పులు ఉమ్మడిగా ప్రయత్నించి, ఒక కొత్త రకమైన శిల్పకళను రూపొందించారు దాన్ని గాంధార శిల్పమంటారు ఈ ప్రాంతంలో చెక్కిన శిల్పాల్లో దేశీయ, విదేశీయ ప్రభావాలుంటాయి భిక్షువులు నివసించటం కోసం రాతిగుహలను తొలిచారు అలా గయ దగ్గరున్న బరబార్ కొండల్లోనూ, పశ్చిమ భారతదేశంలో నాసిక్ ప్రాంతంలోనూ గుహాశిల్పం ప్రారంభమైంది కృష్ణానది డెల్టా ప్రాంతంలోనూ, ఉత్తర భారతదేశంలో మధుర ప్రాంతంలోనూకూడా బౌద్ధ శిల్ప కళ గొప్పగా అభివృద్ధి చెందింది

★ ★ ★

# అధ్యాయం: 11

# ప్రాదేశిక రాజ్యాలు: మొదటి మగధ సామ్రాజ్యం

తూర్పు ఉత్తర ప్రదేశ్‌లోనూ, పశ్చిమ బీహార్‌లోనూ క్రీ పూ 6 వ శతాబ్దం నుంచీ ఇనుమును విస్తృతంగా ఉపయోగించటం ప్రారంభమైంది అది పెద్ద ప్రాదేశిక రాజ్యాలను ఏర్పాటు చేయటానికి అవసరమైన పరిస్థితుల్ని కల్పించింది ఇనుప ఆయుధాలు అందుబాటులో ఉండటంచేత యోధులు సమాజంలో ముఖ్యమైన పాత్రను వహించారు కొత్త వ్యవసాయ పనిముట్లు ఉపయోగించి రైతులు తమ అవసరాలకు మించిన ధాన్యాన్ని పండించటానికి వీలు కలిగింది రైతులవద్దనుంచీ వారి అవసరాలకుమించివున్న ధాన్యాన్ని వసూలుచేసి రాజులు దాన్ని సైనిక అవసరాలకోసమూ, పరిపాలనా అవసరాలకోసమూ ఉపయోగించగలిగారు ఈ మిగులు ధాన్యాన్ని క్రీ పూ 6 వ శతాబ్దంలో ఉదయించిన నగరాల అవసరాలను తీర్చటానికికూడా వీలు కలిగింది ఈ భౌతిక సౌకర్యాలు ప్రజలు తమ భూముల్ని అంటిపెట్టుకు జీవించటానికీ, వీలుంటే ఇరుగుపొరుగుల భూముల్ని ఆక్రమించుకోవటానికీ అవకాశాన్ని కల్పించాయి పట్టణాలు కేంద్రాలుగా, అభివృద్ధి చెందిన పెద్ద రాజ్యాలు ప్రాదేశిక రాజ్యాలు (టెరిటోరియల్ స్టేట్స్) ఉదయించ వచ్చునన్న భావానికి నారు పోశాయి ప్రజలు "జనం"పట్లకాక తాము నివసిస్తున్న ప్రదేశం ("జనపదం") పట్ల విధేయతనూ, భక్తినీ పెంచుకున్నారు

## మహాజనపదాలు

బుద్ధునికాలంలో మహా జనపదాలన్న పేరుతో 16 పెద్ద రాజ్యాలుండినట్టు మనకు తెలుస్తోంది అవి వింధ్య పర్వతాలకు ఉత్తరంగా, ఈశాన్య సరిహద్దు నుంచీ బీహారు వరకూ విస్తరించి ఉండేవి వాటిలో మగధ, కోసల, వత్స, అవంతి చాలా బలమైన రాజ్యాలుగా ఉండేవని అనిపిస్తోంది తూర్పున అంగరాజ్యం ఉండేది నేటి మాంఘీర్, భగల్పూర్ జిల్లాలు అందులో ఉండేవి దాని రాజధాని చంప క్రీ పూ 6 వ శతాబ్దం నుంచీ అక్కడ జననివాసం ఉన్నట్టుగా ఆధారాలున్నాయి కానీ కాలక్రమాన పక్కనే ఉన్న మగధ రాజ్యం అంగరాజ్యాన్ని తనలో కలుపుకుంది

నేటి పాట్నా, గయ జిల్లాలూ, షాహాబాద్ జిల్లాలో కొద్ది భాగమూ మగధ రాజ్యంగా ఉండేది మగధ ఆ కాలంలో అన్నిటికంటే బలమైన రాజ్యంగా రూపొందింది గంగకు ఉత్తరంగా తీర్హూత్ డివిజన్‌లో వజ్జి రాజ్యం ఉండేది అందులో ఎనిమిది వంశాలుండేవి వారిలో ముఖ్యమైన వారు లిచ్ఛవులు వారి రాజధాని వైశాలి అది నేటి వైశాలీ జిల్లాలోని బసర్ అన్న గ్రామం పురాణాలు వైశాలీ పట్టణానికి చాలా ప్రాచీనతను కల్పిస్తాయి కానీ పురాతత్వ ఆధారాలు క్రీ పూ 6 వ శతాబ్దం తరువాతనే అక్కడ జననివాసం ప్రారంభమైనట్టుగా చెబుతాయి

మరికొంత పడమరగా వస్తే వారాణసి రాజధానిగా కాశీరాజ్యం ఉండేది రాజఘాట్‌లో జరిగిన పురాతత్వ తవ్వకాలు క్రీ పూ 7 వ శతాబ్దంలో తొలిసారిగా అక్కడ జననివాసం ఉండేదనీ, క్రీ పూ 6 వ శతాబ్దంలో నగరం చుట్టూ మట్టితో కట్టిన గోడలుండేవనీ నిరూపిస్తున్నాయి మొదట కాశీరాజ్యం అత్యంత బలవంతమైన రాజ్యంగా ఉండేది కానీ కాలక్రమాన దాన్ని కోసల రాజ్యం ఆక్రమించుకుంది

ఈనాటి తూర్పు ఉత్తరప్రదేశ్, కోసల రాజ్యంగా ఉండేది దాని రాజధాని శ్రావస్తి ఈనాడు గోండా, బరాయిచ్ జిల్లాల సరిహద్దులోని సహేత్ – మహేత్ ను శ్రావస్తి అనేవారు అక్కడ జరిగిన తవ్వకాల ఆధారంగా చూస్తే సహేత్ – మహేత్ ప్రాంతంలో క్రీ పూ 6 వ శతాబ్దానికి పూర్వం పెద్ద ఎత్తున జననివాసం ఉండేదికాదని

తెలుస్తుంది కోసల రాజ్యంలో రామాయణ కథతో సంబంధం ఉన్న అయోధ్య ఒక ప్రధాన నగరం కానీ క్రీ పూ 6 వ శతాబ్దానికి పూర్వం అక్కడ జననివాసం అసలు ఉండేది కాదని పురాతత్వ ఆధారాలు చెబుతున్నాయి కోసల రాజ్యంలో బుద్ధుని జన్మస్థలమైన శాక్యరాజుల కపిలవస్తు పట్టణం కూడా ఉండేది శాక్యరాజ్యం స్వతంత్ర గణ రాజ్యం బస్తీ జిల్లాలోని పిప్రాహ్వాను ప్రాచీన కపిలవస్తుగా గుర్తించారు పిప్రాహ్వాకు 15 కి మీ దూరంలో ఉన్న



లుంబిని ఈనాడు నేపాల్‌లో ఉంది ఈ పట్టణం శాక్యులకు మరొక రాజధానిగా ఉండేది

కోసల రాజ్యం సరిహద్దులో మల్ల వంశానికి చెందినవారి స్వతంత్ర రాజ్యం ఉండేది ఈ రాజ్యం వజ్జి రాజ్యపు ఉత్తర సరిహద్దును తాకేది మల్లుల రాజధానుల్లో కుశీనగరం కూడా ఒకటి అక్కడే బుద్ధుడు చనిపోయాడు కుశీనగరాన్ని దేవరియా జిల్లాలోని కశియాగా గుర్తించారు

మరింత పశ్చిమంగా, యమునానది పొడవునా కౌశాంబి రాజధానిగా వత్సరాజ్యం ఉండేది వత్సరాజులు కురువంశానికి చెందినవారే వీరు అలహాబాద్ సమీపంలోని కౌశాంబిలో స్థిరపడ్డారు గంగాయమునల సంగమస్థలానికి దగ్గరగా ఉండటంచేత వారు కౌశాంబిని రాజధానిగా ఎన్నుకున్నారు అక్కడ జరిగిన తవ్వకాలు నిరూపిస్తున్నట్టుగా క్రీ పూ 6 వ శతాబ్దంలో అది బలమైన కోటను కలిగిన పట్టణం

ఇదేకాలంలో ఇంతకంటే ప్రాచీన రాజ్యాలైన కురు, పాంచాల రాజ్యాలను గురించి కూడా మనకు ప్రస్తావనలు న్నాయి పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లోని ఈ రాజ్యాలకు మలి వేదయుగంలో ఉండిన ప్రాధాన్యత ఉండేదికాదు

మధ్యప్రదేశ్‌లోని మాళ్వా మధ్యభాగాన్నీ, దాని చుట్టు పట్ల ఉన్న ప్రాంతాలనూ అవంతీ రాజ్యమంటారు దీన్ని రెండు భాగాలుగా గుర్తిస్తారు ఉత్తర ప్రాంతానికి రాజధాని ఉజ్జయిని, దక్షిణ ప్రాంతానికి రాజధాని మాహిష్మతి ఈ రెండు పట్టణాలూ కూడా క్రీ పూ 6 వ శతాబ్దం నుంచీ ప్రాముఖ్యతలోకి వచ్చినట్టుగా అక్కడ జరిగిన పురాతత్వ తవ్వకాలు నిరూపిస్తున్నాయి కానీ కాలక్రమాన ఉజ్జయిని మాహిష్మతిని దాటిపోయింది మాహిష్మతిలో ఇనుప పరిశ్రమ చాలా గొప్పగా అభివృద్ధి చెందింది అంతేకా కుండా, మాహిష్మతి చుట్టూరా బలమైన కోట కూడా నిర్మించబడింది

క్రీ పూ 6 వ శతాబ్దం నుంచీ భారతదేశ చరిత్ర ఈ రాజ్యాలు ఆధిపత్యం కోసం పరస్పరం కలహించుకున్న కథనమే చివరగా ఈ పోటీలో మగధ నెగ్గి, సామ్రాజ్యాన్ని స్థాపించగలిగింది

## మగధ సామ్రాజ్య ఉన్నతి, పతనం

బింబిసారుని నాయకత్వంలో మగధ ప్రాధాన్యతను సంతరించుకుంది అతడు హర్యంక వంశానికి చెందినవాడు, బుద్ధునికి సమకాలికుడుకూడా అతడు సామ్రాజ్య విస్తరణ కోసం యుద్ధాలను ప్రారంభించాడు అవి చివరకు అశోకుని కళింగ యుద్ధంతో ముగిసాయి బింబిసారుడు అంగరాజ్యాన్ని జయించి, చంపానగరం రాజధానిగా – దానికి అజాత శత్రువును రాజప్రతినిధిగా నియమించాడు బింబిసారుడు తన వివాహ సంబంధాలతో కూడా రాజ్యాన్ని బలపరుచుకున్నాడు అతడు ముగ్గురు భార్యల్ని స్వీకరించాడు అతని మొదటిభార్య కోసల రాజకుమార్తె, ప్రసేనజిత్ చెల్లెలు ఆవిడ కట్నంగా కాశీ పట్టణాన్ని తీసుకువచ్చింది ఆ పట్టణంమీద అతనికి లక్ష నాణాల సుంకం వచ్చేది దాన్నిచూసి మనకు ఆ కాలంలో సుంకం నాణాల రూపంలో వసూలు చేయబడేదన్న విషయం తెలుస్తుంది ఈ వివాహంతో కోసల రాజ్యం మెత్తబడింది బింబిసారునికి ఇతర రాజ్యాలతో తన ఇష్టం వచ్చిన విధంగా వ్యవహరించే స్వాతంత్ర్యాన్నిచ్చింది అతని రెండవ భార్య, వైశాలికి చెందిన లిచ్ఛవీ రాజకుమార్తె ఆవిడ పేరు చెల్లన అతని మూడవ భార్య పంజాబుకు చెందిన మద్ర తెగ నాయకుని కుమార్తె ఈ వివాహ సంబంధాలు అతని రాజకీయ ప్రతిష్ఠను చాలా గొప్పగా పెంచాయి మగధ సామ్రాజ్యాన్ని పశ్చిమ, ఉత్తర దిశలకు విస్తరింప చేయటానికి మార్గాన్ని సుగమం చేశాయి

మగధకు ప్రధాన శత్రువు ఉజ్జయిని రాజధానిగా ఉండిన అవంతీరాజ్యం ఆ దేశపు రాజైన చండప్రద్యోత మహాసే నుడు బింబిసారుణ్ణి ఎదిరించాడు కానీ ఇద్దరూ స్నేహితులు కావటమే మంచిదని నిర్ణయించుకొని రాజీ చేసుకున్నారు ఆ తరువాత ప్రద్యోత మహాసేనునికి కామెర్ల వ్యాధి వస్తే, బింబిసారుడు అతని కోరిక మీద జీవకుడన్న రాజ వైద్యుణ్ణి అవంతికి పంపాడు అంతకు పూర్వం ప్రద్యోత మహాసేనుడు గెలవలేకపోయిన గాంధార రాజుకూడా ఒక రాయబారినీ, లేఖనూ పంపి బింబిసారునితో సంధి చేసుకున్నాడు ఇలా క్రీ పూ 6 వ శతాబ్దంలో యుద్ధాల ద్వారానూ, దౌత్యసంబంధాల ద్వారానూ బింబిసారుడు మగధను సాటిలేని రాజ్యంగా రూపొందించాడు అతని రాజ్యంలో 80,000 గ్రామాలు వున్నట్లుగా చెబుతారు కానీ ఈ సంఖ్య ఒక సాంప్రదాయిక సంఖ్య అని మనం మరిచిపోకూడదు

మగధకు తొలి రాజధాని రాజగీర్ ఆ కాలంలో దాన్ని గిరివ్రజం అని పిలిచేవారు ఆ పట్టణం చుట్టూ ఐదు కొండలుండేవి వీటిమధ్య ఉన్న దారులను రాతి గోడలు కట్టి మూసేసేవారు అందుచేత గిరివ్రజం శత్రుదుర్భేద్యంగా ఉండేది

బౌద్ధుల రికార్డుల ప్రకారం బింబిసారుడు 52 సంవత్స రాలు – అంటే, క్రీ పూ 544-492 మధ్యకాలంలో – పరిపాలించాడు అతని తరువాత అతని కుమారుడు అజాతశత్రు (క్రీ పూ 492-460) రాజయ్యాడు అతడు తండ్రిని హత్యచేసి సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడు అతని పరిపాలనా కాలంలో బింబిసారవంశం కీర్తి అత్యున్నత శిఖరాలను అందుకుంది అతడు రెండు యుద్ధాలను చేశాడు మూడవ యుద్ధానికి ఏర్పాట్లు చేశాడు అతడు దురాక్రమణ పద్ధతిలో రాజ్యాన్ని విస్తరింప చేశాడు అందుచేత కాశీ, కోసల

రాజ్యాలు అతనికి వ్యతిరేకంగా ఏకమయ్యాయి అలా మగధ, కోసల రాజ్యాల మధ్య సుదీర్ఘమైన వైరం ప్రారంభమైంది చిట్టచివరకు విజయం అజాతశత్రుకే దక్కింది కోసల రాజు తన కుమార్తెనూ, కాశీనీ అజాత శత్రుకు సమర్పించి సంధి చేసుకోవలసి వచ్చింది

అజాతశత్రు బంధుత్వాలను గౌరవించే వ్యక్తికాదు అతని తల్లి లిచ్ఛవీ రాజకుమార్తె అయినా అతడు వైశాలితో యుద్ధం చేయటానికి అది అడ్డం రాలేదు అందుకు లిచ్ఛవులు కోసల రాజుల మిత్రులన్నది అతడు చూపించిన నెపం అతడు లిచ్ఛవుల్లో విభేదాలు సృష్టించి, వారిప్రాంతంమీద దాడిచేసి, చివరకు వారిని యుద్ధంలో ఓడించి, వారి స్వాతంత్ర్యాన్ని హరించాడు అతనికి వైశాలీ రాజ్యాన్ని నాశనం చేయటానికి పదహారేళ్ళు పట్టింది రాళ్ళను వడిసెలలో లాగా విసరగల కొత్త మారణాయుధాన్ని ఉపయోగించటం ద్వారా అతడు ఈ కార్యాన్ని సాధించ గలిగాడు గదలాంటి ఆయుధాన్ని అమర్చిన రథం కూడా అతనికి ఉండేది దాని సహాయంతో అతడు సామూహికంగా ప్రజల్ని చంపగలిగాడు అలా కాశీ, వైశాలీ రాజ్యాలను తనలో కలుపుకుని మగధ సామ్రాజ్యం విస్తరించింది

అవంతీ రాజు అజాత శత్రుకు ఇంతకంటే బలమైన శత్రువుగా రూపొందాడు ఆ రాజు కోశాంబికి చెందిన వత్సరాజులను జయించి, మగధమీద దండయాత్ర చేయ గలడన్న భయాన్ని సృష్టించాడు ఈ ప్రమాదం నుంచీ రక్షించుకోవటానికి అజాతశత్రు రాజ్‌గిర్ నగరానికి కోటను కట్టటం ప్రారంభించాడు ఆ కోట గోడ శిధిలాలను ఈనాటికీ చూడవచ్చు కానీ అజాతశత్రు కాలంలో ఆ దండయాత్ర జరగలేదు

అజాతశత్రు తరువాత ఉదయనుడు (క్రీ పూ 460–444) రాజయ్యాడు పాట్నావద్ద గంగా, సోన్ నదుల సంగమ స్థానంలో కోటను నిర్మించటం చేత ఇతని పరిపాలనాకాలాన్ని విశిష్టమైనదిగా చెప్పవచ్చు మగధ సామ్రాజ్యానికి పాట్నా మధ్యలో ఉండటం చేత అతడు కోటను అక్కడ నిర్మించాడు అప్పటికి మగధ సామ్రాజ్యం ఉత్తరాన హిమాలయాల నుంచీ దక్షిణాన ఛోటానాగపూర్ కొండల వరకూ విస్తరించి ఉండేది పాట్నా ఉనికి చాలా కీలకమైంది ఈ విషయాన్ని తరువాత చూడవచ్చు

ఉదయనుని తరువాత శిశునాగులు రాజ్యానికొచ్చారు వీరు రాజధానిని తాత్కాలికంగా వైశాలికి మార్చారు ఉజ్జయిని రాజధానిగా ఉన్న అవంతీ రాజ్యాన్ని ధ్వంసం చేయటం వీరు సాధించిన ఘనకార్యం అంతటితో మగధ, అవంతీ రాజ్యాల మధ్య వంద సంవత్సరాలు కొనసాగిన వైరం ముగిసింది అనాటినుంచీ మౌర్య సామ్రాజ్య పతనం వరకూ అవంతి మగధ సామ్రాజ్యంలో ఒక భాగంగా మాత్రమే కొనసాగింది

శిశునాగుల తరువాత నందులు మగధలో అధికారానికి వచ్చారు మగధను పాలించిన అత్యంత బలమైన రాజులుగా వీరిని పేర్కొనవచ్చు వీరి ప్రాబల్యం ఎంత పటిష్ఠంగా ఉండేదంటే – పంజాబును ఆక్రమించిన అలెగ్జాండర్ మరింత తూర్పుకు రావటానికి సాహసించ లేకపోయాడు నందులు కళింగను మగధ సామ్రాజ్యంలో కలిపారు అక్కడనుంచీ వీరు ఒక జైన తీర్థంకరుని విగ్రహాన్ని విజయచిహ్నంగా తీసుకు వచ్చారు ఇదంతా కూడా మహా పద్మనందుని పరిపాలనా కాలంలో జరిగింది అతడు తాను ఇతర రాజుల నందరినీ నిర్మూలించిన "ఏకరాట్"నని ప్రకటించుకున్నాడు అతడు కళింగను మాత్రమే కాకుండా బహుశా అతనిమీద తిరుగుబాటు చేసిన కోసల రాజ్యాన్ని కూడా ఆక్రమించుకున్నట్టుగా తెలుస్తోంది

నందులు అసాధారణ సంపన్నులు, అసామాన్యమైన బలవంతులు వీరికి రెండు లక్షల కాల్బలం, అరవైవేల అశ్విక దళం, అరువేల ఏనుగులు (యుద్ధంలో ఉపయోగించ గలిగినవి) ఉండేవట ఇంత పెద్ద శాశ్వత సైన్యాన్ని పోషించాలంటే చక్కని పన్నుల విధానం ఉండివుండాలి ఈ కారణాలవల్లనే అలెగ్జాండర్ నందుల మీదికి రాలేదు

తరువాత కాలంలో వచ్చిన నందరాజులు బలహీనులు, ప్రజాభిమానం లేనివారు మగధలో నందుల పరిపాలన అతరించిపోయి, మౌర్యుల పరిపాలన వచ్చింది వీరికాలంలో మగధ సామ్రాజ్య వైభవం, కీర్తి – శిఖరాగ్రాలకు చేరుకున్నాయి

## మగధ విజయానికి కారణాలు

మౌర్యులు అధికారానికి రావటానికి రెండువందల సంవత్సరాల పూర్వం వరకూ మగధ సామ్రాజ్య విస్తరణను అదేకాలంలో జరిగిన ఇరానియన్ సామ్రాజ్య విస్తరణతో పోల్చవచ్చు భారతదేశంలో అనాడు అత్యంత విశాలమైన సామ్రాజ్యాన్ని స్థాపించిన ఘనత బింబిసారుడూ, అజాతశత్రువూ, మహా పద్మనందుడూ మొదలైన అనేక రాజులకు దక్కుతుంది వారు తెలివి తేటలూ, రాజ్య విస్తరణ కాంక్షా ఉన్న గొప్ప రాజులు వారు తమ రాజ్యాలను విస్తరింప చేయటానికీ, బలోపేతం చేయటానికీ మంచీవీ, చెడ్డవీ అన్న తేడాలేకుండా అన్ని పద్ధతులనూ అనుసరించారు కానీ మగధ సామ్రాజ్య విస్తరణకు ఇదొక్కటే కారణం కాదు

అవి కాకుండా ముఖ్యమైన అనేక ఇతర కారణాలున్నాయి మగధకు తొలిరాజధాని అయిన రాజ్‌గిర్ సమీపంలోనే గొప్ప ఇనుప నిక్షేపాలుండేవి ఆ ఇనుపయుగంలో భౌగోళికంగా మగధకు ఇది గొప్ప అనుకూలంగా పనిచేసింది అంత సమీపంగా మంచి ఇనుపఖనిజం లభించటం చేత మగధ రాజులు మెరుగైన ఆయుధాలను తయారుచేసుకో గలిగారు అలాంటి ఆయుధాలు వారి శత్రువులకు తేలికగా లభించేవి

కావు. ఉజ్జయిని రాజధానిగా ఉన్న అవంతీ రాజ్యానికి దగ్గరగా మధ్యప్రదేశ్ తూర్పు ప్రాంతంలో కూడా ఇనుప గనులు బయటపడ్డాయి. క్రీ. పూ. 500 ప్రాంతంలో ఇనుమును కరిగించటం, శుద్ధి చేయటం ఉజ్జయినిలో జరిగే దనటానికి ఎలాంటి సందేహమూ లేదు. బహుశా వారి కమ్మరులు కూడా మంచి నాణ్యత కలిగిన ఆయుధాలను తయారుచేసేవారు. అందుచేతనే మగధకు అవంతి తీవ్రమైన ప్రతిద్వందిగా తయారైంది. అవంతిని అణచటానికి మగధకు దాదాపు వంద సంవత్సరాలు పట్టింది.

మగధకు మరికొన్ని ఇతర సౌకర్యాలు కూడా ఉండేవి. మగధ మొదటి రాజధాని అయిన రాజ్‌గీర్, తరువాత రాజధాని అయిన పాటలీపుత్రం యుద్ధతంత్రం దృష్టితో చూసినప్పుడు భద్రమైన చోట్లలో ఉండేవి. రాజ్‌గీర్ ఐదు కొండల మధ్యలో ఉండేది. కోట గోడల్ని పగలగొట్టే ఫిరంగుల లాంటి ఆయుధాలు లేని ఆ కాలంలో రాజ్‌గీర్ దుర్గాన్ని ఆక్రమించటం అసాధ్యంగా ఉండేది. క్రీ. పూ. 5 వ శతాబ్దంలో మగధ రాజులు తమ రాజధానిని పాటలీపుత్రానికి మార్చారు. పాటలీపుత్రం గంగ, గండకీ, సోన్ నదుల సంగమ స్థానంలో ఉంది. పారిశ్రామిక యుగానికి ముందు, వార్తా సౌకర్యాలు కష్టంగా ఉన్న కాలంలో మగధ సైన్యాలు నదుల మీద నాలుగు దిక్కులకూ ప్రయాణం చేయగలిగేవి. అంతేకాకుండా దాదాపు అన్నివైపులా నదుల చేత చుట్టబడి ఉండటం చేత పాటలీపుత్రం శత్రుదుర్భేద్యంగా ఉండేది. సోన్, గంగానదులు ఉత్తర, పశ్చిమాలలోనూ, పూన్‌పన్ దక్షిణ, తూర్పుదిశల్లోనూ పాటలీపుత్రాన్ని చుట్టి ఉండేవి. పాటలీపుత్రం నిజమైన జలదుర్గం. ఈ నగరాన్ని ఆక్రమించటం ఆ కాలంలో అసాధ్యంగా ఉండేది.

మధ్యగంగా మైదానం కేంద్రబిందువుగా పాటలీపుత్రం ఉండేది. అడవుల్ని తొలిగిస్తే ఒండ్రుమట్టి భూమి ఎంతో సారవంతంగా ఉండేది. వర్షపాతం అధికంగా ఉండటం చేత నీటిపారుదల సౌకర్యం లేకపోయినా వ్యవసాయం చేయటానికి సాధ్యమయ్యేది. ఈ ప్రాంతంలో రకరకాల వడ్లు పండించేవారు. వాటని గురించిన ప్రస్తావన తొలి బౌద్ధ గ్రంధాలలో ఉంది. అలహాబాదుకు పడమరగా ఉన్న ప్రాంతంలో కంటే ఈ ప్రాంతంలో ఎక్కువగా పంటలు పండేవి. కాబట్టి రైతుకు తన అవసరాలకు మించి పండించే వీలు కలిగింది. ఆ అదనపు పంటను పాలకులు పన్నుల రూపంలో గుంజుకునేవారు.

పట్టణాలు అభివృద్ధి చెందటం చేతా, లోహాలతో చేసిన నాణాలు చెలామణీలోకి రావటం చేత కూడా మగధపాలకులు లాభపడ్డారు. ఈశాన్య భారతదేశంలో వ్యాపారం అభివృద్ధి చెందటం చేత పాలకులు తమ సైన్యాలను పోషించటం కోసమూ, ధనాన్ని సేకరించుకోవటం కోసమూ పన్నులు విధించటానికి వీలు కలిగింది.

సైనిక వ్యవస్థలో మగధకు ప్రత్యేక సౌకర్యాలు కూడా లభించాయి. గుర్రాలనూ, రథాలనూ ఉపయోగించటం ఇతర రాజ్యాలకు తెలుసు. కానీ ఏనుగులను పెద్ద ఎత్తున ఇరుగుపొరుగు రాజ్యాలతో జరిగిన యుద్ధాలలో మొదటిసారిగా ఉపయోగించింది మగధ రాజులే. వారికి భారతదేశం తూర్పుభాగం నుంచీ ఏనుగులు సరఫరా అయ్యేవి. గ్రీకు చారిత్రకాధారాల ప్రకారం నందరాజుల వద్ద 6000 ఏనుగులుండేవి. కోటల్ని పగలకొట్టటానికీ, బాటలూ, ఇతర ప్రయాణ సౌకర్యాలూ లేని బురద ప్రాంతాలలో నడిపించటానికీ ఏనుగులు బాగా ఉపయోగపడేవి.

చివరగా మనం మగధ రాజ్యంలోని సమాజం యొక్క సంప్రదాయ వ్యతిరేక స్వభావాన్ని గురించి ఆలోచించాలి. అక్కడ కిరాతులూ, మాగధులూ జీవించేవారు. వీరిని సాంప్రదాయిక బ్రాహ్మణులు తక్కువగా చూసేవారు. వైదిక ప్రజలు రావటంతో అక్కడ సంతోషకరమైన జాతి సాంకర్యం జరిగింది. కొత్తగా ఆర్యీకరణం చెందటం చేత మగధ రాజులు అంతకు ముందు వేదమతాన్ని స్వీకరించిన వారికంటే సామ్రాజ్య విస్తరణలో ఎక్కువ ఉత్సాహాన్ని చూపించారు. ఈ కారణాలచేత మగధ ఇతర రాజ్యాలను ఓడించ గలిగింది. భారతదేశంలో మొదటి సామ్రాజ్యాన్ని స్థాపించ గలిగింది.

★ ★ ★

# అధ్యాయం: 12

# ఇరానియన్, మాసిడోనియన్ దండయాత్రలు

## ఇరానియన్ దండయాత్ర

భారతదేశంలోని ఈశాన్య భాగంలో చిన్న చిన్న సామంత రాజ్యాలూ, స్వతంత్ర రాజ్యాలూ మగధ సామ్రాజ్యంలో విలీన మయ్యాయి కానీ వాయవ్య భారతదేశంలో క్రీ పూ 6 వ శతాబ్దంలో పరిస్థితి మరొకరకంగా ఉండేది చిన్న చిన్న రాజ్యాలైన కాంభోజ, గాంధార, మద్ర రాజ్యాలు పరస్పరం కలహించుకుంటూ ఉండేవి ఆ ప్రాంతంలో ఈ చిన్న రాజ్యాలను ఐక్యం చేయగల సామర్థ్యం ఉన్న మగధలాంటి పెద్ద సామ్రాజ్యం ఉండేది కాదు దానికితోడు ఈ ప్రాంతం సంపన్నమైంది కూడా హిందూకుష్ కనుమల కుండా ఈ ప్రాంతంలోకి ప్రవేశించటం సులభంగా ఉండేది

మగధ రాజుల కాలంలోనే తమ సామ్రాజ్యాన్ని విస్తరింప చేసిన ఇరాన్‌కు చెందిన అకిమేనియన్ రాజులు భారతదేశం వాయవ్య ప్రాంతంలోని రాజకీయ అనైక్యతను అవకాశంగా తీసుకున్నారు క్రీ పూ 516 లో ఇరాన్ రాజు డేరియస్ వాయవ్య ప్రాంతంలోకి ప్రవేశించి పంజాబునూ, సింధునది పశ్చిమప్రాంతాన్నీ, సింధూనూ ఆక్రమించుకున్నాడు ఈ ప్రాంతం ఇరానియన్ సామ్రాజ్యంలోని ఇరవైయవ రాష్ట్రం (సాత్రపి)గా మారిపోయింది ఇరానియన్ సామ్రాజ్యంలో 28 సాత్రపులుండేవి భారతీయ సాత్రపిలో సింధు, వాయవ్య భారతం, సింధూనదికి పడమర ఉన్న పంజాబు ఉండేవి ఇది ఇరానియన్ సామ్రాజ్యంలోనే అత్యంత సారవంతమైన, జనసాంద్రత కలిగిన ప్రాంతంగా ఉండేది ఈ ప్రాంతం నుంచీ ఇరానియన్ సామ్రాజ్యానికి 360 టాలంట్ల కప్పం బంగారం రూపంలో లభించేది ఆసియా ప్రాంత రాష్ట్రాలనుంచీ ఇరానియన్ సామ్రాజ్యానికి లభించే ఆదాయంలో ఇది మూడవ భాగంగా ఉండేది భారతీయుల్ని ఇరానియన్ సైన్యంలో కూడా చేర్చుకునేవారు డేరియస్ తరువాత ఇరాన్‌సామ్రాజ్యానికి చక్రవర్తి అయిన జెక్సీస్ గ్రీకులతో జరిగిన సుదీర్ఘపోరాటంలో భారతీయ సైనికుల్ని ఉపయోగించాడు అలెగ్జాండర్ దండయాత్ర కాలం వరకూ భారతదేశంలోని ఈ ప్రాంతం ఇరానియన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండేదనిపిస్తోంది

## దండయాత్ర ఫలితాలు

భారత ఇరాన్‌ల మధ్య సంబంధాలు 200 సంవత్సరాలు కొనసాగాయి దీని ఫలితంగా వ్యాపార సంబంధాలు ప్రారంభమయ్యాయి వీటికంటే సాంస్కృతిక ఫలితాలు ఎక్కువ ముఖ్యమైనవి ఇరానియన్ లేఖకులు ఖరోష్టి అన్న లిపిని భారతదేశానికి తీసుకువచ్చారు దాన్ని అరబిక్‌లాగా కుడి నుంచీ ఎడమకు రాసేవారు క్రీ పూ 3 వ శతాబ్దానికి చెందిన అశోకుని శాసనాలు కొన్ని వాయవ్యభారతంలో ఈ లిపిలో రాయబడ్డాయి ఈ లిపి దాదాపు క్రీ శ 3 వ శతాబ్దం వరకూ ఉపయోగంలో ఉండేది ఇరానియన్ నాణాలు వాయవ్య భారతంలో లభించాయి అవి ఇరాన్‌కు ఆ ప్రాంతంతో వ్యాపార సంబంధాలుండేవని నిరూపిస్తున్నాయి కానీ విద్దాంక నాణాలు (పంచ్‌మార్క్‌డ్ కాయిన్స్) ఇరాన్ సంబంధం వల్లనే భారతదేశంలో కొనసాగాయని భావించటం మాత్రం పొరపాటు మౌర్య శిల్పకళమీద ఇరానియన్ ప్రభావం స్పష్టంగానే కనిపిస్తుంది అశోకుని కాలంనాటి స్మారక నిర్మాణాలు – మరీ ముఖ్యంగా గంట ఆకారంలో నిర్మించిన స్తంభాగ్రాలు – ఇరానియన్ నమూనాలను కొంతవరకైనా పోలి ఉన్నాయి అశోకుని శాసనాలలో ఉన్న ఉపోద్ఘాతాల్లోనూ, వాటిలో ఉపయోగించిన కొన్ని పదాలలోనూ కూడా ఇరానియన్ ప్రభావం కనిపిస్తుంది ఉదాహరణకు "దిపి" అన్న ఇరానియన్ పదానికి బదులుగా అశోకుని శాసన లేఖకుడు "లిపి" అన్న పదాన్ని ఉపయోగించాడు ఇరానియన్‌ల ద్వారానే బహుశా గ్రీకులు భారతదేశంలోని

అసాధారణ సంపదను గురించి తెలుసుకున్నారు అది వారి దురాశను అధికం చేసింది చివరకు అది అలెగ్జాండర్ దండయాత్ర రూపంలో బయటపడింది

## అలెగ్జాండర్ దండయాత్ర

క్రీ పూ నాలుగవ శతాబ్దంలో గ్రీకులూ, ఇరానియన్‌లూ ప్రపంచాధిపత్యం కోసం పోరాడుకున్నారు మాసిడోనియాకు చెందిన అలెగ్జాండర్ నాయకత్వంలో గ్రీకులు చిట్టచివరకు ఇరానియన్ సామ్రాజ్యాన్ని ధ్వంసం చేశారు అలెగ్జాండర్ ఆసియా మైనర్‌నూ, ఇరాక్‌ను మాత్రమే కాకుండా ఇరాన్‌ను కూడా జయించాడు భారతదేశంలోని అశేష ధన సంపద ఆకర్షించటం వల్లనే కాబోలు – ఇరాన్ నుంచీ భారతదేశం మీదికి తన సైన్యాలను నడిపించాడు 'చరిత్రపిత'గా అందరూ భావించే హెరొడోటస్, ఇతర గ్రీకు రచయితలూ భారతదేశాన్ని అద్భుతాల దేశంగా చిత్రించారు ఆ వర్ణనలు అలెగ్జాండర్ భారతదేశం మీదికి రావటానికి ప్రోత్సహించాయి అలెగ్జాండర్‌కు భౌగోళిక శాస్త్రంలోనూ, ప్రకృతి విజ్ఞానంలోనూ గొప్ప ఆసక్తి ఉండేది కాస్పియన్ సముద్రం భారతదేశం తూర్పుభాగం వరకూ విస్తరించి ఉందని ఎవరో చెప్పగా అతడు విన్నాడు తనకంటే ముందు వచ్చిన వీరుల సాహస కృత్యాలను గురించి కూడా తెలుసుకున్నాడు వారిని అనుకరించాలనీ, అధిగమించాలనీ అతనికి కోరిక కలిగింది

వాయవ్యభారతంలోని రాజకీయ పరిస్థితి అతని ప్రణాళికకు అనుకూలంగా ఉంది ఆ ప్రాంతం అనేక చిన్న గణతంత్ర రాజ్యాలుగా, గిరిజన రాజ్యాలుగా విభజించబడి ఉంది వారికి తమ రాజ్యం మీదా, ప్రాంతం మీదా అపారమైన భక్తి ఉండేది ఈ రాజ్యాలను ఒకటి తరువాత ఒకటిగా జయించటం అలెగ్జాండర్‌కు సులభమనిపించింది ఈ రాజులలో ఇద్దరు ప్రసిద్ధులు వారు తక్షశిల రాజైన అంభి, జీలం, చీనాబ్ నదుల మధ్య ఉన్న ప్రాంతానికి రాజైన పోరస్ వీరిద్దరూ ఏకమై ఉంటే అలెగ్జాండర్‌ను నిరోధించగలిగి ఉండేవారు కానీ వీరిద్దరూ కలిసి పోరాడలేదు కైబర్ కనుమ ఎలాంటి రక్షణా లేకుండా ఉండిపోయింది

ఇరాన్‌ను జయించిన తరువాత అలెగ్జాండర్ కాబూల్‌ను ఆక్రమించుకున్నాడు అక్కణ్ణుంచీ క్రీ పూ 326లో కైబర్ కనుమ గుండా భారతదేశంలోకి ప్రవేశించాడు అతనికి సింధూప్రాంతం చేరుకోవటానికి ఐదునెలలు పట్టింది తక్షశిలరాజైన అంభి శత్రువుకు దాసోహం అని, సైనిక సహాయమూ, ధన సహాయమూ చేశాడు జీలం నదిని చేరేసరికి అలెగ్జాండర్‌ను మొదటిసారిగా పోరస్ అత్యంత సాహసోపేతంగా ఎదిరించాడు అలెగ్జాండర్ పోరస్‌ను ఓడించాడు కానీ అతని ధైర్యసాహసాలను చూసి ఎంతో మెచ్చుకున్నాడు అతని రాజ్యాన్ని అతనికి తిరిగి ఇచ్చేశాడు అతణ్ణే తన రాజకీయ మిత్రుడుగా గ్రహించాడు తరువాత బియాస్ నది వరకూ పురోగమించాడు ఇంకా తూర్పుకు పురోగమించాలని భావించాడు కానీ అతని సైన్యం అతనితో సహకరించలేదు గ్రీకుసైనికులు యుద్ధాలతో అలసిపోయారు, జబ్బు పడ్డారు భారతదేశంలోని వేడి వాతావరణం, పది సంవత్సరాల నిరంతర యుద్ధాలూ వారిని ఇంటిని గురించి ఆలోచించేలా చేశాయి అంతేకాకుండా సింధూనదీతీరంలో భారతీయుల పోరాట పటిమను రుచి చూశారు అందుచేత వారు ముందుకు సాగటానికి అంగీకరించలేదు అరియన్ అన్న గ్రీకు చరిత్రకారుడు చెప్పినట్టుగా "ఆ కాలంలో ఆ ప్రాంతంలోని ఇతర దేశాలతో పోల్చి చూసినప్పుడు భారతీయులు యుద్ధకళలో ఎంతో మెరుగైనవారు" మరీ ముఖ్యంగా గంగా తీరాన ఉన్న శత్రుదుర్నిరీక్ష్యమైన రాజ్యాన్ని గురించి విన్నారు అదే నందుల పరిపాలనలో ఉన్న మగధ రాజ్యం వారి సైనిక శక్తి అలెగ్జాండర్ సైనిక శక్తికంటే ఎక్కువ కాబట్టే అలెగ్జాండర్ ఎంతగా బతిమాలినా అతని సైన్యాలు అంగుళం ముందుకు కదలటానిక్కూడా అంగీకరించలేదు "నేను అవిధేయతతో, పిరికి భయాలతో నలిగిపోయిన హృదయాలను ఉత్సాహపరచటానికి ప్రయత్నిస్తున్నాను" అని అలెగ్జాండర్ బాధపడ్డాడు శత్రువుల చేతిలో పరాజయం ఎరుగని రాజు తన సొంతసైనికుల చేతిలోనే ఓడిపోవలసి వచ్చింది తూర్పు దేశాల్లో సామ్రాజ్య విస్తరణ అతనికి తీరని కలగా మిగిలిపోయింది అతడు తిరిగిపోతూ భారతదేశం సరిహద్దుల వరకూ అనేక చిన్న చిన్న రాజ్యాలను జయించాడు అతడు భారతదేశంలో 19 నెలలు (క్రీ పూ 326–325) గడిపాడు అవిశ్రాంతంగా యుద్ధాలు చేశాడు తాను జయించిన ప్రాంతాలలో పరిపాలనా వ్యవస్థల్ని ఏర్పాటు చేయటానికి అతనికి సమయం లేకపోయింది కానీ అతడు కొన్ని ఏర్పాట్లు చేశాడు తన ఆధిపత్యాన్ని అంగీకరించిన రాజులకు వారి రాజ్యాలను తిరిగి ఇచ్చేశాడు తన సొంత సామ్రాజ్యాన్ని మూడు భాగాలు చేసి, వాటిని ముగ్గురు గవర్నర్ల కింద ఉంచాడు తన ప్రాంతంలో తన అధికారాన్ని కొనసాగించటంకోసం అనేక నగరాలను స్థాపించాడు

## అలెగ్జాండర్ దండయాత్ర ప్రభావం

ప్రాచీన గ్రీస్ ప్రాచీన భారతదేశంతో దగ్గరి సంబంధాలను ఏర్పరచుకోవటానికి అలెగ్జాండర్ దండయాత్ర మొట్టమొదటి అవకాశాన్ని కల్పించింది దీనివల్ల ముఖ్యమైన ఫలితాలు వచ్చాయి అలెగ్జాండర్ భారతదేశ దండయాత్ర గొప్ప విజయమే అతడు తన సామ్రాజ్యానికి ఒక భారతీయ

పరగణాను కలిపాడు అది ఇరాన్ ఆక్రమించిన భారత భూభాగం కంటే చాలా పెద్దది కానీ గ్రీకులు సంపాదించిన భారతభూభాగాలు అనతికాలంలోనే మౌర్య చక్రవర్తుల పాలయ్యాయి

అనేకరంగాలలో గ్రీస్, భారతదేశాల మధ్య సరాసరి సంబంధాలు ఏర్పడటం అలెగ్జాండర్ దండయాత్ర వల్ల కలిగిన అత్యంత ప్రధానమైన ఫలితం అలెగ్జాండర్ దండయాత్ర భారత, గ్రీస్ దేశాల మధ్య నాలుగు భూమార్గాలనూ, సముద్రమార్గాలనూ ఉపయోగంలోకి తెచ్చింది వాటిద్వారా గ్రీకు వ్యాపారులూ, చేతిపనివారూ భారతదేశానికి రావటం ప్రారంభించారు ఆనాటి వరకూ ఉన్న వ్యాపార సౌకర్యాలు అభివృద్ధి చెందాయి

అలెగ్జాండర్ దండయాత్రకు పూర్వం కూడా వాయవ్య ప్రాంతంలో కొందరు గ్రీకులు నివసించేవారని తెలుస్తోంది కానీ ఆ తరువాత ఈ ప్రాంతంలో గ్రీకు జననివాసాలు పెరిగాయి వీటిలో ప్రధానమైనవి కాబూల్ ప్రాంతంలోని అలెగ్జాండ్రియా నగరం, జీలం ప్రాంతంలోని బూకేషాలా, సింధుప్రాంతంలోని అలెగ్జాండ్రియా ఈ ప్రాంతాలను ఆ తరువాత మౌర్యులు జయించినా చంద్రగుప్త మౌర్యుని కాలంలోనూ, అశోకుని కాలంలోనూ గ్రీకులు అక్కడే నివసించారు

తాను మొట్టమొదటిసారిగా సింధూనది ముఖద్వారంలో చూసిన సముద్రంలోని భౌగోళిక రహస్యాల పట్ల అలెగ్జాండర్‌కు తీవ్రమైన ఆసక్తి ఉండేది అతడు తన స్నేహితుడు నియార్చెస్ నాయకత్వంలో సింధూనది ముఖ ద్వారం నుంచీ యూఫ్రెటిస్ ముఖ ద్వారం వరకూ ఉన్న ఓడరేవుల్ని గురించి తెలుసుకోవటానికి తన కొత్త నౌకాదళాన్ని పంపాడు అలెగ్జాండర్ చరిత్రకారులు ఎంతో విలువైన భౌగోళిక సమాచారాన్ని మనకు అందజేశారు వారు అలెగ్జాండర్ దండయాత్రల్ని గురించి స్పష్టమైన తేదీలున్న రికార్డుల్ని తయారు చేశారు నిశ్చితమైన ఆధారాల మీద మనం తరువాతి కాలపు చారిత్రక ఘటనల కాలక్రమాన్ని నిర్మించుకోవటానికి ఈ రికార్డులు వీలు కలిగిస్తున్నాయి అలెగ్జాండర్ చరిత్రకారులు మనకు సామాజిక, ఆర్థిక పరిస్థితులను గురించి కూడా విలువైన సమాచారాన్ని అందించారు వారు సతీసహగమనాన్ని గురించీ, బీద తలిదండ్రులు తమ కుమార్తెల్ని సంతల్లో అమ్ముకోవటాన్ని గురించీ, వాయవ్య ప్రాంతంలోని మేలైన కోడెల్ని గురించీ చెప్పారు గ్రీసులో ఉపయోగించటం కోసం అలెగ్జాండర్ రెండు లక్షల ఎద్దుల్ని మాసిడోనియాకు పంపాడు భారతదేశంలో అత్యంత ప్రజాదరణ ఉన్న వృత్తి వడ్రంగం ఆనాటి వడ్రంగులు రథాలనూ, పడవలనూ, ఓడలనూ తయారుచేసేవారు

వాయవ్య భారతదేశంలోని చిన్న చిన్న రాజ్యాలను అలెగ్జాండర్ ధ్వంసం చేశాడు అలా అలెగ్జాండర్ దండయాత్ర ఆ ప్రాంతంలో మౌర్య సామ్రాజ్య విస్తరణకు దారి చూపింది మౌర్య సామ్రాజ్య స్థాపకుడైన చంద్ర గుప్త మౌర్యుడు అలెగ్జాండర్ సైనిక యంత్రాంగాన్ని పరిశీలించి, నందుల సైనిక శక్తిని ధ్వంసం చేయటానికి అవసరమైన విజ్ఞానాన్ని సంపాదించుకున్నట్టుగా ఒక సాంప్రదాయక కథనం ఉంది

★ ★ ★

# అధ్యాయం: 13

# బౌద్ధయుగంలో రాజ్యం, వర్ణసమాజం

## భౌతిక జీవితం

పురాతత్వ సాక్ష్యాధారాలతో కలిపి – పాళీ గ్రంథాల ఆధారంగానూ, సంస్కృత సూత్రసాహిత్యం ఆధారంగానూ అధ్యయనం చేస్తే తూర్పు ఉత్తర ప్రదేశ్, బీహార్ ప్రాంతాలలో భౌతిక జీవితం ఎలా ఉండేదో అర్థం చేసుకోవచ్చు పురాతత్వ శాస్త్రం ఆధారంగా చూస్తే క్రీ పూ 6 వ శతాబ్దాన్ని ఎన్ బి పి డబ్లియు దశకు ప్రారంభంగా చెప్పవచ్చు ఎన్ బి పి డబ్లియు అంటే "నార్తర్న్ బ్లాక్ పాలిష్డ్ వేర్" అని అర్థం ఈ కాలానికి చెందిన పాత్రలు తళతళలాడే మెరుపు ఉన్న మట్టిపాత్రలు వీటిని చక్కని నిర్మాణ కౌశలంతో చేసేవారు ధనవంతులు ఈ పాత్రల్ని బహుశా భోజన సమయంలో ఉపయోగించేవారు వీటితోపాటు ముఖ్యంగా చేతిపనులకూ, వ్యవసాయానికీ ఉపయోగించే పనిముట్లు కూడా బయటపడ్డాయి ఈ దశలోనే లోహంతో చేసిన నాణాల ఉపయోగం కూడా ప్రారంభమైంది కాల్చిన ఇటుకలూ, గుండ్రని బావులూ ఎన్ బి పి డబ్లియు దశ మధ్యలో – అంటే క్రీ పూ 3 వ శతాబ్దంలో – మొదటిసారిగా కనిపిస్తాయి

ఎన్ బి పి.డబ్లియుతో భారతదేశంలో రెండవ నగరీకరణం ప్రారంభమైంది క్రీ పూ 1500 ప్రాంతంలో హరప్పా నాగరికతకు చెందిన నగరాలు అదృశ్యమైపోయాయి తరువాత 1000 సంవత్సరాల కాలం భారతదేశంలో ఎలాంటి నగరాలూ కనిపించవు క్రీ పూ 6 వ శతాబ్దంలో రెండవ నగరీకరణం ప్రారంభమైంది పాళీ, సంస్కృత గ్రంథాల్లో పేర్కొనబడిన కోశాంబీ, శ్రావస్తి, అయోధ్య, కపిలవస్తు, వారాణసి, వైశాలి, రాజ్‌గీర్, పాటలీపుత్రం, చంప మొదలైన నగరాలు తవ్వకాల్లో బయటపడ్డాయి ప్రతిచోటా ఎన్ బి పి డబ్ల్యు దశప్రారంభానికో, మధ్యకాలానికో చెందిన మట్టి ఇళ్ళు, జన నివాసం ఉన్న ఆధారాలూ లభించాయి పాట్నాలో కర్రగుంజల కంచలు కూడా బయటపడ్డాయి బహుశా ఇవి మౌర్యుల కాలానికో, వారి పూర్వకాలానికో చెందినవి కావచ్చు ఈ నగరాలలో కొన్నిటికి కోట గోడలున్నాయి ఇళ్ళను ఇటుకలతోనూ, కర్రతోనూ నిర్మించారు మధ్యగంగామైదానంలోని తడి వాతావరణానికి అవి కూలిపోయాయి పాళీ గ్రంథాలలో ఏడంతస్తుల మేడల ప్రస్తావన ఉన్నా అలాంటివి ఎక్కడా బయటపడలేదు తవ్వకాల్లో బయటపడ్డ నిర్మాణాలు ఆకర్షణీయంగా లేవు కానీ బూడిదరంగు పాత్రలు లభించిన నివాసాలతో పోల్చి చూసినప్పుడు జనసంఖ్య చాలా ఎక్కువగా పెరగటాన్ని ఈ నివాసాలు సూచిస్తాయి

అనేక పట్టణాలు రాజధానులుగా, ప్రభుత్వ కేంద్రాలుగా ఉండేవి వాటి ప్రారంభం ఎలా ఉన్నా, అవి వ్యాపార కేంద్రాలుగా అభివృద్ధి చెంది – వ్యాపారులకూ, చేతివృత్తుల వారికీ నివాసాలయ్యాయి కొన్నిచోట్లలో చేతివృత్తులవారు పెద్దసంఖ్యలో నివసించటం ప్రారంభించారు వైశాలిలోని "సద్దలపుత్త"లో 500 కుమ్మరి దుకాణాలుండేవి చేతి వృత్తులవారూ, వ్యాపారులూ తమ పెద్ద నాయకత్వంలో వృత్తి సంఘాలను ఏర్పాటు చేసుకున్నారు అలాంటి వృత్తి సంఘాలు 18 ఉండినట్టుగా మనకు ఆధారాలు లభిస్తున్నాయి కానీ కమ్మరులు, వడ్రంగులు, చర్మకారులు, రంగులు వేసే కార్మికులు ఏర్పాటు చేసుకున్న వృత్తి సంఘాలు ప్రత్యేకంగా ప్రస్తావించబడ్డాయి పట్టణాల్లో చేతివృత్తులవారూ, వ్యాపారులు నిర్ణీత ప్రదేశాల్లో నివసించేవారు వారాణసిలో వైశ్యుల వీధి ఉన్నట్టుగా మనకు తెలుస్తోంది అలాగే దంతశిల్పుల వీధి కూడా ఉండేది అలా వృత్తి సంఘాల కారణంగానూ, ఒకే చోట నివసించటం కారణంగానూ వృత్తి నైపుణ్యాన్ని వారు పెంచుకున్నారు సాధారణంగా చేతివృత్తులు వంశ పారంపర్యంగా వచ్చేవి కుటుంబ వృత్తిని కొడుకు తండ్రి వద్దనుంచీ నేర్చుకునేవాడు

చేతివృత్తులవారు తయారుచేసిన వస్తువుల్ని వ్యాపారులు సుదూర ప్రాంతాలకు తీసుకువెళ్లేవారు అలాంటి వస్తువుల్ని 500 బళ్ళలో తీసుకు వెళ్ళినట్టుగా అనేక సందర్భాలలో

ప్రస్తావించబడింది ఈ వస్తువుల్లో నాజూకైన బట్టలూ, దంతపు వస్తువులూ, కుండలూ మొదలైనవి వుండేవి అనాటి ప్రధాన నగరాలన్నీ నదీతీరాలలోనో, వ్యాపార మార్గాల పక్కనో ఉండేవి వీటికి ఒకదానితో మరొకటికి రాకపోకల సంబంధం ఉండేది కోశాంబి, వారాణసి పట్టణాలకూ శ్రావస్తికీ సంబంధం ఉండేది బుద్ధుని కాలంలో శ్రావస్తి గొప్ప వ్యాపార కేంద్రంగా ఉండేది శ్రావస్తినుంచీ తూర్పుగా, దక్షిణంగా వెళ్ళే మార్గాలు కపిలవస్తుకూ, కుశీ నగరానికీ (కశియా)



వెళ్ళి, వైశాలీ పట్టణాన్ని చేరుకునేవి పాట్నా వద్ద గంగానదిని దాటి వ్యాపారులు రాజగీర్ చేరుకునేవారు ఆధునిక భగల్పూర్ దగ్గర ఉన్న చంపానగరానిక్కూడా వీరు గంగానదిమీదనే వెళ్ళేవారు జాతక కథల్లోని విషయాలను మనం నమ్మితే – కోసల, మగధ రాజ్యాలకు చెందిన వ్యాపారులు మధుర గుండా ఉత్తరాన తక్షశిల వరకూ వెళ్ళేవారు అలాగే మధుర నుంచీ దక్షిణాన ఉజ్జయినికీ, పశ్చిమాన గుజరాత్‌కూ వెళ్ళేవారు

డబ్బును ఉపయోగించటంచేత వ్యాపారం అభివృద్ధి చెందింది వేదాలలోని "నిష్కం", "శతమానం" అన్న పదాలు నాణాలను సూచిస్తాయని కొందరు భావిస్తారు కానీ అవి లోహంతో తయారుచేసిన గౌరవసూచకమైన వస్తువులేమో అనిపిస్తోంది క్రీ పూ 6 వ శతాబ్దానికి పూర్వం నాణాల ఉపయోగం ఉన్నట్టు లేదు ఆ కాలానికి చెందిన నాణాలు మనకు లభించలేదు వేదకాలంలో వ్యాపారం వస్తుమార్పిడి పద్ధతిలో జరిగేది అప్పుడప్పుడూ పశువులు ద్రవ్యంగా ఉపయోగపడేవి లోహంతో తయారు చేసిన నాణాలు మొదటిసారిగా గౌతమబుద్ధుని కాలంలో ఉపయోగంలోకి వచ్చాయి మొదటి నాణాలు ఎక్కువగా వెండితో చేయబడ్డాయి కానీ కొన్ని రాగి నాణాలు కూడా ఉండేవి లోహం ముక్కల మీద కొండ, చెట్టు, చేప, ఏనుగు, నెలవంక మొదలైనవాటి బొమ్మల్ని ముద్రించటం చేత వీటిని విద్ధాంక నాణాలు అంటారు ఈ నాణాలు పెద్ద సంఖ్యలో ఉత్తరప్రదేశ్ తూర్పు భాగంలోనూ, మగధలోనూ దొరికాయి కానీ కొన్ని తొలి నాణాలు తక్షశిలలో దొరికాయి డబ్బు విరివిగా ఉపయోగంలో ఉన్నట్టూ, జీతాలూ, వస్తువుల మూల్యాలూ డబ్బు రూపంలో చెల్లింపబడుతూ ఉన్నట్టూ మనకు పాళీ గ్రంథాలు చెబుతాయి అనాటికి డబ్బు ఉపయోగం ఎంతగా పెరిగిందంటే – చచ్చిపోయిన ఎలుకకు కూడా డబ్బురూపంలో విలువ కట్టేవారు

అశోకునికి రెండు శతాబ్దాల పూర్వం రాతప్రారంభమై ఉండవచ్చు రాతిమీదకానీ, లోహంమీదకానీ రాయకపోవటం చేత తొలి రికార్డులు మనకు లభించకుండా పోయాయి రాత ప్రారంభం కావటంచేత ధర్మశాస్త్రాలనూ, ఆచార వ్యవహారాలనూ క్రోడీకరించటానికి వీలుకలిగింది అంతే కాకుండా వ్యాపారానికీ, పన్నుల వసూలుకూ, పెద్ద సైన్యానికి సంబంధించిన జమాఖర్చుల లెక్కల్ని తయారుచేయటానికి కూడా వీలు కలిగింది ఈ కాలంలోనే నాజూకైన కొలతల్ని గురించి చెప్పే 'శుల్వ సూత్రాలు' అన్న గ్రంథాల సంకలనం కూడా జరిగింది ఇది బహుశా రాత రూపొందటాన్ని ముందుగా సూచిస్తుంది అంతేకాకుండా పొలాలకూ, నివేశన స్థలాలకూ సరిహద్దుల్ని నిర్ణయించటానికి కూడా దోహదం చేసి ఉండవచ్చు

ఎన్ బి పి డబ్లియు దశకు చెందిన గ్రామీణ జన నివాసాలకు సంబంధించిన తవ్వకాలు జరగలేదు కానీ బీహార్‌లోనూ, ఉత్తరప్రదేశ్ తూర్పు, మధ్య ప్రాంతాలలోని మైదానాలలో దాదాపు 400 చోట్ల ఈ దశకు చెందిన పాత్రల అవశేషాలు లభించాయి మధ్య గంగామైదానంలో చేతివృత్తులూ, వ్యాపారమూ, నగరీకరణమూ అభివృద్ధి చెందటాన్ని గట్టి గ్రామీణ వ్యవస్థ లేకుండా ఊహించటం సాధ్యం కాదు పన్నులూ, కప్పాలూ, కౌలు డబ్బులూ పుష్కలంగా లభించకపోతే నగరాల్లో రాజులూ, పురోహితులూ, చేతి వృత్తులవారూ, వ్యాపారులూ, ఉద్యోగులూ, సైనికాధికారులూ, ఇతర అధికారులూ నివసించటం సాధ్యం అయ్యేది కాదు గ్రామాల్లో ఉన్న వ్యవసాయదారులు పట్టణాల్లో ఉన్న వ్యవసాయం చేయనివారిని పోషించాలి పట్టణాల్లో ఉన్న చేతి వృత్తులవారూ, వ్యాపారులూ పనిముట్లనూ, బట్టలూ మొదలైన వస్తువులనూ గ్రామాల్లో నివసించేవారికి సరఫరా చేయాలి 500 నాగళ్ళను నగరంలోని పెద్ద వ్యాపారి వద్ద ఉంచిన చిన్న గ్రామీణ వ్యాపారిని గురించిన ప్రస్తావన మనకు లభిస్తోంది అవి ఇనుప కర్రు ఉన్న నాగళ్ళన్న విషయం స్పష్టంగా తెలుస్తూనే ఉంది కౌశాంబిలో ఎన్ బి పి డబ్ల్యు దశకు చెందిన గొడ్డళ్ళూ, కత్తులూ, కొడవళ్ళూ మొదలైన అనేక పనిముట్లు బయటపడ్డాయి వీటిలో చాలా భాగం క్రీ పూ 6–4 శతాబ్దాలకు చెందిన భూమి పొరల్లో లభించాయి బహుశా అవి అనాటి రైతులు డబ్బు కానీ డబ్బుకు బదులుగా వస్తువులుకానీ చెల్లించి, కొని ఉపయోగించిన వస్తువులు కావచ్చు

పాళీగ్రంథాల్లో అసంఖ్యాకమైన గ్రామాల ప్రస్తావన ఉంది. ఒక గుంపు గ్రామాల మధ్య – ఒక పట్టణం ఉన్నట్టుగా మనకు తెలుస్తోంది ఒక గుంపు ప్రజలు ఒకచోట స్థిరనివాసం ఏర్పరచుకోవటం, వారి వ్యవసాయ భూములు సాధారణంగా వారి గ్రామానికి బయట ఉండటం అన్న పరిణామం మధ్యగంగా మైదానంలో గౌతమ బుద్ధుని కాలంలోనే ప్రారంభమైందని చెప్పవచ్చు పాళీ గ్రంథాలు మూడు రకాలైన గ్రామాలను పేర్కొంటాయి మొదటి రకం గ్రామంలో అనేక జాతులూ, తెగలూ కాపురం ఉంటారు ఇలాంటి గ్రామాల సంఖ్యే అత్యధికంగా ఉండేది ఇలాంటి గ్రామాలకు "భోజకుడు" అన్న గ్రామ పెద్ద ఉండేవాడు రెండవ రకం గ్రామాలు పట్టణాలను పోలిన చేతివృత్తుల వారి గ్రామాలు ఉదాహరణకు వారాణసికి దగ్గరలో ఒక వడ్రంగుల గ్రామం ఉండేది ఈ గ్రామాలు ఇతర గ్రామాలకూ, వ్యాపార కేంద్రాలైన పట్టణాలకూ మధ్య లంకెగా ఉండేవి మూడవ రకం గ్రామాలు అడవులకు దగ్గరగా, గ్రామీణ ప్రాంతాల సరిహద్దుల్లో ఉండేవి ఈ గ్రామాల్లో నివసించే ప్రజలు ప్రధానంగా పక్షుల్నీ, జంతువుల్నీ వేటాడి జీవించేవారు వీరు ఆహార సేకరణమీద ఆధారపడేవారు

గ్రామానికి చెందిన పొలాన్ని పంటపొలాలుగా విభజించి కుటుంబాలకు పంచేవారు ప్రతి కుటుంబమూ వ్యవసాయ కూలీల సాయంతో తమకు వచ్చిన పొలాల్ని సాగు చేసుకునేది గ్రామపెద్ద నేతృత్వంలో గ్రామంలోని అందరూ కలిసి పొలాలకు కంచలు వేసుకునేవారు, పంటకాలువల్ని తవ్వుకునేవారు

వ్యవసాయదారులు తమ పంటలో ఆరవ భాగాన్ని పన్నుగా చెల్లించవలసి ఉండేది పన్నుల్ని సరాసరి రాజప్రతినిధులే వసూలు చేసేవారు సాధారణంగా రైతుకూ, రాజ్యానికీమధ్య మధ్యవర్తులు ఉండేవారు కారు కొన్ని గ్రామాలను బ్రాహ్మణులకూ, పెద్ద వ్యాపారులకూ భోగ్యాలుగా ఇచ్చేవారు బానిసల చేతా, వ్యవసాయ కూలీల చేతా పనిచేయించే పెద్ద కమతాలను గురించి కూడా మనకు ఆధారాలు లభించాయి ధనిక రైతుల్ని "గృహపతులు" అనేవారు వీరు వైశ్యుల్లో దాదాపుగా ఒక వర్గాన్ని పోలినవారు

ఈ కాలంలో తూర్పు ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహారులోనూ ప్రధాన ఆహారపంట వరి పాళీ గ్రంథాల్లో అనేక రకాలైన వరిని గురించీ, వరిపొలాలను గురించీ వర్ణనలున్నాయి ఆ కాలానికి చెందిన పాళీ, సంస్కృత గ్రంథాల్లో నారు నాటటానికి ఉపయోగంలో ఉన్న పదాలు కనిపిస్తాయి బుద్ధుని కాలంలో పెద్ద ఎత్తున వరి నారును పొలాల్లో నాటటం ప్రారంభమైనట్టుగా తెలుస్తోంది వరి నారును నాటటం చేతా, నీరు పెట్టి వరిని పండించటం చేతా దిగుబడి చాలా ఎక్కువైంది వరి మాత్రమే కాకుండా బార్లీనీ, పప్పుదినుసుల్నీ, కాయధాన్యాలను కూడా ఆనాటి రైతులు పండించేవారు ఇనుప కర్రు బిగించిన నాగలిని ఉపయోగించటం చేతా, అలహాబాద్, రాజమహల్ పట్టణాల మధ్య ఉన్న పొలాలు ఒండ్రుమట్టి భూములు కావటం చేతా వ్యవసాయం గణనీయంగా అభివృద్ధి చెందింది

గ్రామీణ, పట్టణ ఆర్థిక విధానాలకు సాంకేతిక పరిజ్ఞానం కేంద్రమై పోయింది మధ్యగంగామైదానంలోని గట్టినేలలున్న అరణ్యప్రాంతాలను వ్యవసాయ భూములుగా మార్చటంలో ఇనుము కీలకమైన పాత్రను వహించింది అంతేకాకుండా, ఆ ప్రాంతాలలో స్థిరనివాసం ఏర్పడటానికి కూడా ఇనుమే కారణభూతమైంది ఆనాటి కమ్మరులకు ఇనుప పనిముట్లను గట్టిపరచటం తెలుసు రాజఘాట్ (వారాణసి)లో లభించిన పనిముట్లు సింగ్‌భూమ్, మయూరభంజ్ గనులలో లభించే ఇనుపఖనిజంతో తయారుచేయబడ్డాయని నిరూపిస్తున్నాయి ఆనాటి ప్రజలకు దేశంలోని అత్యుత్తమ ఇనుపగనుల్ని గురించి తెలుసు కాబట్టి చేతివృత్తులకూ, వ్యవసాయానికీ అవసరమైన పనిముట్లు ఇతోధికంగా లభించటం ఆశ్చర్యంకాదు

పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లో మలి వేదయుగంలోనూ, బీహార్, ఉత్తరప్రదేశ్‌లలో కొన్ని రాగి – రాతి యుగం సమాజాల లోనూ అమలులో ఉన్న గ్రామీణ ఆర్థిక వ్యవస్థతో పోల్చి చూసినప్పుడు, భౌతిక అవశేషాల ఆధారంగానూ, పాళీ గ్రంథాల ఆధారంగానూ మనకు రూపుకట్టే ఆర్థిక వ్యవస్థ చాలా భిన్నమైంది మధ్యగంగా మైదానంలోని ఒండ్రుమట్టి ప్రాంతాలలో ఆహార ఉత్పత్తి ఆర్థిక విధానం విస్తరించటాన్నీ, నగర ఆర్థిక వ్యవస్థ ప్రారంభం కావటాన్నీ మొదటిసారిగా గమనించవచ్చు ఈ ఆర్థిక వ్యవస్థ ఆహారాన్ని ఉత్పత్తి చేస్తున్నవారికి మాత్రమే కాకుండా ఆహారోత్పత్తితో సంబంధం లేని వారికి కూడా ఆహారాన్ని సరఫరా చేయగలిగింది కాబట్టి పన్నులను వసూలు చేయటానికీ, ఆ పన్నులతో దీర్ఘకాలిక పద్ధతిలో సైన్యాలను పోషించటానికీ వీలు కలిగింది విశాలమైన ప్రాదేశిక రాజ్యాలు ఏర్పడటానికీ, కొనసాగటానికీ అవసరమైన వాతావరణం అలా ఏర్పడింది

## పరిపాలనా విధానం

అనేక రాజ్యాలను గురించి మనకు తెలిసినా – కోసల, మగధ రాజ్యాలు మాత్రమే బలమైన రాజ్యాలుగా ఆ కాలంలో అభివృద్ధి చెందాయి ఈ రెండూ కూడా సర్వస్వతంత్రమైన రాజ్యాలు వీటిని క్షత్రియ వర్ణానికి చెందిన రాజులు వంశపారంపర్యంగా పరిపాలించేవారు బుద్ధుని గతజన్మలకు చెందిన జాతక కథలు, క్రూరులైన రాజుల్నీ, వారి ప్రధాన పురోహితుల్నీ ప్రజలు బహిష్కరించేవారనీ, వారిస్థానంలో కొత్తవారిని ఎన్నుకునేవారనీ చెబుతాయి కానీ బహిష్కరణలు, ఎన్నిక జరిగినంత అరుదుగానే జరిగేవి రాజుకు అత్యున్నతమైన అధికారం ఉండేది అతనికీ, అతని సంపదకూ ప్రత్యేక రక్షణ కూడా ఉండేది బుద్ధునితో సమానమైన స్థాయి కలిగిన మతనాయకులకు మాత్రమే వారు లొంగేవారు రాజు సాధారణంగా తన రాజ్యాన్ని విజయం నుంచీ విజయానికి నడిపించే యుద్ధ వీరుడు బింబిసారుడు, అజాతశత్రువు మొదలైన రాజుల చరిత్రల్ని చూస్తే ఈ విషయం స్పష్టంగా అర్థమౌతుంది

రాజులు చిన్నా పెద్దా అధికారుల సహాయంతో పరిపాలనను సాగించేవారు పెద్ద అధికారుల్ని "మహామాత్ర" అనేవారు వారు మంత్రి, సేనానాయకుడు, న్యాయాధిపతి, ప్రధాన గణకుడు, అంతఃపుర అధికారి మొదలైన బాధ్యతల్ని నిర్వహించేవారు కొన్ని రాష్ట్రాలలో ఇలాంటి బాధ్యతలనే "ఆయుక్త" అన్న అధికార వర్గం వహించే వారనటానికి అవకాశాలున్నాయి

పరిపాలనలో మంత్రులకు ప్రధాన బాధ్యత ఉండేది మగధకు చెందిన వర్షకారుడూ కోసలకు చెందిన దీర్ఘచరయనుడు అన్న మంత్రులు సమర్థులు, గొప్ప పలుకుబడి కలిగినవారు వీరిలో మొదటివాడు వైశాలికి చెందిన లిచ్ఛవులలో విభేదాలను సృష్టించి, అజాతశత్రువు ఆ రాజ్యాన్ని ఆక్రమించుకోవటానికి దోహదం చేశాడు రెండవ వాడు కోసల రాజుకు సాయం

చేశాడు ఆ కాలంలో పెద్ద అధికారులుగానూ, మంత్రులుగానూ పూజారి వర్గమైన బ్రాహ్మణులను మాత్రమే వినియోగించేవారు సాధారణంగా వీరు రాజవంశానికి చెందినవారుగా ఉండేవారుకారు వేదకాలంలో అమలులో ఉన్న రక్తసంబంధీకుల్ని అధికారంలో నియోగించే విధానం బాగా తగ్గిపోయింది

కోసల, మగధరాజ్యాలు వెండితో తయారు చేసిన విద్ధాంక నాణాలను జారీ చేశాయి కానీ కొందరు పలుకుబడి కలిగిన బ్రాహ్మణ, వైశ్యప్రముఖులకు (సెట్లు) గ్రామాలలో పన్నులు వసూలు చేసుకునే అధికారాన్ని కల్పించాయి వారు పన్నులు మాత్రమే వసూలు చేసుకోవాలి వారికి ఆ గ్రామాల మీద ఎలాంటి పరిపాలనాధికారమూ ఉండేది కాదు

గ్రామ పరిపాలన గ్రామ పెద్దల చేతుల్లో ఉండేది మొదట ఈ గ్రామ పెద్దలు తమ తెగల సైన్యాలకు నాయకులుగా ఉండేవారు కాబట్టి వారిని "గ్రామణి" అని పిలిచేవారు "గ్రామణి" అంటే గ్రామానికి లేదా తెగకు చెందిన సైనిక పటాలానికి నాయకుడన్నమాట స్థిర నివాసం ఏర్పాటు చేసుకోవటమూ, నాగలి వ్యవసాయమూ పెరిగిన తరువాత సంచార గిరిజన బృందాలు వ్యవసాయం వృత్తిగా స్థిరపడటం ప్రారంభించాయి అలా మౌర్యుల కాలానికి ముందుగానే "గ్రామణి" గ్రామ పెద్దగా మారిపోయాడు గ్రామ పెద్దను "గ్రామభోజకుడు", "గ్రామణి", "గ్రామికుడు" అన్న వేరు వేరు పేర్లతో పిలిచేవారు "గ్రామణి" అన్న పేరు ఈ నాటికీ శ్రీలంకలో ఉపయోగంలో ఉంది బింబిసారుడు 86,000 మంది గ్రామికులను (రాజధానికి) పిలిచినట్లుగా ఆధారాలున్నాయి ఇది సాంప్రదాయికమైన సంఖ్యే కావచ్చు కానీ గ్రామణులకు గొప్ప ప్రాముఖ్యత ఉండేదనీ, వారికి రాజుతో సరాసరి సంబంధం ఉండేదనీ ఈ సంఘటన వల్ల అర్థమౌతుంది గ్రామపెద్దలు పన్నుల్ని నిర్ణయించటం, వసూలు చేయటం చేసేవారు తమ ప్రాంతంలో శాంతిభద్రతల్ని కాపాడటం కూడా వారి బాధ్యతగానే ఉండేది అప్పుడప్పుడూ నిరంకుశులైన గ్రామ పెద్దలకు గ్రామస్తులు బుద్ధి చెప్పటం కూడా జరిగేది

## సైన్యము పన్నుల విధానము

పెద్ద వృత్తి సైన్యాన్ని ఏర్పాటు చేయటం రాజ్యం యొక్క శక్తి పెరగటానికి నిజమైన నిదర్శనం అలెగ్జాండర్ దండయాత్ర సమయంలో మగధ రాజ్యాన్ని పరిపాలిస్తున్న నందరాజుకు 20,000 అశ్విక దళం, రెండు లక్షల కాల్బలం, రెండు వేల రథాలూ, నాలుగు వేల ఏనుగులూ కలిగిన సైన్యం ఉండేది ఈశాన్య భారతదేశంలో ఆర్యులు ప్రవేశపెట్టిన రథాలు అక్కడే కాకుండా వాయవ్య భారతంలో కూడా ప్రాధాన్యతను పోగొట్టుకోవటం ప్రారంభించాయి వాయవ్య భారతంలోని రాజులు ఏనుగుల్ని చాలా తక్కువ సంఖ్యలో మాత్రమే పోషించేవారు కొంతమంది రాజులు మాత్రం మగధ రాజుతో సమానంగా అశ్విక దళాన్ని పోషించేవారు ఏనుగుల్ని ఎక్కువ సంఖ్యలో పోషించ గలగటం చేత మగధ రాజు బలం ఎక్కువగా ఉండేది

పెద్ద సైన్యాన్ని ఎక్కువ కాలం పోషించే బాధ్యత ప్రభుత్వ ఖజానాదే నందులకు అసాధారణ ధనసంపత్తి ఉండేదనీ, అందుచేత పెద్ద సైన్యాన్ని పోషించ గలిగే వారనీ చెబుతారు కానీ ఆ ధనాన్ని పన్నుల రూపంలో ఎలా సేకరించ గలిగేవారో మనకు తెలియదు ఆర్థిక వ్యవస్థ సువ్యవస్థితంగా ఉండేది క్షత్రియులూ, బ్రాహ్మణులూ పన్నులు చెల్లించ వలసిన అవసరం లేదు కాబట్టి బరువు ప్రధానంగా వైశ్యుల (గృహపతులు) మీద పడేది వేదకాలంలో తెగలోనివారు ఐచ్ఛికంగా చెల్లించే "బలి" అన్న పన్ను బుద్ధుని కాలం వచ్చే సరికి రైతులు తప్పకుండా చెల్లించ వలసిన పన్నుగా మారిపోయింది ఆ పన్నును వసూలు చేయటం కోసం "బలిసాధకులు" అన్న పేరుతో అధికారులు కూడా నియమితులయ్యారు పంటలో ఆరవ భాగాన్ని పన్నుగా గ్రహిస్తున్నట్టుగా మనకు తెలుస్తోంది రాజప్రతినిధులు గ్రామ పెద్దల సహకారంతో పన్నుల్ని నిర్ణయించి, వసూలు చేసేవారు రాత ప్రారంభమయ్యాక పన్నుల్ని నిర్ణయించటమూ, వసూలు చేయటమూ సుగమం అయి ఉండవచ్చు విద్ధాంక నాణాలు చాలా పెద్ద మొత్తంలో లభించటం చేత అనాడు లావాదేవీలు డబ్బు రూపంలోనూ, వస్తురూపంలోనూ జరిగేవని అనిపిస్తోంది ఈశాన్య భారతదేశంలో లావాదేవీలు వడ్లు రూపంలో జరిగేవి ఈ పన్నులతోపాటు రాజుగారి సొంతపనుల్ని రైతులు ప్రతిఫలం లేకుండా చేసి పెట్టవలసి వచ్చేది ఈ ప్రతిఫలం లేని శ్రమ బలవంతపు శ్రమ కూడా రాజు విధించిన పన్నుల భారాన్ని భరించలేక రైతులు దేశాన్ని వదిలి వెళ్ళిపోయినట్టుగా జాతక కథలు చెబుతాయి

చేతివృత్తులవారూ, వ్యాపారులు కూడా పన్నులు చెల్లించేవారు చేతివృత్తులవారు రాజుకోసం నెలకొక రోజు ప్రతిఫలం తీసుకోకుండా పనిచేయాలి వ్యాపారులు తమ అమ్మకాల మీద సుంకాన్ని చెల్లించాలి సుంకాలను వసూలు చేసే అధికారుల్ని "శౌల్కికుడు" లేక "శుల్కాధ్యక్షుడు" అని పిలిచేవారు

ఈ ప్రాదేశిక రాజ్యాలను పరిపాలించిన రాజులు "సభ"నూ "సమితి"నీ తిరస్కరించారు వేదకాలం తరువాత ప్రజాసంఘాలు అదృశ్యమైపోయాయి అవి తెగలకు చెందిన వ్యవస్థలు కావటం చేత తెగలు వర్ణాలుగా, కులాలుగా

చీలిపోయిన తరువాత వాటికి అస్తిత్వం లేకుండా పోయింది కాబట్టి ధర్మశాస్త్రకారులు వర్ణధర్మాలకూ, ఆచారాలకూ ప్రాధాన్యత నిచ్చారు ఈ విషయాలు ప్రధానంగా సామాజిక విషయాలకు పరిమితంగా ఉండేవి వేదకాలంలోలాగా రాజ్యాలు చిన్నవిగా ఉన్నప్పుడు, తెగకు సంబంధించిన సభ్యుల్ని సులభంగా పిలిపించటానికి వీలున్నప్పుడు ప్రజాసంఘాలూ, సమితులూ విజయవంతంగా పనిచేయటానికి వీలుండేది కోసల, మగధ వంటి విస్తారమైన రాజ్యాలు అవతరించిన తరువాత వివిధ వర్గాలకూ, ప్రాంతాలకూ చెందిన ప్రజల్ని సమావేశాలకు పిలవటానికి వీలులేకుండా పోయింది సమాచార ప్రసారమే కష్టమై పోవటం చేత క్రమం తప్పకుండా సమావేశాలను నిర్వహించటం అసాధ్యమైపోయింది అంతేకాకుండా, పాత కాలపు సమితి కొత్త రాజ్యాలలో నివసిస్తున్న అనేక అవైదిక జాతుల వారికి స్థానాన్ని కల్పించలేకపోయింది కాబట్టి మారిపోయిన పరిస్థితుల్లో పాతకాలపు ప్రజాసంఘాలు కొనసాగటానికి వీలులేకుండా పోయింది వాటిస్థానంలో "పరిషత్" అన్న పేరుతో చిన్న సంఘాలు ఏర్పడ్డాయి వీటిలో బ్రాహ్మణులకు మాత్రమే స్థానం ఉండేది ఈ కాలంలో కూడా ప్రజాసంఘాలు ఉండేవి కానీ అవి రాజరికం అమలులో ఉన్న రాజ్యాల్లో కనిపించేవికావు అవి శాక్య, లిచ్ఛవీ వంటి చిన్న గణతంత్ర రాజ్యాలలో మాత్రమే ఉండేవి

## గణతంత్ర ప్రయోగం

గణతంత్ర రాజ్య విధానం సింధూలోయలోనూ, తూర్పు ఉత్తరప్రదేశ్‌లోని హిమాలయపర్వత ప్రాంతాలలోనూ, బీహార్‌లోనూ ఉండేది సింధూనదీలోయలోని గణతంత్ర రాజ్యాలు రాజరికాలు అవతరించిన తరువాతకూడా మిగిలిన వేదకాలపు గణజీవిత అవశేషాలు కావచ్చు ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహార్‌లోనూ ప్రజలు – కనీసం కొన్ని సందర్భాలలో – పాతగణరాజ్యాలలోని సమానత్వ ఆదర్శంతో ఉత్తేజాన్ని పొంది ఉండవచ్చు ఒకే రాజుకు ప్రాధాన్యత నివ్వటం వారికి అంగీకారయోగ్యంగా ఉండిఉండకపోవచ్చు

గణతంత్ర రాజ్యాలలో నిజమైన అధికారం గణంలోని కొద్దిమంది పెద్దలచేతిలో ఉండేది శాక్య, లిచ్ఛవీ గణరాజ్యాలలో పాలకవర్గం అదే తెగకూ, వర్ణానికీ చెంది ఉండేది లిచ్ఛవులలో 7707 మంది రాజులు కోటలో జరిగే సమితి సమావేశంలో పాల్గొనేవారు ఈ సమితిలో బ్రాహ్మణులు ఉండేవారుకారు మౌర్యయుగం తరువాత మాళవ, క్షుద్రక గణరాజ్యాలలో క్షత్రియులకూ, బ్రాహ్మణులకూ మాత్రమే పౌరసత్వం ఇచ్చేవారు బానిసలకూ, కూలీలకూ పౌరసత్వం ఉండేదికాదు పంజాబ్‌లో బియాస్ నదీతీరంలో ఉన్న ఒక దేశంలో రాజ్యానికి కనీసం ఒక ఏనుగునైనా ఇవ్వగలిగినవారికి మాత్రమే పౌరసత్వం ఇచ్చేవారు సింధూనదీలోయలో ఉండిన ఉన్నతవంశీకుల పాలనకు ఇది చక్కని మచ్చుతునక

శాక్యులలోనూ, లిచ్ఛవులలోనూ పరిపాలనాయంత్రాంగం చాలా సరళంగా ఉండేది అందులో "రాజు," "ఉపరాజు," "సేనాపతి", "భాండాగారికుడు" ఉండేవారు లిచ్ఛవీ రాజ్యంలో నేరాలను విచారించటానికి ఏడంతస్తుల న్యాయ వ్యవస్థ ఉండేది ఆ న్యాయవ్యవస్థ నమ్మశక్యం కానంత గొప్పగా ఉండేది

బుద్ధుని కాలంలో కొన్ని రాజ్యాలను వంశపారం పర్యరాజులు పరిపాలించేవారు కారు ఆ రాజ్యాలను సమితులకు బాధ్యత వహించే వ్యక్తులు పరిపాలించేవారు ప్రాచీన గణరాజ్యాలలో రాజకీయాధికారాన్ని ప్రజలందరూ సమానంగా పంచుకోకపోయినా గణరాజ్య సంప్రదాయం బుద్ధుని కాలంనుంచీ ఉండేది

గణరాజ్యాలకూ, రాజరికాలకూ చాలా తారతమ్యాలుండేవి రాజరికాలలో రైతులనుంచీ వసూలుచేసే మొత్తం పన్నును రాజు ఒక్కడే గ్రహించేవాడు గణరాజ్యాలలో అలాకాదు గణంలోని ప్రతి ప్రధాన వ్యక్తినీ "రాజు" అనేవారు ప్రతి రాజు కూడా పన్నులో తన వాటాను పొందేవాడు లిచ్ఛవీ రాజ్యంలోని 7707 రాజులు కూడా తమ సొంత భాండాగారాన్నీ, పరిపాలనా యంత్రాగాన్నీ కలిగి ఉండేవాడు అలాగే రాజరిక వ్యవస్థలో రాజు మాత్రమే శాశ్వత సైన్యాన్ని కలిగి ఉండేవాడు రాజ్యంలోని ఇతర ప్రజా సమూహాలకు సైన్యాన్ని కలిగి ఉండే అర్హత ఉండేదికాదు కానీ గణరాజ్యాల బహుస్వామ్యంలో అలాకాదు ప్రతి రాజా కూడా ఒక చిన్న సైనిక పటాలాన్ని కలిగి ఉండేవాడు దానికొక సేనాపతి నాయకుడుగా ఉండేవాడు అలా గణరాజ్యంలోని రాజుల మధ్య పోటీ ఉండేది రాజరికంలో బ్రాహ్మణులకు గొప్ప పలుకుబడి ఉండేది తొలి గణ రాజ్యాలలో వారికి ప్రత్యేక స్థానం ఉండేదికాదు బ్రాహ్మణులు వారు రాసిన ధర్మశాస్త్ర గ్రంథాలలో ఈ రాజ్యాలను గుర్తించలేదు కూడా రాజరికానికీ, గణరాజ్యానికీ ఉన్న ప్రధాన తారతమ్యాన్ని గురించి చెప్పాలంటే – రాజరికం ఒక వ్యక్తి ఆధిపత్యంలో ఉండేది గణరాజ్య వ్యవస్థ సమితుల ఆధిపత్యంలో ఉండేది రాజరికం ఏకస్వామ్యం గణరాజ్య వ్యవస్థ బహుస్వామ్యం

మౌర్యుల కాలం నుంచీ గణరాజ్య సంప్రదాయం బలహీనం కావటం ప్రారంభించింది మౌర్యులకు ముందు కూడా రాజరికాలు బలంగానూ, ఎక్కువగానూ ఉండేవి కాబట్టి ప్రాచీన మేధావులు రాజరికాన్ని అత్యంత విస్తృతమైన, ప్రధానమైన రాజ్యవ్యవస్థగా గుర్తించారు వారి అభిప్రాయంలో రాజ్యానికీ, ప్రభుత్వానికీ, రాజరికానికీ మధ్య తేడా

ఉండేదికాదు బుద్ధునికాలానికి రాజ్యం బాగా స్థిరపడి పోవటం చేత మేధావులు రాజ్యం యొక్క మూలాలను గురించి ఆలోచించటం ప్రారంభించారు అత్యంత ప్రాచీనమైన బౌద్ధ గ్రంధాలలో ఒకటైన "దిఘనికాయం" తొలిదశలో మానవులు చాలా సంతోషంగా జీవించారని చెబుతుంది క్రమక్రమంగా వారు సొంత ఆస్తిని సంపాదించుకొని, తమ భార్యలతో సంసారాలను ప్రారంభించారు అలా వారిమధ్య ఆస్తి కోసమూ, స్త్రీల కోసమూ కలహాలు ప్రారంభమయ్యాయి ఈ కలహాలను అంతం చేయటం కోసం వారు శాంతిభద్రతలు కాపాడగల నాయకుణ్ణి ఎన్నుకున్నారు అతడు ప్రజల్ని కూడా రక్షించేవాడు అందుకు ప్రతిఫలంగా ప్రజలు తాము పండించిన వరిధాన్యంలో కొంతభాగాన్ని అతనికి చెల్లించేవారు ఆ నాయకుణ్ణి "రాజు" అన్నారు ఇలా రాజూ, రాజ్యమూ ప్రారంభమయ్యాయి

## సామాజిక వ్యవస్థలు

ఈ కాలంలోనే భారతదేశంలో న్యాయాంగ వ్యవస్థ ప్రారంభమైంది అంతకుముందు వర్గ తారతమ్యాన్ని పాటించని గణ న్యాయం అమల్లో ఉండేది ఈ కాలం వచ్చేసరికి గణం బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అన్న నాలుగు వర్ణాలుగా చీలిపోయింది కాబట్టి ధర్మశాస్త్రాలు ఈ నాలుగు వర్ణాలవారి విధులనూ నిర్ణయించాయి సివిల్, క్రిమినల్ చట్టాలకు వర్ణం ప్రాతిపదికగా మారిపోయింది వర్ణం ఎంత ఉన్నతమైనదైతే అంత పవిత్రమైందిగా భావించబడింది అనేక రకాలైన నియమ నిబంధనలూ శూద్రులకే విధించబడ్డాయి వారికి మత హక్కులూ, న్యాయాంగ హక్కులూ లేకుండా చేశారు సమాజంలో వారిని అతి తక్కువ స్థాయికి నెట్టేశారు వారికి ఉపనయనం అర్హత లేదు బ్రాహ్మణులకూ, ఇతరులకూ వ్యతిరేకంగా వారు చేసిన నేరాలకు అత్యంత తీవ్రంగా శిక్షించారు కానీ శూద్రులకు వ్యతిరేకంగా పైవర్ణాలవారు చేసిన నేరాలకు అత్యంత తేలికైన శిక్షలు విధించారు శూద్రులు సృష్టికర్త పాదాలలో నుంచీ పుట్టారన్న కట్టుకథకు ప్రచారం కల్పించారు కాబట్టి పైవర్ణాలవారు – ముఖ్యంగా బ్రాహ్మణులు – శూద్రులకు దూరంగా ఉండేవారు వారు తాకిన ఆహారాన్ని తాము తినేవారు కారు వారితో వివాహ సంబంధాలు కలిగి ఉండేవారు కారు శూద్రుణ్ణి ఉన్నతోద్యోగాలకు నియోగించ కూడదు అంతేకాదు, అతడు ద్విజులకు బానిసగా, చేతిపనివాడుగా వ్యవసాయకూలీగా పని చేయాలి ఇది అతని ప్రత్యేక బాధ్యత ఈ విషయంలో బౌద్ధ, జైనమతాలు కూడా మౌలికమైన మార్పుల్ని తీసుకు రాలేక పోయాయి ఈ మతాలు శూద్రులను తమ మత వ్యవస్థలోకి చేర్చుకున్నా – అతని స్థాయి తక్కువగానే ఉండేది గౌతమబుద్ధుడు బ్రాహ్మణుల, క్షత్రియుల, గృహపతుల సమావేశాలకు హాజరైనట్టుగా ఆధారాలున్నాయి కానీ శూద్రుల సమావేశానికి సంబంధించిన ప్రస్తావన మాత్రం ఎక్కడా లేదు

రాజప్రతినిధులు సివిల్, క్రిమినల్ చట్టాలను అమలు పరిచేవారు వారు కొరడాలతో కొట్టటం, తల తీసేయటం, నాలుక లాగేయటం వంటి మొరటు దండనల్ని విధించేవారు క్రిమినల్ నేరాల విషయంలో దండన దాదాపు ప్రతీకారంలాగా ఉండేది అంటే – కంటికి కన్ను, పంటికి పన్నులాగా ఉండేది

బ్రాహ్మణ ధర్మశాస్త్రాలు చట్టాలను రూపొందించేటప్పుడు వివిధ వర్ణాల సామాజిక స్థాయిని పరిగణనలోకి తీసుకున్నాయి కానీ బ్రాహ్మణీయ సామాజిక వ్యవస్థలోకి లీనమైన అవైదిక జాతులవారి సంప్రదాయాలను వీరు విస్మరించలేదు దండయాత్రల ఫలితంగా వీరి సంఖ్య పెరుగుతూ కూడా వచ్చింది అందుచేత ఈ ధర్మశాస్త్ర గ్రంధాలు ఈ స్థానిక గిరిజన జాతుల మూలాలను గురించి కల్పనా కథలు సృష్టించి, వారు వారి సొంత ఆచార వ్యవహారాలను పాటించటానికి అనుమతించారు

ఆ కాలంలోనే ప్రాచీన భారతీయ రాజ్యాంగ వ్యవస్థా, ఆర్థిక వ్యవస్థా, సామాజిక వ్యవస్థా ఒక నిశ్చితమైన రూపాన్ని ధరించాయి కాబట్టి, బౌద్ధయుగానికి ఎంతో ప్రాధాన్యత ఉంది ఇనుప పనిముట్లను ఉపయోగించి ఒండ్రుమట్టి నేలల్లో చేసే వ్యవసాయం ఫలితంగా అధునిక ఆహారోత్పత్తి ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందింది ఈ పరిణామం తూర్పు ఉత్తరప్రదేశ్ లోనూ, బీహారులోనూ ప్రముఖంగా వచ్చింది రైతులవద్దనుంచీ పన్నుల్ని వసూలు చేయగలగటం చేతా, పన్నులూ, కప్పాలూ క్రమంగా అందుతూ ఉండటం చేతా విశాలమైన రాజ్యాలను స్థాపించటానికి వీలు కలిగింది ఈ వ్యవస్థను కొనసాగించటం కోసం వర్ణ వ్యవస్థ ఏర్పాటు చేయబడింది ప్రతి వర్ణానికీ స్పష్టమైన బాధ్యతలు అప్పగించబడ్డాయి ఈ వ్యవస్థ ప్రకారం పాలకులూ, పోరాట వీరులూ క్షత్రియులు, పురోహితులూ, గురువులూ బ్రాహ్మణులు, వ్యవసాయదారులూ, పన్ను చెల్లించేవారూ వైశ్యులు, కూలీలుగా పై మూడు వర్ణాల వారినీ సేవించేవారు శూద్రులు

★ ★ ★

## అధ్యాయం: 14

# మౌర్యయుగం

### చంద్రగుప్త మౌర్యుడు

మౌర్యవంశాన్ని చంద్రగుప్త మౌర్యుడు స్థాపించాడు ఇతడు ఒక సాధారణ కుటుంబానికి చెందిన వాడని చాలామంది భావిస్తారు బ్రాహ్మణీయ సంప్రదాయం ప్రకారం చంద్రగుప్తుడు మురు అన్న శూద్రస్త్రీ కుమారుడు మురు నందుల ఆస్థానంలో ఉండేది కానీ బౌద్ధ సంప్రదాయం ప్రకారం నేపాల్ సమీపంలో గోరక్‌పూర్ ప్రాంతంలో మౌర్యులన్న క్షత్రియ వంశం నివసిస్తూ ఉండేది బహుశా చంద్రగుప్తుడు ఈ వంశానికి చెందిన వాడు కావచ్చు నందుల పరిపాలనా కాలంలోని చివరి రోజుల్లో వారి బలహీనతనూ, వారు సంపాదించుకున్న అప్రతిష్టనూ అతడు అవకాశంగా తీసుకొని ఉండవచ్చు కౌటిల్యుడు అని ప్రఖ్యాతి పొందిన చాణక్యుని సహాయంతో అతడు నందులను కూలదోసి మౌర్యవంశ పరిపాలనను ప్రతిష్టించాడు తొమ్మిదవ శతాబ్దంలో విశాఖ దత్తుడు రాసిన "ముద్రారాక్షసం" అన్న నాటకంలో చంద్రగుప్తుని శత్రువులకు వ్యతిరేకంగా చాణక్యుడు చేసిన మంత్రాంగాలు వర్ణించబడ్డాయి అధునిక యుగంలో ఈ నాటకం ఆధారంగా అనేక నాటకా లొచ్చాయి

జస్టిన్ అన్న గ్రీకు రచయిత – ఆరు లక్షల సైనిక బలంతో మొత్తం భారతదేశాన్ని చంద్రగుప్తుడు ఆక్రమించుకున్నాడని చెబుతాడు సింధూనదికి పశ్చిమంగా ఉన్న వాయవ్య భారతదేశాన్ని సెల్యూకస్ బానిసత్వం నుంచీ చంద్రగుప్తుడు విముక్తం చేశాడు ఈ గ్రీకు వైశ్రాయితో జరిగిన యుద్ధంలో చంద్రగుప్తుడు విజయాన్ని సాధించినట్టుగా అనిపిస్తోంది ఇద్దరి మధ్యా సంధి కూడా కుదిరింది 500 ఏనుగుల్ని తీసుకొని సెల్యూకస్ తూర్పు ఆఫ్ఘనిస్థాన్‌నూ, బెలూచిస్థాన్‌నూ, సింధూనదికి పశ్చిమంగా ఉన్న భారతదేశ ప్రాంతాన్నీ చంద్రగుప్తునికి ఇచ్చాడు చంద్రగుప్తుడు విశాలమైన సామ్రాజ్యాన్ని స్థాపించాడు అందులో బీహార్, ఒరిస్సా, బెంగాలులో ఎక్కువ ప్రాంతం, భారతదేశంలోని పశ్చిమ, వాయవ్య ప్రాంతాలూ భాగాలుగా ఉండేవి దక్షిణంలో కేరళ, తమిళనాడు, ఈశాన్య ప్రాంతంలోని కొన్ని భాగాలూ తప్ప భారత ఉపఖండం మొత్తం మౌర్యుల పరిపాలన కింద ఉండేది తరువాత బ్రిటిష్ సామ్రాజ్యంలో కూడా చేరని వాయవ్య ప్రాంతాలు కొన్ని మౌర్య సామ్రాజ్యంలో ఉండేవి

### సామ్రాజ్య వ్యవస్థ

మౌర్యులు విస్తారమైన పరిపాలనా వ్యవస్థను ఏర్పాటు చేశారు దాన్ని గురించి మనం మెగస్తనీసు రచనలనుంచీ, కౌటిల్యుని "అర్థశాస్త్రం"నుంచీ తెలుసుకోవచ్చు మెగస్తనీస్ – చంద్రగుప్తుని ఆస్థానానికి సెల్యూకస్ పంపిన గ్రీకు రాయబారి అతడు చంద్రగుప్త మౌర్యుని ఆస్థానంలో ఉండి పాటలీపుత్ర నగర పరిపాలనను గురించి మాత్రమే కాకుండా మొత్తం మౌర్య సామ్రాజ్య పరిపాలనను గురించి చర్చించాడు మెగస్తనీసు కథనం మొత్తం ఈనాడు లభించటం లేదు కానీ ఆ గ్రంథం నుంచీ ఆ తరువాత కాలపు రచయితలు తమ గ్రంథాల్లో ఉటంకించారు ఈ ఉటంకింపుల నన్నింటినీ సేకరించి ఒక గ్రంథంగా తరువాత కాలంలో ప్రచురించారు ఈ గ్రంథం మౌర్యుల కాలం నాటి పరపాలనను గురించీ, సమాజాన్ని గురించీ, ఆర్థిక వ్యవస్థను గురించీ ఎంతో విలువైన సమాచారాన్ని ఇస్తుంది

మెగస్తనీసు కథనాన్ని కౌటిల్యుని "అర్థశాస్త్రం"తో జోడించి, మౌర్యుల పరిపాలనను అర్థం చేసుకోవచ్చు "అర్థశాస్త్రం" మౌర్య పరిపాలన అంతరించిన కొన్ని శతాబ్దాల తరువాత సంకలనం చేయబడింది కానీ అందులోని కొన్ని అధ్యాయాలలో మౌర్యుల పరిపాలనను గురించీ, ఆర్థిక వ్యవస్థను గురించీ వాస్తవికమైన, నమ్మకమైన సమాచారం మనకు లభిస్తుంది ఈ రెండు గ్రంథాల ఆధారంగా మనం మౌర్యుల పరిపాలనా విధానాన్ని గురించి ఒక చిత్రాన్ని రూపొందించుకోవచ్చు

చంద్రగుప్తమౌర్యుడు అధికారాన్ని మొత్తం తన చేతుల్లో ఉంచుకున్న నిరంకుశ ప్రభువనటానికి సందేహం లేదు "అర్థశాస్త్రం" చెప్పేది నిజమే అయితే – రాజు ఒక ఉన్నతమైన

ఆదర్శాన్ని నెలకొల్పాడు అతడు ప్రజల సంతోషమే తన సంతోషమనీ, ప్రజల కష్టమే తన కష్టమనీ ప్రకటించాడు కానీ అతడు తన ఆచరణలో ఈ సూత్రాన్ని ఎంతవరకూ నిరూపించాడో మనకు తెలియదు మెగస్తనీసు కథనం ప్రకారం రాజుకు ఒక సలహా సంఘం ఉండేది అందులో విజ్ఞులైన వాళ్ళు సభ్యులుగా ఉండేవారు కానీ వారి సలహాను అతడు తప్పకుండా పాటించేవాడనటానికి ఎలాంటి ఆధారాలూ లేవు పెద్ద పదవుల్ని అలంకరించే అధికారులను మాత్రం సలహా సంఘం నుంచీ తీసుకునేవారు

సామ్రాజ్యాన్ని అనేక రాష్ట్రాలుగా విభజించేవారు ప్రతి రాష్ట్రమూ కూడా రాజ వంశానికి చెందిన ఒక రాజ కుమారుని అధీనంలో ఉండేది రాష్ట్రాన్ని మరింత చిన్న భాగాలుగా విభజించేవారు నగర, గ్రామీణ పరిపాలనకు శ్రద్ధ తీసుకునేవారు మౌర్యుల కాలంలో అనేక పట్టణాలు ఉండినట్టుగా పురాతత్వ తవ్వకాలు నిరూపిస్తున్నాయి పాటలీపుత్రం, కౌశాంచి, ఉజ్జయిని, తక్షశిల అనాటికి చెందిన ప్రధాన నగరాలు రాజధాని అయిన పాటలీపుత్రం పరిపాలన ఆరు సంఘాల అధీనంలో ఉండేది ప్రతి సంఘంలోనూ ఐదుమంది సభ్యులు ఉండేవారు నగరంలో పారిశుధ్యాన్ని చూసుకోవటానికి ఒక సంఘం, విదేశీయుల్ని చూసుకోవటానికి ఒక సంఘం, జనన మరణాలు నమోదు చేయటానికి ఒక సంఘం, తూనికలు, కొలతలు పర్యవేక్షించటానికి ఒక సంఘం – ఇలా సంఘాలకు అనేక బాధ్యతలుండేవి బీహారులోని అనేక ప్రాంతాలలో మౌర్యుల కాలానికి చెందిన అనేక తూనికలు లభించాయి

ఇవన్నీ కాకుండా రాజధాని దగ్గరగా ఉన్న ప్రాంతాల్లో సామాజిక, ఆర్థిక వ్యవహారాలు పర్యవేక్షించటానికి కేంద్ర ప్రభుత్వంలో దాదాపు రెండు డజన్ల శాఖలుండేవి చంద్రగుప్తుని పరిపాలనలో అత్యంత ఆసక్తికరమైన అంశం అతడు పోషించిన సైన్యం యొక్క పరిమాణం చంద్రగుప్తుడు 6 లక్షల కాల్బలం, 30,000 ఆశ్విక దళం, 9000 ఏనుగులు ఉన్న సైన్యాన్ని పోషించేవాడు మరొక ఆధారం ప్రకారం అతని సైన్యంలో 8000 రథాలు కూడా ఉండేవి ఈ సైన్యంతోబాటు మౌర్యులకు నావికాదళం కూడా ఉండేది మెగస్తనీసు కథనం ప్రకారం 30 మంది సైనికాధికారులు 6 సంఘాలుగా ఏర్పడి, సైనిక వ్యవహారాలను పర్యవేక్షించేవారు కాల్బలం, ఆశ్విక దళం, ఏనుగులు, రథాలు, నావికాదళం, రవాణా – ఈ ఆరు అంగాలూ ఆరు సంఘాల పర్యవేక్షణలో ఉండేవి మౌర్యుల సైనిక శక్తి నందుల సైనిక శక్తికి దాదాపు మూడు రెట్లు అధికంగా ఉండేది సామ్రాజ్యం పెద్దది కావటం చేతా, ఆర్థిక వనరులు ఎక్కువగా ఉండటం చేతా ఇంత పెద్ద సైన్యాన్ని పోషించటానికి వీలుకలిగి ఉండవచ్చు

చంద్రగుప్త మౌర్యుడు ఇంత పెద్ద సైన్యాన్ని ఎలా పోషించ గలిగాడు? కౌటిల్యుని "అర్థశాస్త్రా"న్ని మనం విశ్వసిస్తే రాజ్యానికి సంబంధించిన అన్ని ఆర్థిక వ్యవహారాలూ ప్రభుత్వ అధీనంలోనే ఉండేవని అర్థమౌతుంది ప్రభుత్వం రైతుల సహాయంతోనూ, శూద్ర కూలీల సహాయంతోనూ కొత్త భూములను సాగులోకి తెచ్చేది కొత్తగా సాగులోకి తెచ్చిన భూముల్ని పొందిన రైతుల వద్ద నుంచీ పన్నుల రూపంలో ప్రభుత్వానికి పెద్ద మొత్తాలు లభించేవి భూమిపన్ను సాధారణంగా పంటలో నాలుగో భాగం నుంచీ ఆరవభాగం వరకూ ఉండేది ప్రభుత్వం నీటి పారుదల సౌకర్యాన్ని కలిగిస్తే రైతులు దానికి అదనంగా పన్ను చెల్లించవలసి ఉండేది ఇవి కాకుండా అత్యవసర పరిస్థితుల్లో ప్రభుత్వం రైతులను ఎక్కువగా పండించమని బలవంతం చేసేది గ్రామాల నుంచీ పట్టణాలకు అమ్మకానికి తెచ్చిన వస్తువుల మీద సుంకం చెల్లించవలసి ఉండేది ఆ సుంకాన్ని పట్టణద్వారాల వద్ద వసూలు చేసేవారు ఇంతేకాకుండా సామ్రాజ్యంలోని మొత్తం గనులూ, మత్తుపదార్థాల వ్యాపారమూ, ఆయుధాల తయారీ మొదలైనవి ప్రభుత్వం అధీనంలోనే ఉండేవి వీటివల్ల ప్రభుత్వ ఖజానాకు డబ్బు వచ్చేది ఈ విధంగా చంద్రగుప్తుడు సువ్యవస్థితమైన పరిపాలనా విధానాన్ని ఏర్పాటుచేసి, దానికి బలమైన ఆర్థిక పునాదిని కల్పించాడు

## అశోకుడు (క్రీ పూ 273-232)

చంద్రగుప్త మౌర్యుని తరువాత అతని కుమారుడు బింబిసారుడు రాజయ్యాడు గ్రీకు రాజులతో సంబంధాలను కొనసాగించటం చేత అతని పరిపాలనా కాలాన్ని ముఖ్యమైనదిగా చెప్పుకోవాలి అతని కుమారుడు అశోకుడు మౌర్యచక్రవర్తులలో అందరికంటే గొప్పవాడు బౌద్ధ సాంప్రదాయక కథనం ప్రకారం అతడు తన సోదరులు 99 మందిని హత్యచేసి సింహాసనాన్ని అధిష్ఠించిన క్రూరుడు ఇది పూర్తిగా జనశ్రుతి మాత్రమే కాబట్టి ఇందులో సత్యం లేకపోవచ్చు బౌద్ధ రచయితలు రాసిన అశోకుని జీవిత చరిత్రలో అనేక కట్టుకథలున్నాయి అందుచేత వాటిని పూర్తిగా నమ్మటానికి వీలుకాదు

## అశోకుని శాసనాలు

అశోకుని చరిత్రను అతని శాసనాల ఆధారంగా పునర్నిర్మించవచ్చు ప్రజలతో తన శాసనాల ద్వారా నేరుగా సంభాషించిన భారతీయ రాజు అశోకుడే అతని శాసనాలు భారతదేశంలో లభిస్తున్న తొట్టతొలి పాళీభాష నమూనాలు అవి రాళ్ళమీదా, నునుపుచేసిన పీఠాలమీద పెట్టిన రాతి




స్తంభాల మీదా, గుహలలో, కొన్ని సందర్భాలలో మట్టి పాత్రలమీదా చెక్కబడినాయి ఇవి భారతదేశంలో మాత్రమే కాకుండా ఆఫ్ఘనిస్థాన్‌లో కూడా లభించాయి ఈ శాసనాలు రాజు ఉత్తర్వుల్ని తెలియజేస్తాయి ఇలాంటి శాసనాలు 45 చోట్లలో లభించాయి లభించిన శాసనాల సంఖ్య 181 ఇవి ప్రాకృత భాషలో బ్రాహ్మీలిపిలో రాయబడ్డాయి

ఇలాంటి శాసనాలు అశోకుని సామ్రాజ్యంలో చాలా ప్రాంతాలలో లభించాయి కానీ ఈ శాసనాలు వాయవ్య భారతదేశంలో అరామిక్, ఖరోష్టిలిపులలో రాయబడ్డాయి ఆఫ్ఘనిస్థాన్‌లో – అరామిక్, గ్రీకు భాషలూ, లిపులూ కూడా ఉపయోగించబడ్డాయి సాధారణంగా అశోకుని శాసనాలను ప్రాచీనమైన రహదారుల పక్కలో ఉంచేవారు ఈ శాసనాలు మనకు అశోకుని జీవితాన్ని గురించీ, అతని దేశీయ, విదేశీయ విధానాలను గురించీ, అతని సామ్రాజ్య విస్తృతిని గురించీ తెలియజేస్తాయి

## కళింగ యుద్ధం ప్రభావం

బౌద్ధమత భావజాలం అశోకుని దేశీయ, విదేశీయ విధానాన్ని నడిపించింది సింహాసనాన్ని అధిష్టించిన తరువాత అశోకుడు ఒకే ఒక పెద్ద యుద్ధాన్ని – కళింగయుద్ధాన్ని – చేశాడు అతని కథనం ప్రకారం అందులో ఒక లక్షమంది చనిపోయారు అనేక లక్షల మంది నిరాశ్రయులై పోయారు లక్షన్నరమంది బందీలయ్యారు ఈ సంఖ్యలు అతిశయోక్తులనటానికి సందేహం లేదు ఎందుకంటే, అశోకుని శాసనాల్లో "లక్ష" అన్న మాట అనేకసార్లు నిర్దుష్టత లేకుండా ఉపయోగించబడింది కానీ ఈ యుద్ధంలో జరిగిన హత్యాకాండను చూసి అశోకుడు చలించి పోయాడనటానికి మాత్రం సందేహం లేదు కాబట్టి అతడు సామ్రాజ్య విస్తరణను త్యజించి సంస్కృతీ విస్తరణను చేబట్టాడు మరోవిధంగా చెప్పాలంటే "భేరీఘోష"ను త్యజించి "ధమ్మఘోష"ను ప్రారంభించాడు పదమూడవ ప్రధాన శిలాశాసనం నుంచీ అశోకుని మాటల్ని ఉటంకిస్తున్నాం

> "సింహాసనాన్ని అధిష్టించిన ఎనిమిది సంవత్సరాల తరువాత దేవానాం ప్రియుడు, ప్రియదర్శి (అశోక చక్రవర్తి) కళింగ రాజ్యాన్ని జయించాడు అందులో లక్షన్నర మంది బందీలయ్యారు లక్షమంది చనిపోయారు అనేక లక్షలమంది నిరాశ్రయులై పోయారు కళింగ దేశాన్ని ఆక్రమించుకున్న తరువాత దేవానాంప్రియుడు ధర్మాన్ని నిజాయితీగా అనుసరించాడు ధర్మాన్ని ఆశించాడు ధర్మాన్ని బోధించాడు కళింగ దేశాన్ని జయించిన తరువాత దేవానాంప్రియునిలో పశ్చాత్తాపం కలిగింది ఒక స్వతంత్ర దేశాన్ని జయిస్తే జరిగే మారణ కాండా, ప్రజలు బందీలుగా ప్రవాస జీవితానికి వెళ్ళటమూ దేవానాంప్రియుని మనస్సును కలచివేసింది ఆ ప్రాంతంలో నివసించేవారు – వారు బ్రాహ్మణులైన, శ్రమణులైనా –, ఇతర తెగలకు చెందిన వారైనా, తమ గురువులమీద భక్తీ, స్నేహితుల మీదా, పరిచయస్తులమీదా, సహోద్యోగుల మీదా, బంధువులమీదా, బానిసలమీదా, సేవకులమీదా ప్రేమ, అభిమానము కలిగిన గృహస్థులైనా హింసనూ, ఎడబాటునూ భరించక తప్పదు కళింగ దండ యాత్రలో చనిపోయినవారిలో, తమవారి నుంచీ ఎడబాటు పొందినవారిలో నూరవ భాగం లేదా వెయ్యవ భాగం ప్రజలు బాధపడితే దేవానాంప్రియుని మనస్సు ఈనాడు తల్లడిల్లిపోతుంది
>
> "దేవానాంప్రియుడు ధమ్మం (ధర్మం)తో గెలిచిన గెలుపే అన్నిటికంటే గొప్ప గెలుపని భావిస్తాడు"

అశోకుడు ఇప్పుడు గిరిజనులకూ, సరిహద్దురాజ్యాలకూ ఒక సైద్ధాంతికమైన అభ్యర్ధన చేశాడు కళింగ వంటి స్వతంత్ర రాజ్యాలలోని ప్రజలను తనను తండ్రిగా భావించి, తనలో విశ్వాసం ఉంచమన్నాడు తాను నియమించిన అధికారులు ఈ భావాన్ని ప్రజలలో విస్తృతంగా ప్రచారం చేయాలన్నాడు గిరిజన జాతుల వారిని 'ధమ్మం' అనుసరించమని కోరాడు

పరాయి రాజ్యాలను సైనికంగా ఆక్రమించుకునే అధికారం తనకు ఉందన్న భావాన్ని అశోకుడు వదిలి పెట్టాడు ఆ రాజ్యాలను భావజాలంతో జయించటానికి ప్రయత్నించాడు పరదేశాలలో కూడా ప్రజలకోసమూ, పశువులకోసమూ సంక్షేమ కార్యాలను ప్రారంభించాడు ఆనాటి పరిస్థితులతో పోల్చి చూసినప్పుడు ఇది చాలా కొత్తవిధానం పశ్చిమ ఆసియాలోని గ్రీకు రాజ్యాలకూ, గ్రీసుకూ శాంతిదూతల్ని పంపాడు అశోకుని శాసనాల ఆధారంగా మనం ఈ విషయాలను తెలుసుకోవచ్చు బౌద్ధసాంప్రదాయ కథనం ప్రకారం అతడు బౌద్ధ మతాన్ని ప్రచారం చేయటానికి శ్రీలంకకూ, మధ్య ఆసియా దేశాలకూ మత ప్రచారకులను పంపాడు నాగరికుడైన రాజుగా అశోకుడు ప్రచారం ద్వారా తన రాజకీయ ప్రాబల్యాన్ని పెంచుకున్నాడు

కళింగయుద్ధం అశోకుణ్ణి తీవ్రమైన శాంతివాదిగా మార్చివేసిందని భావించటం పొరపాటు అన్ని సందర్భాలలోనూ అతడు శాంతిని అనుసరించలేదు శాంతికోసం శాంతి అన్న విధానాన్ని పాటించలేదు అలాకాకుండా సామ్రాజ్యాన్ని సంఘటిత పరచటానికి అవసరమైన వాస్తవిక విధానాన్ని అనుసరించాడు ఆక్రమణ తరువాత కళింగదేశాన్ని తన సామ్రాజ్యంతో కలుపుకున్నాడు అంతేకాకుండా, చంద్రగుప్తుని కాలం నుంచీ వస్తున్న పెద్ద సైన్యాన్ని అశోకుడు రద్దుచేసిన దాఖలాలు లేవు అతడు గిరిజన జాతుల వారిని 'ధర్మాన్ని' పాటించ వలసిందిగా అనేకసార్లు విజ్ఞప్తి చేసినా – సంప్రదాయాలకూ, ధర్మానికి వాళ్ళు వ్యతిరేకంగా ప్రవర్తించినప్పుడు వారిని బెదిరించాడు ప్రజలకు బహుమతులు ఇవ్వటం మాత్రమే కాకుండా అవసరం ఉంటే దండించే అధికారం కూడా ఉన్న "రాజుకులు" అన్న అధికార వర్గాన్ని అశోకుడు తన సామ్రాజ్యంలో ఏర్పాటు చేశాడు

ధర్మం ఆధారంగా సామ్రాజ్యాన్ని సంఘటితపరచటానికి అశోకుడు చేసిన ప్రయత్నాలు ఫలించాయి వేటగాళ్ళూ, జాలరులూ తమ సాంప్రదాయిక వృత్తుల్ని వదిలిపెట్టి, స్థిరమైన వ్యావసాయిక జీవనం సాగించేలా చేయటానికి అశోకుడు చేసిన ప్రయత్నాలు ఎలా ఫలించాయో అతని కాంధార్ శాసనం అభివర్ణిస్తుంది

## దేశీయవిధానం - బౌద్ధమతం

కళింగ యుద్ధం ఫలితంగా అశోకుడు బౌద్ధమతాన్ని స్వీకరించాడు జనశృతి ప్రకారం అతడు భిక్షువుగా మారిపోయి బౌద్ధులకు ఉదారంగా దానా లిచ్చాడు బౌద్ధారామాలకు తీర్థయాత్రలు చేశాడు అతడు తీర్థయాత్రలు చేసింది సత్యమేనని అతని శాసనాలలో పేర్కొన్న "ధర్మయాత్రలు" సూచిస్తున్నాయి



అశోకుని రూమిదేయ్ స్తంభశాసనం
ఇది బ్రాహ్మిలిపిలో ఉన్న ప్రాకృత భాషాశాసనం దీని తెలుగు అనువాదం ఇలా ఉంటుంది
"దేవానాంప్రియుడు, ప్రియదర్శి అయిన అశోకుడు తాను రాజ్యభారాన్ని స్వీకరించిన ఇరవై సంవత్సరాల తరువాత శాక్యముని బుద్ధుడు పుట్టిన ఈ చోటికి వచ్చాడు
"అతడు ఇక్కడ ఒక రాతిగోడనూ, బుద్ధుడు ఇక్కడ జన్మించాడని ప్రకటించే స్తంభాన్నీ నిర్మింపచేశాడు
"లుంబినీ గ్రామం "బలి"ని (కప్పాన్ని) చెల్లించవలసిన అవసరంలేదని అతడు ప్రకటించాడు అలాగే "భాగా"న్ని (పంటలో రాజుకు చెల్లించవలసిన భాగాన్ని ఎనిమిదోవంతుకు తగ్గించాడు ")

సాంప్రదాయిక కథనం ప్రకారం అశోకుడు మూడవ "బౌద్ధసంగతి"ని ఏర్పాటు చేశాడు దక్షిణ భారతదేశానికి మాత్రమే కాకుండా శ్రీలంకకూ, బర్మాకూ, ఇతర దేశాలకూ కూడా మత ప్రచారకులను పంపించాడు క్రీ పూ రెండవ శతాబ్దానికీ, మొదటి శతాబ్దానికీ చెందిన బ్రాహ్మీలిపిలో ఉన్న శాసనాలు శ్రీలంకలో లభించాయి

'రాజు తండ్రి వంటివాడు' అన్న గొప్ప ఆదర్శాన్ని అశోకుడు తనముందు ఉంచుకున్నాడు తాను ప్రజలను కన్నబిడ్డల్లాగా చూసుకుంటానని ప్రజలకు చెప్పవలసిందిగా అశోకుడు అధికారుల్ని ఆదేశించాడు రాజప్రతినిధులైన ప్రభుత్వాధికారులు ప్రజలను శ్రద్ధగా చూసుకోవాలని అశోకుడు ఆదేశించాడు వివిధ సామాజిక వర్గాలలో, స్త్రీలలో ధర్మాన్ని ప్రచారం చేయటం కోసం "ధర్మమహామాత్ర" అన్న పేరుతో అధికారుల్ని నియమించాడు చట్టాలను అమలు చేయటం కోసం "రాజుకులు" అన్న అధికారుల్ని కూడా నియమించాడు

కర్మకాండను - మరీముఖ్యంగా స్త్రీలు అనుసరించే ఆచారాలను అశోకుడు నిరసించాడు కొన్ని జంతువులనూ, పక్షులనూ చంపటాన్ని తన సామ్రాజ్యమంతా నిషేధించాడు రాజధానిలో జంతువధను పూర్తిగా నిషేధించాడు ప్రజలు హద్దుమీరి ప్రవర్తించటానికి అవకాశం ఉన్న విలాసోత్సవాలను చట్టపరంగా నిషేధించాడు

కానీ అశోకుని ధర్మం సంకుచిత ధర్మం కాదు అది పాక్షిక మత ధర్మంకూడా కాదు అతని ఉద్దేశం సామాజిక ధర్మాన్ని రక్షించటం మాత్రమే తల్లితండ్రులపట్ల విధేయులుగా ఉండమనీ, బ్రాహ్మణులనూ, బౌద్ధ భిక్షువులనూ గౌరవంగా చూడమనీ, బానిల పట్లా, సేవకుల పట్లా దయాదాక్షిణ్యాలు కలిగి ఉండమనీ అశోకుడు ప్రజలను ఆదేశించాడు ఇలాంటి ఆదేశాలను మనం హిందూ, బౌద్ధమతాలు రెండింటిలోనూ గమనించవచ్చు

అశోకుడు ప్రజలకు తాము బతకటం, ఇతరుల్ని బతకనివ్వటం నేర్పాడు జంతువులమీద దయా, బంధువులపట్ల ఉచితమైన ప్రవర్తనా ప్రజలకు ఉండాలని నొక్కి చెప్పాడు కుటుంబ వ్యవస్థనూ, అమలులో ఉన్న సామాజిక వర్గాలను బలోపేతం చేయటం అశోకుని ఉద్దేశం ప్రజలు మర్యాదగా ప్రవర్తిస్తే స్వర్గానికి వెళ్తారని అతడు నమ్మాడు నిర్వాణం (బౌద్ధుల ఆధ్యాత్మిక గమ్యం) లభిస్తుందని అతడు ఎక్కడా చెప్పలేదు అతడు సర్వత్రా స్వర్గాన్నే పేర్కొన్నాడు అతడు సహనం ప్రాతిపదికగా అమలులో ఉన్న సామాజిక వ్యవస్థను కొనసాగించాలని భావించాడు అతడు సంకుచితమైన ధర్మాన్ని ఏనాడూ బోధించలేదు

## చరిత్రలో అశోకుని స్థానం

అశోకుని శాంతి విధానం మౌర్య సామ్రాజ్యపతనానికి కారణ భూతమైందని కొందరు భావిస్తారు అందులో సత్యం లేదు వాస్తవానికి అశోకుడు అనేక విజయాలను సాధించాడు ప్రాచీన ప్రపంచ చరిత్రలో అశోకుడు అందరికంటే గొప్ప

మత ప్రచారకుడైన రాజు తన లక్ష్యం కోసం అతడు ఎంతో ఉత్సాహంగా పనిచేసి – స్వదేశంలోనూ, ఇతర దేశాలలోనూ ఎంతో సాధించాడు

అశోకుడు భారతదేశంలో రాజకీయ ఐక్యతను సాధించాడు అతడు ఆ ఐక్యతను ఒకే ధర్మంతో, ఒకే భాషతో, తాను శాసనాలలో ఉపయోగించిన ఒకే లిపి (బ్రాహ్మి)తో మరింత పటిష్టం చేశాడు అతడు దేశాన్ని ఐక్యం చేయటం కోసం బ్రాహ్మీ లిపితోపాటు ఖరోష్టి, అరామిక్, గ్రీక్ లిపులను కూడా గౌరవించాడు అతడు ప్రాకృతం, సంస్కృతం, గ్రీక్‌వంటి భాషలనే కాకుండా అనేక మత శాఖలను సహన దృష్టితో చూశాడు అశోకుడు సహనం కలిగిన మత విధానాన్ని అనుసరించాడు అతడు తన పౌరులమీద బౌద్ధమతాన్ని బలవంతంగా రుద్దలేదు అంతేకాకుండా, అతడు బౌద్ధేతర, బౌద్ధవ్యతిరేక మత శాఖలవారికి ఉదారంగా దానాలిచ్చాడు

మత ప్రచార ఉత్సాహం అశోకునిలో తీవ్రంగా ఉండేది సామ్రాజ్యం యొక్క అన్ని ప్రాంతాలకూ అతడు అధికారుల్ని పంపాడు అది పరిపాలనకు దోహదం చేయటం మాత్రమే కాకుండా – అభివృద్ధి చెందిన గంగామైదానానికీ, వెనకబడి ఉన్న సుదూర రాష్ట్రాలకూ మధ్య సాంస్కృతిక సంబంధాలను ఏర్పాటు చేసింది సామ్రాజ్యం మధ్యభాగంలో ఉన్న భౌతిక సంస్కృతి కళింగకూ, దక్కన్ పీఠభూమి దక్షిణ భాగానికీ, బెంగాల్ ఉత్తర ప్రాంతానికీ వ్యాపించింది

అన్నిటికంటే ముఖ్యంగా శాంతి విధానాన్ని అనుసరించటం చేతా, దురాక్రమణలకు దిగకపోవటం చేతా, సాంస్కృతిక విజయాలను సాధించటం చేతా అశోకునికి చరిత్రలో ప్రముఖమైన స్థానం ఉంది అలాంటి విధానాన్ని అనుసరించినవారు అతనికంటే పూర్వం ఎవరూ లేరు క్రీ పూ 14 వ శతాబ్దంలో ఈజిప్ట్‌లో అఖ్‌నాటర్ అన్న రాజు తప్ప ఇలాంటి శాంతి విధానాన్ని అనుసరించిన వారు ప్రపంచ చరిత్రలోనే ఎవరూ లేరు అశోకునికి ఈ ఈజిప్ట్ రాజును గురించి తెలియదనటానికి సందేహం లేదు కౌటిల్యుడు ఎల్లప్పుడూ సామ్రాజ్య విస్తరణకు ప్రయత్నించాలని చెప్పాడు కానీ అశోకుడు పూర్తిగా దానికి వ్యతిరేకమైన విధానాన్ని అనుసరించాడు కళింగ యుద్ధం వరకూ అనుసరిస్తూ వచ్చిన సామ్రాజ్య విస్తరణ విధానాన్ని వదిలిపెట్టమని మగధ రాజులకు అశోకుడు బోధించాడు శాంతి విధానాన్ని అనుసరించమన్నాడు దాదాపు రెండు శతాబ్దాల నిరంతర యుద్ధాల తరువాత మగధకు శాంతి ఎంతో అవసరమైంది అశోకుడు శాంతి విధానాన్నే అనుసరించాడు అవసరమైన ఆర్థిక వనరులున్నా, గొప్ప సైన్యం ఉన్నా – కళింగ యుద్ధం తరువాత అశోకుడు యుద్ధాలు చేయలేదు ఈ విషయంలో అశోకుడు నిస్సందేహంగా తన కాలంకంటే ఎంతో ముందు వున్నాడనటానికి సందేహం లేదు

కానీ అశోకుని శాంతివిధానం అతని రాజప్రతినిధుల మీదా, సామంత రాజుల మీదా శాశ్వతమైన ప్రభావాన్ని చూపించలేదు క్రీ పూ 232లో అశోకుడు పదవీ త్యాగం చేసిన తరువాత వారు స్వతంత్రం ప్రకటించుకున్నారు అతని ఇరుగు పొరుగు రాజులలో కూడా అశోకుని విధానం మార్పు తీసుకురాలేకపోయింది అశోకుడు పదవీ త్యాగం చేసిన 30 సంవత్సరాల తరువాత వారు వాయవ్య ప్రాంతం మీద దాడిచేసి ఆక్రమించుకున్నారు

★ ★ ★

# అధ్యాయం: 15

# మౌర్యపరిపాలన ప్రత్యేకత

## రాజ్యం యొక్క అధికారం

బ్రాహ్మణీయ ధర్మశాస్త్ర గ్రంధాలు – రాజు ధర్మ శాస్త్రాల ఆధారంగానూ, దేశంలో ప్రచలితంగా ఉన్న ఆచార వ్యవహారాల ఆధారంగానూ పరిపాలన చేయాలని పదేపదే చెబుతున్నాయి వర్ణాలమీదా, ఆశ్రమాలమీదా ఆధారపడ్డ సామాజిక వ్యవస్థ పతనమైపోతున్నప్పుడు రాజు ధర్మాన్ని పరిరక్షించాలని కౌటిల్యుడు చెప్పాడు అతడు రాజును "ధర్మ ప్రవర్తకుడు" అని పిలిచాడు అశోకుడు తన శాసనాలలో రాజశాసనం ఇతర శాసనాల కంటే ఉన్నతమైందని ప్రకటించాడు అతడు ధర్మాన్ని ప్రచారం చేశాడు అంతేకాకుండా, ధర్మం యొక్క మూల సూత్రాలను ప్రజలు అనుసరించేలా చూడటానికి ఉద్యోగులను నియమించాడు

మగధ రాజులు అనుసరించిన సైనిక ఆక్రమణ విధానం రాజు సర్వాధికారి అన్న సిద్ధాంతం వద్దకు సహజంగానే చేరుకుంది అంగ, వైశాలి, కాశీ, కోసల, అవంతి, కళింగ రాజ్యాలు ఒకటి తరువాత ఒకటిగా మగధ సామ్రాజ్యంలో భాగాలై పోయాయి సైనికాధికారం క్రమక్రమంగా ప్రజాజీవితంలోని అన్ని రంగాలమీదా తన దౌష్ట్యాన్ని చూపించటం ప్రారంభించింది ఇతర రాజ్యాల మీద తన ఆధిపత్యాన్ని స్థాపించుకోగల కత్తిబలం మగధకు ఉండేది

జీవితానికి సంబంధించిన అన్ని రంగాలనూ తన అధీనంలో ఉంచుకోవటంకోసం రాజ్యం పెద్ద ఉద్యోగి వర్గాన్ని పోషించవలసి వచ్చింది మౌర్య సామ్రాజ్య కాలంలో ఉన్నంతమంది ప్రభుత్వోద్యోగులు అంతకు ముందెన్నడూ లేరు

పరిపాలనా వ్యవస్థకు వెన్నుదమ్నుగా విస్తారమైన గూఢచారి వ్యవస్థ ఉండేది రకరకాలైన గూఢచారులు విదేశీశత్రువుల మీదా, ప్రభుత్వాధికారుల మీదా ఒక కన్నువేసి ఉంచి, సమాచారాన్ని సేకరించేవారు మూఢ విశ్వాసాలను రెచ్చగొట్టి, అమాయక ప్రజల వద్ద నుంచీ డబ్బు వసూలు చేయటానికి కూడా వారు తోడ్పడేవారు

ముఖ్యమైన అధికారులను "తీర్థులు" అని పిలిచేవారు అత్యున్నతమైన అధికారులు మంత్రి, పురోహితుడు, సేనాపతి, యువరాజు వీరికి చాలా పెద్ద జీతాలుండేవి ఇతర అధికారులకు కూడా డబ్బు రూపంలోనే జీతాలు చెల్లించేవారు ఈ నలుగురు ఉద్యోగులకూ 48,000 పణాలు చెల్లించేవారు పణం తులంలో ముప్పాతిక తూకం ఉన్న వెండి నాణెం తక్కువ స్థాయి అధికారులకు అన్నీ కలిపి 60 పణాలు మాత్రమే ఇచ్చేవారు 10 నుండి 20 పణాలు జీతం లభించే ప్రభుత్వోద్యోగులు కూడా ఉండేవారు కాబట్టి అతి పెద్ద, అతి చిన్న ఉద్యోగుల మధ్య జీతాలలో పెద్ద అగాధం ఉండేది

కౌటిల్యుని "అర్థశాస్త్రం"లో ఉన్న ప్రకారమైతే రాజ్యం యొక్క ఆర్థిక వ్యవహారాలను అజమాయిషీ చేయటం కోసం రాజు 27 మంది "అధ్యక్షుల"ను నియమించేవాడు వీరు వ్యవసాయాన్ని కూడా అజమాయిషీ చేసేవారు అంతేకాకుండా, వ్యాపారం, తూనికలు, కొలతలు, చేనేత, నూలు వడకటం లాంటి చేతివృత్తులూ, గనులూ కూడా వీరి అధీనంలోనే ఉండేవి వ్యవసాయ దారులకు రాజ్యమే నీటి పారుదల సౌకర్యాలను కలిగించేది మౌర్య సామ్రాజ్యంలో అధికారులు ఈజిప్టులో లాగా భూమిని కొలిచేవారనీ (సర్వే), పెద్ద కాలువల గుండా చిన్న పంటకాలువలలోకి నీరు వదలటాన్ని అజమాయిషీ చేసేవారనీ మెగస్తనీస్ చెప్పాడు

కౌటిల్యుని అర్థశాస్త్రం ప్రకారం మౌర్య సామ్రాజ్య కాలంలో వచ్చిన కొత్త పరిణామం బానిసలను వ్యవసాయ కార్యకలాపాలలో ఉపయోగించటం కానీ మెగస్తనీసు తనకు భారతదేశంలో బానిసలు తారసపడలే దన్నాడు అయినా వేదకాలం నుంచీ భారతదేశంలో గృహబానిసలు ఉండేవారనటానికి సందేహం లేదు కానీ మౌర్యుల కాలంలోనే మొటదిసారిగా బానిసలను వ్యవసాయంలో ఉపయోగించటం పెద్ద ఎత్తున ప్రారంభమైంది ప్రభుత్వానికి వ్యవసాయ క్షేత్రాలుండేవి అందులో అసంఖ్యాకమైన బానిసల చేతా, వ్యవసాయ కూలీల చేతా పని చేయించేవారు కళింగ నుంచీ

అశోకుడు తీసుకువచ్చిన లక్షన్నర యుద్ధ ఖైదీలను ఇలాగే ఉపయోగించి ఉండవచ్చు కానీ ప్రాచీన భారతీయ సమాజం బానిస సమాజం కాదు గ్రీస్, రోమ్ దేశాల్లో బానిసలు చేసిన పనుల్ని భారతదేశంలో శూద్రులు చేసేవారు పై మూడు వర్ణాలవారికీ శూద్రులు ఉమ్మడి ఆస్తిగా భావించబడ్డారు వారు నిర్బంధంపై మూడు వర్ణాలవారికీ బానిసలుగా, చేతిపనివారుగా, వ్యవసాయ కూలీలుగా, గృహసేవకులుగా పని చేశారు

రాజు అజమాయిషీ విశాలమైన ప్రాంతంలో పనిచేసేదని భావించటానికి అనేక కారణాలున్నాయి ఈ అజమాయిషీ రాజ్యం యొక్క కేంద్రభాగంలో, తప్పకుండా ఉండేది పాటలీపుత్రం సామ్రాజ్యానికి కీలకమైన స్థానంలో ఉండటం చేతా, రాజప్రతినిధులు నాలుగు దిక్కులకూ నౌకలమీద ప్రయాణం చేయటానికి వీలుండటం చేతా అది వీలు కలిగింది అంతేకాకుండా పాటలీపుత్రం నుంచీ వైశాలి, చంపారణ్ ల మీదుగా నేపాల్ కు ఒక రాజమార్గం ఉండేది హిమాలయపర్వత పాదాల వద్ద మరొక మార్గం ఉండేది అది వైశాలి నుంచీ కపిలవస్తు, కల్సి (డెహ్రాడూన్ జిల్లా), హజ్రాల మీదుగా పెషావర్ చేరుకునేది మెగస్తనీస్ వాయవ్య భారతదేశాన్ని పాటలీపుత్రంతో కలిపే మరొక రాజమార్గాన్ని గురించి ప్రస్తావించాడు పాట్నా, ససారంలను కలుపుతూ మరొక మార్గం మీర్జాపూర్ కూ, మధ్య



లౌరియా–నందన్ ఘర్ లోని అశోకస్తంభం

భారతదేశానికీ వెళ్ళేది తూర్పు మధ్యప్రదేశ్ గుండా పాటలీపుత్రం, కళింగల మధ్యకూడా మరొక రాజమార్గం ఉండేది కళింగ ప్రాంతం నుంచీ ఆంధ్ర, కర్ణాటక ప్రాంతాలకు కూడా రహదారి సౌకర్యం ఉండేది ఈ సౌకర్యాలు – రాకపోకలు అభివృద్ధి చెందటానికి దోహదం చేశాయి అందులో గుర్రాలు ప్రధాన పాత్ర వహించి ఉండవచ్చు ఉత్తర భారతదేశంలో గంగ, ఇతర నదులు రాకపోకలకు దారులుగా ఉపయోగపడ్డాయి

ప్రధాన రహదారుల పక్క ఉన్న అశోకుని శాసనాలు అతని సామ్రాజ్యం మొగల్ సామ్రాజ్యంతో, బహుశా తూర్పు ఇండియా కంపెనీ సామ్రాజ్యంతో సమానంగా ఉండేదని సూచిస్తున్నాయి ప్రధాన రహదారుల పక్క ఎక్కువగా జననివాసాలు ఏర్పడటం చేతా, రికాబులు పూన్చిన గుర్రాలను ఉపయోగించటం చేతా మధ్యయుగాలలో రాకపోకల సౌకర్యాలు అభివృద్ధి చెందాయి తూర్పు ఇండియా కంపెనీ తుపాకులనూ, వాటికి సహాయకంగా నీటి ఆవిరితో నడిచే పడవలనూ 1830 నుంచీ ఉపయోగించటం ప్రారంభించింది

మౌర్యచక్రవర్తులకు పెద్ద జనసంఖ్యతో వ్యవహరించవలసిన అవసరం ఉండేదికాదు వారి సైన్యం మొత్తం ఆరున్నర లక్షలకు మించి ఉండేదికాదు పదిశాతం ప్రజలు సైన్యంలోకి తీసుకోబడ్డారని అనుకున్నా గంగామైదానంలోని జనాభా అరున్నర మిలియన్లకు మించి ఉండేదికాదు రాజశాసనం తూర్పు, దక్షిణ ప్రాంతాల చివరలకు తప్ప మిగిలిన దేశానికంతా అందేదని అశోకుని శాసనాలు చెబుతాయి కానీ కఠినమైన రాజ్యాధికారం గంగామైదాన మధ్యభాగాన్ని దాటి ఉండేది కాదేమో ననిపిస్తుంది

ప్రాచీన భారతదేశంలో పన్నుల విధానం రూపొందటంలో మౌర్యసామ్రాజ్యం ఒక ప్రధానమైన మలుపు రైతుల వద్ద నుంచీ, చేతివృత్తులవారి నుంచీ, వ్యాపారులనుంచీ వసూలు చేయవలసిన పన్నుల పేర్లను కౌటిల్యుడు పేర్కొన్నాడు పన్నుల్ని నిర్ణయించటానికీ, వసూలు చేయటానికీ, భద్రపరచటానికీ విస్తృతమైన యంత్రాంగం అవసరమైంది మౌర్యులు వసూలు చేసిన పన్ను ధనాన్ని భద్రపరచటం కంటే, పన్నును నిర్ణయించటానికే ఎక్కువ ప్రాధాన్యత నిచ్చారు పన్నులు నిర్ణయించే అత్యున్నత అధికారి పేరు "సమహర్త" పన్ను ధనాన్ని ఖజానాలో భద్రపరిచే అధికారిపేరు "సన్నిధాత" రాజ్యానికి మొదటి అధికారి చేసే అపకారం రెండవ అధికారిచేసే అపకారం కంటే ఎక్కువగా ఉంటుందని ఆనాడు భావించేవారు పన్నులు నిర్ణయించే పెద్ద అధికార యంత్రాంగం మొదటి సారిగా మనకు మౌర్యుల కాలంలోనే కనిపిస్తుంది "అర్థశాస్త్రం"లో పేర్కొన్న పన్నులు చాలా ఉన్నాయి వీటినన్నిటినీ నిజంగానే వసూలు చేసి ఉంటే ప్రజలకు జీవనం సాగించటానికి దాదాపుగా ఏమీ మిగిలి ఉండదు

మౌర్యుల కాలంలో గ్రామాలలో గిడ్డంగులున్నట్టుగా శాసనాధారాలున్నాయి పన్నుల్ని ధాన్యరూపంలో కూడా వసూలు చేసేవారనీ, అలా వసూలు చేసిన ధనాన్ని కరువుకాలంలో స్థానిక ప్రజలకు పంచేవారనీ భావించవచ్చు

వెండితో చేసిన విద్ధాంక నాణాలు మౌర్య సామ్రాజ్యంలో మారకపు ద్రవ్యంగా ఉండేవని భావించవచ్చు వీటిమీద నెమలి, కొండ, నెలవంక మొదలైన చిత్రాలుండేవి ఇవి చాలా పెద్ద సంఖ్యలో లభించాయి అవి పన్నుల్ని వసూలు చేయటానికీ, ఉద్యోగుల జీతాలను చెల్లించటానికీ ఉపయోగ పడివుంటా యనటానికి ఎలాంటి సందేహమూ లేదు అంతేకాకుండా నాణాల విలువ ఒకేరకంగా ఉండటంచేత విశాలమైన ప్రాంతంలో వ్యాపార లావాదేవీలు జరగటానికి అవి దోహదం చేసి ఉంటాయి

మౌర్యులు కళలకూ, శిల్పానికీ గొప్పగా దోహదం చేశారు వారు రాతి కట్టడాలను విస్తృతంగా పరిచయం చేశారు పాట లీపుత్రంలోని మౌర్య చక్రవర్తుల అంతఃపురం – ఇరాన్‌లోని అంతఃపురాలలాగా అద్భుతంగా ఉండేదని మెగస్తనీస్ చెప్పాడు ఆధునిక పాట్నానగరానికి దగ్గరగా కుమ్రహార్ అన్నచోట 80 స్తంభాలు కలిగిన విశాలమైన హాలు ఉండేదనటానికి నిదర్శనంగా స్థంభాల శకలాలు తవ్వకాల్లో బయటపడ్డాయి ఈ శిధిలాలు మెగస్తనీసు వర్ణించిన వైభవానికి నిదర్శనాలు కావు కానీ రాతికి మెరుగు పెట్టటంలో మౌర్యులకాలానికి చెందిన పనివారు ఎంత నైపుణ్యాన్ని సాధించారో ఇవి చెబుతాయి ఈ రాతిస్థంభాలు ఉత్తర ప్రాంతంలో లభించిన నల్లని పాత్రలతో సమానమైన మెరుపును కలిగి ఉన్నాయి అంత పెద్దరాతి బండలను క్వారీలనుంచి తీసుకురావటం, వాటిని నిటారుగా నిలబెట్టిన తరువాత మెరుగు పెట్టటం, చిత్రికలు పట్టటం చాలా కష్టమైన పనులుగా ఉండి ఉండాలి ఇవి ఇంజనీరింగులో ఆనాటికి ఆశ్చర్యకరమైన పనులే ప్రతి స్థంభమూ ఒకే రాతి నుంచీ చెక్కబడింది గొప్ప శిల్ప నైపుణ్యం ఉన్న స్థంభాగ్రాలను మాత్రం ఇతర రాతిలో చెక్కి వీటిమీద పెట్టారు ఇందులో సింహాలు, ఎద్దులు మొదలైన జంతువుల శిల్పా లున్నాయి ఈ మెరుగు పెట్టిన స్థంభాలను సామ్రాజ్యమంతా అనేక చోట్ల ఉంచారు ఈ స్థంభాలకు మెరుగు పెట్టటంలోనూ, వాటిని సుదూర ప్రాంతాలకు తరలించటంలోనూ అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం బాగా విస్తరించి ఉండేదని అర్థమౌతోంది మౌర్యుల నాటి శిల్పులు, భిక్షువులు నివసించటం కోసం రాతి గుహలను తొలవటాన్ని కూడా ప్రారంభించారు గయకు 30 కి మీ దూరంలో ఉన్న బరబార్ గుహలు ఇందుకు అత్యంత ప్రాచీనమైన ఉదాహరణ తరువాతికాలంలో గుహలు చెక్కే కౌశలం పశ్చిమ, దక్షిణ ప్రాంతాలకు వ్యాపించింది

## భౌతిక సంస్కృతి విస్తరణ, రాజ్యవిధానం

మొట్టమొదటిసారిగా మౌర్యులు చక్కని పరిపాలనా యంత్రాంగాన్ని ఏర్పాటు చేశారు ఈ యంత్రాంగం ప్రధానంగా సామ్రాజ్య కేంద్రప్రాంతంలో సమర్థవంతంగా పనిచేసేది మరొకవైపున యుద్ధాలలో వారి విజయాలు వ్యాపారానికీ, మతప్రచారానికీ తలుపులు తెరిచాయి



రాంపూర్వాలో లభించిన వృషభ చప్పెం

ఉద్యోగులూ, వ్యాపారులూ, జైన బౌద్ధ సన్యాసులూ ఏర్పాటు చేసిన సంబంధాల ఫలితంగా గంగామైదానంలోని భౌతిక సంస్కృతి సామ్రాజ్యం యొక్క సుదూర ప్రాంతాలకు వ్యాపించిందని చెప్పవచ్చు ఇనుమునూ, పెద్ద మొత్తంలో విద్ధాంకనాణాలనూ, ఎన్ బి పి డబ్ల్యు అని పిలవబడే అంద మైన పాత్రలనూ, కాల్చిన ఇటుకలనూ, వర్తులాకారంలో ఉన్న బావులనూ విస్తృతంగా ఉపయోగించటంమీద గంగా మైదానంలోని భౌతిక సంస్కృతి ఆధారపడి ఉండేది అన్నిటికంటే ముఖ్యంగా ఈ సంస్కృతి అభివృద్ధి చెందటం

ఈశాన్య భారతంలో పట్టణాలు అభివృద్ధి చెందటం మీద ఆధారపడింది ఈ నగరాలు చాలా ఎక్కువగా ఉండటం చేత వాటిని కచ్చితంగా లెక్కపెట్టటం సాధ్యం కాదని అరియన్ అన్న గ్రీకు రచయిత చెప్పాడు అలా గంగా మైదానంలో మౌర్యుల కాలంలో భౌతిక సంస్కృతి త్వరత్వరగా వ్యాపించింది దక్షిణ బీహార్‌లో ఇనుము సులభంగా లభిస్తూ ఉండటంచేత ప్రజలు ఇనుప పనిముట్లను ఉపయోగించటం క్రమక్రమంగా అధికం కాసాగింది రంధ్రం ఉన్న గొడ్డళ్ళూ, కొడవళ్ళూ, బహుశా నాగలి కర్రులూ ఈ కాలంలో ఎక్కువగా ఉపయోగించారు ఇనుప ఆయుధాలు రాజ్యం యొక్క గుత్త ఆస్తి అయినా, ఇనుప పనిముట్లను అన్ని వర్గాల వారూ ఉపయోగించటానికి వీలుండేది వాటిని తయారు చేయటం గంగామైదానం నుంచీ సామ్రాజ్యంలోని సుదూర ప్రాంతాలకు వ్యాపించింది



మౌర్యులకాలంనాటి ఎర్రమట్టి బొమ్మ

మౌర్య సామ్రాజ్యకాలంలోనే మొట్టమొదటిసారిగా కాల్చిన ఇటుకల్ని ఉపయోగించటం ప్రారంభమైంది బీహార్‌లోనూ, ఉత్తరప్రదేశ్‌లోనూ కాల్చిన ఇటుకలతో కట్టిన మౌర్యుల కాలంనాటి నిర్మాణాలు బయటపడ్డాయి ఆ కాలంలో ఇళ్ళను – కాల్చిన ఇటుకలనూ, సులభంగా లభిస్తున్న కలపనూ ఉపయోగించి నిర్మించేవారు ఆ కాలంలో ఆ ప్రాంతంలో దట్టమైన వృక్షసంపద ఉండేది పాటలీపుత్రంలో కర్రతో కట్టిన నిర్మాణాన్ని గురించి మెగస్తనీస్ ప్రస్తావించాడు వరదల్నీ, శత్రువుల దండయాత్రలనీ అడ్డుకోవటానికి కర్ర దుంగల్ని ఒక పద్ధతిలో అడ్డంగా కట్టేవారని పాటలీ పుత్రంలో జరిగిన తవ్వకాలు చెబుతున్నాయి కాల్చిన ఇటుకల్ని ఉపయోగించటం సామ్రాజ్యపు సరిహద్దు రాష్ట్రాలకు కూడా వ్యాపించింది తేమ తక్కువగా ఉన్న ప్రాంతాలలోలాగా వర్షపాతం ఎక్కువగా ఉన్న గంగామైదానంలో కాల్చని పచ్చి ఇటుకలతో ఎక్కువ కాలం మన్నిక ఉన్న పెద్ద భవనాలను నిర్మించటం సాధ్యం కాలేదు అందుచేత కాల్చిన ఇటుకల ఉపయోగం అన్ని ప్రాంతాలకూ విస్తరించటం ఆ కాలంలో ఒక గొప్ప వరంగా పరిణమించింది దీని ఫలితంగా సామ్రాజ్యంలోని అన్ని ప్రాంతాలలోనూ నగరాలు అభివృద్ధి చెందాయి అలాగే మొదట గంగామైదానానికి మాత్రమే పరిమితంగా ఉన్న వర్తులాకారపు బావులు కూడా సామ్రాజ్యంలోని ఇతర ప్రాంతాలకు విస్తరించాయి గృహావసరాలకు కావలసిన నీరు ఈ బావుల నుంచీ లభించటం చేత నదీతీరాలలోనే జననివాసాలు ఏర్పాటు చేసుకోవాల్సిన అవసరం లేకుండా పోయింది ఈ బావులు జన సాంద్రత ఎక్కువగా ఉన్న నివాసాలలో మురికి నీరు ఇంకటానికి పనికొచ్చే గుంటలుగా ఉపయోగపడేవి

మధ్యగంగా మైదానపు భౌతిక సంస్కృతిలోని లక్షణాలు – కొన్ని మార్పులతో – ఉత్తర బెంగాలుకూ, కళింగకూ, ఆంధ్రకూ, కర్ణాటకకూ చేరుకున్నాయి బంగ్లాదేశ్‌లో మౌర్య బ్రాహ్మిలిపిలో మహాస్థాన శాసనం బోగ్రా జిల్లాలో లభించింది దీనాజ్‌పూర్ జిల్లాలోని బంగర్‌లో ఎన్ బి పి డబ్ల్యు పాత్రలు లభించాయి 24 పరగణాల్లోని చంద్రకేతుఘర్‌లో కూడా ఈ లక్షణాలున్న పాత్రలు లభించాయి ఒరిస్సాలోని శిశుపాలఘర్‌లోని జన నివాసాలకు కూడా గంగా మైదానంతో సంబంధాలున్నాయి ఇవి క్రీ పూ 3 వ శతాబ్దానికి – అంటే మౌర్యుల కాలానికి చెందినవని భావిస్తున్నారు ఇక్కడ ఎన్ బి పి డబ్ల్యు పాత్రలూ, ఇనుప పనిముట్లూ, విద్ధాంక నాణాలూ లభించాయి తూర్పు తీరప్రాంతం వెంబడి వెళ్ళే ఒక ప్రాచీన రహదారి పక్కన ధౌలీ, జౌగడా గ్రామాలకు దగ్గరగా అశోకుని శిలాశాసనం ఉంది దానికి సమీపంలోనే శిశుపాలఘర్ ఉంది కాబట్టి మగధ సామ్రాజ్యపు భౌతిక సంస్కృతి ఈ ప్రాంతానికి చేరటానికి ఈ ప్రాంతానికీ, పాటలీపుత్ర ప్రాంతానికీ రహదారి సంబంధాలుండేవని ఊహించటంలో తప్పులేదు ఈ సంబంధం క్రీ పూ నాలుగవ శతాబ్దంలో నందుల్ని కళింగ మీద దండెత్తినప్పుడు ప్రారంభమై ఉండవచ్చు అది

బరబార్ కొండల్లోని లోమరుషి గుహలు



రోపర్‌లో బయటపడ్డ గుండ్రని ఊటబావులు



క్రీ పూ 3 వ శతాబ్దంలో కళింగ ఆక్రమణతో బలపడి ఉండవచ్చు కళింగ యుద్ధం తరువాత తన శాంతి విధానంలో భాగంగా తన సామ్రాజ్యంలో భాగమైపోయిన కళింగ దేశంలో అశోకుడు కొన్ని జన నివాసాలను ప్రోత్సహించాడు

మౌర్యుల కాలంలో ఆంధ్రలోనూ, కర్ణాటకలోనూ అనేక చోట్ల ఇనుప ఆయుధాలూ, పనిముట్లూ దొరికాయి కానీ ఈ ప్రాంతాలలో ఇనుమును ఉపయోగించే సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి చెందటానికి రాతియుగానికి చెందిన పనివారు కారకులు పెద్ద పెద్ద బండల్ని ఉపయోగించి – కొన్ని సందర్భాల్లో వృత్తాకారంలో – సమాధుల్ని నిర్మించిన వారు వీరే కానీ వీటిలో కొన్ని చోట్లలో అశోకుని శాసనాలూ, ఎన్ బి పి డబ్ల్యు పాత్రలూ లభించాయి ఇవి క్రీ పూ 3 వ శతాబ్దానికి చెందినవి ఉదాహరణకు ఆంధ్రలోని అమరావతిలోనూ, కర్ణాటకలో అనేక చోట్లలోనూ అశోకుని శాసనాలు లభించాయి కాబట్టి తూర్పు తీరంగుండా మౌర్య సంస్కృతియొక్క భౌతిక లక్షణాలు దక్కన్ పీఠభూమి దక్షిణ భాగానికి క్రమక్రమంగా వ్యాపించాయని భావించవచ్చు

ఉక్కును తయారు చేయటం భారతదేశంలోని కొన్ని భాగాలకు మౌర్యులతో ఉన్న సంబంధాలవల్లనే వ్యాపించింది క్రీ పూ 200 అంతకంటే పూర్వ దశకు చెందిన ఉక్కు వస్తువులు గంగామైదానం మధ్యప్రాంతంలో లభించాయి ఉక్కుకు సంబంధించిన విజ్ఞానం వ్యాపించటం చేత కళింగ రాజ్యంలో అడవుల్ని నిర్మూలించటం, మెరుగైన వ్యవసాయ పద్ధతుల్ని ప్రవేశపెట్టటం జరిగి ఉండవచ్చు ఈ పరిస్థితులు ఆ ప్రాంతంలో చేది రాజ్యం తలెత్తటానికి దోహదం చేశాయి క్రీ పూ మొదటి శతాబ్దంలోనే శాతవాహన రాజ్యం ఏర్పడినా అది ఒకరకంగా మౌర్య సామ్రాజ్యానికి కొనసాగింపు మాత్రమే వారు మౌర్య సామ్రాజ్యానికి చెందిన కొన్ని భాగాలను తమ రాజ్యంలో కలుపుకొని, పరిపాలనలో చాలా వరకూ మౌర్యులు పాటించిన విధానాలనే పాటించారు

మౌర్యులను పరిశీలించి అలా రాజ్యాలను స్థాపించాలని ప్రయత్నించిన వారు చేది రాజులూ, శాతవాహన రాజులూ మాత్రమే కాదు చేర (కేరళపుత్రులు), చోళ, పాండ్య రాజ్యాలు కూడా అలాగే అవతరించాయి చివరిమూడు రాజ్యాలకు చెందిన ప్రజలూ, సత్యపుత్రులూ, తామ్రపర్ణి (శ్రీలంక) ప్రజలూ మౌర్య సామ్రాజ్యం సరిహద్దులలో నివసిస్తున్నట్టుగా అశోకుని శిలాశాసనాలు చెబుతాయి కాబట్టి వీరందరికీ మౌర్యరాజ్య స్వభావాన్ని గురించి తెలుసు మౌర్య రాజధానిని సందర్శించిన పాండ్యులను గురించి మెగస్తనీస్ ప్రస్తావించాడు అశోకుడు తన్నుతాను "దేవానాం ప్రియుడు" అని పిలుచుకున్నాడు సంగం గ్రంధాలలో పేర్కొన్న రాజులు ఈ బిరుదును తమిళంలోకి అనువదించి తాము ఉపయోగించుకున్నారు

శాసనాలూ, అక్కడక్కడా ఎన్ బి పి డబ్ల్యు పాత్రల శకలాలూ, విద్ధాంక నాణాలూ బంగ్లాదేశ్‌లోనూ, ఒరిస్సాలోనూ, ఆంధ్రలోనూ, కర్ణాటకలోనూ లభించాయి అవి సుమారు క్రీ పూ 300 ప్రాంతానికి చెందినవి మౌర్య సామ్రాజ్య కాలంలో మధ్యగంగా మైదానంలోని భౌతిక సంస్కృతిని సుదూర ప్రాంతాలకు విస్తరింప చేయటానికి ప్రయత్నాలు జరిగాయని ఇవి నిరూపిస్తాయి ఈ విధానం కౌటిల్యుడు చెప్పిన విధానానికి అనుకూలంగానే ఉంది కొత్త జనపదాలను రైతుల సహకారంతో స్థాపించాలనీ, జనసాంద్రత ఎక్కువగా ఉన్న ప్రాంతాలనుంచి శూద్ర కూలీలను తీసుకోవాలనీ కౌటిల్యుడు చెప్పాడు (ఆ కాలంలో వ్యవసాయదారులు వైశ్యులు) సాగులో లేని భూమిని సాగులోకి తీసుకురావటానికి వీరికి పన్ను మాఫీ చేయబడేది వీరికి పశువులనూ, విత్తనాలనూ, డబ్బునూ ఉచితంగా ఇచ్చేవారు తాము చేసిన సహాయాల వల్ల ప్రతిఫలం ఉంటుందన్న విశ్వాసంతో రాజ్యం ఈ విధానాన్ని అనుసరించేది ఇనుప కర్రు బిగించిన నాగలిని గురించి తెలియని ప్రాంతాలలో అలాంటి నూతన జన నివాసాలు అవసరమయ్యాయి ఈ విధానం వల్ల విశాలమైన ప్రాంతాలు వ్యవసాయం కిందికి వచ్చాయి ఆ ప్రాంతాలలో స్థిరమైన జన నివాసం ఏర్పడింది

మౌర్యసామ్రాజ్యంలోని మధ్యగంగామైదానపు భౌతిక సంస్కృతిని మధ్యభారతంలో తూర్పున ఛోటానాగపూర్ నుంచి పడమర వింధ్యపర్వతాల వరకూ వ్యాపించి ఉన్న గిరిజన ప్రాంతానికి విస్తరింప చేయటానికి పట్టణాలు ఎంతవరకూ దోహదం చేశాయో చెప్పటం సాధ్యం కాదు కానీ అశోకుడు గిరిజనులతో సన్నిహిత సంబంధాలను కలిగి ఉండేవాడనటం మాత్రం సత్యం వారు ధర్మాన్ని అనుసరించాలని అశోకుడు ప్రోత్సహించేవాడు అశోకుడు నియమించిన ధర్మమహామాత్రల ద్వారా గంగామైదానంలోని మెరుగైన సంస్కృతికి సంబంధించిన మూల సూత్రాలను గిరిజనులు తెలుసుకోగలిగేవారు ఈ విధంగా అశోకుడు బుద్ధిపూర్వకంగా, ఒక పద్ధతి ప్రకారం సంస్కృతీ విస్తరణ విధానాన్ని అనుసరించాడు ధర్మాన్ని ప్రచారం చేయటం ద్వారా మానవులు దేవతలతో కలుస్తారని అశోకుడు చెప్పాడు అంటే– గిరిజనులూ, ఇతరులూ స్థిరనివాసం ఏర్పరచుకున్న వ్యవసాయదారుల్లాగా పన్నులు చెల్లిస్తూ రాజునూ, రాజ్యాధికారాన్నీ, భిక్షువుల్నీ, పురోహితులనూ, ప్రభుత్వోద్యోగులనూ గౌరవిస్తూ ఉండాలని దానికర్థం అశోకుని విధానం విజయం పొందింది వేటగాళ్ళూ, జాలరులూ తమ హింసావృత్తుల్ని విసర్జించి ధర్మాన్ని స్వీకరించారని అశోకుడు ప్రకటించాడు అంటే, గిరిజనులు స్థిరమైన వ్యవసాయ జీవనాన్ని స్వీకరించారని అర్థం

## మౌర్య సామ్రాజ్యపతనం - కారణాలు

యుద్ధాల పరంపరతో, కళింగ ఆక్రమణతో ఉన్నత స్థాయికి చేరుకున్న మగధ సామ్రాజ్యం క్రీ పూ 232 తరువాత శిథిలం కావటం ప్రారంభించింది మౌర్య సామ్రాజ్యం క్షీణించటానికీ, పతనం కావటానికీ అనేక కారణాలున్నాయి

### బ్రాహ్మణుల తిరుగుబాటు

బ్రాహ్మణుల తిరుగుబాటు అశోకుని విధానాలకు వ్యతిరేకంగా వచ్చింది అశోకుడు సామరస్యమైన విధానాన్ని అనుసరించాడనీ, బ్రాహ్మణులను కూడా గౌరవించాలని ప్రజలను ఆదేశించాడనీ చెప్పటానికి ఎలాంటి సందేహమూ లేదు కానీ అతడు జంతువులనూ, పక్షులనూ చంపటాన్ని నిషేధించాడు స్త్రీలు అనుసరించే అనవసర ఆచార వ్యవహారాలను విమర్శించాడు దీనివల్ల బ్రాహ్మణుల ఆదాయం తగ్గిపోయింది కర్మకాండకూ, యజ్ఞయాగాలకూ వ్యతిరేకమైన అశోకుని విధానం వల్ల దక్షిణల మీదా, దానాలమీదా ఆధారపడుతూ ఉన్న బ్రాహ్మణులకు అతని పట్ల వ్యతిరేకత కలిగింది అతని సామరస్య విధానం వారికి సంతృప్తి నివ్వలేదు వారికి తమకున్న ప్రత్యేక హక్కుల్ని రక్షించే విధానం, తమ అవసరాలకు సరిపోయే విధానం కావలసి వచ్చింది మౌర్య సామ్రాజ్యం పతనమై పోయిన తరువాత ఆ శిథిలాలలో నుంచి ఉద్భవించిన రాజ్యాలలో కొన్నిటిని బ్రాహ్మణులే పరిపాలించారు శుంగరాజులూ, మధ్యప్రదేశ్‌లోనూ, ఇంకా తూర్పు ప్రాంతంలో పరిపాలించిన కణ్వ రాజులూ బ్రాహ్మణులే పశ్చిమ దక్కన్‌లోనూ, ఆంధ్రదేశంలోనూ చాలా కాలం నిలిచిన సామ్రాజ్యాన్ని స్థాపించిన శాతవాహనులు కూడా తాము బ్రాహ్మణుల మని ప్రకటించుకున్నారు అశోకుడు నిరాదరించిన యజ్ఞయాగాలను ఈ బ్రాహ్మణ రాజవంశాలవారు మళ్ళీ ప్రారంభించారు

### ఆర్థిక క్లిష్టపరిస్థితి

సైన్యం మీదా, ఉద్యోగి వర్గం మీదా జరుగుతూ వచ్చిన అపారమైన ఖర్చు కారణంగా మౌర్య సామ్రాజ్యం ఆర్థికంగా క్లిష్టపరిస్థితిని ఎదుర్కోవలసి వచ్చింది మనకు తెలిసినంతవరకూ మౌర్యులు అత్యంత పెద్ద సైన్యాన్నీ, అత్యంత పెద్ద సంఖ్యలో అధికారులనూ పోషించారు ప్రజల మీద ఎంత ఎక్కువగా పన్నులు విధించినా ఈ ఉపరితల నిర్మాణాన్ని పోషించటం కష్టమైపోయింది దీనికితోడు అశోకుడు బౌద్ధ భిక్షువులకు పెద్ద మొత్తాలను విరాళాలుగా ఇవ్వటంచేత ఖజానా ఖాళీ అయిపోయినట్టుగా ఉంది చివరి రోజులలో ఈ ఖర్చులను భరించటం కోసం బంగారంతో చేయించిన విగ్రహాలను కరిగించ వలసి వచ్చింది

### నియంతృత్వ పరిపాలన

సామ్రాజ్యం విచ్ఛిన్నం కావటానికి రాష్ట్రాలలో నియంతృత్వ పాలన ఒక ముఖ్యకారణం బింబిసారుడు రాజుగా ఉన్నప్పుడు తక్షశిల పౌరులు క్రూరులైన ప్రభుత్వోద్యోగుల (దుష్టామాత్యుల) నియంతృత్వ పాలనను గురించి తీవ్రంగా ఫిర్యాదు చేశారు అశోకుణ్ణి రాజప్రతినిధిగా నియమించటం ద్వారా బింబిసారుడు వారిని శాంతపరిచాడు కానీ అశోకుడు చక్రవర్తి అయిన తరువాత కూడా ఆ ఫిర్యాదులు కొనసాగుతూనే వచ్చాయి రాష్ట్రాలలో నియంతృత్వ పరిపాలనను అశోకుడు చాలా తీవ్రంగా పరిగణించేవాడని అతని కళింగ శాసనాలు చాటుతున్నాయి పట్టణప్రజలను అకారణంగా బాధించ వద్దని మహామాత్రలకు అతడు చెప్పాడు అధికారులు నిరంకుశంగా తయారు కాకుండా ఉండటం కోసం అతడు వారికి "రొటేషన్ పద్ధతి"ని ప్రవేశ పెట్టాడు ఈ పద్ధతి తోసలి (కళింగ), ఉజ్జయిని, తక్షశిలలలో అమలులో ఉండేది అతడు ఏడాదికి 256 రాత్రులు తీర్థయాత్రల్లో గడిపేవాడు బహుశా ఈ అలవాటు పరిపాలనను అజమాయిషీ చేయటానికి ఉపయోగపడి ఉండవచ్చు కానీ ఇవన్నీ కూడా సుదూర ప్రాంతాలలో నియంతృత్వ పాలనను నిరోధించ లేకుండా పోయాయి అశోకుని నిష్క్రమణ తరువాత - తక్షశిల తిరుగుబాటు చేసి, సామ్రాజ్యం నుంచి విడిపోయి, స్వతంత్ర రాజ్యంగా ప్రకటించుకుంది

### సుదూరప్రాంతాల్లో కొత్తవిజ్ఞానం

మగధ సామ్రాజ్య విస్తరణ కొన్ని భౌతిక సౌకర్యాల మీద ఎలా ఆధారపడి జరిగిందో ఇంతకు ముందే చూశాం మగధ సామ్రాజ్యం విస్తరించటం చేత ఈ భౌతిక సౌకర్యాలకు చెందిన విజ్ఞానం మధ్యభారతదేశానికీ, దక్కన్ పీఠభూమికీ, కళింగకూ విస్తరించింది అంతటితో మగధ సామ్రాజ్యానికి గుండెకాయ అయిన గంగామైదానానికున్న ప్రత్యేక ప్రాబల్యం పోయింది సుదూర సరిహద్దు ప్రాంతాలలో ఇనుప పనిముట్లనూ, ఆయుధాలనూ అలవాటుగా ఉపయోగించటమూ, మౌర్య సామ్రాజ్య పతనమూ దాదాపు ఒకే కాలంలో జరిగాయి మగధ నుంచీ భౌతిక సంస్కృతిని వారసత్వంగా గ్రహించి, దాని ఆధారంగా కొత్త రాజ్యాలను స్థాపించటం, అభివృద్ధి చేయటం సాధ్యమైంది అందుచేతనే మధ్య భారతదేశంలో శుంగ, కణ్వ రాజ్యాలూ, కళింగలో చేది రాజ్యమూ, దక్కన్‌లో శాతవాహన రాజ్యమూ ప్రారంభమయ్యాయి

## ఈశాన్య భారతం నిరాదరణ, చైనా మహాకుడ్యం

అశోకుడు ఇంటా, బయటా మత ప్రచార కార్యక్రమాలతో తలమునకలుగా ఉండటం చేత వాయవ్య ప్రాంతంలోని కనుమలను రక్షించటం మీద దృష్టి నిలుపలేక పోయాడు ఆ కాలంలో, అంటే క్రీ పూ 3 వ శతాబ్దంలో – మధ్య ఆసియాలో సిథియన్లు నిరంతరంగా సంచరిస్తూ ఉండటం చేత ఆ కనుమల్ని రక్షించటం ఎంతో అవసరంగా ఉండేది సిథియన్లు గుర్రాలను ఉపయోగించటం మీద ఆధారపడ్డ సంచార జీవనులు చైనాలోనూ, భారత దేశంలోనూ ఉన్న స్థిరమైన సామ్రాజ్యాలకు వీరివల్ల తీవ్రమైన ప్రమాదం ఉండేది వీరి దాడుల నుంచీ తన సామ్రాజ్యాన్ని రక్షించుకోవటం కోసం చైనా చక్రవర్తి షి హువాంగ్ టీ (క్రీ పూ 247–210) చైనా మహాకుడ్యాన్ని నిర్మించాడు అశోకుడు అలాంటి చర్యల్ని తీసుకోలేదు సిథియన్లు భారతదేశం వైపు చొచ్చుకొనిరాగానే పార్థియన్లూ, శకులూ, గ్రీకులూ కూడా భారతదేశం వైపుకు రాకతప్పలేదు గ్రీకులు ఉత్తర ఆఫ్ఘనిస్థాన్‌లో బాక్ట్రియా అన్న పేరుతో ఒక సామ్రాజ్యాన్ని స్థాపించారు భారతదేశం మీద మొట్ట మొదటిసారిగా క్రీ పూ 206లో దండయాత్ర చేసింది వీరే దీని తరువాత వరసగా దండయాత్రలు క్రీస్తుశకం ప్రారంభం వరకూ కొనసాగాయి

మౌర్య సామ్రాజ్యాన్ని క్రీ పూ 185లో పుష్యమిత్ర శుంగుడు ధ్వంసం చేశాడు బ్రాహ్మణుడే అయినా అతడు చిట్టచివరి మౌర్య రాజైన బృహద్రధుని వద్ద సేనాధిపతిగా ఉండేవాడు అతడు రాజును బహిరంగంగా చంపి, బలవంతంగా సింహాసనాన్ని ఆక్రమించుకున్నాడని చెబుతారు శుంగులు పాటలీపుత్రాన్నీ, మధ్యభారత దేశాన్నీ పరిపాలించారు బ్రాహ్మణీయ జీవన విధానం పునరుద్ధరించబడినందుకు నిదర్శనంగా అనేక యజ్ఞయాగాలను చేశారు వీరు బౌద్ధులను హింసించారని చెబుతారు వీరి తరువాత కణ్వులు అధికారానికి వచ్చారు వీరుకూడా బ్రాహ్మణులే

★ ★ ★

అధ్యాయం: 16

# మధ్య ఆసియాతో సంబంధాలు - వాటి ఫలితాలు

క్రీ. పూ దాదాపు 200 ప్రాంతంలో ప్రారంభమైన దశలో మౌర్య సామ్రాజ్యంలాగా పెద్ద సామ్రాజ్యం ఏర్పడలేదు కానీ ఆ దశలో మధ్య ఆసియాకూ, భారతదేశానికీ మధ్య విస్తృతమైన సంబంధాలు ప్రారంభం కావటం మాత్రం గమనార్హం తూర్పు, మధ్య భారతదేశంలోనూ, దక్కన్ లోనూ స్థానికులైన శుంగులు, కణ్వులు, శాతవాహనులు మౌర్య సామ్రాజ్యం తరువాత సొంత రాజ్యాలను ఏర్పాటు చేశారు ఈశాన్య భారతదేశంలో మౌర్యసామ్రాజ్యం స్థానంలో మధ్య ఆసియాకు చెందిన అనేక రాజవంశాల వారు రాజ్యాలను స్థాపించారు

## ఇండో - గ్రీకులు

క్రీ పూ 200 ప్రాంతంలో వరసగా దండయాత్రలు ప్రారంభమయ్యాయి మొట్టమొదటి సారిగా హిందూకుష్ పర్వతాలను దాటి వచ్చిన వారు బాక్ట్రియాకు చెందిన గ్రీకులు వీరి రాజ్యం ఉత్తర ఆఫ్ఘనిస్థాన్‌లో ఆక్సస్ నదికి దక్షిణంగా ఉండేది ఈ దశలో దురాక్రమణ దారులు ఒకరి తరువాత ఒకరుగా వచ్చారు వీరిలో కొందరు ఏకకాలంలో పరిపాలన కూడా సాగించారు ఈ దండయాత్రలకున్న ప్రధాన కారణం, బాక్ట్రియాలోనూ, పార్థియా అని పిలవబడే ఇరాన్ ప్రాంతంలోనూ ఉండిన సెల్యూసిడ్ రాజ్యం యొక్క బలహీనత సిథియన్ జాతుల ఒత్తిడి కారణంగా ఈ గ్రీకులు ఈ ప్రాంతంలో తమ అధికారాన్ని రక్షించుకోలేకపోయారు చైనా గోడ నిర్మించబడిన తరువాత సిథియన్లు చైనా సరిహద్దుల్ని చేరలేకపోయారు వారు తమ దృష్టిని ఇరుగుపొరుగుల్లో ఉన్న గ్రీకుల మీదికీ, పార్థియన్ల మీదికీ మళ్ళించారు సిథియన్ తెగలవారు తరమటం చేత బాక్ట్రియన్ గ్రీకులకు భారతదేశం మీదికి దండెత్తి రావటం తప్ప మరొక మార్గం లేకుండా పోయింది ఈ కాలంలో ప్రారంభమైన పరాయి దండయాత్రల్ని అడ్డుకోగల శక్తి అశోకుని వారసులకు లేకుండా పోయింది



ఇండో-గ్రీక్ నాణాలు

అలా మొదట భారతదేశం మీదికి దండెత్తి వచ్చిన వారు గ్రీకులు వీరిని ఇండో – గ్రీకులనీ, బాక్ట్రియన్ గ్రీకులని కూడా అంటారు క్రీ పూ రెండవ శతాబ్దంలో ఇండో – గ్రీకులు వాయవ్య భారతదేశంలో విశాలమైన ప్రాంతాన్ని – అలెగ్జాండర్ ఆక్రమించుకున్న ప్రాంతంకంటే విశాలమైన ప్రాంతాన్ని – ఆక్రమించుకున్నారు వారు అయోధ్య, పాటలీపుత్రాలవరకూ చొచ్చుకొని వచ్చినట్టు చెబుతారు కానీ గ్రీకులు భారతదేశంలో సువ్యవస్థితమైన పరిపాలనను



స్థాపించలేకపోయారు  రెండు గ్రీకు వంశాలు వాయవ్య భారతంలో ఏకకాలంలో పరిపాలించాయి గ్రీకు రాజులలో సుప్రసిద్ధుడు మీనాండర్ (క్రీ పూ 165–145) ఇతణ్ణి మిళిందుడు అని కూడా అంటారు అతడు పంజాబులోని సకలి (ఆధునిక సియాల్ కోట) అన్న పట్టణాన్ని రాజధానిగా పరిపాలించాడు అతడు గంగా–యమునా మైదానం మీద దండయాత్ర చేశాడు అతణ్ణి నాగసేనుడు బౌద్ధమతంలోకి మార్చాడు నాగసేనుణ్ణి నాగార్జునుడని కూడా పిలుస్తారు బౌద్ధమతం గురించి మీనాండర్ నాగసేనుణ్ణి ఎన్నో ప్రశ్నలడిగాడు అతని ప్రశ్నలూ, వాటికి నాగసేనుడిచ్చిన సమాధానాలూ "మిళింద పన్హ" అన్న గ్రంథంలో రికార్డు చేయబడ్డాయి

భారతదేశంలో ఇండో – బాక్ట్రియన్ గ్రీకుల పరిపాలనకు ఎంతో ప్రాధాన్యత ఉంది ఇందుకు ముఖ్యమైన కారణం – వారు పెద్ద సంఖ్యలో నాణాలను విడుదల చేయటం రాజులతో సంబంధం ఉందని నిస్సందేహంగా చెప్పదగిన నాణాలను మొదట ముద్రించిన వారు ఇండో–గ్రీకులే అంతకు పూర్వకాలానికి చెందిన విద్దాంక నాణాలను గురించి అలా చెప్పటానికి వీలులేదు భారతదేశంలో మొదటిసారిగా బంగారు నాణాలను ముద్రించినవారు కూడా ఇండో–గ్రీకులే తరువాత కుషానుల కాలంలో వాటి సంఖ్య పెరిగింది గ్రీకుల పరిపాలన వాయవ్య భారతదేశం సరిహద్దులో హెలనిస్టిక్ (గ్రీకు) కళ లక్షణాలను ప్రవేశపెట్టింది అలెగ్జాండర్ చనిపోయిన తరువాత గ్రీకులకూ, గ్రీకులు జయించిన ఇతర ప్రజలకూ మధ్య ఏర్పడ్డ సంబంధం యొక్క ఫలితం ఈ కళ గాంధార శిల్పం భారతదేశంలో దీనికి అత్యుత్తమ ఉదాహరణం



తక్షశిలవద్ద కులవార్‌లో లభించిన క్రీ శ మొదటి శతాబ్దానికి చెందిన తామ్రశాసనం

ఇందులోని భాష ప్రాకృతం ఇది ఖరోష్ఠలిపిలో కుడినుంచీ ఎడమకు రాయబడింది ఇందులోని మొదటి రెండు పంక్తులకు తెలుగు అనువాదం ఇలా ఉంటుంది

"ఏజస్ (?) శకంలో 134వ సంవత్సరంలో శ్రావణ మాసంలోని 23వ రోజున గృహపతి ధమ్మునికీ, భద్రనలకూ కుమార్తె అయిన చంద్రభి బుద్ధుని అస్థికలను ఛత్రశిలక అన్నచోట స్థాపితం చేస్తున్నది"

## శకులు

గ్రీకుల తరువాత శకులు వచ్చారు వీరు గ్రీకులకంటే ఎక్కువ భాగాన్ని పరిపాలించారు భారతదేశంలోనూ, ఆఫ్ఘనిస్థాన్‌లోనూ ఐదు శాఖలకు చెందిన శకులు విస్తరించారు ఒక శాఖ ఆఫ్ఘనిస్థాన్‌లోనూ, మరొక శాఖ పంజాబ్‌లోనూ స్థిరపడ్డారు పంజాబ్‌లో స్థిరపడ్డ శకుల రాజధాని తక్షశిల మూడవ శాఖ మధురలో స్థిరపడి, దాదాపు రెండు శతాబ్దాలపాటు పరిపాలించారు నాలుగవ శాఖ పశ్చిమ భారతదేశాన్ని క్రీస్తు శకం నాలుగవ శతాబ్దం వరకూ పరిపాలించారు ఐదవశాఖవారు దక్కన్ పీఠభూమి ఉత్తర భాగంలో తమ రాజ్యాన్ని స్థాపించారు

శకులు భారతదేశంలోని రాజుల వద్దనుంచీకానీ, ప్రజల వద్దనుంచీకానీ బలమైన ప్రతిఘటనను ఎదుర్కోలేదు కానీ

క్రీ పూ 58 ప్రాంతంలో ఉజ్జయిని రాజొౌకతను శకులతో విజయవంతంగా పోరాడి వారిని తరిమి వేసినట్టుగా ఆధారాలున్నాయి అతడు తన్నుతాను విక్రమాదిత్యుడని పిలుచుకున్నాడు అతడు శకులను ఓడించి, తరిమివేసిన క్రీ పూ 57 వ సంవత్సరం నుంచీ విక్రమశకం అన్న పేరుతో ఒక శకం కూడా ప్రారంభమైంది ఆ రోజు నుంచీ "విక్రమాదిత్యుడు" అన్నది గొప్పవారు కాంక్షించే బిరుదుగా మారిపోయింది తమ అధికారానికి సంకేతంగా రోమన్ చక్రవర్తులు "సీజర్" అన్న బిరుదును స్వీకరించినట్టుగా ఘనకార్యాలను సాధించామనుకున్న భారతీయ రాజులు "విక్రమాదిత్యుడు" అన్న బిరుదును స్వీకరించటం ప్రారంభించారు అందుచేత భారతదేశ చరిత్రలో 14మంది విక్రమాదిత్యులు ఉన్నారు ఈ వ్యామోహం క్రీ శ 12 వ శతాబ్దం వరకూ కొనసాగింది ఇది పశ్చిమ భారతదేశంలోనూ, పశ్చిమ దక్కన్‌లోనూ మరీ ఎక్కువగా ఉండేది

శకులు భారతదేశంలోని అనేక ప్రాంతాలలో తమ రాజ్యాలను స్థాపించినా – భారతదేశంలోని పశ్చిమ భాగాన్ని పరిపాలించినవారు మాత్రమే ఎక్కువకాలం తమ రాజ్యాధికారాన్ని నిలబెట్టుకోగలిగారు వీరి పరిపాలన దాదాపు నాలుగు వందల సంవత్సరాల కాలం కొనసాగింది శకులలో అత్యంత ప్రధానమైన రాజు మొదటి రుద్రదామనుడు (క్రీ శ 130 – 150) ఇతడు సింధుప్రాంతాన్ని మాత్రమే కాకుండా గుజరాత్, కొంకణ్, నర్మదాలోయ, మాళ్వ, కధియవార్ ప్రాంతాల్లోని ఎక్కువ భాగాన్ని పరిపాలించాడు కథియవార్ వర్షాభావ ప్రాంతంలో ఉన్న సుదర్శన సరస్సును బాగుచేయించటం ద్వారా రుద్రదామనుడు చరిత్రలో సుస్థిర స్థానాన్ని సంపాదించుకున్నాడు మౌర్యుల కాలానికి చెందిన ఈ సరస్సు చాలా కాలంగా వ్యవసాయానికి నీరు సరఫరా చేస్తూ ఉండేది

రుద్రదామనుడు భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకున్న పరదేశీయుడే అయినా అతడు గొప్ప సంస్కృత భాషాభిమాని చక్కని సంస్కృతంలో సుదీర్ఘమైన మొదటి శాసనం వేయించినవాడు రుద్రదామనుడే అంతవరకూ మనదేశంలో లభించిన పెద్ద శాసనాలన్నీ ప్రాకృతంలో ఉండేవి

## పార్థియన్లు

వాయువ్యభారతదేశంలో శకుల ఆధిపత్యం తరువాత పార్థియన్ల ఆధిపత్యం ప్రారంభమైంది కానీ కొన్ని సంస్కృత గ్రంధాలు వీరిద్దరినీ కలిపి శక – పహ్లావులు అన్న పేరుతో పేర్కొంటాయి నిజానికి వీరిద్దరూ ఏకకాలంలో ఈ దేశంలో పరిపాలన సాగించారు పార్థియన్లు ఇరాన్‌కు చెందినవారు అక్కడనుంచే భారతదేశానికి వచ్చారు శకులతో, గ్రీకులతో పోల్చితే వీరు వాయవ్య భారతదేశంలో చాలా తక్కువ భాగాన్ని మాత్రమే ఆక్రమించుకోగలిగారు వీరిలో అత్యంత ప్రసిద్ధుడైన రాజు గొండోఫెర్నిస్ క్రైస్తవ మతాన్ని ప్రచారం చేయటానికి సెయింట్ థామస్ ఇతని పరిపాలనా కాలంలోనే భారతదేశానికి వచ్చాడని చెబుతారు కాలక్రమాన పార్థియన్లు శకులలాగే భారతదేశ రాజకీయ వ్యవస్థలో, సమాజంలో కలిసిపోయారు

## కుషానులు

పార్థియన్ల తరువాత కుషానులు వచ్చారు వీరిని యూచీయులనీ, తోచారియన్లనీ కూడా అంటారు 'యుచ్చి' తెగలోని ఐదు తెగలలో ఒకరు కుషానులు వీరు మధ్య ఆసియా ఉత్తర భాగంలో చైనాకు దగ్గరగా ఉన్న గడ్డి మైదానాలకు చెందిన సంచార జాతి వీరు మొదట బాక్ట్రియాను ఆక్రమించుకొని, శకులను అధికారం నుంచీ తొలగించారు క్రమక్రమంగా వీరు కాబూల్ లోయలోకి ప్రవేశించి, గాంధారప్రాంతాన్ని ఆక్రమించుకొని గ్రీకులనూ, పార్థియన్లనూ అధికారం నుంచీ తొలగించారు చివరకు వీరు సింధూ మైదానంలోని దక్షిణ భాగంలోనూ, గంగామైదానంలోని ఎక్కువ ప్రాంతంలోనూ తమ అధికారాన్ని స్థాపించారు వీరి సామ్రాజ్యం ఆక్సస్ నది నుంచీ గంగానది వరకూ, మధ్య ఆసియాలోని ఖోరసాన్ నుంచీ ఉత్తరప్రదేశ్‌లోని వారణాసి వరకూ విస్తరించి ఉండేది మధ్య ఆసియాలో ఎక్కువభాగం ఈనాటి రష్యా, ఇరాన్‌లో కొంతభాగం, ఆఫ్ఘనిస్థాన్‌లో కొంతభాగం, ఈ నాటి పాకిస్తాన్ మొత్తం, దాదాపు మొత్తం ఉత్తర భారతదేశం – ఈ ప్రాంతాలను, కుషానులు ఒకే పరిపాలన కిందికి తెచ్చారు అందుచేత వివిధ జాతులకూ, సంస్కృతులకూ చెందిన ప్రజలు ఒకరితో ఒకరు కలిసి జీవించే అరుదైన అవకాశం లభించింది దాని ఫలితంగా ఒక కొత్త సంస్కృతి ఉద్భవించి, ఐదు ఆధునిక దేశాలలో విస్తరించింది



కనిష్కుని నాణెం

కుషానులలో రెండు రాజవంశాలు కనిపిస్తాయి ఖడ్ఫైసిస్ అన్నది మొదటి రాజవంశం వీరు క్రీ శ 50 నుంచి 28 సంవత్సరాలు పరిపాలించారు వీరిలో ఇద్దరు రాజులున్నారు వీరిలో మొదటివాడు మొదటి ఖడ్ఫైసిస్ ఇతడు హిందూకుష్ పర్వతాలకు దక్షిణంగా ఉన్న ప్రాంతంలో నాణాలను విడుదల చేశాడు ఇతడు రోమన్ నాణాలకు అనుకరణగా రాగి నాణాలను ముద్రించాడు తరువాత రాజు రెండవ ఖడ్ఫైసిస్ ఇతడు బంగారు నాణాలను ముద్రించాడు సింధూనదికి తూర్పుభాగంలో తన సామ్రాజ్యాన్ని విస్తరింపచేశాడు

ఖడ్ఫైసిస్ కుటుంబం తరువాత కనిష్క కుటుంబం అధికారంలోకి వచ్చింది వీరు తమ సామ్రాజ్యాన్ని ఉత్తర భారతదేశంలోనూ, దక్షిణసింధూ ప్రాంతంలోనూ విస్తరింప చేశారు తొలి కుషాను రాజులు బంగారు నాణాలను అసంఖ్యాకంగా విడుదల చేశారు వీటిలోని బంగారం గుప్తుల కాలంనాటి బంగారు నాణాలలోని బంగారంకంటే ఎక్కువ నాణ్యత కలది కుషానుల బంగారు నాణాలు ఎక్కువగా సింధూ నదికి పశ్చిమ భాగంలోనే లభించాయి కానీ వారి శాసనాలు ఆగ్నేయ భారతంలోనూ, సింధూ ప్రాంతంలోనూ మాత్రమే కాకుండా మధుర, శ్రావస్తి, కోశాంబి, వారాణసి మొదలైన ప్రాంతాలలో కూడా లభించాయి కాబట్టి కుషానులు తమ పరిపాలనను గంగా మైదానంలోని ఎక్కువ భాగాలలో స్థాపించ గలిగారని చెప్పవచ్చు మధురలో లభించిన కుషానుల నాణాలూ, శాసనాలూ, నిర్మాణాలూ, శిల్పాలూ కుషానులకు ఆ నగరం రెండవ రాజధాని అని చెబుతున్నాయి కుషానుల మొదటి రాజధాని పురుషపురం లేదా పెషావర్ అక్కడ కనిష్కుడు కట్టించిన ఆరామాన్నీ, స్తూపాన్నీ చూసి విదేశీ యాత్రికులు ఆశ్చర్యపోయారు

కుషానులలో అత్యంత ప్రసిద్ధుడు కనిష్కుడు భారతదేశం బయట అతడు చైనీయుల చేతిలో ఓటమిని రుచి చూసినా చరిత్రలో అతనికి రెండు కారణాల చేత స్థానం ఉంది అతడు క్రీ శ 78లో 'శకం' అన్న పేరుతో ఒక కొత్త యుగాన్ని ప్రారంభించాడు దీన్ని భారత ప్రభుత్వం అనుసరి స్తుంది రెండవ కారణం కనిష్కుడు బౌద్ధమతాన్ని హృదయ పూర్వకంగా బలపరిచాడు అతడు కాశ్మీరంలో "బౌద్ధసంగీతి"ని ఏర్పాటు చేశాడు ఆ సమావేశంలోనే మహాయాన బౌద్ధమత సిద్ధాంతాలు స్థిరీకరించబడ్డాయి కనిష్కుడు కళాపోషకుడు, గొప్ప సంస్కృత సాహిత్యాభిమాని

కనిష్కుని వారసులు క్రీ శ 230 వరకూ వాయవ్య భారతాన్ని పరిపాలించారు వారిలో కొందరు "వాసుదేవుడు" మొదలైన అచ్చమైన భారతీయమైన పేర్లను కలిగి ఉన్నారు

ఇరాన్‌లో తలెత్తిన ససానియన్ రాజులు క్రీ శ మూడవ శతాబ్దం మధ్యభాగంలో ఆఫ్ఘనిస్థాన్‌లోనూ, సింధూ నదికి పశ్చిమ ప్రాంతంలోనూ ఉన్న కుషాను సామ్రాజ్యాన్ని వంచనతో ఆక్రమించారు కానీ భారతదేశంలో కుషానుల పరిపాలన మరొక శతాబ్దం పాటు కొనసాగింది కుషానుల అధి కారం కాబూల్‌లోయలోనూ, కపిస, బాక్ట్రియా, ఖోరెజెమ్, సోడ్గియానా (ఆధునిక భోక్రా, సమర్కండ్ ప్రాంతాలు) ప్రాంతాలలోనూ మూడు– నాలుగు శతాబ్దాల్లో బలహీనంగా కొనసాగింది కుషానుల నాణాలూ, శాసనాలూ, ఎర్రమట్టి బొమ్మలూ పెద్ద సంఖ్యలో ఈ ప్రాంతాలలో లభించాయి తోప్రక్ – కాలా అన్నచోట (ఖోరెజెమ్ ప్రాంతంలో) మూడు – నాలుగు శతాబ్దాలకు చెందిన ఒక కుషానుల రాజభవనం బయటపడటం చాలా విశేషం అది ప్రభుత్వ రికార్డుల్ని భద్రపరిచే కార్యాలయంగా కూడా ఉపయోగించబడింది ఆ శాసనాలూ, రికార్డులూ ఖోరెజ్మియల్ భాషలో, అరామిక్ లిపిలో రాయబడేవి

## మధ్య ఆసియా సంబంధాల ప్రభావం

### నిర్మాణాలూ, పాత్రలు

భవన నిర్మాణ కార్యక్రమాల్లో శక – కుషాన దశ ఒక స్పష్టమైన ముందడుగు ఉత్తరభారతదేశంలో అనేకచోట్ల జరిగిన తవ్వకాలలో భవన నిర్మాణానికి సంబంధించి అనేక పొరలు బయటపడ్డాయి కొన్నిచోట్ల అలాంటి పొరలు అరడజను కంటే ఎక్కువ ఉన్నాయి కూడా నేలమీద పరవటానికి కాల్చిన ఇటుకల్నీ, పైకప్పుకూ, నేలకూ కూడా పెంకుల్నీ ఆకాలంలో ఉపయోగించినట్టుగా ఆ తవ్వకాలు నిరూపిస్తున్నాయి "సుర్కి" వేయటం, పెంకుల్ని ఉపయో గించటం వారు బయటనుంచీ తెచ్చుకొని ఉండకపోవచ్చు ఇటుకలతో గోడల్ని కట్టటం కూడా ఆ కాలంలో ఎక్కువగా ఉండేది ఆ కాలానికి చెందిన పాత్రలు ఎరుపురంగువి వీటిలో పాలిష్ చేసినవీ, చేయనివీ కూడా ఉన్నాయి వీటి మందం మధ్యరకంగానూ, పలచగానూ ఉంది నీరు చల్లటానికి ఉపయోగపడే రంధ్రాలు కలిగిన పాత్రలూ, కొమ్ము పాత్రలూ ఆ కాలానికి చెందిన ప్రత్యేక తరహా పాత్రలు రష్యా – మధ్య ఆసియా ప్రాంతంలో లభించిన పలచని ఎర్రమట్టి పాత్రల్ని ఇవి మనకు గుర్తుకు తెస్తాయి ఈ పాత్రలు ఆ ప్రాంతాల్లో కుషానుల కాలానికి చెందిన మట్టి పొరల్లో లభించాయి ఈ ఎర్రమట్టి పాత్రలు కుషాను సంస్కృతి సరిహద్దులోని ఫర్గానా వంటి ప్రాంతాల్లో కూడా లభించాయి ఈ పాత్రల్ని తయారు చేయటం ఆ నాడు మధ్య ఆసియాలో చాలా మందికి తెలిసిన కళ

## మెరుగైన ఆశ్వీక దళం

శకులూ, కుషానులూ భారతీయ సంస్కృతికి కొత్త అంశాలను కలిపి, దాన్ని ఎంతగానో సుసంపన్నం చేశారు వారు భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకొని, భారతీయ సంస్కృతిలో పూర్తిగా ఐక్యమై పోయారు వారికి సొంతలిపీ, లిపిబద్ధమైన భాషా, మతవ్యవస్థా లేకపోవటం చేత వారు ఈ సాంస్కృతికాంశాలను భారతదేశం నుంచీ గ్రహించారు వారు భారతీయ సమాజంలో ఒక అవిభాజ్యమైన భాగంగా కలిసిపోయి, దాని అభివృద్ధికి ఎంతో దోహదం చేశారు వారు మెరుగైన ఆశ్వీక దళాలను పరిచయం చేశారు పెద్ద ఎత్తున గుర్రపుస్వారిని ప్రవేశపెట్టారు వారు గుర్రపు జీనుల్నీ, కళ్ళాలనూ ఉపయోగించటాన్ని అలవాటు చేశారు ఇలాంటి శిల్పాలు మనకు మొదటిసారిగా క్రీ శ రెండు మూడు శతాబ్దాలకు చెంది శిల్పకళలో కనిపిస్తాయి శకులూ, కుషానులూ గుర్రపు స్వారీలో గొప్ప నైపుణ్యం ఉన్న రౌతులు వారికి గుర్రపు స్వారీ అంటే ఎంత ఇష్టమో ఆఫ్ఘనిస్థాన్‌లోని బెగ్రాంలో బయట పడ్డ కుషానులనాటి ఎర్రమట్టి రౌతు బొమ్మలు నిరూపిస్తున్నాయి ఈ విదేశీ రౌతులలో కొంతమంది బలమైన కవచాలను కూడా ఉపయోగించేవారు వీరు బల్లాలతో, బరిసెలతో పోరాడేవారు బహుశా వీరు తాళ్ళకు కట్టిన బొటనవేలి రికాబుల్ని కూడా ఉపయోగించి ఉండవచ్చు ఆ రికాబులు గుర్రాలను తోలటానికి బాగా ఉపయోగపడి ఉండవచ్చు శకులూ, కుషానులూ తలపాగనూ, లాల్చీనీ, పంట్లామునూ, పొడవైన మందపు కోటునూ పరిచయం చేశారు ఈ నాటికీ ఆఫ్ఘనులూ, పంజాబీలూ తలపాగను ధరిస్తారు నేటి షేర్వానీ ఆనాటి పొడవు కోటుకు ఆధునిక రూపమే మధ్య ఆసియా నుంచీ వచ్చినవారు కూడా టోపీనీ, శిరస్త్రాణాన్నీ, బూట్లనూ పరిచయం చేశారు వీటిని యుద్ధవీరులు ఉపయోగించేవారు వీరికున్న ఈ అదనపు సౌకర్యాల వల్ల శకులూ, కుషానులూ ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్, భారతదేశాలలో తమ శత్రువుల్ని సమూలంగా తుడిచిపెట్టగలిగారు తరువాత ఈ సైనిక సాంకేతిక విజ్ఞానం వారి సామ్రాజ్యమంతా విస్తరించింది వీరి సామంత రాజులు ఈ విజ్ఞానాన్ని తమను జయించిన వారికి వ్యతిరేకంగా ఉపయోగించారు

## వ్యాపారం

పరదేశీయులు భారతదేశంలోకి రావటం చేత మధ్య ఆసియాకూ, భారతదేశానికీ మధ్య చిక్కని సంబంధాలు ఏర్పడ్డాయి వాటి ఫలితంగా భారతదేశానికి ఆల్టాయ్ పర్వత ప్రాంతాలనుంచీ పెద్ద పరిమాణంలో బంగారం వచ్చింది రోమన్ సామ్రాజ్యంతో ఏర్పడ్డ వ్యాపార సంబంధాల ఫలితంగా కూడా భారతదేశానికి బంగారం వచ్చి ఉండవచ్చు కుషానులు "పట్టుబాట" (సిల్క్ రూట్) మీద ఆధిపత్యాన్ని కలిగి ఉండేవారు అది చైనాలో ప్రారంభమై – మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్థాన్‌లోని కుషాను సామ్రాజ్య ప్రాంతాల గుండా ఇరాన్‌ను చేరుకునేది లేదా తూర్పు మెడిటరేనియన్ ప్రాంతంలోని పశ్చిమ ఆసియా ప్రాంతాలకు చేరుకునేది ఆ ప్రాంతాలు రోమన్ సామ్రాజ్యంలో భాగంగా ఉండేది ఈ పట్టుబాట కుషానులకు గొప్ప ఆదాయాన్ని తెచ్చిపెట్టేది పట్టు వ్యాపారుల మీద విధించిన సుంకాలతో కుషానులు సంపన్నమైన సామ్రాజ్యాన్ని నిర్మించగలిగారు భారత దేశంలోని రాజులలో కుషానులే మొట్టమొదట బంగారు నాణాలను ముద్రించినవారన్నది చాలా ముఖ్యమైన అంశం

## రాజకీయ వ్యవస్థ

మధ్య ఆసియా దురాక్రమణదారులు తమ పరిపాలనను అసంఖ్యాకమైన స్థానిక రాజ్యాలమీద బలవంతంగా రుద్దారు ఇవన్నీ చిన్న చిన్న రాజ్యాలే దీని ఫలితంగా ఫ్యూడల్ వ్యవస్థ అభివృద్ధి చెందింది కుషానులు "రాజాధిరాజు"



విదిశ సమీపంలో హెలియడోరస్ వేయించిన స్తంభం

అన్న ఆడంబరపు బిరుదును స్వీకరించారు అనేక చిన్న రాజులమీద వీరి అధికారాన్ని ఆ బిరుదు సూచిస్తుంది

శకులూ, కుషానులూ రాజ్యాధికారం భగవంతుడిచ్చే దన్న సిద్ధాంతానికి బలాన్ని చేకూర్చారు కుషాను రాజులను "భగవత్ పుత్రులు" అని పిలిచేవారు ఈ బిరుదును వారు చైనీయుల వద్దనుంచీ స్వీకరించారు చైనీయులు తమ రాజుల్ని "స్వర్గపుత్రులు" అని పిలిచేవారు ('స్వర్గ' అంటే 'దేవుడు' అని అర్థం ) రాజ్యాధికారాన్ని చట్టబద్ధం చేయటం కోసం దీన్ని భారతీయ రాజులు ఉపయోగించారు హిందూధర్మశాస్త్రవేత్తయిన మనువు – రాజు పసిబాలుడుగా ఉన్నా ప్రజలు గౌరవించాలని – ఆదేశించాడు రాజు మానవ రూపంలో ఉన్న భగవంతుడే నన్నాడు

కుషానులు సాత్రప ప్రభుత్వ విధానాన్ని ప్రవేశ పెట్టారు సామ్రాజ్యాన్ని అనేక సాత్రపులుగా విభజించారు ఒక్కొక్క సాత్రపికి అధికారిగా ఒక సాత్రపుణ్ణి నియమించారు వంశ పారంపర్య ద్వంద్వ పరిపాలనా, ఇద్దరు రాజులు ఒకే ప్రాంతంలో, ఒకే కాలంలో పరిపాలించటం వంటి చిత్రమైన పద్ధతులను కూడా వారు అనుసరించారు తండ్రీ, కొడుకూ ఏకకాలంలో రాజులుగా ఉండటం కూడా మనకు కనిపిస్తుంది కాబట్టి కుషానుల కాలంలో కేంద్రీకృత రాజ్యాధికారం తక్కువగా ఉండేదని చెప్పవచ్చు

గ్రీకులు మిలిటరీ గవర్నర్ల విధానాన్ని ప్రారంభించారు వారిని 'స్ట్రాటిగో'లన్నారు తాము జయించిన రాజ్యాలను తమకిందనే ఉంచుకోవటానికి మిలిటరీ గవర్నర్లు అవసరమయ్యారు

## భారతీయ సమాజంలో కొత్త అంశాలు

గ్రీకులూ, శకులూ, పార్థియన్లూ, కుషానులూ చివరకు భారతదేశంలో తమ అస్తిత్వాన్నే కోల్పోయారు కాలక్రమాన వారందరూ పూర్తిగా భారతీయులే అయిపోయారు వీరిలో చాలామంది యుద్ధవీరులుగా భారతదేశానికి రావటం చేత వీరిని యుద్ధ వీరుల వర్ణమైన క్షత్రియ వర్ణంలో కలుపుకున్నారు వీరిని బ్రాహ్మణీయ సమాజంలోకి కలుపుకోవటాన్ని చిత్రంగా సమర్థించుకున్నారు శకులూ, పార్థియన్లూ దారితప్పిన క్షత్రియులనీ, తమ స్థాయి నుంచీ దిగజారిన వారనీ మనువు చెప్పాడు అంటే – వీరు ద్వితీయ శ్రేణి క్షత్రియు లన్నమాట మౌర్యుల యుగం తరువాత తప్ప ప్రాచీన కాలంలో మరే ఇతరయుగంలోనూ పరదేశీయుల్ని ఇంత పెద్ద సంఖ్యలో భారతీయ సమాజంలో లీనం చేసుకోలేదు

## మత పరిణామాలు

పరదేశాల నుంచీ వచ్చిన కొందరు రాజులు వైష్ణవ మతంలో చేరిపోయారు వైష్ణవ మతమంటే స్థితికారుడైన విష్ణువును పూజించే హిందూ మత శాఖ క్రీ పూ రెండవ శతాబ్దంలో గ్రీకు రాయబారైన హెలియడోరస్ వాసుదేవుని (విష్ణువు) గౌరవార్థం మధ్యప్రదేశ్‌లోని విదిశ దగ్గర ఒక స్తంభాన్ని నెలకొల్పాడు

మరికొందరు బౌద్ధమతంలో చేరిపోయారు ప్రసిద్ధ గ్రీకు రాజైన మీనాండర్ అటువంటివాడు అతనికీ, నాగసేనుడికీ (నాగార్జునుడు) మధ్య జరిగిన సంవాదం మౌర్యయుగం తరువాత బౌద్ధమత సిద్ధాంత చరిత్రను తెలుసుకోవటానికి ఎంతగానో ఉపయోగపడుతుంది కొందరు కుషాను రాజులు శివకేశవుల నిద్దరినీ పూజించారు వారి నాణాలమీద ఇద్దరి బొమ్మలనూ ముద్రించారు మరికొందరు కుషాను రాజులు విష్ణువును మాత్రమే పూజించారు కుషాను రాజైన వాసుదేవుడు అలాంటివాడు వాసుదేవుడంటే విష్ణువు అవతారంగా పూజింపబడే కృష్ణుడు

## మహాయాన బౌద్ధమతం ప్రారంభం

మౌర్యయుగం తరువాత భారతదేశంలోని మతాలలో మార్పులు వచ్చాయి అందుకు ప్రధాన కారణం వ్యాపారంలోనూ, చేతివృత్తులలోనూ గొప్ప అభివృద్ధి కనిపించటం మరొక కారణం మధ్య ఆసియా ప్రాంతాలనుంచీ పెద్ద సంఖ్యలో ప్రజలు భారతదేశంలోకి వలస రావటం ఈ కారణాల చేత ప్రధానంగా బౌద్ధమతంలో మార్పులు వచ్చాయి పట్టణాల్లో కేంద్రీకృతమైన వ్యాపారుల వద్ద నుంచీ ధన రూపంలో లభించే విరాళాలను వదులుకోవటానికి బౌద్ధ భిక్షువులూ, సన్యాసులూ ఇష్టపడలేదు ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున కొండ తవ్వకాలలో బౌద్ధారామాలుండిన చోట పెద్ద సంఖ్యలో నాణాలు లభించాయి దీనికితోడు మాంసాహారులైన విదేశీయులను బౌద్ధ మతం తనలో లీనం చేసుకుంది ఈ పరిణామాలు నిరాడంబరమైన సన్యాసుల, సన్యాసినుల జీవిత విధానంలో ఎంతో సడలింపుకు కారణమైంది వీరు బంగారం, వెండి బహుమతులు స్వీకరించటం, మాంసాన్ని తినటం, ఆడంబరమైన దుస్తుల్ని ధరించటం ప్రారంభించారు వీరిలో కొందరిలో క్రమశిక్షణ ఎంతగా క్షీణించి పోయిందంటే – వీరు సంఘాన్ని త్యజించి గృహస్థులుగా మారిపోయారు ఈ కొత్త రకమైన బౌద్ధమతాన్ని మహాయానం అని పిలవటం ప్రారంభించారు ప్రాచీనమైన పవిత్ర బౌద్ధమతంలో బుద్ధునికి సంబంధించిన కొన్ని వస్తువులను ప్రతీకలుగా పూజించేవారు



ప్రాచీన నగరమైన తక్షశిల శిథిలాలు (క్రీ శ మొదటి శతాబ్దం) (విమానం నుంచి కనిపించే దృశ్యం)

క్రీస్తుశకం ప్రారంభకాలానికి వీటికి బదులుగా బుద్ధుని ప్రతిమలనే పూజించటం ప్రారంభమైంది బౌద్ధమతంలో విగ్రహారాధన ప్రారంభం కావటం చేత బ్రాహ్మణీయమతంలో విగ్రహారాధనకు ప్రాధాన్యత చాలా ఎక్కువైంది మహాయానానికి ప్రాధాన్యత పెరగటంతో ప్రాచీన పవిత్ర బౌద్ధమత శాఖను హీనయానం అన్న పేరుతో పిలవటం ప్రారంభమైంది

కనిష్కుడు మహాయానికి ప్రోత్సాహకుడు కావటం మహాయానానికి గొప్ప అదృష్టంగా పరిణమించింది అతడు కాశ్మీరంలో ఒక పరిషత్తును నిర్వహించాడు ఈ పరిషత్తు సభ్యులు బౌద్ధ సాహిత్య సంకనాలైన త్రిపిటకాలకు మూడు లక్షల పదాలతో సమగ్రమైన వ్యాఖ్యల్ని రాశారు ఈ వ్యాఖ్యానాలను రాగి రేకుల మీద చెక్కించి, వాటిని రాతి తొట్టి వంటి పాత్రలో ఉంచి, భూస్థాపితం చేసి దానిమీద కనిష్కుడు ఒక స్థూపాన్ని నిర్మించాడు ఈ కథనంలో సత్యం ఉంటే – రాగి రేకులతోపాటు ఆ స్థూపం బయటపడినప్పుడు బౌద్ధ మత గ్రంథాలమీదా, బోధనల మీదా కొత్త వెలుగు ప్రసరిస్తుంది దీన్ని మాత్రమేకాక కనిష్కుడు బుద్ధుణ్ణి గురించి భావితరాలకు తెలియచేయటం కోసం అనేక స్థూపాలను నిర్మించాడు

## గాంధార, మధుర కళా పద్ధతులు

పరదేశీయ రాజులు భారతీయ కళా సాహిత్యాలకు ఉత్సాహవంతులైన పోషకులయ్యారు వీరు సాధారణంగా కొత్తగా మతం మార్చుకున్నవారు చూపించే అత్యుత్సాహాన్ని చూపించారు అనేక సంప్రదాయాల్లో, దేశాల్లో శిక్షణ పొందిన తాపీపనివారినీ, ఇతర కళాకారులనూ కుషాను సామ్రాజ్యం ఒకచోటికి తీసుకు వచ్చింది ఈ సమ్మేళనం మధ్య ఆసియా, గాంధార, మధుర శిల్ప పద్ధతులు ఉద్భవించటానికి కారణభూతమైంది మధ్య ఆసియాలో లభించిన శిల్పాలను పరిశీలిస్తే స్థానిక, భారతీయ శిల్ప పద్ధతులు – బౌద్ధమతం ప్రభావం కారణంగా ఎలా సమ్మేళనం చెందాయో అర్థమౌతుంది

భారతీయ కళాకారులకు మధ్య ఆసియా, గ్రీకు, రోమన్ కళాకారులతో సంబంధాలు ఏర్పడ్డాయి ఈ సంబంధాలు

భారతదేశంలోని వాయవ్య ప్రాంతంలోని గాంధార దేశంలో ఎక్కువగా ఏర్పడ్డాయి ఇక్కడ ఒక కొత్త శిల్ప శైలి ఏర్పడింది వీరు గ్రీక్ – రోమన్ పద్ధతిలో బుద్ధుని విగ్రహాలను చెక్కటం ప్రారంభించారు మరీముఖ్యంగా బుద్ధుని వెంట్రుకలను ఈ పద్ధతిలో చిత్రించేవారు



బుద్ధుని ప్రతిమ, గాంధార శిల్పం

మధుర – స్థానిక శిల్ప కళాకేంద్రమే అయినా గాంధార శిల్ప పద్ధతి అక్కడికి కూడా వ్యాపించింది మధురలో ఎంతో అందమైన బుద్ధుని శిల్పాలు తయారు చేశారు అంతేకాకుండా, శిరస్సులేని కనిష్కుని నిలువెత్తు విగ్రహం కూడా ఇక్కడే లభించింది దాని పీఠం మీద కనిష్కుని పేరు కూడా చెక్కబడింది ఈ విగ్రహం ఎంతో ప్రసిద్ధమైంది వర్ధమాన మహావీరుని రాతివిగ్రహాలు కూడా మధురలో తయారయ్యాయి మధుర కృష్ణుని జన్మస్థానమూ, అతని బాల్యంతో సంబంధం ఉన్న ప్రాంతమూ అయినా – గుప్త యుగానికి పూర్వకాలానికి చెందిన శిల్పాలలో, శాసనాలలో కృష్ణుని ప్రస్తావన కనిపించదు మధుర శిల్పకళా పద్ధతి క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో అభివృద్ధి చెందింది ఆ ప్రాంతాలలో తయారైన ఎర్రరాతి శిల్పాలు ఆ ప్రాంతానికి వెలుపల కూడా లభించాయి మధురలోని వస్తుప్రదర్శనశాలలో కుషానుల కాలానికి చెందిన శిల్పాలు అత్యధిక సంఖ్యలో ఉన్నాయి

అదేకాలంలో వింధ్యకు దక్షిణంగా ఉన్న అనేక ప్రాంతాలలో ఎంతో అందమైన శిల్పాలు లభించాయి మహారాష్ట్రలో బౌద్ధగుహాలయాలను రాతిలో తొలిచారు ఆంధ్రప్రదేశ్‌లోని నాగార్జున కొండ, అమరావతి గొప్ప బౌద్ధశిల్ప కళాకేంద్రాలయ్యాయి అక్కడ అనేక ఫలకాలమీద బుద్ధుని జీవితగాథల్ని చిత్రించారు బౌద్ధమతానికి చెందిన తొలి శిలాఫలకాలు గయలోనూ, సాంచీలోనూ, బార్‌హూత్‌లోనూ లభించాయి ఇవి క్రీ పూ రెండవ శతాబ్దానికి చెందినవి కానీ క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో శిల్పకళలో మరింత అభివృద్ధి జరిగింది

## సాహిత్యం, పాండిత్యం

పరదేశీయులైన రాజులు సంస్కృత సాహిత్యాన్ని ఆదరించి, పోషించారు క్రీ శ 150 ప్రాంతానికి చెందిన రుద్రదామనుని కథియవార్ శాసనంలో మనకు మొదటిసారిగా కావ్యశైలి లక్షణాలు కనిపిస్తాయి ఆ తరువాత శాసనాలను చక్కని సంస్కృతంలో రాయటం ప్రారంభమైంది కానీ



మధురలో లభించిన శిల్పం



సాంచీస్థూపం ప్రధాన ద్వారం

వాటి సరసనే క్రీ శ నాలుగవ శతాబ్దం తరువాత కూడా శాసనాలను ప్రాకృతంలో రాయటం కొనసాగుతూనే వచ్చింది

అశ్వఘోషుని వంటి గొప్ప సృజనశీలురైన సాహిత్యకారులు కుషానుల ప్రోత్సాహాన్ని పొందినట్టుగా అనిపిస్తోంది అశ్వఘోషుడు బుద్ధుని జీవితం ఆధారంగా "బుద్ధచరితం" అన్న కావ్యాన్ని రాశాడు అతడు "సౌందరనందం" అన్న కావ్యాన్ని కూడా రాశాడు అది సంస్కృత కావ్య సంప్రదాయానికి చక్కని ఉదాహరణం

మహాయాన బౌద్ధం విస్తరించటం చేత అసంఖ్యాకంగా 'అవధాన'కావ్యాలు రచించబడ్డాయి వీటిలో అనేక గ్రంథాలు బౌద్ధమిశ్రమమైన సంస్కృత భాషలో రాయబడ్డాయి సామాన్య ప్రజానీకం వద్దకు మహాయాన బౌద్ధమతాన్ని తీసుకుపోవటం ఈ గ్రంథాల ఏకైక లక్ష్యం ఈ మార్గానికి లేదా ప్రక్రియకు చెందిన గ్రంథాలలో ప్రధానమైనవి "మహావస్తు", "దివ్యవదన"

తెరను ఉపయోగించటాన్ని పరిచయం చేసి గ్రీకులు భారతీయ నాటక రంగం అభివృద్ధికి దోహదం చేశారు తెరను యవనులనుంచీ – అంటే గ్రీకులనుంచీ గ్రహించటం చేత దానికి "యవనిక" అన్న పేరు వచ్చింది 'యవన' అన్నది "అయోనియన్" అన్న మాటకు సంస్కృత రూపం అయోనియన్‌లు ప్రాచీన భారతీయులకు పరిచయం ఉన్న గ్రీకు తెగకు చెందినవారు తరువాత కాలంలో 'యవనులు' అన్న మాటను విదేశీయులందరికీ ఉపయోగించారు

ఆ కాలానికి చెందిన లౌకిక సాహిత్యానికి అత్యుత్తమ ఉదాహరణం వాత్స్యాయనుడు రాసిన "కామసూత్రాలు" ఇది క్రీ శ మూడవ శతాబ్దానికి చెందినదని భావిస్తారు శృంగారాన్ని గురించీ, రతికళను గురించీ ఈనాడు మనకు లభిస్తున్న గ్రంథాలలో అత్యంత ప్రాచీనమైంది నగర జీవితం అభివృద్ధి చెందుతున్న కాలంలో ఒక నాగరికుని జీవిత దృశ్యాన్ని ఈ గ్రంథం ప్రదర్శిస్తుంది

## సైన్స్, సాంకేతిక పరిజ్ఞానం

మౌర్యయుగం తరువాతి కాలంలో ఖగోళ శాస్త్రం, జ్యోతిషం గ్రీకులతో ఏర్పడ్డ సంబంధాల వల్ల అభివృద్ధి చెందాయి సంస్కృత ఖగోళశాస్త్ర గ్రంథాలలో గ్రహాల కదలికకు సంబంధించిన అనేక గ్రీకు పదాలు కనిపిస్తాయి భారతీయ ఖగోళ శాస్త్రం గ్రీకుల భావాల చేత ప్రభావితం

కావటం ప్రారంభించింది గ్రీకు పదమైన "హోరస్కోప్" నుంచీ జ్యోతిషానికి ఉపయోగించే సంస్కృతపదం "హోరా శాస్త్రం" ఉద్భవించింది చక్కని ఆకారంలో తయారుచేసి ముద్రించిన గ్రీకు నాణాలు మన విద్ధాంక నాణాల కంటే ఎంతో మెరుగ్గా ఉండేవి "డ్రాఖ్మా" అన్న గ్రీకు పదం 'ద్రమ్మ'గా పరిణామం చెందింది దీనికి ప్రతిగా గ్రీకు రాజులు బ్రాహ్మీలిపిని ఉపయోగించటం ప్రారంభించారు తమ నాణాలమీద భారతీయ చిహ్నాలను ముద్రించుకున్నారు గ్రీకులు కుక్కలనూ, పశువులనూ, దంతంతో చేసిన వస్తువులనూ ఎగుమతి చేశారు వారు భారతదేశం నుంచి ఏదైనా చేతివృత్తిని నేర్చుకున్నారా లేదా అని చెప్పటానికి సాధ్యం కావటం లేదు

భారతీయులు గ్రీకుల వద్ద నుంచీ వైద్యశాస్త్రం, వృక్షశాస్త్రం, రసాయన శాస్త్రాలను పెద్దగా నేర్చుకున్నట్టు అనిపించటం లేదు ఈ శాస్త్రాలను గురించి చరకుడూ, శుశ్రుతుడూ చర్చించారు మందుల్ని తయారు చేయ టానికి పనికి వచ్చే మొక్కల పేర్లనూ, మూలికల పేర్లనూ "చరకసంహిత" అసంఖ్యాకంగా పేర్కొంటుంది ఆ మూలికలను దంచటానికీ, కలపటానికీ ఆ గ్రంథం సూచించే విధానాలను పరిశీలిస్తే ప్రాచీన కాలంలో రసాయన శాస్త్రం సాధించిన అభివృద్ధి అవగతమౌతుంది వ్యాధులను నయం చేయటానికి భారతీయ వైద్యులు ప్రధానంగా మొక్కల మీదనే ఆధారపడ్డారు వాటిని సంస్కృతంలో "ఓషధులు" అన్నారు అందులో నుంచే "ఔషధం" అన్న పదం వచ్చింది

మధ్యాసియన్లతో ఏర్పడ్డ సంబంధాలవల్ల సాంకేతిక రంగంలో కూడా భారతీయులు లాభాన్ని పొందినట్టు అనిపిస్తుంది కనిష్కుడు పంట్లాంనూ, ఎత్తైన బూట్లనూ ధరించి ఉన్నట్టుగా చిత్రించబడ్డాడు బహుశా ఆ కాలంలోనే చర్మంతో బూట్లు తయారుచేయటం ప్రారంభమై ఉండవచ్చు ఏది ఏమైనా – కుషానులు ముద్రించిన రాగి నాణాలు రోమన్ నాణాలకు అనుకరణ అనటానికి సందేహం లేదు అలాగే కుషానుల బంగారు నాణాలు కూడా రోమన్‌ల బంగారు నాణాలకు అనుకరణగానే వచ్చాయి గ్రీస్, భారతదేశాల మధ్య రెండు సార్లు దౌత్య సంబంధాలు ఏర్పాటు చేసుకున్నట్టుగా ఆధారాలున్నాయి క్రీ శ 27–28లో భారతదేశం నుంచీ రోమన్ చక్రవర్తి అగస్టస్ ఆస్థానానికి దౌత్యవేత్తలు వెళ్ళారు అలాగే క్రీ శ 110–20 సంవత్సరాల మధ్య రోమన్ చక్రవర్తిగా ట్రాజన్ ఉన్నప్పుడు మరొక దౌత్య బృందం వెళ్ళింది అలా భారతదేశానికి గ్రీస్‌తో ఏర్పడ్డ సంబంధాల వల్ల సాంకేతిక రంగంలో కొత్త పద్ధతులు అమలులోకి వచ్చి ఉండవచ్చు గాజుతో వస్తువుల్ని తయారు చేయటాన్ని విదేశీమెలకువలూ, పద్ధతులూ ఈ కాలంలోనే ప్రభావితం చేశాయి భారతదేశంలో మరే ఇతర యుగంలోనూ గాజు పరిశ్రమ ఇంతగా అభివృద్ధి చెందలేదు



బార్‌హూత్‌లో లభించిన ఒక శిలాఫలకం



వెండినాణాలు

# అధ్యాయం: 17

# శాతవాహన యుగం

## రాజకీయ చరిత్ర

ఉత్తర భారతదేశంలో మౌర్యులకు స్థానిక వారసులు శుంగవంశీయులు వారి తరువాత కణ్వులు దక్కన్ పీఠభూమిలో మౌర్యులకు వారసులు శాతవాహనులు కానీ వీరు మౌర్య సామ్రాజ్యం పతనమైన వంద సంవత్సరాల తరువాత అధికారానికి వచ్చారు పురాణాలలో పేర్కొన బడ్డ ఆంధ్రులే శాతవాహనులని భావించబడుతూ ఉంది పురాణాలు ఆంధ్రుల పరిపాలనను పేర్కొంటాయేకానీ శాత వాహనుల పరిపాలనను పేర్కొనవు అలాగే "ఆంధ్ర" అన్నపేరు శాతవాహనుల శాసనాల్లో కనిపించదు శాతవాహన యుగానికి పూర్వం ఉండిన జన నివాసాలలో ఎరుపు, నలుపు – ఎరుపు, బూడిదరంగు పాత్రలు లభించాయి ఇవి దక్కన్‌లో అనేకచోట్ల లభించాయి వీరు ఇనుమును ఉపయోగించటం తెలిసిన రాతియుగం మానవులనీ, వీరు ఉత్తర భారతదేశంలోని భౌతిక సంస్కృతితో సంబం ధాలను ఏర్పరచుకున్న తరువాత కొత్త కార్యకలాపాలను ప్రారంభించారనీ భావిస్తున్నారు ఇనుప నాగలి కర్రును ఉపయోగించటం, వరిని నాటటం, నగర జీవిత విస్తరణ, రాత ప్రారంభం కావటం మొదలైన పరిణామాలు శాతవాహనులు రాజ్యాన్ని స్థాపించటానికి దోహదం చేశాయి ఆంధ్రులు మూడు వందల సంవత్సరాల కాలం పరిపాలించారని కొన్ని పురాణాలు చెబుతున్నాయి అదేకాలంలో శాతవాహనుల పరిపాలన కొనసాగింది కణ్వులను జయించి, మధ్య భారతదేశంలో తమ రాజ్యాన్ని స్థాపించుకున్న తరువాత శాతవాహనులు శాసనాలను వేశారు శాతవాహనుల తొలి శాసనాలు క్రీ పూ మొదటి శతాబ్దానికి చెందినవి కానీ తొలి శాతవాహన రాజులు మనకు ఆంధ్రప్రాంతంలో కాక మహారాష్ట్ర ప్రాంతంలో కనిపిస్తారు అక్కడే వారి తొలిశాసనాలు కూడా ఎక్కువగా లభించాయి వారు మహారాష్ట్రలో గోదావరికి ఎగువ భాగంలో – ఈనాడు విభిన్నమైన పంటలు పండుతున్న సంపన్న ప్రాంతంలో తమ రాజ్యాన్ని స్థాపించారు

క్రమక్రమంగా శాతవాహనులు తమ అధికారాన్ని కర్ణాటక, ఆంధ్రప్రాంతాలకు విస్తరింపచేశారు పశ్చిమభారతదేశంలోనూ, దక్కన్ ఉత్తర ప్రాంతంలోనూ తమ రాజ్యాధికారాన్ని స్థాపిం చుకున్న శకులు శాతవాహనులకు ప్రధాన శత్రువులు ఒక సందర్భంలో మహారాష్ట్రలోనూ, పశ్చిమ భారతదేశంలోనూ ఉన్న శాతవాహన రాజ్యాలను శకులు పూర్తిగా లాక్కున్నారు కానీ శాతవాహన వంశం ప్రతిష్టను మళ్ళీ నిలబెట్టిన గౌరవం గౌతమీ పుత్ర శాతకర్ణి (క్రీ శ 106 – 130)కి దక్కుతుంది అతడు తన్నుతాను "ఏక బ్రాహ్మణుడ"ని పిల్చుకున్నాడు అతడు శకులను ఓడించాడు అనేక మంది క్షత్రియ రాజులను మట్టుపెట్టాడు తన ప్రధాన శత్రువైన నహపణుని క్షహరత వంశాన్ని నిర్వంశం చేసినట్టుగా ప్రకటించుకున్నాడు నాసిక్ వద్ద లభించిన దాదాపు 800 నహపణుని వెండినాణాలమీద గౌతమీపుత్ర శాతకర్ణి పునర్ముద్రణ చిహ్నాలు ఉండటంచేత ఈ విషయం సత్యమేనని నిర్ధారితమౌతూ ఉంది శకుల పరిపాలనలో ఉండిన మాళ్వా, కథియవార్ ప్రాంతాలను కూడా గౌతమీపుత్ర శాతకర్ణి ఆక్రమించుకున్నాడు గౌతమీ పుత్ర శాతకర్ణి సామ్రాజ్యం ఉత్తరాన మాళ్వనుంచీ దక్షిణాన కర్ణాటక వరకూ వ్యాపించి ఉండేది ఆంధ్రప్రాంతం మొత్తం బహుశా అతని అధికార పరిధిలోనే ఉండేది

గౌతమీపుత్ర శాతకర్ణి వారసులు క్రీ శ 220 వరకూ పరిపాలించారు అతని తరువాత అధికారానికి వచ్చిన వాసిష్ఠీపుత్ర పులమావి (క్రీ శ 130–154) ముద్రించిన నాణాలు ఆంధ్రప్రాంతంలో లభించాయి క్రీ శ రెండవ శతాబ్ది కాలానికి ఈ ప్రాంతం శాతవాహన సామ్రాజ్యంలో భాగం కావటాన్ని ఇవి నిరూపిస్తాయి అతడు గోదావరీ తీరాన ఔరంగాబాద్ జిల్లాలో ఉన్న పైఠాన్ లేదా ప్రతిష్టాన పురాన్ని తన రాజధానిగా చేసుకున్నాడు మాళ్వప్రాంతంలోని కొంకణ తీరం కోసం మళ్లీ శకరాజులు శాతవాహనులతో సంఘర్షణకు దిగారు సౌరాష్ట్ర (కథియవార్) రాజైన మొదటి రుద్రదాముడు శాతవాహనులను రెండుసార్లు ఓడించాడు కానీ వారితో ఉన్న వివాహ సంబంధాల కారణంగా




వారిని నాశనం చేయలేదు తరువాత రాజులలో ఒకడైన యజ్ఞశ్రీ శాతకర్ణి (క్రీ శ 165–194) శకరాజుల వద్ద నుంచి ఉత్తర కొంకణ ప్రాంతాన్నీ, మాళ్వ ప్రాంతాన్నీ స్వాధీనపరుచుకున్నాడు అతడు వ్యాపారాన్నీ, నౌకాయానాన్నీ ఎంతగానో అభిమానించాడు అతడు ముద్రించిన నాణాలు ఆంధ్రప్రదేశ్‌లో మాత్రమే కాకుండా మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, గుజరాత్ ప్రాంతాల్లోకూడా లభించాయి యజ్ఞశ్రీ శాతకర్ణికి నౌకాయానమన్నా, విదేశీ వ్యాపారమన్నా ఉన్న అభిమానం, అతడు నాణాలమీద ముద్రించిన పడవ చిత్రం చాటుతుంది

## భౌతిక సంస్కృతిలోని అంశాలు

శాతవాహనుల కాలంలో దక్కన్‌లో వర్ధిల్లిన సంస్కృతి స్థానిక, ఔత్తరాహ అంశాల సమ్మేళనం దక్కన్ పీఠభూమికి చెందిన పాతరాతియుగం నిర్మాతలు ఇనుమును గురించీ, వ్యవసాయాన్ని గురించీ ఇంతో అంతో తెలిసిన వారే సుమారు క్రీ పూ 200 సంవత్సరాల కాలానికి చెందిన కొన్ని ఇనుప తవ్వకపు పనిముట్లు లభించాయి క్రీ శ మొదటి రెండు మూడు శతాబ్దాలలో వీటి సంఖ్య గణనీయంగా పెరిగింది కానీ ఈ పనిముట్ల ఆకారంలో – రాతియుగానికీ, శాతవాహన యుగానికీ మధ్య పెద్ద

తేడా కనిపించదు తవ్వటానికి ఉపయోగించే పనిముట్లకు మాత్రం ఒక పద్ధతిలో పిడి రంధ్రం ఏర్పాటు చేయబడింది పిడి రంధ్రం ఉన్న గుద్దళ్ళూ, కొడవళ్ళూ, గునపాలూ, నాగలి కర్రులూ, గొడ్డళ్ళూ, కత్తులూ మొదలైన పనిముట్లు శాతవాహనుల కాలానికి చెందిన పొరల్లో లభించాయి పిడి చెక్కటానికి వీలున్న బాణాలూ, బాకులూ కూడా ఇవే పొరల్లో దొరికాయి కరీంనగర్ జిల్లాలో ఒకచోట కమ్మరి కొలిమి కూడా బయటపడింది కరీంనగర్, వరంగల్లు జిల్లాల్లోని ఇనుప ఖనిజ నిక్షేపాలను శాతవాహనులు ఉప యోగించుకున్నట్టుగా ఆధారాలున్నాయి రాతియుగంలోనే ఇనుప పరిశ్రమ ఉండినట్టుగా ఆ ప్రాంతాల్లో ఆధారాలు లభించాయి క్రీస్తు శకానికి పూర్వమూ, ఆ తరువాత కోలార్ ప్రాంతంలో బంగారం పరిశ్రమ ఉండేదని చెప్పటానికి ఆధారాలున్నాయి శాతవాహనులు బంగారాన్ని ఆభరణాలకు మాత్రమే ఉపయోగించి ఉండవచ్చు వారు కుషానులలాగా బంగారు నాణాలను ముద్రించలేదు వారు ప్రధానంగా సీసంతో చేసిన నాణాలనే ముద్రించారు ఇవి దక్కన్ పీఠభూమి ప్రాంతంలో లభించాయి వీరు రాగి, కంచు నాణాలను కూడా ముద్రించారు శాతవాహనుల తరువాత క్రీ శ మూడవ శతాబ్దంలో అధికారానికి వచ్చిన ఇక్ష్వాకులు కూడా తూర్పు దక్కన్ ప్రాంతంలో తమ సొంత నాణాలను విడుదల చేశారు శాతవాహనులూ, ఇక్ష్వాకులూ దక్కన్ పీఠభూమి ప్రాంతంలోని ఖనిజ సంపదను ఉపయోగించుకున్నారు

దక్కన్ పీఠభూమిలో నివసించిన ప్రజలకు వరినాటి, పంట పండించటం తెలుసు క్రీ శ మొదటి రెండు శతాబ్దాల్లో కృష్ణా, గోదావరీ నదులమధ్యభాగం, ముఖ్యంగా ఆ నదుల ముఖద్వారాలలో ఉన్న ప్రాంతం గొప్ప వరి ధాన్యాగారంగా ఉండేది దక్కన్ ప్రజలు పత్తిని కూడా పండించేవారు విదేశీయాత్రికుల కథనం ప్రకారం ఆంధ్రదేశం పత్తిపంటకు ప్రసిద్ధంగా ఉండేది అలా దక్కన్‌లోని ఎక్కువ భాగంలో అభివృద్ధి చెందిన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అమలులో ఉండేది ప్లినీ (క్రీ శ మొదటి శతాబ్దంలో వచ్చిన గ్రీకు యాత్రికుడు) కథనం ప్రకారం ఆంధ్ర సామ్రాజ్యం లక్ష కాల్బలాన్నీ, రెండు వేల గుర్రాలనూ, వేయి ఏనుగులనూ కలిగిన సైన్యాన్ని పోషించేది అంటే – దీని వెనక పెద్ద సంఖ్యలో గ్రామీణ ప్రజానీకం ఉండేదనీ, వారు ఇంత పెద్ద సైన్యాన్ని పోషించ గలిగినంత అదనపు ఆహారాన్ని ఉత్పత్తి చేసేవారనీ ఊహించవచ్చు

ఉత్తరదేశ వాసులతో సంబంధాలు ఏర్పడటం చేత దక్కన్ వాసులు నాణాలను ఉపయోగించటం, ఇటుకల్ని కాల్చటం, గుండ్రని చేదబావుల్ని తవ్వటం నేర్చుకున్నారు భౌతిక జీవితానికి చెందిన ఈ అంశాలు మరో రెండు శతాబ్దాల తరువాత ఎంతో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి కరీంనగర్ జిల్లాలోని పెద్ద బంకూరులో క్రీ పూ 200 – క్రీ శ 200 మధ్యకాలంలో కాల్చిన ఇటుకలనూ, ఇంటి కప్పులకు పనికి వచ్చే సమతలంగా ఉన్న పెంకులనూ ఉపయోగించేవారు దీనివల్ల వీటితో కట్టిన నిర్మాణాలకు ఎక్కువ మన్నిక ఉండేది అదేచోట క్రీ శ రెండవ శతాబ్దానికి చెందిన 22 ఇటుక కట్టడం కట్టిన బావులు బయటపడటం మరింత ఆశ్చర్యకరమైన విషయం ఇవి ఆ ప్రాంతంలో చక్కని జననివాసం ఉండేదని సూచిస్తున్నాయి ఈ ప్రాంతంలో మురుగునీటిని మురుగునీటి గుంటలకు తీసుకెళ్లే మూత మూసిన కాలువలు కూడా బయటపడ్డాయి క్రీ పూ మొదటి శతాబ్దంలో మహారాష్ట్ర ప్రాంతంలో పట్టణాలు వెలిశాయి అనేక చేతివృత్తులు ప్రారంభమయ్యాయి ఆ పట్టణాలు మరొక శతాబ్దం తరువాత ఎంతో ప్రతిష్టను సంతరించుకున్నాయి తూర్పు దక్కన్ ప్రాంతంలోని ఆంధ్రప్రాంతంలో 30 కోటలు కలిగిన పట్టణాలూ, అసంఖ్యాకమైన గ్రామాలూ ఉన్నట్టుగా ప్లినీ చెప్పాడు రెండు, మూడు శతాబ్దాలకు చెందిన అనేక పట్టణాలను గురించి శాసనాలూ, తవ్వకాలూ చెబుతున్నాయి ఆనాడు అభివృద్ధి చెందుతూ ఉన్న వ్యాపారాన్ని గురించి రోమన్, శాతవాహన నాణాల ఆధారంగా తెలుసుకోవచ్చు ఈ వ్యాపార కేంద్రాలు మరొక శతాబ్దం తరువాత తూర్పు దక్కన్ ప్రాంతంలోని కృష్ణా, గోదావరీ మధ్య భాగంలో వెలిశాయి

## సామాజిక నిర్మాణం

శాతవాహనులు మొట్టమొదట దక్కన్‌కు సంబంధించిన ఒక తెగ కావచ్చు కానీ తరువాత కాలంలో వీరు బ్రాహ్మణీకరణం పొందారు శిథిలమైపోతున్న చాతుర్వర్ణ వ్యవస్థను తాను పునస్థాపన చేసినట్టుగా ప్రసిద్ధ శాతవాహన రాజు గౌతమీపుత్ర శాతకర్ణి చెప్పుకున్నాడు వర్ణసంకరం జరగకుండా తాను నిరోధించ గలిగానని అతడు గర్వంగా చెప్పుకున్నాడు శకులు హిందూ సమాజంలోకి చొచ్చుకొని రావటం చేతా, దక్కన్‌లోని తెగలు పైపై మెరుగులకు మాత్రమే బ్రాహ్మణీకరణం పొంది ఉండటం చేతా అలాంటి గందరగోళం వచ్చింది శకులను క్షత్రియులుగా హిందూ సమాజంలోకి కలుపుకోవటంచేత వారికీ, శాతవాహనులకూ వివాహబంధాలు సాధ్యమయ్యాయి అలాగే స్థానిక గిరిజన తెగలవారిని క్రమంగా బౌద్ధ భిక్షువులు వారి స్వీయ సంస్కృతికి దూరం చేశారు రాజులు బౌద్ధ భిక్షువులకు భూదానాలిచ్చి, వారు దక్కన్ పడమర ప్రాంతంలో వెళ్ళి స్థిరపడటానికి ప్రోత్సహించారు తొట్టతొలి బౌద్ధ గుహాలయాలు వ్యాపార మార్గాల్లో ఉండటం చేత వ్యాపారులు బౌద్ధ భిక్షువుల్ని

ప్రోత్సహించారని ఊహించటానికి వీలుంది బ్రాహ్మణులకు భూదానాలు చేసిన మొదటి రాజులు కూడా శాతవాహనులే కానీ వీరు ఎక్కువగా బౌద్ధులకే భూదానాలు చేశా రనటానికి ఆధారాలున్నాయి

ధర్మశాస్త్రాల ప్రకారం దేశాన్ని పరిపాలించటం క్షత్రియుల బాధ్యత కానీ శాతవాహనులు తాము బ్రాహ్మణులమని చెప్పుకున్నారు గౌతమీపుత్ర శాతకర్ణి తాను నిజమైన బ్రాహ్మణున్నని గొప్పలు చెప్పుకున్నాడు ఆంధ్రులే తొలి శాతవాహనులుగా గుర్తించబడటంచేత వారు స్థానిక గిరిజన తెగకు చెందిన వారుగా ఉండవచ్చునని ఊహించటానికి అవకాశం కలుగుతోంది వీరు తరువాతి కాలంలో బ్రాహ్మణులుగా మారిపోయారు ఉత్తరదేశానికి చెందిన ఆచారవంతులైన బ్రాహ్మణులు ఆంధ్రులను సంకరవర్ణంగానే పరిగణించారు వీటిని గమనిస్తే ఆంధ్రులు స్థానిక గిరిజన తెగకు చెందిన వారేననీ, కాలక్రమాన వారిని బ్రాహ్మణీయ సమాజం పరిధిలోకి ఒక సంకర వర్ణంగా తీసుకు రావటం జరిగిందనీ అర్థమౌతుంది

చేతి వృత్తులూ, వ్యాపారమూ ఈ కాలంలో బాగా అభివృద్ధి చెందటంచేత ఎంతోమంది వ్యాపారులూ, చేతివృత్తులవారూ సమాజంలో పైకొచ్చారు తమ పట్టణాల పేర్లతో తమకు గుర్తింపు రావటాన్ని వ్యాపారులు గర్వకారణంగా పరిగణించారు చేతివృత్తులవారూ, వ్యాపారులూ బౌద్ధమత వ్యాప్తికోసం ఉదారంగా ధనసహాయం చేశారు వీరు చిన్న చిన్న శాసన ఫలకాలను కూడా వేశారు వీటిలో గంధికులను దాతలుగా అనేకసార్లు పేర్కొన్నారు గంధికలంటే సుగంధ ద్రవ్యాలను తయారుచేసేవారు, వాటి వ్యాపారం చేసేవారు తరువాత కాలంలో గంధికులు అన్న పేరు అన్ని రకాల వ్యాపారులకూ వర్తింపచేయటం ప్రారంభమైంది ఈ ప్రాచీన పదంలో నుంచే "గాంధి" అన్న ఆధునిక వంశనామం వచ్చింది

శాతవాహనులను గురించి అన్నిటికంటే ఆసక్తికరమైన అంశం వారి కుటుంబ వ్యవస్థ ఉత్తరభారతదేశంలో అమలులో ఉన్న ఆర్యసామాజిక వ్యవస్థలో తండ్రికి తల్లికంటే ఎక్కువ ప్రాధాన్యత ఉండేది ఇంతవరకూ మనం పరిశీలించిన ఉత్తరదేశరాజు లందరూ పితృస్వామ్య వ్యవస్థకు చెందినవారే కానీ శాతవాహనుల్లో మాతృస్వామ్య వ్యవస్థ లక్షణాలు కనిపిస్తాయి తల్లిపేరుతో గుర్తించబడటం శతవాహన రాజుల సంప్రదాయం గౌతమీపుత్ర, వాసిష్ఠీపుత్ర మొదలైన రాజుల పేర్లు ఆ నాటి సమాజంలో తల్లికి ఉన్నతమైన స్థానం ఉండేదని సూచిస్తున్నాయి ఈనాడు దక్షిణ భారతదేశంలో కొడుకు పేరులో తండ్రి పేరు భాగంగా ఉండటం సాధారణంగా కనిపిస్తుంది గాని, తల్లిపేరుకు స్థానం ఉండదు ఈ పరిణామం పితృస్వామ్య వ్యవస్థను సూచిస్తుంది శాతవాహన రాణులు స్వయంగా మత సంబంధమైన పెద్దపెద్దదానాలు చేశారు వీరిలో కొందరు రాజప్రతినిధులుగా కూడా వ్యవహరించారు కానీ శాతవాహన రాజవంశం ప్రాథమికంగా పితృస్వామ్య వ్యవస్థనే పాటించింది రాజ్యాధికారం పురుషులకు మాత్రమే సంక్రమించేది

## పరిపాలనా వ్యవస్థ స్వరూపం

ధర్మశాస్త్రాల్లో నిర్వచించిన విధంగా రాజు ఎలా ఉండాలో అలా ఉండటానికి శాతవాహన రాజులు ప్రయత్నించారు రాజు ధర్మోద్ధారకుడుగా, ధర్మరక్షకుడుగా ఉండాలి అతనికి కొన్ని దైవిక లక్షణాలు కూడా ఆపాదించబడ్డాయి శాతవాహన రాజులు రాముడు, భీముడు, విష్ణువు, అర్జునుడు మొదలైన పురాణపురుషుల లక్షణాలను కలిగి ఉన్నట్టుగా భావించారు శాతవాహన రాజులకు ఈ పురాణపురుషుల శౌర్యపరాక్రమాలున్నట్టుగా చెప్పారు ఇది వీరికి దివ్యత్వాన్ని ఆపాదించటం కోసమే జరిగిందన్నది తేట తెల్లమైన విషయం

అశోకుని కాలంలో ఉన్న కొన్ని పరిపాలనా వ్యవస్థలను శాతవాహనులు కొనసాగించారు వారు జిల్లాను "అహర" అనే అన్నారు మౌర్యుల కాలంలోలాగే వారి ఉద్యోగులను అమాత్యులనీ, మహామాత్రలనీ పిలిచారు



కార్లెలోని చైత్యం

కానీ శాతవాహనుల పరిపాలనా విధానంలో కొన్ని సైనిక, ఫ్యూడల్ లక్షణాలు కనిపిస్తాయి రాష్ట్రాల గవర్నర్లుగా శాతవాహనులు సేనాపతులనే నియమించేవారన్నది గమనించ తగ్గ విషయం దక్కన్‌లోని గిరిజనులు ఆనాటి కింకా పూర్తిగా హిందూ మతాన్ని స్వీకరించి ఉండక పోవటం చేత ప్రజలను గట్టి మిలిటరీ పరిపాలన కింద ఉంచాల్సిన అవసరం ఉండేది గ్రామీణ పరిపాలన "గౌల్మికుల" చేతిలో ఉండేది వీరు కూడా సైనికాధికారులే తొమ్మిది రథాలూ,

తొమ్మిది ఏనుగులూ, ఇరవైఐదు గుర్రాలూ, నలభై ఐదుమంది కాల్బలమూ కలిగిన సైనిక పటాలానికి అధికారి అయిన వ్యక్తిని "గౌళికుడు" అనేవారు అలా గ్రామీణ ప్రాంతాలలో శాంతిభద్రతల పరిరక్షణకు సైనికాధికారులనే నియమించేవారు

శాసనాలల్లో విస్తృతంగా కనిపించే "కటకం", "స్కంధావారం" అన్న పదాలు శాతవాహనుల పరిపాలనకున్న సైనిక స్వభావాన్ని తేటతెల్లం చేస్తాయి అవి రాజు ఉన్నంతవరకూ పరిపాలనా కేంద్రాలుగా పనిచేసే సైనిక స్థావరాలు మాత్రమే అలా శాతవాహనుల పరిపాలనలో బలప్రయోగం ముఖ్యమైన పాత్రను వహించిందని చెప్పవచ్చు

బ్రాహ్మణులకూ, బౌద్ధ సన్యాసులకూ సుంకాలు చెల్లించ నవసరంలేని భూదానాలను – శాతవాహనులే ప్రారంభించారు వారు సాగు చేసుకుంటున్న దానక్షేత్రాల మీద రాజభటుల, సైనికుల, ప్రభుత్వాధికారుల పెత్తనమూ, అజమాయిషీ ఉండేవి కావు శాతవాహన సామ్రాజ్యంలో ఈ ప్రాంతాలు స్వతంత్ర ద్వీపాలలాగా ఉండేవి బహుశా బౌద్ధ భిక్షువులు శాంతిసామరస్యాలను ప్రజలకు బోధించేవారు రాజ్యాధికారాన్నీ, సామాజిక వ్యవస్థనూ గౌరవించాలని కూడా చెప్పేవారు బ్రాహ్మణులు వర్ణవ్యవస్థ సూత్రాలను అమలుపరచి, సామాజిక స్థిరత్వాన్ని రక్షించటానికి దోహదం చేసేవారు

శాతవాహన రాజ్యంలో మూడంతస్తుల పరిపాలనా వ్యవస్థ ఉండేది రాజ్యంలో అత్యంత ఉన్నతాధికారిని "రాజు" అనేవారు అతడికే నాణాలను ముద్రించే అధికారం ఉండేది రెండవ అధికారి "మహాభోజుడు" మూడవ అధికారి "సేనాపతి" ఈ అధికారులకు తమ ప్రాంతాలమీద అధికారం ఉండేది

## మతం

శాతవాహన రాజులు తాము బ్రాహ్మణులమని ప్రకటించుకున్నారు వీరు బ్రాహ్మణీయ మతం పురోగమనానికి చాలా దోహదం చేశారు మొదటినుంచీకూడా శాతవాహన రాజులూ, రాణులూ కూడా "అశ్వమేధం", "వాజపేయం" లాంటి యజ్ఞాలను నిర్వహించారు

వీరు కృష్ణుడూ, వాసుదేవుడులాంటి వైష్ణవ దేవతల్ని ఎందరినో పూజించారు బ్రాహ్మణులకు ఉదారంగా యజ్ఞదక్షిణలను ఇచ్చారు

కానీ శాతవాహన రాజులు బౌద్ధ భిక్షువులకు భూదానాలు చేసి బౌద్ధమతాన్ని కూడా పోషించారు శాతవాహన సామ్రాజ్యంలోని ప్రజల్లో – ముఖ్యంగా చేతివృత్తుల వారిలో – మహాయాన బౌద్ధమతం బహుళ ప్రచారంలో ఉండేది శాతవాహనుల కాలంలోనూ, మరీ ముఖ్యంగా వారి తరువాత అధికారానికి వచ్చిన ఇక్ష్వాకుల కాలంలోనూ ఆంధ్రదేశంలో నాగార్జున కొండ, అమరావతి బౌద్ధ సంస్కృతికి ప్రధాన కేంద్రాలయ్యాయి దక్కన్ పశ్చిమ భాగంలోని (మహారాష్ట్ర) నాసిక్, జునార్ ప్రాంతాలలో కూడా బౌద్ధమతం బాగా విస్తరించింది అక్కడి వ్యాపారులు దాని విస్తరణకు దోహదం చేసినట్టుగా అనిపిస్తోంది

## వాస్తుశిల్పం

శాతవాహనుల కాలంలో మహారాష్ట్ర వాయవ్య ప్రాంతంలో అనేక చైత్యాలనూ, విహారాలనూ నిర్మించటం జరిగింది అసాధారణమైన ఓర్పుతో, నేర్పుతో వీటిని పెద్ద బండరాళ్ళలో తొలిచారు వాస్తవానికి వీని నిర్మాణం శాతవాహనులకంటే ఒక శతాబ్దం ముందుగానే – అంటే, క్రీ పూ 200 ప్రాంతంలో – ప్రారంభమైంది బౌద్ధ వాస్తుశిల్పంలోని రెండు నిర్మాణాలు చైత్యాలూ, విహారాలు చైత్యాలు అనేక స్తంభాలు కలిగిన పెద్ద గదుల (హాల్స్) రూపంలో ఉంటాయి విహారాలు వరండా కలిగి ఉంటాయి వాటిలో నుంచీ హాలులోకి ప్రవేశ ద్వారం ఉంటుంది పశ్చిమ దక్కన్‌లోని కార్లేలో అత్యంత ప్రసిద్ధమైన చైత్యం ఉంది దాని పొడవు 40 అడుగులు, వెడల్పు 15 అడుగులు, ఎత్తు 15 అడుగులు పెద్ద రాతిలో చెక్కిన చైత్యానికి ఇది చక్కని ఉదాహరణ

చైత్యాలకు సమీపంలో భిక్షువులు వర్షాకాలంలో తలదాచుకోవటానికి తొలిచిన నిర్మాణాలు విహారాలు ఇలాంటి మూడు విహారాలు నాసిక్ వద్ద ఉన్నాయి అక్కడ నహపాన, గౌతమీపుత్ర వేయించిన శాసనాలుండటం చేత అవి క్రీ శ మొదటి శతాబ్దానికి చెందినవై ఉండవచ్చునని భావిస్తున్నారు

ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణా – గోదావరీ ప్రాంతంలో కూడా రాతిలో తొలిచిన గుహాలయాలు కనిపిస్తున్నాయి కానీ ఈ ప్రాంతం స్థూపాకారంలో ఉన్న స్వతంత్ర బౌద్ధ నిర్మాణాలకే ప్రసిద్ధి వీటిలో ప్రసిద్ధి చెందినవి అమరావతి, నాగార్జున కొండ బుద్ధుని శరీరానికి చెందిన స్మృతిచిహ్నంమీద నిర్మించిన వృత్తాకార నిర్మాణాన్ని స్థూపం అంటారు అమరావతీస్థూప నిర్మాణం క్రీ పూ 200 ప్రాంతంలో ప్రారంభమైంది క్రీ శ రెండవ శతాబ్దం ఉత్తరార్థంలో దీన్ని పూర్తిగా పునర్నిర్మించారు శంఖాకార నిర్మాణం కలిగిన దీని అడుగు వ్యాసం కొలత 53 మీటర్లు ఎత్తు బహుశా 33 మీటర్లు అమరావతీ స్థూపంలో బుద్ధుని జీవితానికి చెందిన అనేక దృశ్యాలు రాళ్లమీద చెక్కబడ్డాయి

శాతవాహనుల తరువాత అధికారానికి వచ్చిన ఇక్ష్వాకుల కాలంలో – అంటే, క్రీ శ రెండు – మూడు శతాబ్దాల్లో నాగార్జున కొండ గొప్పగా విలసిల్లింది అక్కడ బౌద్ధమతానికి చెందిన నిర్మాణాలు మాత్రమే కాకుండా, ఇటుకతో నిర్మించిన



బుద్ధుని పాదముద్రికల్ని పూజిస్తున్న దృశ్యం – అమరావతి



బుద్ధుడు ధర్మోపన్యాసం చేస్తున్న దృశ్యం – నాగార్జున కొండ

బౌద్ధారామాలను అత్యంత ప్రాచీనమైన హిందూ దేవాలయాలు కూడా బయటపడ్డాయి దాదాపు రెండు డజన్ల అక్కడ గుర్తించవచ్చు స్థూపాలతోనూ, మహా చైత్యాలతోనూ విలసిల్లిన ఆ ప్రాంతం క్రీస్తుశకం తొలి శతాబ్దాలకు చెందిన చాలా గొప్ప భవన సముదాయం అని మనకు అనిపిస్తుంది

## భాష

శాతవాహనుల రాజభాష ప్రాకృతం వారు వేయించిన శాసనాలన్నీ ప్రాకృత భాషలో, బ్రాహ్మీలిపిలో ఉన్నాయి అశోకుడు వేయించిన శాసనాలు కూడా ఇదే పద్ధతిలో ఉన్నాయి కొంతమంది శాతవాహన రాజులు ప్రాకృత గ్రంథాలను కూడా రాశారని భావిస్తున్నారు "గాథాసప్తశతి" అన్ని గ్రంథాన్ని శాతవాహన రాజైన హాలుడు సంకలనం చేశాడని చెబుతారు అందులో 700 ప్రాకృత పద్యాలున్నాయి కానీ చాలా కాలం తరువాత – అంటే, క్రీ శ 6 వ శతాబ్దం ప్రాంతంలో – ఈ గ్రంథం చివరిసారిగా పరిష్కరించబడి, ఇప్పుడున్న రూపాన్ని పొందింది

★ ★ ★

# అధ్యాయం: 18

# దక్షిణాదిలో చారిత్రక సూర్యోదయం

చారిత్రక యుగం ప్రారంభం కావటాన్ని అనేక అంశాలు సూచిస్తాయి అవి 1 పెద్ద సంఖ్యలో గ్రామీణ సమాజాలు స్థిరనివాసం ఏర్పరచుకోవటం, వారు కర్రు కలిగిన నాగలితో వ్యవసాయాన్ని కొనసాగించటం 2 రాజ్యవ్యవస్థ రూపొందటం 3 సామాజిక వర్గాలు అభివృద్ధి చెందటం 4 రాత ప్రారంభం కావటం 5 లిఖిత సాహిత్యం ప్రారంభం కావటం క్రీ పూ రెండవ శతాబ్దం వరకూ ఈ పరిణామాలేవీ కావేరి డెల్టా కేంద్రంగా కలిగిన ద్వీపకల్పం దక్షిణాగ్రాన కనిపించలేదు అంతవరకూ ఉత్తర భాగాన "మెగాలిత్ బిల్డర్స్" అని పిలవబడే మానవులు జీవించేవారు వీరి ఉనికిని గురించి మనకు వారి నివాసాల ద్వారా తెలియదు అవి సంఖ్యలో చాలా తక్కువగా కూడా ఉన్నాయి వారి నివాసాల కంటే వారు నిర్మించిన సమాధులే వారిని గురించి ఎక్కువగా చెబుతాయి పెద్ద పెద్ద బండరాళ్ళతో నిర్మించిన సమాధులు కావటం చేత వీటిని "మెగాలిత్ గ్రేవ్స్" అంటారు (మెగాలిత్స్ అంటే పెద్ద బండ రాళ్ళని అర్థం ) పెద్ద బండల్ని గుండ్రంగా పేర్చుతారు వీటిలో చనిపోయినవారి అస్థి పంజరాలు మాత్రమే కాకుండా, పాత్రలూ, ఇనుప వస్తువులు కూడా ఉంటాయి

ఆ కాలానికి చెందిన ప్రజలు ఎర్రమట్టి పాత్రలతోపాటు అనేక రకాల పాత్రల్ని ఉపయోగించారు కానీ ఎరుపు, నలుపు రంగు కలిసిన పాత్రల్ని వారు చాలా ఎక్కువగా ఉపయోగించారు చనిపోయిన వ్యక్తులతో పాటు వస్తువుల్ని కూడా పాతిపెట్టటం వెనక ఆ వస్తువులు చనిపోయిన వారికి పరలోకంలో అవసరమౌతాయన్న నమ్మకం ఉంది ఈ సమాధుల్లో లభించే వస్తువులు వారి ఆహారసంపాదన విధానాన్ని గురించి మనకు తెలియజేస్తాయి ఈ సమాధుల్లో మనకు బాణాల మొనలూ, బల్లాల మొనలూ, గుద్దళ్ళూ, కొడవళ్ళూ లభించాయి ఇవన్నీ కూడా ఇనుముతో తయారుచేసినవే ఈ సమాధుల్లో త్రిశూలాలు కూడా లభించాయి ఇవి తరువాతి కాలంలో శివుని ఆయుధంగా అభివర్ణించబడ్డాయి వ్యవసాయ పనిముట్లకంటే ఎక్కువగా వేటకూ, పోరాటాలకూ ఉపయోగించే ఆయుధాలే ఎక్కువగా ఈ సమాధుల్లో లభించాయి ఆ కాలపు ప్రజలు అభివృద్ధి చెందిన వ్యవసాయ విధానాన్ని అనుసరించేవారు కారని ఈ పనిముట్లు మనకు సూచిస్తున్నాయి

దక్షిణ భారత ద్వీపకల్పంలో అన్ని మెట్ట ప్రాంతాల్లోనూ మెగాలిత్ సమాధులు బయటపడ్డాయి కానీ అవి ఎక్కువగా ఆంధ్రప్రదేశ్ తూర్పుభాగంలోనూ, తమిళనాడులోనూ బయటపడ్డాయి వీటి ప్రారంభ కాలం సుమారుగా క్రీ పూ 1000 సంవత్సరాలు కానీ, చాలా సందర్భాల్లో ఈ మెగాలిథిక్ దశ క్రీ పూ 5 వ శతాబ్దం నుంచీ ఒకటవ శతాబ్దం వరకూ కొనసాగింది మరికొన్ని సందర్భాల్లో ఈ దశ క్రీస్తుశకం తొలి శతాబ్దాలవరకూ కూడా విస్తరించింది

అశోకుని శాసనాల్లో పేర్కొనబడిన చోళులూ, పాండ్యులూ, కేరళ పుత్రులూ (చేరులు) బహుశా ఈ మెగాలిథిక్ సాంస్కృతిక దశకు చెందినవారే కావచ్చు దక్షిణ తమిళనాడుకు చెందిన మెగాలిథిక్ ప్రజలకు కొన్ని ప్రత్యేక లక్షణాలున్నాయి వారు చనిపోయిన వారి అస్థిపంజరాలను ఎర్రమట్టితో చేసిన కుండల్లో ఉంచి గుంతల్లో పాతిపెట్టారు అనేక చోట్లలో ఆ పాత్రల చుట్టూరా వర్తులాకారంలో పేర్చిన రాళ్ళు లేవు అంతేకాకుండా, సమాధుల్లో ఉంచిన వస్తువులు కూడా తక్కువే ఈ పద్ధతి కృష్ణా–గోదావరీ నదుల మధ్యభాగంలో అనుసరించిన శవ ఖనన విధానానికి భిన్నంగా ఉంటుంది వారు శవాలను శవపేటికల్లో ఉంచికానీ, పేటికలు లేకుండా గుంతల్లోకానీ పాతిపెట్టి, చుట్టూరా వర్తులాకారంలో రాళ్ళను అమర్చేవారు అనాడు ఇనుము ఉపయోగంలో ఉన్నా మెగాలిథిక్ ప్రజలు నివాసానికీ, శవాలను పాతిపెట్టటానికీ కూడా కొండవాలు ప్రదేశాలనే ఎన్నుకునేవారు అనాటి ప్రజలు వడ్లనూ, రాగులనూ పండించేవారు కానీ అనాడు వ్యవసాయం కింద ఉన్న పొలం చాలా తక్కువగా ఉండేది మైదాన ప్రాంతాలూ, సమతల ప్రాంతాలూ అడవుల మయంగా ఉండటం చేత

అలాంటి ప్రాంతాల్లో వారు నివాసం ఏర్పరచుకోలేక పోయారు

## రాజ్యవ్యవస్థ అవతరణ-సాంస్కృతికాభివృద్ధి

క్రీ పూ 3 వ శతాబ్దానికల్లా మెగాలితిక్ ప్రజలు కొండవాలుల నుంచీ దిగి వచ్చి సారవంతమైన నదీముఖద్వార ప్రాంతాలను చేరుకున్నారు అక్కడ బురదనేలలను నివాస ప్రాంతాలుగా మార్చుకున్నారు ఉత్తర భారతదేశం నుంచీ వ్యాపారులూ, విజేతలూ, జైన, బౌద్ధ, బ్రాహ్మణ మత ప్రచారకులూ తీసుకు వచ్చిన భౌతిక సంస్కృతి ఇచ్చిన ఉత్సాహంతో వీరు వరిని తడిపంటగా పండించటం నేర్చుకున్నారు అనేక పల్లెలనూ, పట్టణాలనూ స్థాపించుకున్నారు సామాజిక వర్గాలను ఏర్పాటు చేసుకున్నారు క్రీ పూ 4 వ శతాబ్దం నుంచీ ఉత్తర భారతదేశానికీ, దక్షిణ భారతదేశం లోని దక్షిణ ప్రాంతానికీ మధ్య ఏర్పడిన సాంస్కృతిక, ఆర్థిక సంబంధాలకు గొప్ప ప్రాముఖ్యత కలిగింది దక్షిణ దక్షిణాదిని "తమిళకం" అనేవారు దక్షిణ భారతదేశానికి వెళ్ళే దారిని దక్షిణాపథం అనేవారు దక్షిణదేశం నుండి బంగారమూ, ముత్యాలూ, అనేక రకాల విలువైన రత్నాలూ లభిస్తుండటం చేత దక్షిణాపథానికి ఔత్తరాహులు ఎంతో విలువ ఇచ్చేవారు పాటలీపుత్రంలో నివసించిన మెగస్తనీసుకు పాండ్య దేశాన్ని గురించి తెలుసు గంగా, సోన్ నదులను గురించీ, మగధ రాజధాని అయిన పాటలీపుత్రాన్ని గురించీ తొలి "సంగం" గ్రంథాలు పేర్కొన్నాయి అశోకుని శాసనాలు మగధ సామ్రాజ్య సరిహద్దుల్లో చోళులు, పాండ్యులు, కేరళ పుత్రులు, సత్యపుత్రులు నివసిస్తున్నట్టుగా చెబుతాయి వీరిలో ఇంతవరకూ సత్యపుత్రుల్ని మాత్రమే గుర్తించలేకపోయాం అశోకుని శాసనాల్లో తామ్రపర్ణుల (శ్రీలంకనివాసులు) ప్రస్తావన కూడా ఉంది "దేవానాంప్రియ" అన్న అశోకుని బిరుదాన్ని ఒక తమిళ రాజు స్వీకరించాడు ఇవన్నీ కూడా



బండరాళ్ళతో నిర్మించిన ఖననస్థానం (మెగాలిథిక్ బారియల్)

జైనులూ, బౌద్ధులూ, అజీవకులూ, బ్రాహ్మణులు నిర్వహించిన మతప్రచార, సంస్కృతీకరణ కార్యక్రమాల ఫలితాలే వీరితోబాటు వీరి వెనువెంబడే వ్యాపారులు కూడా వచ్చి ఈ ప్రక్రియకు దోహదం చేశారు అందుచేతనే అశోకుడు తన శాసనాలను ప్రధానమైన రహదార్ల ప్రక్కనే వేయించాడు తొలిదశలో గంగామైదాన సంస్కృతి ప్రభావం తమిళ – బ్రాహ్మీ శాసనాల్లో పేర్కొనబడిన సంప్రదాయ వ్యతిరేక తెగల ప్రవర్తనమీద కనిపిస్తుంది అలాగే బ్రాహ్మణీయ మత ప్రభావం కూడా తమిళకం మీద విస్తృతంగా ప్రసరించటం ప్రారంభమైంది ఈ పరిణామం, క్రీ శ 4 వ శతాబ్దం తరువాత స్పష్టంగా కనిపించటం ప్రారంభించింది దీని ఫలితంగా తమిళ సంస్కృతిలోని అనేక అంశాలు ఉత్తరాదిని చేరుకున్నాయి బ్రాహ్మణీయ గ్రంధాలు కావేరిని భారతదేశంలోని పవిత్ర నదుల్లో ఒకటిగా గుర్తించాయి

అడవుల్ని చదును చేయటంలోనూ, నాగలి సేద్యంలోనూ ఎంతగానో దోహదం చేసిన ఇనుముకు సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానంలేకుండా ఈ దక్షిణాది రాజ్యాలు అభివృద్ధి చెంది ఉండేవికావు

"జనపద"మూ, మగధసామ్రాజ్యమూ ముద్రించిన విద్ధాంక నాణాలు విస్తృతమైన ప్రాంతంలో లభించాయి అవి అనాడు అభివృద్ధి చెందిన ఉత్తర – దక్షిణ వాణిజ్యాన్ని సూచిస్తున్నాయి

రోమన్ సామ్రాజ్యంతో లాభసాటి వాణిజ్యం అభివృద్ధి చెందటం కూడా – చోళ, చేర, పాండ్యరాజ్యాలు అవతరించటానికి కారణభూతమైంది క్రీ శ మొదటి శతాబ్దం నుంచీ కూడా ఈ రాజ్యాల్లోని ప్రజలు దక్షిణ భారతదేశంలోని తీరప్రాంతాలతోనూ, రోమన్ సామ్రాజ్యంలోని తూర్పుదేశాలతోనూ (ముఖ్యంగా ఈజిప్ట్) ఎగుమతి దిగుమతి వ్యాపారాన్ని కొనసాగించి లాభాలను ఆర్జించారు



క్రీస్తుశకం తొలి శతాబ్దాలకు చెందిన దంతపువస్తువులు

## తొలి మూడు రాజ్యాలు

భారత ద్వీపకల్పంలో కృష్ణానదికి దక్షిణంగా ఉన్న భాగాన్ని మూడు రాజ్యాలుగా విభజిస్తారు అవి చోళ, పాండ్య, చేర (కేరళ) రాజ్యాలు మెగస్తనీస్ వీరిలో పాండ్యుల్ని మొదట పేర్కొన్నాడు ఆ దేశం ముత్యాలకు ప్రసిద్ధి చెందిందన్నాడు అంతేకాకుండా, ఆ రాజ్యాన్ని ఒక స్త్రీ పరిపాలిస్తోందని చెప్పాడు అది బహుశా పాండ్యదేశ సమాజం మీద మాతృస్వామిక వ్యవస్థ ప్రభావానికో చిహ్నం కావచ్చు

పాండ్య రాజ్యం భారతద్వీపకల్పంలోని దక్షిణ భాగంలో, ఆగ్నేయ దిశగా ఉన్న ప్రాంతం ఈ ప్రాంతం ఆధునిక తమిళనాడులోని తిరునల్వేలి, రామనాధపురం, మధురై జిల్లాలను కలిగి ఉండేది దాని రాజధాని మదురై క్రీస్తుశకం తొలిశతాబ్దాలలో తమిళ విద్వాంసులు సంకలనం చేసిన "సంగం" సాహిత్యంలో పాండ్యరాజుల ప్రస్తావన వస్తుంది కానీ అందులో మనకు కాలక్రమంలో సమగ్రంగా ఉన్న సమాచారం మాత్రం లభించదు "సంగం" సాహిత్యం ఒకరిద్దరు పాండ్యరాజుల్ని మాత్రమే పేర్కొంటుంది "సంగం" సాహిత్యాన్ని పరిశీలిస్తే పాండ్యదేశం సుభిక్షంగా ఉండేదనటానికి ఎలాంటి సందేహమూ లేదు పాండ్యరాజులు రోమన్ సామ్రాజ్యంతో వ్యాపారం చేసి చాలా లాభాలను సంపాదించారు రోమన్ చక్రవర్తి అగస్టస్ ఆస్థానానికి రాయబారుల్ని పంపారు పాండ్యరాజ్యంలో బ్రాహ్మణులు గొప్ప పలుకుబడిని కలిగి ఉండేవారు క్రీ శ తొలి శతాబ్దాలలో పాండ్యరాజులు వైదిక యజ్ఞాలను కూడా నిర్వహించారు

పాండ్యరాజ్యానికి ఈశాన్య దిశలో చోళరాజ్యం ఏర్ప డింది మధ్యయుగాల తొలిరోజుల్లో దీన్ని "చోళ మండలం" అని పిలిచేవారు చోళరాజ్యం పెన్నార్, వేలార్ నదుల మధ్యభాగంలో విస్తరించి ఉండేది "సంగం" సాహిత్యగ్రంథాల నుంచీ చోళరాజ్య రాజకీయ చరిత్రను గురించి మనం ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవచ్చు వారి రాజధాని ఉరయూరు అది పత్తి వ్యాపారానికి కూడా కేంద్రంగా ఉండేది క్రీ పూ 2 వ శతాబ్దం మధ్యకాలంలో ఎలారుడు అన్న చోళరాజు శ్రీలంకను జయించి, దాదాపు 50 సంవత్సరాలు పరిపా లించాడు క్రీ శ రెండవ శతాబ్దంలో సుప్రసిద్ధుడైన కరికాల చోళునితో చోళుల చరిత్ర బాగా స్థిరపడింది అతడు పుహార్ నగరాన్ని నిర్మించాడు 160 కి మీ పొడవున కావేరీ నదికి గట్లు పోయించాడు శ్రీలంక నుంచీ తాను తీసుకు వచ్చిన 12000 మంది యుద్ధఖైదీలతో అతడు ఈ పని చేయించాడు పుహార్ కావేరీ పట్నంగా గుర్తించబడింది అదే చోళుల రాజధాని కూడా అది ఆనాడు గొప్ప వ్యాపార కేంద్రం అక్కడ జరిగిన తవ్వకాలలో పెద్దరేవు కూడా బయటపడింది చోళుల సంపదకు పత్తి వ్యాపారం ఒక ప్రధాన కారణం చోళులు బలమైన నౌకాదళాన్ని కూడా పోషించారు

కరికాలుని తరువాత అధికారానికి వచ్చిన రాజుల కాలంలో చోళుల వైభవం చాలా త్వరగా పతనమై పోయింది వారి రాజధాని అయిన కావేరీ పట్నంను శత్రువులు ఆక్రమించుకొని, ధ్వంసం చేశారు చోళుల ఇరుగుపొరుగున ఉన్న పాండ్యులు, చేరులు తమ రాజ్యాన్ని విస్తరింప చేశారు మిగిలివున్న చోళరాజ్య వైభవాన్ని, ఉత్తర ప్రాంతానికి చెందిన పల్లవులు తుడిచి పెట్టేశారు క్రీ శ 4 వ శతాబ్దం నుంచీ 9 వ శతాబ్దం వరకూ దక్షిణ భారత చరిత్రలో చాలా అప్రధానమైన పాత్రను మాత్రమే నిర్వహించారు

పాండ్య రాజ్యానికి పశ్చిమంగానూ, ఉత్తరంగానూ చేరుల (కేరళీయుల) రాజ్యం ఉండేది ఆ రాజ్యం పడమటి కనుమలకూ, అరేబియా సముద్రానికీ మధ్యభాగంలో విస్తరించి ఉండేది ఈనాటి కేరళ, తమిళనాడు రాష్ట్రాల్లోని కొంత ప్రాంతం ఆ రాజ్యంలో భాగంగా ఉండేది క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో చేర రాజ్యం చోళ, పాండ్య రాజ్యాలతో సమానమైన ప్రాధాన్యతను కలిగి ఉండేది చేర రాజ్యం ప్రాధాన్యతకు కూడా రోమన్ సామ్రాజ్యంతో వారికున్న వ్యాపార సంబంధాలే కారణం రోమన్లు చేరరాజ్యంలోని ముజిరిస్ (ఈనాటి కన్ననూర్)లో తమ రక్షణ కోసం రెండు సైనిక పటాలాలను ఉంచేవారు అక్కడ వారు అగస్టస్ దేవాలయాన్ని నిర్మించారని కూడా చెబుతారు

చేరరాజుల చరిత్ర చోళులతో, పాండ్యులతో నిరంతరంగా యుద్ధాలతో కొనసాగింది కరికాల చోళుని నాన్నను చేరరాజు హతమార్చాడు కానీ, యుద్ధంలో తాను కూడా చనిపోయాడు ఆ తరువాత ఈ రెండు రాజ్యాలూ మిత్రులుగా కొన సాగి, వివాహసంబంధాన్ని కూడా ఏర్పాటు చేసుకున్నాయి మరికొంతకాలానికి చేర రాజు చోళులకు వ్యతిరేకంగా పాండ్యులతో చేరాడు కానీ చోళులు వీరిద్దరినీ యుద్ధంలో ఓడించారు వీపు మీద గాయం కావటం చేత చేర రాజు అవమాన భారంతో ఆత్మహత్య చేసుకున్నాడని చెబుతారు

చేర రాజ్యపు కవుల కథనం ప్రకారం చేర రాజుల్లో సుప్రసిద్ధుడు సెంగుట్టవన్ సెంగుట్టవన్ అంటే ఎర్రటి వాడు లేదా మంచివాడు అని అర్థం అతడు శత్రువులను జయించి, తన సోదరుణ్ణి రాజును చేశాడు అతడు ఉత్తర భారతదేశాన్ని జయించినట్టూ, గంగను దాటి నట్టూ చెబుతారు అవి అతిశయోక్తులు మాత్రమే క్రీ శ రెండవ శతాబ్దం తరువాత చేరుల ప్రాబల్యం తగ్గిపోయింది మళ్ళీ క్రీ శ 8 వ శతాబ్దం వరకూ వీరి చరిత్రను గురించి మనకేమీ తెలియదు

ఈ మూడు రాజ్యాల రాజకీయ చరిత్రలో ఆసక్తికరమైన అంశాలు వీరిలోవీరు నిరంతరంగా కలహించుకోవటం, వీరు శ్రీలంకతో చేసిన యుద్ధాలు

ఈ యుద్ధాలవల్ల ఈ దేశాలు బలహీనమయ్యాయి కానీ ప్రకృతి వనరులు బాగా ఉండటమూ, విదేశీవ్యాపారమూ వీరికి చాలా లాభసాటిగా ఉండేవి ఈ రాజ్యాలు సంపన్నమైనవనే చెప్పాలి కూడా వీరు సుగంధ ద్రవ్యాలను – ముఖ్యంగా మిరియాలను పండించేవారు మిరియాలకు పాశ్చాత్యదేశాల్లో గొప్ప గిరాకీ ఉండేది అలాగే ఏనుగుల నుంచీ లభించే దంతాలకి కూడా పాశ్చాత్యదేశాల్లో చాలా గిరాకీ ఉండేది వీరికి సముద్రం నుంచీ ముత్యాలూ, గనులనుంచీ విలువైన రత్నాలూ లభించేవి వీటిని పాశ్చాత్య దేశాలకు పెద్ద సంఖ్యలో ఎగుమతి చేసేవారు దీనికితోడు వీరు పట్టు బట్టలనూ, మస్లిన్ బట్టలను నేసేవారు పాముపొరవంటి పలచని నూలు బట్టల్ని గురించిన ప్రస్తావనలు వీరి సాహిత్యంలో ఉన్నాయి తొలి తమిళకావ్యాలు పట్టు బట్టలమీద నగిషీలు కుట్టే విద్యను గురించి ప్రస్తావిస్తాయి ఉరయూర్ పత్తివ్యాపారానికి ప్రసిద్ధ కేంద్రంగా ఉండేది ప్రాచీన కాలంలో తమిళులు గ్రీసుతోనూ, గ్రీసు రాజ్యాలైన ఈజిప్ట్, అరేబియాలతోనూ, తూర్పు దేశాలైన మలయా ద్వీపకల్పంతోనూ, చైనా మొదలైన దేశాలతోనూ వ్యాపార సంబంధాలను కలిగి ఉండేవారు ఈ సంబంధాల వల్లనే బియ్యం, అల్లం, దాల్చిన చెక్క మొదలైన వస్తువులకు తమిళంలో ఉన్న పదాలు గ్రీకు భాషలోకి వెళ్ళాయి ఈజిప్ట్ రోమన్ సామ్రాజ్యంలో భాగమయ్యాక, ఋతుపవనాల

దిశలను కనుగొన్న తరువాత – అంటే క్రీ శ ఒకటవ శతాబ్దం తరువాత – వ్యాపారం బాగా అభివృద్ధి చెందింది క్రీ శ మొదటి రెండున్నర శతాబ్దాల కాలంలో దక్షిణ భారత రాజ్యాలు రోమన్‌లతో లాభసాటి వ్యాపారాన్ని సాగించాయి ఈ వ్యాపార సంబంధాలు మందగించాక ఈ రాజ్యాలు కూడా శిథిలం కావటం ప్రారంభించాయి

## ధనం - బలం

వ్యాపారం (స్థానిక, విదేశీయం) ప్రభుత్వాదాయానికి ప్రధాన మార్గంగా ఉండేది పుహార్‌రేవులో సుంకాలు వసూలు చేసే అధికారులు ఉండేవారు వ్యాపారం కోసం ఒక ప్రాంతం నుంచీ మరొక ప్రాంతానికి వెళ్ళే వ్యాపారుల భద్రత కోసమూ, దొంగవ్యాపారాన్ని నిరోధించటం కోసమూ రహదారుల మీద రాజభటులు కాపలా కాసేవారు

యుద్ధాల తరువాత చేసే దోపిడీల్లో లభించే సంపద కూడా రాజ్య సంపదలో భాగమయ్యేది కానీ యుద్ధాలకూ, రాజతంత్రానికీ నిజమైన పునాది మాత్రం వ్యవసాయం మీద లభించే ఆదాయమే పండిన పంటలో రాజుకు చెల్లించ వలసింది ఎంత భాగమో స్పష్టంగా ఎవరూ పేర్కొనలేదు దక్షిణ భారత (కన్యాకుమారి) అగ్రమూ, దాని చుట్టుపట్ల ఉన్న ప్రాంతాలూ చాలా సారవంతంగా ఉండేవి అందులో వరి, రాగులు, చెరకూ పండించేవారు ఒక ఏనుగు పడుకున్నంత ప్రాంతంలో ఏడుగురికి సరిపోయే ధాన్యం పండేదని ఆనాడు కావేరీ ముఖద్వార ప్రాంతాన్ని గురించి చెప్పేవారు దీనికితోడు తమిళ ప్రాంతంలో ఇతర ధాన్యాలూ, పళ్ళూ, మిరియాలూ, పసుపూ పండించేవారు వీటన్నిటిలోనూ రాజుకు భాగం ఉండేది

రైతులనుంచీ వసూలు చేసిన పన్నులను ఉపయోగించి రాజ్యం సైన్యాన్ని పోషించేది సైన్యంలో ఎద్దులు లాగే రథాలూ, ఏనుగులూ, అశ్విక దళమూ, పదాతి దళమూ ఉండేవి యుద్ధాలలో ఏనుగులు ప్రధానపాత్ర వహించేవి పాండ్యరాజులు విదేశాల నుంచీ సముద్రమార్గంలో గుర్రాలను తెప్పించుకునేవారు రాజులూ, రాజ బంధువులూ ఏనుగుల్ని ఉపయోగించేవారు సేనాధిపతులు రథాలను ఉపయోగించే వారు అశ్వికులూ, పదాతులూ తమ పదాల రక్షణకు తోలుతో చేసిన పాదరక్షల్ని ఉపయోగించేవారు

## సామాజిక వర్గాల అభివృద్ధి

వ్యాపార సుంకాల నుంచీ, యుద్ధకాలంలో దోపిడీల నుంచీ, వ్యవసాయ పన్నుల నుంచీ వచ్చిన ఆదాయంతో రాజులు వృత్తి సైనిక దళాలనూ, కవులనూ, పురోహితులనూ పోషించేవారు పురోహితులు ఎక్కువగా బ్రాహ్మణులే మొదటి సారిగా తమిళనాడులో "సంగం" యుగంలోనే బ్రాహ్మణులు అవతరించారు బ్రాహ్మణులను నొప్పించని వాడే ఆదర్శ ప్రభువని వారు భావించేవారు చాలా మంది కవులు కూడా బ్రాహ్మణులే కవులైన బ్రాహ్మణులకు రాజాదరణ పుష్కలంగా లభించేది ఎవరో ఒక కవికి కరికాల చోళుడు 16 లక్షల బంగారు నాణాలను ఇచ్చినట్టుగా చెబుతారు బంగారంతో పాటు కవులకు నగదు, భూములు, రథాలూ, గుర్రాలూ, చివరకు ఏనుగులూ కూడా లభించేవి తమిళ బ్రాహ్మణులు మద్య మాంసాలను సేవించేవారు క్షత్రియులూ, వైశ్యులూ నిర్దిష్టమైన వర్ణాలుగా ఉండినట్టుగా "సంగం" గ్రంథాలు చెబుతాయి రాజ్య వ్యవస్థలోనూ, సమాజంలోనూ యోధులకు ప్రత్యేక స్థానం ఉండేది సైనికాధికారులకు ఒక ప్రత్యేక ఉత్సవంలో "ఎనాది" అన్న బిరుదాన్నిచ్చేవారు సివిల్, మిలిటరీ ఉద్యోగాలలో చోళుల కాలంలోనూ పాండ్యుల కాలంలోనూ కూడా "వెల్లాల" కులానికి చెందిన వారుండేవారు వీరు సంపన్న రైతులు, నాలుగవ వర్ణానికి చెందినవారు ఎక్కువ వ్యవసాయ భూమి వీరి అధీనంలోనే ఉండేది కాబట్టి రైతులు – ధనికరైతులు, పేద రైతులు అన్న వర్గాలుగా చీలిపోయి ఉండేవారు ధనిక రైతులు సొంతసేద్యం చేసేవారు కారు కూలీలతో వారి వ్యవసాయం సాగేది వ్యవసాయ కూలీలుగా చిట్ట చివరి కులానికి చెందిన వారుండేవారు వారిని తమిళంలో "కడసియార్"లు అనేవారు వీరి పరిస్థితి బానిసల పరిస్థితి కంటే భిన్నంగా ఉండేది కాదు

కొంతమంది చేతివృత్తుల వారి పరిస్థితి కూడా వ్యవసాయ కూలీల పరిస్థితి లాగే ఉండేది "పరయర్"లు కూడా వ్యవసాయ కూలీలే వీరు జంతు చర్మాలను చాపలుగా కూడా ఉపయోగించేవారు అనేక మంది కులహీనులు, గిరిజనులు దారుణమైన పేదరికంలో జీవించేవారు వీరికి పొట్ట గడవటమే కష్టంగా ఉండేది "సంగం" యుగంలోని సమాజంలో తీవ్రమైన అసమానతలుండేవి ఉన్నవాళ్ళు ఇటుకలతోనూ, సున్నంతోనూ కట్టిన ఇళ్ళలోనూ, లేనివాళ్ళు గుడిసెల్లోనూ, అంతకంటే దీనమైన నివాసాల్లోనూ జీవించేవారు నగరాల్లో సంపన్న వ్యాపారులు పై అంతస్తుల్లో నివసించేవారు సామాజిక అసమానతల్ని కొనసాగించటానికి మతాన్నీ, మతకర్మల్నీ ఉపయోగించేవారో లేదో మనకు తెలియదు "సంగం" యుగం తొలి రోజుల్లో తీవ్రమైన కులభేదాలు ఉండేవికావు కానీ కాలక్రమాన బ్రాహ్మణుల, పాలక వర్ణాల ప్రాదుర్భావం జరిగింది

## బ్రాహ్మణ మతం ప్రారంభం

క్రీస్తుశకం తొలి శతాబ్దాలలో బ్రాహ్మణ మతం ప్రభావంతో రాజ్యవ్యవస్థా, సామాజిక వ్యవస్థా అభివృద్ధి చెందాయి కానీ బ్రాహ్మణుల ప్రాబల్యం తమిళనాడులో ఒక చిన్న ప్రాంతానికీ, ఆ ప్రాంతంలో కూడా సమాజంలోని ఉన్నత వర్గాలకూ మాత్రమే పరిమితంగా ఉండేది రాజులు వైదిక కర్మల్ని ఆచరించేవారు వేదానుయాయులైన బ్రాహ్మణులు ఇతరులతో వాద ప్రతివాదాలు చేసేవారు స్థానిక గిరిజనులు "మురుగన్" అన్న దేవుణ్ణి పూజించేవారు తరువాత మధ్యయుగాల్లో మురుగన్‌ను సుబ్రహ్మణ్య స్వామి అని పిలవటం ప్రారంభమైంది విష్ణుపూజ తరువాతి కాలంలో వచ్చింది కానీ, దాన్ని గురించిన ప్రస్తావన మాత్రం ఉంది చనిపోయిన వారితో పాటు వస్తువుల్ని పాతిపెట్టే ఆచారం కొనసాగుతూ వచ్చింది చనిపోయిన వారికి వడ్లు ఆహారంగా పాతిపెట్టే కొత్త ఆచారం ప్రారంభమైంది శవాలను దహించే కొత్త ఆచారం వచ్చినా – పాతిపెట్టే మెగాలిథిక్ పాత ఆచారం, అదృశ్యమై పోలేదు

## తమిళభాష, సంగం సాహిత్యం

చారిత్రక దశ ప్రారంభంలో తమిళుల్ని గురించి ఇంత వరకూ చెప్పిన విషయాలకు "సంగం" సాహిత్యం ఆధారం ఇంతకు ముందే చెప్పినట్టు రాజుల లేదా ఇతర పాలకుల పోషణతో నిర్వహించ బడుతూ ఉండిన తమిళ కవి పరిషత్తును "సంగం" అని పిలిచేవారు అలాంటి పరిషత్తులు ఎన్ని ఉండేవో, అవి ఎంతకాలం పాటు జరిగేవో మనకు కచ్చితంగా తెలియదు ఎనిమిదవ శతాబ్దం మధ్యకాలానికి చెందిన ఒక వ్యాఖ్యాన గ్రంథంలో మూడు "సంగం" పరిషత్తులు 9990 ఏళ్ళ కాలం కొనసాగాయనీ, 8598 మంది కవులు ఆ పరిషత్తుల్లో పాల్గొన్నారనీ, 197 మంది పాండ్యరాజులు ఆ పరిషత్తులకు పోషకులుగా ఉండేవారనీ ఉంది ఇదంతా కూడా హద్దులేని అతిశయోక్తి మాత్రమే మనకు తెలిసిందల్లా మధురైలో రాజపోషణతో ఈ పరిషత్తులు జరిగేవని మాత్రమే

క్రీ శ 3–6 శతాబ్దాల మధ్య ఈనాడు అందుబాటులో ఉన్న సంగం సాహిత్యం ఈ పరిషత్తులలో రచించబడింది ఇందులో కొంతభాగం మరొక శతాబ్దం ముందు రచించబడి ఉండవచ్చు "సంగం" సాహిత్యాన్ని రెండు రకాలుగా విభజించవచ్చు అవి కథన సాహిత్యం నైతిక సాహిత్యం కథన సాహిత్యం "మేల్ కణక్కు" ఈ విభాగంలో 18 ప్రధాన గ్రంథాలుంటాయి వీటిలో ఎనిమిది కవితాసంకలనాలు, పది గ్రామీణ/ప్రేమ గాథలున్నాయి రెండవ రకం గ్రంథాలను "కీన్ కళక్కు" అంటారు వీటి సంఖ్య కూడా పద్దెనిమిదే

## "సంగం" గ్రంథాలలో కనిపించే సామాజిక పరిణామం

పైన పేర్కొన్న రెండు రకాల "సంగం" గ్రంథాలూ సామాజిక పరిణామంలోని అనేక దశల్ని సూచిస్తాయి కథాకావ్యాలు ప్రధానంగా వీరకావ్యాలు యుద్ధాలలో, గోగ్రహణాలలో వీరులు చూపించిన ధైర్య సాహసాలను అవి కీర్తిస్తాయి ప్రాచీన తమిళప్రజలు ప్రధానంగా గ్రామీణులని ఈ గ్రంథాలు చెబుతాయి మెగాలిథిక్ జీవిత విధానం యొక్క తొలిసూచనలు కూడా ఈ గ్రంథాల్లో కనిపిస్తాయి తొలి మెగాలిథిక్ ప్రజలు వడ్లు పండించారు కానీ, ప్రాథమికంగా వారు వేటగాళ్ళుగా, చేపలు పట్టేవాళ్ళుగా జీవించారు దక్షిణ దేశంలో గుద్దళ్ళూ, కొడవళ్ళూ చాలా చోట్లలో లభించాయి కానీ కర్రు ఉన్న నాగళ్ళు మాత్రం లభించలేదు ఆ కాలానికి సంబంధించిన ఇనుప వస్తువుల్లో ఉలులూ, శీర్షాలూ, అమ్ములూ, పొడవైన కత్తులూ, బాకులూ, బల్లెపు మొనలూ మొదలైనవి ఉన్నాయి ఈ వస్తువులు ప్రధానంగా యుద్ధాలలో, వేటలో ఉపయోగపడేవి ఈ ఆధారాలు "సంగం" గ్రంథాలతో సమన్వయిస్తున్నాయి నిరంతరం యుద్ధాలూ, గోగ్రహణాలు జరుగుతూ ఉండినట్టుగా ఈ గ్రంథాలు చెబుతాయి యుద్ధకాలంలో చేసే దోపిడీలనుంచి లభించే ధనం ఒక ప్రధాన జీవనాధారమని కూడా ఈ గ్రంథాలు చెబుతాయి వీరులు మరణిస్తే వారు రాతి ముక్కలుగా మారిపోతారని ఈ గ్రంథాలు భావించాయి మెగాలిథిక్ సమాధుల్లో వర్తులాకారంలో పేర్చిన బండరాళ్ళు ఈ విషయాన్ని మనకు జ్ఞాపకం చేస్తాయి గోవుల కోసమూ, ఇతర వస్తువుల కోసమూ జరిగిన పోరాటాల్లో చనిపోయిన వారి జ్ఞాపకార్థం "వీరగల్లులు" చెక్కించే తరువాత కాలపు సంప్రదాయానికి ఇది దారి చూపి ఉండవచ్చు "సంగం" గ్రంథాలలో వర్ణించబడిన ఉన్నత సామాజిక దశ మెగాలిథిక్ సంస్కృతిలోని తొలి దశ కావచ్చు

"సంగం" గ్రంథాలు రాజ్య వ్యవస్థను గురించీ, అందులో యుద్ధవీరుల పటాలాలకున్న స్థానాన్ని గురించీ, పన్నుల విధానాన్ని గురించీ, అప్పుడప్పుడే ఉదయిస్తున్న న్యాయవ్యవస్థను గురించీ మనకో అభిప్రాయాన్నిస్తాయి అంతేకాకుండా వ్యాపారాన్ని గురించీ, వ్యాపారుల్ని గురించీ, చేతిపనుల వారిని గురించీ, రైతుల్ని గురించీ కూడా ఈ గ్రంథాలు చెబుతాయి అవి కంచి, కొర్కై, మధురై, పుహార్, ఉరయూర్ మొదలైన పట్టణాలను పేర్కొంటాయి వీటిలో పుహార్ (కావేరీపట్నం) అత్యంత ప్రధానమైన పట్టణంగా ఉండేది పట్టణాలను గురించీ, ఆర్థిక వ్యవహారాలను గురించీ "సంగం" గ్రంథాలు పేర్కొనే విషయాలను గ్రీక్, రోమన్

రికార్డులూ, సంగం యుగానికి చెందిన స్థలాల్లో జరిగిన తవ్వకాలూ ధ్రువపరుస్తాయి

"సంగం" గ్రంథాలలో చాలా భాగం, నీతి గ్రంథాలూ ప్రాకృత – సంస్కృత విద్వాంసులైన బ్రాహ్మణుల రచనలే నీతి గ్రంథాలు క్రీస్తుశకం తొలి శతాబ్దాలను గురించి తెలియజేస్తాయి రాజుకూ, రాజాస్థానంలోని వారికీ మాత్రమే కాకుండా ఇతర సామాజిక వర్గాలకూ, వృత్తులకూ చెందిన వారికి కూడా ఇవి ప్రవర్తనా నియమావళిని నిర్దేశిస్తాయి పల్లవుల కాలంలో – అంటే క్రీ శ 4 వ శతాబ్దం తరువాత – బ్రాహ్మణుల సంఖ్య బాగా పెరిగిన అనంతరం మాత్రమే ఇది సాధ్యమై ఉంటుంది ఈ గ్రంథాలు గ్రామ దానాలను గురించి పేర్కొంటాయి రాజులు అటు సూర్యవంశం నుంచో, ఇటు చంద్రవంశం నుంచో అవతరించినట్టుగా చెబుతాయి ఈ అలవాటు క్రీ శ 6 వ శతాబ్దం నుంచీ ఉత్తరభారతదేశంలో కూడా అలవాటులో కొచ్చింది

"సంగం" గ్రంథాలతోపాటు వ్యాకరణం, కావ్య శాస్త్రాలను గురించి చర్చించే "తొల్‌కాప్పియం" అన్న గ్రంథం కూడా ఉంది తత్వ శాస్త్రగ్రంథంగా, నీతి వాక్యాల సంపుటంగా ప్రసిద్ధి కెక్కిన "తిరుక్కురల్" ఉంది ఇవి కాకుండా "శిలప్పదికారం", "మణిమేఖలై" అన్న సుప్రసిద్ధ మహాకావ్యాలున్నాయి ఇవి దాదాపు క్రీ శ 6 వ శతాబ్దంలో రచించబడ్డాయి వీటిలో మొదటిది తమిళ సాహిత్యంలో మణిదీపం ఇందులో కోవలన్ అన్న రాజకుటుంబీకుడు తన ధర్మపత్ని కణ్ణగిని నిరాదరించి కావేరీ పట్టణానికి చెందిన మాధవి అన్న వేశ్య వ్యామోహంలో పడటం చిత్రించబడింది ఈ గ్రంథాన్ని రాసినకవి బహుశా జైనుడు కావచ్చు అతడు తన కథను అన్ని తమిళ రాజ్యాలలో నడుపుతాడు రెండవ కావ్యమైన "మణిమేఖలై"ని మధ చెందిన ఒక ధాన్యం వ్యాపారి రాశాడు కోవలన్‌కూ మా పుట్టిన కుమార్తె జీవితానుభవాలను ఈ కావ్యం చిత్రిస్తు ఈ మహాకావ్యంలో సాహిత్య ప్రభావం కంటే ప్రభావమే ఎక్కువగా కనిపిస్తుంది ఈ రెండు కావ అవతారికల్లోనూ కవులు తాము చేరరాజైన సెంగుట్ట సమకాలికులమనీ, స్నేహితులమనీ చెప్పుకున్నారు కానీ కావ్యాలను అంత ప్రాచీన కాలానికి తీసుకువెళ్ళటా వీలులేకపోయినా వీటిద్వారా క్రీ శ 6 వ శతా వరకూ తమిళుల సామాజిక, ఆర్థిక జీవితాన్ని గురి తెలుసుకోవచ్చుననటానికి సందేహం లేదు

క్రీస్తుశకం ప్రారంభం కావటానికి పూర్వమే తమిళు రాత తెలుసుననటానికి సందేహం లేదు మధురై ప్రాం లోని సహజమైన గుహల్లో బ్రాహ్మీ లిపిలో ఉన్న దాదా 75 చిన్న చిన్న శాసనాలు బయటపడ్డాయి వాటిలో మన ప్రాకృత పదాల కలగలిసిన అత్యంత ప్రాచీనమైన తమి కనిపిస్తుంది ఈ శాసనాలు క్రీ పూ రెండు – ఒక శతాబ్దాల కాలానికి చెందినవి ఆ కాలంలోనే జైన, బౌ మత ప్రచారకులు ఈ ప్రాంతాలకు వచ్చారు తమిళ భా ఉన్న కుండ పెంకులు ఈ లోగా తవ్వకాలలో లభించా క్రీస్తుశకం ప్రారంభంలో తమిళభాష ఎలాగుండేదో అ తెలియజేస్తాయి కాబట్టి "సంగం" సాహిత్యంలో ఎక్కు భాగం క్రీస్తు శకం తొలి శతాబ్దాలలో రచించబడింద చివరగా క్రీ శ 6 వ శతాబ్ద కాలంలో సంకలన చేయబడిందనీ భావించటంలో ఆశ్చర్యం లేదు

* * *

అధ్యాయం: 19

# మౌర్య యుగానంతరం పట్టణాల్లో చేతివృత్తులు, వ్యాపారం

## చేతివృత్తులు

ప్రాచీన భారతదేశంలో శకుల, కుషానుల, శాతవాహనుల యుగమూ (క్రీ పూ 200 – క్రీ శ 200), మొదటి తమిళ రాజ్యాల యుగమూ, చేతివృత్తులకూ, వ్యాపారానికీ స్వర్ణయుగాలు ఆ కాలంలో చేతివృత్తులూ, కళలూ గొప్ప అభివృద్ధిని సాధించాయి ఆ కాలానికి చెందిన గ్రంథాల్లో పేర్కొన్నంతమంది చేతివృత్తుల వారిని అంతకుపూర్వం ఏ గ్రంథమూ పేర్కొనలేదు మౌర్యయుగానికి పూర్వం వచ్చిన "దిఘనికాయం" అన్న గ్రంథం దాదాపు రెండు డజన్ల చేతివృత్తుల్ని పేర్కొంటుంది అదేకాలానికి చెందిన "మహావాస్తు" అన్న గ్రంథం రాజగృహంలో 36 వృత్తుల వాళ్ళు నివసిస్తున్నట్టుగా చెబుతుంది ఈ పట్టిక అసంపూర్ణంగా కూడా కనిపిస్తుంది "మిళిందపన్హ" (మిళిందుని ప్రశ్న) అన్న గ్రంథం 75 వృత్తుల్ని పేర్కొంటుంది వాటిలో 65 చేతివృత్తులు సాహిత్య గ్రంథాల ప్రకారం చేతివృత్తుల వారు ప్రధానంగా పట్టణాలలో నివసించేవారు కానీ వారు పల్లెల్లో కూడా నివసించినట్టుగా తవ్వకాలు నిరూపిస్తున్నాయి తెలంగాణాలోని కరీంనగర్‌లోని పల్లెల్లో వడ్రంగులూ, కమ్మరులూ, కంసాలులూ, కుమ్మరులూ మొదలైన చేతి వృత్తులవారు వేరువేరుగా నివసించే వారనీ, వ్యవసాయ కూలీలూ, ఇతర కూలీలూ మరొక వైపున నివసించేవారనీ అక్కడ జరిగిన తవ్వకాలు చెబుతున్నాయి

బంగారంతో, వెండితో, సీసంతో, తగరంతో, కంచుతో, ఇనుముతో పనిచేయటం, రత్నాల నగల్ని తయారు చేయటం ఎనిమిది విభిన్నమైన వృత్తులుగా ఉండేవి అనేక రకాలైన కంచునూ, తుత్తునాగాన్నీ, అంటిమొనీనీ, ఎర్ర ఆర్సెనిక్‌నూ కూడా వారు పేర్కొన్నారు ఈ ఆధారాలన్నీ కూడా లోహాలను తవ్వితీయటంలో, శుభ్రపరచటంలో వారు సాధించిన గొప్ప అభివృద్ధినీ, ప్రత్యేక పరిజ్ఞానాన్నీ సూచిస్తాయి ఇనుముతో పని చేయటంలో వారు గొప్ప సాంకేతిక పరిజ్ఞానాన్ని సాధించారు ఇనుముతో చేసిన కళాఖండాలు – కుషానుల, శాతవాహనుల కాలం నాటి స్థలాలలో జరిగిన తవ్వకాలలో పెద్ద సంఖ్యలో బయటపడ్డాయి ఈ విషయంలో ఆంధ్రదేశంలోని తెలంగాణా ప్రాంతం ఇతర ప్రాంతాలకంటే సంపన్నంగా ఉండేది ఈ ప్రాంతంలోని కరీంనగర్, నల్లగొండ జిల్లాలలో జరిగిన తవ్వకాలలో ఆయుధాలతోపాటు, తులాదండాలూ, రంధ్రం ఉన్న గొడ్డళ్ళూ, గుద్దళ్ళూ, కొడవళ్ళూ, నాగలికర్రులూ, క్షవరం చేసుకునే కత్తులూ, గరిటలూ కూడా లభించాయి భారతదేశం నుంచి ఇనుమూ, ఉక్కూ – ముఖ్యంగా భోజన సమయంలో ఉపయోగించే చెంచాలూ, బాకులూ మొదలైన వస్తువులు అబిసీనియా ఓడరేవులకు ఎగుమతి అయ్యేవి పశ్చిమ ఆసియాలో వాటికి చాలా గౌరవం కూడా ఉండేది

నూలుబట్టలూ, పట్టుబట్టలూ నేయటం, ఆయుధాలనూ, విలాస వస్తువులనూ తయారుచేయటం అనాడు కొనసాగేది "షతక" అన్న పేరుతో పిలువబడుతూ ఉండిన ఒక ప్రత్యేక రకమైన నూలు బట్టకు మధుర ప్రధానకేంద్రంగా ఉండేది కొన్ని దక్షిణ భారత పట్టణాల్లో రంగులు అద్దటం అభివృద్ధిలో ఉన్న పరిశ్రమగా ఉండేది తమిళనాడులోని తిరుచిరాపల్లి సమీపంలోని ఉరైయూర్‌లో ఇటుకలతో కట్టిన అద్దకం తొట్టి బయటపడింది అరికమేడులో కూడా ఇలాంటి తొట్లు బయటపడ్డాయి ఇవి క్రీ శ 1–3 శతాబ్దాలకు చెందినవి ఆ కాలంలో చేతి మగ్గాల పరిశ్రమ ఈ పట్టణాల్లో చాలా అభివృద్ధిలో ఉండేది నూనె గానుగ ఉపయోగంలోకి రాగానే నూనె ఉత్పత్తి బాగా పెరిగింది అనాటి శాసనాల్లో నేతగాళ్లను గురించీ, బంగారుపనివాళ్ళను గురించీ, అద్దకపు పనివాళ్ళను గురించీ, శిల్పులను గురించీ, చేపలు పట్టేవారిని

గురించీ, అత్తర్లు తయారు చేసేవారిని గురించీ ప్రస్తావనలు న్నాయి అత్తరు వర్తకులు బౌద్ధ భిక్షువులకు దానాలు చేశారనీ, గుహాలయాలను నిర్మించారనీ, స్తంభాలనూ, ఫలకాలనూ, నీటి కొళాయిలనూ దానం చేశారనీ కూడా ఈ శాసనాలు చెబుతాయి ఇవన్నీ కూడా చేతివృత్తులు ఉచ్ఛస్థితిలో ఉండేవనటానికి సూచనలు



విలాస వస్తువులను తయారుచేయటాన్ని గురించి ప్రస్తావించేటప్పుడు దంతంతోనూ, గాజుతోనూ వస్తువులను తయారు చేయటాన్నీ, పూసల్ని చేయటాన్ని గురించి తప్పకుండా చెప్పాలి అలాగే గవ్వలతో విలాస వస్తువుల్ని తయారు చేసే పరిశ్రమకూడా బాగా లాభదాయకంగా ఉండేది కుషానుల కేంద్రాలలో జరిగిన తవ్వకాలలో చేతితో తయారు చేసిన అనేక వస్తువులు బయటపడ్డాయి అఫ్ఘనిస్తాన్‌లోనూ, రోమ్‌లోనూ భారతదేశంలో తయారైన దంతం వస్తువులు లభించాయి ఈ వస్తువులు దక్కన్‌లోని శాతవాహన స్థలాలలో లభించిన దంతపు వస్తువులను పోలి ఉన్నాయి రోమ్‌లో తయారు చేసిన గాజు వస్తువులు తక్షశిలలోనూ, అఫ్ఘనిస్థాన్‌లోనూ లభించాయి కానీ గాజుకు సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం క్రీస్తుశకం ప్రారంభంలో భారతదేశానికి చేరుకొని, అత్యున్నతస్థాయిని అందుకుంది అలాగే తక్కువ విలువ కలిగిన రంగురాళ్ళతో (సెమీప్రెషస్ స్టోన్స్) చేసిన పూసలూ, గాజులూ చాలా పెద్ద మొత్తంలో మౌర్యయుగానంతరపు పొరలలో లభించాయి

నాణాలను ముద్రించటం ఆనాడు ఒక ప్రధానమైన కళ బంగారంతో, వెండితో, రాగితో, కంచుతో, సీసంతో, పోటిన్‌తో తయారు చేసిన అనేక రకాల నాణాలకు ఆ కాలం ప్రసిద్ధి చెందింది ఈ పనివారు రోమన్ నాణాలకు నకిలీ నాణాలను కూడా తయారు చేశారు ఉత్తర భారతదేశంలోనూ, దక్కన్‌లోనూ నాణాలను తయారు చేసే అచ్చులు లభించాయి శాతవాహనుల కాలానికి చెందిన ఒక అచ్చును పరిశీలిస్తే దాని సహాయంతో ఒకసారికి ఆరు నాణాలను ముద్రించ వచ్చని స్పష్టమౌతోంది నగరాలలోని చేతివృత్తులకు గ్రామాలలోని ఎర్ర మట్టి బొమ్మల పరిశ్రమ దోహదంగా ఉండేది అందమైన ఎర్రమట్టి బొమ్మలు అసంఖ్యాకంగా లభించాయి ఇలాంటి బొమ్మలు కుషానుల, శాతవాహనుల కేంద్రాలన్నిటిలో లభించాయి కానీ ఈ సందర్భంలో నల్లగొండ జిల్లా ఎల్లేశ్వరాన్ని ప్రత్యేకంగా పేర్కొనాలి అక్కడ అత్యధిక సంఖ్యలో ఎర్రమట్టి బొమ్మలతో బాటు, వాటిని తయారుచేయటానికి ఉపయోగించిన అచ్చులు కూడా బయటపడ్డాయి ఎర్రమట్టి బొమ్మలూ, అచ్చులూ హైదరాబాదుకు 65 కి మీ దూరంలో ఉన్న కొండాపురంలో కూడా బయటపడ్డాయి అవి పట్టణాలలో నివసించే ఉన్నత వర్గీయులకోసం ప్రధానంగా తయారు చేయబడేవి గుప్తులకాలంలోనూ, మరీ ముఖ్యంగా గుప్తుల అనంతర కాలంలోనూ పట్టణాలు పతనమైపోయాక ఎర్రమట్టి బొమ్మలు కూడా అదృశ్యమై పోయాయి

చేతి వృత్తుల కళాకారులు వృత్తి సంఘాలను కూడా ఏర్పరచుకునేవారు క్రీ శ 2 వ శతాబ్దంలో మహారాష్ట్రలో మత విషయాలు అంతగా తెలియని సాధారణ బౌద్ధులు భిక్షువులకు బట్టలూ, ఇతర అవసరాలు సమకూర్చటం కోసం వృత్తి సంఘాలలో డబ్బుల్ని కట్టేవారు అలాంటి వృత్తిసంఘాలు కుమ్మరులకూ, నూనె తీసేవారికీ, బట్టలు నేసేవారికీ వేరువేరుగా ఉండేవి అలాగే ఒక ముఖ్యుడు ప్రతిరోజూ వందమంది బ్రాహ్మణులకు అన్నదానం చేయటం కోసం తన నెలసరి ఆదాయంలోంచీ కొంత ధనాన్ని పిండి తయారుచేసే వారి సంఘానికి చెల్లించేవాడు ఆనాటి రికార్డుల్ని పరిశీలిస్తే అప్పటి చేతివృత్తుల కళాకారులు కనీసం రెండు డజన్ల వృత్తిసంఘాలను ఏర్పరచుకొని ఉండేవారని తెలుస్తుంది శాసనాధారాలను బట్టి చూస్తే ఎక్కువ మంది చేతివృత్తుల కళాకారులు మధురలోనూ, దక్కన్ పశ్చిమ భాగంలోనూ ఉండేవారని తెలుస్తుంది వారున్న ప్రాంతాలు పశ్చిమ తీరంలో ఉన్న ఓడ రేవులకు వెళ్ళేదారిలో ఉండేవి

ఈ కాలానికి చెందిన అత్యంత ప్రధానమైన ఆర్థిక పరిణామం, భారతదేశానికీ, తూర్పురోమన్ సామ్రాజ్య దేశాలకూ మధ్య అభివృద్ధి చెందిన వ్యాపార సంబంధాలు మొదట ఈ వ్యాపారంలో ఎక్కువ భాగం భూమార్గంగా సాగేది కానీ శకులూ, పార్థియన్లూ, కుషానులూ ఆ మార్గంలో సంచరించటం ప్రారంభించిన తరువాత భూమార్గంలో వ్యాపారం అసాధ్యమైపోయింది ఇది క్రీ పూ మొదటి శతాబ్దంలో జరిగింది ఇరానియన్ పార్థియన్లు భారతదేశం నుంచీ ఇనుము, ఉక్కు దిగుమతి చేసుకునేవారు కానీ ఇరాన్‌కు అవల ఉన్న దేశాలలో భారతదేశం వ్యాపారం చేయటానికి అడ్డుతగిలేవారు కాబట్టి క్రీ శ మొదటి శతాబ్దం నుంచీ భారతదేశం పశ్చిమ దేశాలతో వ్యాపారానికి ప్రధానంగా సముద్రమార్గాన్ని ఆశ్రయించవలసి వచ్చింది కాబట్టి నావికులు అరేబియా సముద్రం తూర్పుతీరం నుంచీ పశ్చిమ తీరానికి చాలా తక్కువ కాలంలో ప్రయాణం చేయగలిగేవారు క్రీస్తుశకం ప్రారంభకాలంలోనే రుతుపవనాలను కనుగొన్నారు కాబట్టి నావికులు పశ్చిమ తీరంలోని బరూచ్, సొపారా రేవుల్నీ, తూర్పు తీరంలోని అరికమేడు, తామ్రలిప్తి రేవుల్నీ చేరుకునేవారు వీటిలో బరూచ్ (గుజరాత్) రేవు ఇతర రేవులకంటే ఎక్కువ ప్రసిద్ధిలో ఉండేది ఆ రేవు గుండా ఎక్కువ వ్యాపారం సాగేది ఆ రేవుకు శాతవాహన రాజ్యంలో తయారైన వస్తువులు మాత్రమే కాకుండా శక, కుషాను రాజ్యాలలో తయారైన వస్తువులు కూడా వచ్చేవి శకులూ, కుషానులూ ఉత్తరాదినుంచీ పశ్చిమ తీరంలోని రేవుల్ని చేరుకోవటానికి రెండు మార్గాలను ఉపయోగించేవారు ఈ రెండు మార్గాలూ తక్షశిలలో కలిసేవి మధ్య ఆసియా గుండా వెళ్ళే "సిల్క్‌రూట్"లో కూడా కలిసేవి వీటిలో మొదటి




మార్గం ఉత్తరం నుంచీ బయలుదేరి దక్షిణానికి వస్తుంది అది తక్షశిలను సింధూనదీముఖ ద్వారంతో కలిపి బరూచ్ చేరుకుంటుంది రెండవ మార్గాన్ని "ఉత్తరాపథం" అనేవారు అది మొదటి మార్గంకంటే ఎక్కువ ఉపయోగంలో ఉండేది అది తక్షశిల వద్ద బయలుదేరి ఆధునిక పంజాబ్ గుండా ప్రయాణించి, యమున పశ్చిమ తీరాన్ని చేరుకునేది యమున వెంబడి సాగి మధురను చేరుకునేది మధురనుంచీ మాళ్వప్రాంతంలోని ఉజ్జయినిని చేరుకునేది ఉజ్జయిని నుంచి అరేబియా సముద్ర తీరంలోని బరూచ్‌ని చేరుకునేది అలహాబాద్ వద్ద ఉన్న కోశాంబీ నగరంనుంచి బయలుదేరే మరో మార్గంకూడా ఉజ్జయిని వద్ద కలిసేది

## విదేశ వ్యాపారం

భారత, రోమ్ దేశాలమధ్య జరిగిన వ్యాపారం గొప్ప స్థాయిలోనే జరిగింది. కానీ వ్యాపార వస్తువులు మాత్రం సామాన్య జనం వాడే నిత్యావసర వస్తువులు కాదు అది చురుగ్గా సాగిన విలాస వస్తువుల వ్యాపారం వాటిని "ఉన్నత వంశీయుల అవసరాలు" అని కూడా పిలిచేవారు రోమన్లు మొదట దక్షిణ దేశంలోని దక్షిణ ప్రాంతంలో ప్రారంభించారు వారి అత్యంత ప్రాచీన మైన నాణాలు శాతవాహనుల ప్రాబల్యం ఉన్న ప్రాంతానికి బయట తమిళ రాజ్యాలలో లభించాయి రోమన్లు ప్రధానంగా దక్షిణ భారతదేశంలో ప్రసిద్ధి పొందిన

సుగంధ ద్రవ్యాలను దిగుమతి చేసుకునేవారు వారు మస్లిన్ బట్టనూ, ముత్యాలనూ, విలువైన వజ్రాలనూ, నగలనూ మధ్య భారతదేశం నుంచీ, దక్షిణ భారతదేశం నుంచీ దిగుమతి చేసుకునేవారు ఇనుముతో చేసిన వస్తువులకు – ముఖ్యంగా భోజన సమయంలో ఉపయోగించే చెంచాలూ, చాకులూ మొదలైన వస్తువులకు ప్రత్యేక ప్రాధాన్యత ఉండేది ముత్యాలూ, దంతం వస్తువులూ, విలువైన వజ్రాలూ, కొన్ని జంతువులూ విలాస వస్తువులుగా ప్రత్యేక గౌరవాన్ని కలిగి ఉండేవి కొన్ని మొక్కలూ, ఆ మొక్కల ఆధారంగా జరిగే ఉత్పత్తులూ, మతకర్మలలోనూ, అంత్యక్రియలకు సంబంధించిన కర్మలలోనూ, మందులలోనూ ఉపయోగ



ఉస్మానాబాద్ జిల్లాలోని టెర్‌లో లభించిన ఎర్రమట్టి బొమ్మలు



నాగార్జునకొండలో స్టేడియం శిథిలాలు

పడేవి భోజన సమయంలో ఉపయోగించే ఇనుప వస్తువులు బహుశా ఉన్నత వర్గీయులకు అవసరమయ్యేవి

సరాసరి భారతదేశం నుంచీ ఎగుమతి చేసే వస్తువుల తోపాటు, మరికొన్ని వస్తువుల్ని చైనానుంచీ, మధ్య ఆసియా నుంచీ భారతదేశానికి దిగుమతి చేసుకొని, భారతదేశం నుంచీ రోమన్ సామ్రాజ్యానికి ఎగుమతి చేసేవారు పట్టుబట్టలు సరాసరి చైనా నుంచీ ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్ దేశాల గుండా వెళ్ళే "సిల్క్ రూట్" ద్వారా రోమన్ సామ్రాజ్యాన్ని చేరేవి కొంతకాలం తరువాత ఇరాన్‌లో పార్థియన్ సామ్రాజ్యం ప్రారంభమయ్యాక ఈ వ్యాపారానికి ఆటంకాలు ఏర్పడటం ప్రారంభమైంది కాబట్టి పట్టుబట్టలు కూడా పశ్చిమ భారత తీరంలోని ఓడరేవుల గుండా ఎగుమతి చేయవలసి వచ్చింది కొన్ని సందర్భాల్లో చైనా పట్టు భారత దేశాన్ని చేరుకొని, తూర్పుతీరంలోని రేవుల మీదుగా రోమన్ సామ్రాజ్యాన్ని చేరుకునేది అలా భారతదేశానికీ, రోమ్ సామ్రాజ్యానికీ మధ్య పట్టు వ్యాపారం బాగా సాగేది దీనికి బదులుగా రోమన్‌లు భారతదేశానికి వైన్‌లనూ, చెవులున్న వైన్ పాత్రలనూ, అనేక ఇతర రకాల పాత్రలనూ ఎగుమతి చేసేవారు అలాంటి పాత్రలు పశ్చిమబెంగాల్‌లోని తామ్‌లుక్‌లోనూ, పాండిచ్చేరి దగ్గరలో ఉన్న అరికమేడులోనూ, దక్షిణ భారతదేశంలో అనేక ఇతర చోట్లలోనూ జరిగిన తవ్వకాలలో బయటపడ్డాయి కొన్ని సందర్భాలలో ఈ పాత్రలు గౌహతి వరకూ కూడా వెళ్ళాయి శాతవాహనులు నాణాలను ముద్రించటం కోసం ఉపయోగించిన సీసంరేకు చుట్టలరూపంలో రోమ్‌నుంచీ దిగుమతి అయ్యేది రోమన్ వస్తువులు ఉత్తరభారతదేశంలో ఎక్కడా పెద్దసంఖ్యలో లభించలేదు కానీ కుషానుల కాలంలో వాయవ్య భారతదేశానికీ, రోమ్ సామ్రాజ్యంలోని తూర్పు దేశాలకూ మధ్య వ్యాపార సంబంధాలు వుండేవనటానికి ఎలాంటి సందేహమూ లేదు ఈ వ్యాపార సంబంధాలు క్రీ శ రెండవ శతాబ్దంలో ఉండేవి క్రీ శ 115లో రోమన్‌లు మెసపొటేమియాను జయించి తమ సామ్రాజ్యంలో కలుపుకోవటంచేత ఇది సాధ్యమైంది రోమన్ చక్రవర్తి ట్రాజన్ మస్కట్‌ను జయించటమే కాకుండా పర్షియన్ సింధుశాఖ ప్రాంతాన్ని బాగా పరిశీలించాడు ఈ విజయాలు, వ్యాపార సంబంధాల కారణంగా రోమన్ వస్తువులు ఆఫ్ఘనిస్థాన్‌కూ, వాయవ్య భారతదేశానికీ చేరాయి కాబూల్‌కు 72 కి మీ దూరంలో ఉన్న బెగ్రామ్ అన్నచోట జరిగిన తవ్వకాల్లో ఇటలీలో, ఈజిప్ట్‌లో పాలరాతితో చేసిన గిన్నెలూ, కంచుస్టాండులూ, ఉక్కు గజంబద్దలూ, పశ్చిమ దేశాల్లో ఉపయోగంలో ఉండిన తూనికలూ, గ్రీక్ – రోమన్ కాలానికి చెందిన చిన్న కంచువిగ్రహాలూ, అనేక ఇతర పాత్రలూ కూడా బయటపడ్డాయి ఈనాడు పాకిస్థాన్‌లో వాయవ్య పరగణాలోని శిర్‌కప్‌ను ప్రాచీన

తక్షశిలగా గుర్తించారు అక్కడ కంచుతో చేసిన చక్కని గ్రీక్ – రోమన్ విగ్రహాలు లభించాయి అక్కడ రోమన్ చక్రవర్తి టైబీరియస్ కాలానికి చెందిన నాణాలూ, వెండి నగలూ, కొన్ని కంచుపాత్రలూ, ఒక కూజా కూడా లభించాయి కానీ దక్షిణభారతదేశంలో చాలా చోట్లలో లభించిన అరిటైన్ పాత్రలు మధ్యభారతదేశంలో కానీ, పశ్చిమ భారతదేశంలో కానీ అఫ్ఘనిస్థాన్‌లోగానీ కనిపించ లేదు వింధ్య పర్వతాలకు దక్షిణంగా శాతవాహన రాజ్యంలోనూ, దక్షిణదేశంలోనూ ఎంతో ప్రజాదరణ పొందిన ఈ పశ్చిమదేశాల పాత్రలు ఆ ప్రాంతాలకు అందలేదన్నమాట అలా శాతవాహనులూ, కుషానులూ రోమన్ సామ్రాజ్యంతో వ్యాపారం చేసి గొప్పలాభాలను సంపాదించారు వీరిలో శాతవాహనులు అందరికంటే ఎక్కువ లాభాలను సంపాదించారని చెప్పవచ్చు

రోమన్‌లు భారతదేశానికి చేసిన అత్యంత ప్రధానమైన ఎగుమతి బంగారంతోనూ, వెండితోనూ చేసిన నాణాలు వీటి ఎగుమతి పెద్దసంఖ్యలో జరిగింది మొత్తం భారతదేశంలో అలాంటి నాణాలు 150 చోట్ల లభించాయి వీటిలో అత్యధిక శాతం వింధ్యపర్వతాలకు దక్షిణంగా లభించాయి కాబట్టి క్రీ శ 77లో రోమన్ రచయిత ప్లినీ తాను రాసిన "నాచురల్ హిస్టరీ" అన్న గ్రంథంలో చేసిన వ్యాఖ్య నిజమేననిపిస్తోంది భారతదేశంతో వ్యాపారం వల్ల రోమన్ సామ్రాజ్యం తన బంగారాన్ని పోగొట్టుకుంటోందని ప్లినీ భావించాడు క్రీ శ 22లోనే తూర్పు దేశాలనుంచీ మిరియాలు కొనటం మీద జరుగుతున్న అధిక వ్యయాన్ని గురించి అసంతృప్తి ఉండేది కొంతమంది పాశ్చాత్యులకు భారతదేశం నుంచీ వచ్చే మిరియాలంటే విపరీతమైన మోజు ఉండేది మిరియాలను సంస్కృతంలో "యవనప్రియ" అని పిలిచేవారు భారతదేశం నుంచీ ఉన్నత వర్గీయులు దిగుమతి చేసుకునే భోజనోపకరణాలకు (కట్లరీ) వ్యతిరేకంగా తీవ్రమైన ప్రతిస్పందన వచ్చింది బహుశా ఆ కాలపు ప్రజలకు వ్యాపార సమతౌల్యాన్ని (బాలన్స్ ఆఫ్ ట్రేడ్) గురించి ఏమీ తెలిసి ఉండక పోవచ్చు భారతదేశ దక్షిణభాగంలో పెద్ద సంఖ్యలో లభించిన నాణాలూ, పాత్రలూ – ఈ వ్యాపారంలో లబ్ధి పొందింది భారతదేశమేనని నిరూపిస్తున్నాయి రోమన్ సామ్రాజ్యం భారతదేశంతో వ్యాపారంలో ఎంతగా నష్టపోయిందంటే – రోమన్ ప్రభుత్వం భారతదేశం నుంచీ మిరియాలూ, భోజనోపకరణాలూ దిగుమతి చేసుకోవటాన్ని ఆపటానికి చర్యలు తీసుకోవలసి వచ్చింది

భారత – రోమన్ వ్యాపారంలోనూ, నౌకాయానంలోనూ రోమన్లదే ప్రధానపాత్ర రోమన్లు దక్షిణ భారతదేశంలో నివసించారు కానీ భారతీయులు రోమన్ సామ్రాజ్యంలో నివసించినట్టు ఆధారాలు లభించటం లేదు రోమన్ సామ్రాజ్యకాలంలో కొందరు తమిళ వ్యాపారులు ఈజిప్ట్‌లో నివసించినట్టుగా అక్కడ లభించిన పాత్రల ముక్కలూ, కుడ్యలేఖనాలూ తెలుపుతున్నాయి

రోమ్ నుంచీ వచ్చిన బంగారం, వెండి నాణాలు భారతీయులు ఎలా ఉపయోగించారు? సాధారణంగా రోమన్ నాణాలకు వాటిలోని లోహం ఆధారంగా విలువ కట్టేవారు కానీ పెద్ద పెద్ద లావాదేవీలలో వాటికి మారకం విలువ ఉండి ఉండవచ్చు ఉత్తర భారతదేశంలో ఇండో – గ్రీక్ రాజులు కొన్ని బంగారు నాణాలను ముద్రించారు కానీ కుషానులు బంగారు నాణాలను పెద్దసంఖ్యలో ముద్రించారు కుషానులు బంగారునాణాలన్నీ రోమన్ బంగారంతో ముద్రించినవని భావించటం పొరపాటు అభిప్రాయం మాత్రమే క్రీ పూ 5 వ శతాబ్దంలోనే భారతదేశం ఇరానియన్ సామ్రాజ్యానికి 320 టాలెంట్ల బంగారాన్ని కప్పంగా చెల్లించింది ఈ బంగారాన్ని బహుశా సింధులోని బంగారు గనులనుంచీ త్వవ్వి తీసి ఉండవచ్చు కుషానులు మధ్య ఆసియా ప్రాంతం నుంచీ బంగారాన్ని సంపాదించి ఉండవచ్చు లేదా కర్ణాటక నుంచీ కానీ తరువాతి కాలంలో తమ అధికార పరిధిలోకి వచ్చిన దక్షిణ బీహార్‌లోని దాల్ భూం బంగారు గనులనుంచీ కానీ వారు బంగారాన్ని సంపాదించి ఉండవచ్చు రోమన్‌లతో ఉన్న సంబంధాల ప్రభావం వల్ల కుషానులు 'దీనార్'ల వంటి బంగారు నాణాలను ముద్రించారు వీటి సంఖ్య గుప్తుల కాలంలో బాగా పెరిగింది కానీ బంగారు నాణాలను సాధారణ రోజువారీ లావాదేవీలలో ఉపయోగించినట్టు లేదు అందుకోసం సీసపు నాణాలుండేవి ఆంధ్రలో సీసము, రాగి నిక్షేపాలు కనిపించాయి దక్కన్‌లో ఆంధ్రులు పెద్దసంఖ్యలో సీసమూ, పోటిన్ నాణాలను పెద్ద మొత్తంలో ముద్రించారు కన్యాకుమారి అగ్రం ప్రాంతంలో కొన్ని విద్ధాంక నాణాలూ, మరికొన్ని సంగం కాలపు నాణాలూ లభించాయి ఉత్తర భారతదేశంలోనూ, ఈశాన్య భారతదేశంలోనూ రాగి నాణాలను అత్యధిక సంఖ్యలో ముద్రించిన వారు కుషానులే స్థానిక రాజులైన నాగులు మొదలైనవారుకూడా పెద్ద మొత్తంలో రాగి, కంచు నాణాలను ముద్రించారు వీరు మధ్యభారతదేశాన్ని పరిపాలించారు వీరుకాక తూర్పు రాజస్థాన్, దానికి అనుకొని ఉన్న పంజాబ్, హర్యానా ప్రాంతాలను పాలించిన యౌధేయులూ; కౌశాంబీ, మధుర, అవంతి, అహిచ్ఛత్ర (ఉత్తరప్రదేశ్‌లోని బరైలీజిల్లా) ప్రాంతాలను పరిపాలించిన మిత్రులు కూడా రాగి, కంచునాణాలను ముద్రించారు అవాటిలాగా అంతవరకూ మరేనాడూ కూడా ద్రవ్య ఆర్థిక విధానం పట్టణప్రజాజీవితంలోకి అంతగా చొచ్చుకొని పోలేదు రోమ్ సామ్రాజ్యంతో అభివృద్ధి చెందుతున్న వ్యాపారంతో ఆనాడు కళలూ, చేతివృత్తులూ చేయి చేయి కలిపి అభివృద్ధి చెందాయి

## నగరాలు

చేతివృత్తులు, వ్యాపారం అభివృద్ధి చెందటం, ద్రవ్య ఆర్థిక విధానం విస్తరించటం ఆ కాలంలో అనేక నగరాలు ఆర్థికంగా అభివృద్ధి చెందటానికి కారణభూతమయ్యాయి అనాటి సాహిత్య గ్రంథాలలో ఉత్తర భారతదేశంలోని వైశాలీ, పాటలీపుత్రం, వారణాసి, కౌశాంబి, శ్రావస్తి, హస్తినాపురం, మధుర, ఇంద్రప్రస్థం (ఢిల్లీలోని పురానాఖిల్లా ప్రాంతం) మొదలైన నగరాలు పేర్కొన బడ్డాయి వీటిలో కొన్ని నగరాలను చైనా యాత్రికులు కూడా వర్ణించారు క్రీ శ మొదటి రెండు శతాబ్దాల్లో కుషానులకాలంలో ఈ నగరాల్లో ఎక్కువభాగం ఉన్నత స్థితిలో ఉన్నాయి ఈ విషయాన్ని తవ్వకాలలో లభించిన సాక్ష్యాల ఆధారంగా చెప్పవచ్చు కుషానుల కాలంలోనే ఈ నగరాల్లో మెరుగైన కట్టడాలు బయట పడ్డాయి కుషానుల పరిపాలనా కాలంలో బీహార్‌లోని చిరండ్, సోన్‌పూర్, బక్సార్, తూర్పు ఉత్తరప్రదేశ్‌లోని ఖౌరత్, మాసన్ మొదలైన పట్టణాలు ఉన్నతదశలో ఉండినట్టుగా కూడా తవ్వకాలు నిరూపిస్తున్నాయి అలాగే ఉత్తరప్రదేశ్‌లోని సోహ్‌గౌరా, భీటా, కౌశాంబీ, అలహాబాద్ సమీపంలోని శృంగవేరపూర్, అత్రంజిఖేరా, మీరట్, ముజఫర్‌పూర్‌లోని అనేక ప్రాంతాలు కూడా సంపదలతో తులతూగుతుండేవి మధుర సమీపంలోని సోంక్‌లో జరిగిన తవ్వకాలు కుషానులకు సంబంధించిన ఏడు పొరలనూ, గుప్తుల కాలానికి సంబంధించిన ఒకే ఒక పొరనూ బయటికి తీసుకువచ్చాయి అలాగే పంజాబులోని జలంధర్, లూధియానా, రోపర్‌లలో కూడా కుషానుల కాలంనాటి చక్కని నిర్మాణాలు బయటపడ్డాయి హర్యానాలో కూడా ఇలాంటి సాక్ష్యాధారాలే లభించాయి అనేక స్థలాలలో కుషానుల కాలం నాటి ఇటుకలతో గుప్తుల కాలంలో నిర్మించిన తక్కువ రకం నిర్మాణాలు బయట పడ్డాయి మొత్తం మీద కుషానుల కాలంలో నగరీకరణం అత్యున్నతస్థాయికి చేరుకున్నట్టుగా నిరూపించబడుతూ ఉంది పశ్చిమ భారతదేశంలోని మాళ్వ ప్రాంతాన్ని పరిపాలించిన శకుల నగరాల పరిస్థితి కూడా ఇలాగే ఉండేది వారి నగరాల్లో ప్రధానమైంది ఉజ్జయిని ఉత్తర భారతదేశంలోని కౌశాంబి నుంచీ, మధురనుంచీ పశ్చిమ తీరప్రాంతానికి వచ్చే రెండు దారులూ ఉజ్జయినిలో కలవటంచేత ఆ నగరానికి అంత ప్రాముఖ్యత వచ్చింది దానికితోడు ఉజ్జయిని విలువ కలిగిన అగేట్, కార్నీలియన్ రాళ్ళ వ్యాపారానికి కేంద్రంగా కూడా ఉండేది క్రీ పూ 200 కాలం నుంచీ కూడా ఇక్కడ అగేట్, కార్నీలియన్, జాస్పర్ రాళ్ళతో పూసల్ని తయారు చేసేవారని ఈ ప్రాంతంలో జరిగిన తవ్వకాలు నిరూపిస్తున్నాయి సిప్రానదీగర్భంలో పుష్కలంగా ముడిసరుకు లభించటం చేత ఈ పరిశ్రమ అంత గొప్పగా వర్ధిల్లటానికి వీలు కలిగింది

శకుల, కుషానుల యుగంలో లాగే శాతవాహనుల యుగంలోనూ నగరాలు చాలా అభివృద్ధి చెందాయి టగర (తెర్), పైఠాన్, ధాన్యకటకం, అమరావతి, నాగార్జునకొండ, బరూచ్, సోపారా, అరికమేడు, కావేరీపట్నం – దక్షిణ, పశ్చిమ భారతదేశ ప్రాంతాల్లో శాతవాహనుల కాలంలో ప్రసిద్ధ పట్టణాలుగా ఉండేవి శాతవాహనుల కాలంనాటి అనేక పట్టణాలు తెలంగాణా ప్రాంతంలో జరిగిన తవ్వకాలలో బయటపడ్డాయి రోమన్ చరిత్రకారుడు ప్లినీ శాతవాహనుల కాలంలో కోటగోడలున్న పట్టణాలు 30 ఉన్నాయని పేర్కొన్నాడు వాటిలో కొన్ని తెలంగాణాలో బయటపడ్డ పట్టణాలు కావచ్చు ఈ పట్టణాలు కోస్తాజిల్లాల్లోని పట్టణాలకంటే ముందుగానే అవతరించాయి కానీ మహారాష్ట్ర పశ్చిమ ప్రాంతంలోని పట్టణాలు అవతరించిన కొంతకాలం తరువాత ఈ పట్టణాలు అవతరించాయి క్రీ శ 3 వ శతాబ్దంలోనో, ఆ తరువాతనో మహారాష్ట్ర, ఆంధ్ర, తమిళనాడు ప్రాంతాలలో పట్టణాల పతనం ప్రారంభమైంది

కుషానుల కాలంలోనూ, శాతవాహనుల కాలంలోనూ పట్టణాలు అభివృద్ధి చెందటానికి కారణం – వారు రోమన్ సామ్రాజ్యంతో లాభసాటి వ్యాపారాన్ని కొనసాగించటమే భారతదేశం రోమన్ సామ్రాజ్యంలోని తూర్పు ప్రాంతంతోనూ, మధ్య ఆసియాతోనూ వ్యాపారాన్ని నెరపింది కుషానుల రాజ్యాధికార కేంద్రం వాయవ్య భారతదేశంలో ఉండటంచేత పంజాబ్‌లోనూ, పశ్చిమ ఉత్తరప్రదేశ్‌లోనూ పట్టణాలు అభివృద్ధిచెందాయి కుషానుల పట్టణాలలో చాలాభాగం వాయవ్య భారతదేశప్రాంతంలో కానీ, మధుర నుంచీ తక్షశిలకు వెళ్ళే "ఉత్తరాపథం" వెంబడికానీ ఉన్నాయి కుషాను రాజులు ఈ రహదారికి భద్రతను కల్పించేవారు క్రీ శ 3 వ శతాబ్దంలో కుషాను సామ్రాజ్యం పతనం కావటంతో ఈ పట్టణాలు దెబ్బతిన్నాయి దక్కన్‌లో కూడా ఇలాగే జరిగింది రోమన్ సామ్రాజ్యం భారత దేశ వ్యాపారం మీద నిషేధాన్ని విధించటంతో పట్టణాలు చేతివృత్తుల వారినీ, వ్యాపారులనూ భరించలేకపోయాయి శాతవాహనుల తరువాత దక్కన్‌లో కూడా పట్టణ నాగరికత పతనమైనట్టుగా పురాతత్వ తవ్వకాలలో లభించిన ఆధారాలు నిరూపిస్తున్నాయి

★ ★ ★

# అధ్యాయం: 20

# గుప్తసామ్రాజ్య ప్రారంభం, అభివృద్ధి

## నేపథ్యం

మౌర్యసామ్రాజ్యం శిథిలమైపోయిన తరువాత కుషానులూ, శాతవాహనులూ బలమైన రాజకీయ శక్తులుగా అభివృద్ధి చెందారు శాతవాహనులు దక్కన్‌లోనూ, దక్షిణ దేశంలోనూ స్థిరత్వాన్ని కల్పించారు రాజకీయ ఐక్యతను సాధించారు వీటికి రోమ్‌తో వారు సాగించిన లాభసాటి వ్యాపారమే కారణం కుషానులు ఉత్తర భారతదేశంలో ఇలాంటి పాత్రనే నిర్వహించారు ఈ రెండు సామ్రాజ్యాలూ కూడా క్రీ శ 3 వ శతాబ్దం మధ్యభాగంలో పతనమైపోయాయి

కుషాను సామ్రాజ్య శిథిలాలలో నుంచి ఒక కొత్త సామ్రాజ్యం ఉద్భవించింది అది కుషాను, శాతవాహన సామ్రాజ్యాలలో అధిక భాగానికి విస్తరించింది అదే గుప్త సామ్రాజ్యం వీరు వైశ్యవర్ణానికి చెందినవారు కావచ్చు గుప్త సామ్రాజ్యం మౌర్యసామ్రాజ్యమంత పెద్దది కాకపోయినా క్రీ శ 335 నుంచీ 455 వరకూ ఉత్తర భారతదేశాన్ని రాజకీయంగా ఐక్యంగా ఉంచగలిగింది క్రీ పూ 3 వ శతాబ్దం చివర గుప్తుల సామ్రాజ్యం ప్రాథమికంగా ఉత్తరప్రదేశ్, బీహార్‌లకు మాత్రమే పరిమితంగా ఉండేది గుప్తుల తొలినాణాలూ, శాసనాలూ ఉత్తరప్రదేశ్‌లోనే లభించాయి కాబట్టి గుప్తులకు బీహార్ కంటే ఉత్తరప్రదేశ్ ముఖ్యమైన రాజ్యభాగంగా ఉండి ఉండవచ్చు కాబట్టి గుప్తులు ఉత్తరప్రదేశ్ నుంచీ వివిధ దిశలకు విస్తరించి ఉండవచ్చు బహుశా వారి అధికారకేంద్రం ప్రయాగ కావచ్చు అక్కడినుంచీ వారు పరిసరప్రాంతాలకు విస్తరించి ఉండవచ్చు

బహుశా గుప్తులు ఉత్తరప్రదేశ్‌లో కుషానుల సామంత రాజులు కావచ్చు ఎక్కువ వ్యవధి లేకుండా కుషానుల పతనం తరువాత వీరు అధికారానికి వచ్చారు ఉత్తరప్రదేశ్‌లోనూ, బీహార్‌లోనూ కుషానుల అవశేషాల తరువాత వెంటనే గుప్తుల అవశేషాలు లభిస్తున్నాయి బహుశా కుషానుల వద్దనుంచీ గుప్తులు గుర్రపు జీనునూ, కళ్ళాలనూ, బొత్తాములున్న కోట్లనూ, పంట్లాములనూ, బూట్లనూ ఉపయోగించటం నేర్చుకొని ఉండవచ్చు వీటివల్ల వారు గొప్ప గుర్రపురౌతులయ్యారు వారి వేగం బాగా పెరిగింది కుషానుల ఆలోచన ప్రకారం ఏనుగులూ, రథాలూ తమ పూర్వప్రాధాన్యతను కోల్పోయాయి గుప్తులు కూడా అలాగే భావించారు వారి నాణాల మీద గుర్రాల మీదున్న రౌతుల్ని ముద్రించారు కొందరు గుప్త రాజులు అసామాన్యమైన రథయోధులుగా వర్ణించబడినా వారి ప్రధాన బలం ఆశ్వికదళమే

గుప్తులకు కొన్ని అదనపు భౌతిక సౌకర్యాలుండేవి వారి కార్యస్థానం సారవంతమైన "మధ్యదేశం"లో – అంటే ఉత్తర ప్రదేశ్ – బీహార్ ప్రాంతంలో ఉండేది వారు బీహారులోనూ, మధ్యభారతదేశంలోనూ లభించే ఇనుమును ఉపయోగించుకోగలిగారు రోమన్ సామ్రాజ్య తూర్పు ప్రాంతంతోనూ, బైజాంటిక్ సామ్రాజ్యంతోనూ పట్టు వ్యాపారాన్ని కొనసాగిస్తూ ఉండిన ఉత్తరభారతదేశ ప్రాంతాలను బాగా ఉపయోగించుకోగలిగారు ఈ కారణాల వల్ల గుప్తులు "అనుగంగా" ప్రాంతం (మధ్యగంగా మైదానం)లోనూ, ప్రయాగ (ఆధునిక అలహాబాద్)లోనూ, సాకేత (ఆధునిక అయోధ్య)లోనూ తమ పరిపాలనను స్థాపించ గలిగారు అనతికాలంలోనే గుప్త సామ్రాజ్యం భారతీయ సామ్రాజ్యంగా విస్తరించింది క్రీ శ 230లో ఉత్తరభారతదేశంలో కుషానుల సామ్రాజ్యం పతనం కావటంతో మధ్యభారతదేశంలో ఎక్కువభాగం మురుందుల పరిపాలన కిందకి వచ్చింది బహుశా వీరు కుషానుల రక్తసంబంధీకులు కావచ్చు వీరు క్రీ శ 250 వరకూ పరిపాలించారు ఆ తరువాత సుమారు క్రీ శ 275 ప్రాంతంలో గుప్తులు అధికారానికి వచ్చారు

గుప్త వంశంలో మొదటి ముఖ్యమైన రాజు మొదటి చంద్రగుప్తుడు అతడు తన బలాన్ని పెంచుకోవటంకోసం (బహుశా) నేపాల్‌కు చెందిన లిచ్ఛవుల రాజకుమార్తెను వివాహం చేసుకున్నాడు గుప్తులు వైశ్యులు కావటంచేత

క్షత్రియ రాజకుమార్తెను వివాహం చేసుకోవటం అతని ప్రతిష్ఠను పెంచింది క్రీ శ 319-20లో గుప్తశకాన్ని ప్రారంభించటంచేత మొదటి చంద్రగుప్తుడు ఒక ప్రధానమైన రాజన్న విషయం స్పష్టమౌతోంది ఆ తరువాత అనేక శాసనాలు గుప్త యుగాన్నే లెక్కలోకి తీసుకున్నాయి

## సముద్రగుప్తుడు (క్రీ శ 335-380)

మొదటి చంద్రగుప్తుని కుమారుడైన సముద్రగుప్తుడు గుప్త సామ్రాజ్యాన్ని గొప్పగా విస్తరింప జేశాడు అతడు అశోకునికి భిన్నమైనవాడు అశోకుడు శాంతినీ, శాంతియుత సహజీవనాన్నీ నమ్మినవాడు కానీ సముద్రగుప్తుడు హింసనూ, దురాక్రమణనూ ప్రేమించినవాడు అతని ఆస్థానకవి హరిసేనుడు తన ప్రభువు సైనిక విజయాలను గురించి చాలా గొప్పగా రాశాడు తాను రాసిన సుదీర్ఘమైన ప్రస్తుతిలో హరిసేనుడు – సముద్రగుప్తుడు ఏయే దేశాలనూ, ప్రజలనూ జయించాడో వివరింగా చెప్పాడు ఈ శాసనం అలహాబాద్ సమీపంలో శాంతికాముకుడైన అశోకుని శాసనం చెక్కబడి ఉన్న రాతిమీదే చెక్కబడింది సముద్రగుప్తుడు జయించిన రాజ్యాలను ఐదు రకాలుగా విభజించవచ్చు మొదటి రకం గంగా–యమునా పరీవాహక ప్రాంతంలోని రాజులు సముద్రగుప్తుడు వీరిని ఓడించి, వీరి రాజ్యాలను తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు రెండవ రకం హిమాలయప్రాంతంలోనూ, గుప్త సామ్రాజ్యం సరిహద్దులో ఉన్న నేపాల్, బెంగాల్, అస్సాం ప్రాంతాల రాజులు వీరు సముద్ర గుప్తుని అధికారాన్ని గుర్తించవలసి వచ్చింది వీటితోపాటు పంజాబు ప్రాంతంలో ఉండిన కొన్ని స్వతంత్ర రాజ్యాలు కూడా సముద్రగుప్తునికి దాసోహం అనవలసివచ్చింది ఈ రాజ్యాలు మౌర్య సామ్రాజ్య శిథిలాల మీద మినుకు మినుకుమంటూ ఉండేవి వీటిని చివరగా సముద్రగుప్తుడు కబళించాడు మూడవ రకం వింధ్యపర్వత ప్రాంతంలోని "ఆటవిక రాజ్యాలు" వీటిని సముద్రగుప్తుడు తన అధీనంలోకి తీసుకున్నాడు నాలుగవ రకం దక్కన్ పీఠభూమి తూర్పు, దక్షిణ ప్రాంతాల్లో ఉండిన పన్నెండు రాజ్యాలు సముద్రగుప్తుడు తన హస్తాలను కంచి వరకూ సాచాడు కంచి పల్లవులు సముద్రగుప్తుని సార్వభౌమత్వాన్ని అంగీకరించక తప్పలేదు ఐదవరకం వారు శకులు, కుషానులు, వీరిలో కొందరు అఫ్ఘనిస్థాన్‌లో పరిపాలన కొనసాగిస్తున్నారు సముద్రగుప్తుడు వారిని పదవులనుంచి తొలగించాడు అతని అధికారానికి సుదూర ప్రాంతాలు కూడా తల వంచాయి ఒక చైనీస్ కథనం ప్రకారం శ్రీలంక రాజైన మేఘవర్మ గయలో ఒక బౌద్ధ దేవాలయాన్ని నిర్మించుకోవటానికి అనుమతి కోరుతూ ఒక రాయబారిని పంపాడు ఆ అనుమతి ఇవ్వబడింది ఆ దేవాలయం గొప్ప బౌద్ధ ఆరామంగా కాలక్రమాన అభివృద్ధి చెందింది అలహాబాద్ ప్రస్తుతిని నమ్మేటట్టయితే సముద్రగుప్తునికి పరాజయం లేదు ధైర్య సాహసాల కారణంగానూ, సైనిక నాయకత్వ కారణంగానూ సముద్రగుప్తుణ్ణి భారతదేశపు నెపోలియన్ అంటారు అతడు భారతదేశంలో విశాలమైన ప్రాంతాన్ని బలవంతంగా ఐక్యం చేశాడనటానికి సందేహం లేదు అంతేకాదు, అతని బలప్రభావం అతని సామ్రాజ్యానికంటే ఎక్కువ ప్రాంతంలో ఉండేది

## రెండవ చంద్రగుప్తుడు (క్రీ శ 380-412)

రెండవ చంద్రగుప్తుని కాలంలో గుప్తసామ్రాజ్యం అత్యున్నతస్థితికి చేరుకుంది అతడు యుద్ధాలతోనూ, వివాహ



సముద్రగుప్తుని అలహాబాద్ స్థంభ శాసనం (30, 31, 33 పంక్తులు)

తెలుగు అనువాదం

"అతని ఔదార్యం, పరాక్రమం, మత గ్రంథాల అధ్యయనం అతని కీర్తిని ఉన్నతోన్నతం చేశాయి అవి అనేక మార్గాలలో ప్రయాణించి ముల్లోకాలనూ పునీతం చేశాయి శివుని జటాజూటం నుంచీ వెలువడిన గంగాజలం లాంటిది అతని కీర్తి"




సంబంధాలతోనూ తన సామ్రాజ్యాన్ని విస్తరింప జేశాడు చంద్రగుప్తుడు తన కుమార్తె ప్రభావతిని మధ్య భారతదేశాన్ని పరిపాలిస్తూ ఉండిన వాకాటక రాజుకిచ్చి వివాహం చేశాడు అతడు బ్రాహ్మణుడు అతడు చనిపోవటంతో చిన్న వయసులో ఉన్న అతని కొడుకు రాజయ్యాడు వాస్తవానికి రాజ్యాధికారమంతా ప్రభావతి చేతికి వచ్చింది ప్రభావతి

వేయించిన దాన శాసనాల్లో ఆవిడ తన తండ్రి చంద్రగుప్తునికి మద్దతు ఇస్తున్నట్టుగా స్పష్టంగా అర్థమౌతుంది అలా చంద్రగుప్తుడు వాకాటక రాజ్యం మీద పరోక్షమైన అధికారాన్ని సంపాదించాడు అది అతనికి గొప్ప అనుకూలతగా పరిణమించింది వాకాటక రాజ్యంలో తనకున్న పలుకుబడిని ఆధారం చేసుకొని చంద్రగుప్తుడు పశ్చిమ మాళ్వ, గుజరాత్ రాజ్యాలను జయించాడు ఆ రాజ్యాలను శక, క్షాత్రపులు నాలుగు శతాబ్దాలుగా పరిపాలిస్తూ ఉండేవారు ఈ విజయంతో అతనికి పశ్చిమ సముద్రతీరం మీద ఆధిపత్యం లభించింది మాళ్వ దేశపు సంపద – ముఖ్యంగా ఉజ్జయిని సంపద – బాగా అభివృద్ధి చెందింది రెండవ చంద్రగుప్తుడు ఉజ్జయినిని రెండవ రాజధానిగా చేసినట్టుగా అనిపిస్తోంది

ఢిల్లీలోని కుతుబ్ మినార్ ప్రాంతంలోని ఒక ఇనుప స్థంభం మీద "చంద్ర" అన్న రాజు సాధించిన విజయాలు చెక్కబడ్డాయి "చంద్ర" రెండవ చంద్రగుప్తుడే అయితే



మొదటి చంద్రగుప్తుడు, సముద్రగుప్తుడు, రెండవ చంద్రగుప్తుడు ముద్రించిన నాణాలు

అతడు గుప్త సామ్రాజ్యాన్ని వాయవ్య భారతదేశానికీ, బెంగాలుకూ కూడా విస్తరింపచేశాడు బెంగాల్‌లోని చాలా భాగాన్ని ఆక్రమించుకున్నాడు కానీ ఈ ప్రస్తుతి శాసనం అతిశయోక్తి అని భావించవలసి వస్తోంది

రెండవ చంద్రగుప్తుడు "విక్రమాదిత్యుడు" అన్న బిరుదాన్ని స్వీకరించాడు పశ్చిమ భారతదేశంలోని శకక్షాత్రపులను ఓడించినందుకు చిహ్నంగా క్రీ పూ 57లో ఒక ఉజ్జయిని రాజు మొదటిసారిగా ఈ బిరుదాన్ని ఉపయోగించాడు రెండవ చంద్రగుప్తుని ఉజ్జయిని ఆస్థానంలో కాళిదాసు, అమరసింహుడు మొదలైన చాలామంది కవి పండితులు ఉండేవారు చంద్రగుప్తుని కాలంలోనే చైనా యాత్రికుడు ఫాహియాన్ (క్రీ శ 399–414) భారతదేశానికి వచ్చి, ఈ దేశాన్ని గురించీ, భారతీయుల్ని గురించీ విస్తృతంగా రాశాడు

## సామ్రాజ్య పతనం

క్రీ శ 5 వ శతాబ్దంలో రెండవ చంద్రగుప్తుని వారసులు మధ్యఆసియా నుంచీ వచ్చిన హూణుల దాడిని ఎదుర్కోవలసి వచ్చింది స్కందగుప్తుడు వారి దాడిని కొంతకాలం నిరోధించ గలిగాడు కానీ అతని తరువాతి రాజులు బలహీనులు కావటంచేత ఆ పని చేయలేకపోయారు హూణులు గొప్ప నైపుణ్యం కల అశ్వికులు బహుశా వారు లోహంతో చేసిన రికాబుల్ని కూడా ఉపయోగించి ఉండవచ్చు వారు చాలా వేగంగా ప్రయాణించ గలిగేవారు వారు గొప్ప ధానుష్కులు కూడా కావటం చేత ఇరాన్‌లోనూ, భారతదేశంలోనూ గొప్ప విజయాలను సాధించారు

క్రీ శ 485 ప్రాంతానికి హూణులు మాళ్వరాజ్యాన్నీ, మధ్యభారతదేశంలో ఎక్కువ భాగాన్నీ జయించ గలిగారు ఆ ప్రాంతాలలో వారి శాసనాలు కూడా లభించాయి ఆ తరువాత రాజస్థాన్, పంజాబ్ ప్రాంతాలు కూడా వారికి దాసోహమన్నాయి క్రీ శ 6 వ శతాబ్దం వచ్చేసరికి గుప్త సామ్రాజ్యం బాగా కుంచించుక పోయింది మాళ్వ రాజైన యశోధర్మ హూణుల దాడిని ఎదుర్కొని వారి రాజ్యాన్ని కూలదోసేశాడు కానీ దానివల్ల గుప్తులకు జరిగిన ఉపకారం ఏమీ లేదు యశోధర్మ గుప్తులను కూడా ఎదుర్కొని, క్రీ శ 532లో తన విజయానికి చిహ్నంగా దాదాపు ఉత్తరభారతదేశమంతా జయస్థంభాలను నాటించాడు యశోధర్మ పరిపాలనాకాలం చాలా తక్కువే అయినా, అది గుప్త సామ్రాజ్యం మీద పెద్ద దెబ్బతీసింది

చిన్నచిన్న స్వతంత్ర రాజ్యాలు అవతరించటం కూడా గుప్త సామ్రాజ్యం పతనానికి కారణభూతమైంది బెంగాల్ ఉత్తరభాగంలోని గవర్నర్లూ, ఆగ్నేయభాగంలోని సామంతులూ

స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు మగధకు చెందిన చివరి గుప్త రాజులు బీహార్‌లో తమ అధికారాన్ని స్థాపించుకోగలిగారు కానీ వీరితోపాటు కనోజ్ రాజధానిగా ముఖారి రాజులు కూడా ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో తమ రాజ్యాన్ని స్థాపించుకున్నారు అలా క్రీ శ 550 ప్రాంతానికి ఉత్తరప్రదేశ్, బీహార్ గుప్తుల చేయి జారిపోయాయి అరవ శతాబ్దం ప్రారంభంలోనే మధ్యప్రదేశ్ ఉత్తరభాగంలో కొందరు స్వతంత్రరాజులు భూదాన శాసనాలు వేశారు కానీ వారు తమ శాసనాలలో కాలక్రమాన్ని లెక్కించటానికి గుప్తయుగాన్నే ఉపయోగించారు గుజరాత్‌లోనూ, పశ్చిమ మాళ్వ ప్రాంతంలోనూ వలభీ రాజులు తమ అధికారాన్ని స్థాపించుకున్నారు స్కందగుప్తుని పరిపాలనా కాలం తరువాత – అంటే క్రీ శ 467 తరువాత మాళ్వలోనూ, సౌరాష్ట్రలోనూ గుప్తుల నాణాలు కానీ, శాసనాలు కానీ కనిపించవు తమ సామ్రాజ్యంలోనుంచీ పశ్చిమ భారతదేశం దూరమైపోవటంచేత (క్రీ శ 5 వ శతాబ్దం తరువాత) గుప్తులకు వ్యాపారం మీద వస్తూ ఉండిన పెద్ద ఆదాయం తప్పకుండా ఆగిపోయి ఉండాలి అందుచేత వారి ఆర్థిక వ్యవస్థ కుంటుపడిపోయి ఉండాలి ఉత్తర భారతదేశంలోని హర్యానాలో స్థానేశ్వరరాజులు రాజ్యాన్ని స్థాపించి, క్రమక్రమంగా కనోజ్ వైపు విస్తరించారు

మత కార్యాలకూ, ఇతర కార్యాలకూ భూదానాలు ఇచ్చే సంప్రదాయం పెరుగుతూ రావటంచేత గుప్తరాజ్యానికి పెద్ద వృత్తిసైన్యాన్ని పోషించటం క్రమక్రమంగా బరువైపోయి ఉండాలి విదేశీవ్యాపారం తగ్గిపోవటంచేత వారి ఆదాయం మరింతగా తగ్గిపోయి ఉండాలి క్రీ శ 473లో గుజరాత్ నుంచీ మాళ్వకు ఒక సంఘానికి చెందిన పట్టు నేతగాళ్ళు వలస పోవటం, అక్కడ అనుత్పాదక శ్రమలోకి మారిపోవటం – తగ్గిపోయిన పట్టు వ్యాపారాన్ని సూచిస్తోంది క్రమక్రమంగా గుజరాత్‌కు ఉన్న వ్యాపార ప్రాధాన్యత అదృశ్యమై పోయింది ఐదవ శతాబ్దం ఉత్తరార్థంలో గుప్త రాజులు బరువు తగ్గించిన బంగారు నాణాలను ముద్రించటం కొనసాగించాలని వృధాప్రయత్నాలు చేశారు గుప్తరాజుల పరిపాలన అరవ శతాబ్దం మధ్యవరకూ కొనసాగినా–వారి సామ్రాజ్యవైభవం ఒక శతాబ్దంముందే అదృశ్యమైపోయింది

★ ★ ★

# అధ్యాయం: 21

# గుప్తయుగంలో జనజీవితం

## పరిపాలనా విధానం

మౌర్యులలాగా కాకుండా గుప్తులు "పరమేశ్వర", "మహా రాజాధిరాజ", "పరమభట్టారక" లాంటి అడంబరమైన బిరుదుల్ని స్వీకరించారు అవి వారు చిన్న రాజులమీద అధికారాన్ని కలిగి ఉండేవారని సూచిస్తున్నాయి గుప్తులలో రాజరికం వంశపారంపర్యంగా ఉండేది కానీ ఎల్లప్పుడూ జ్యేష్ఠపుత్రునికే రాజ్యాధికారం లభించేది కాదు అందుచేత రాజులూ, ఉన్నతాధికారులూ అస్థిరత్వాన్ని సృష్టించే అవకాశం ఉండేది తమను వివిధ దేవతలతో పోల్చి, భక్తిని చాటుకున్న బ్రాహ్మణులకు గుప్తరాజులు గొప్ప దానాలు చేశారు గుప్త రాజుల్ని స్థితికారుడైన విష్ణువుతో పోల్చేవారు విష్ణుపత్ని అయిన లక్ష్మిని గుప్త రాజులు తమ నాణాలమీద తప్పకుండా ముద్రించేవారు

గుప్తరాజుల సైన్యం సంఖ్య ఎంత ఉండేదో మనకు తెలియదు రాజు ఒక శాశ్వత సైన్యాన్ని పోషించే వాడనటానికి మాత్రం ఎలాంటి సందేహమూ లేదు దీనికి తోడుగా యుద్ధకాలంలో సామంత రాజులు తమ సైన్యాలను పంపేవారు రథాల ప్రాధాన్యత తగ్గిపోయింది అశ్విక దళానికి ప్రాధాన్యత పెరిగింది యుద్ధ విద్యలో ధానుష్కులైన అశ్వికులు (గుర్రం మీద వేగంగా వెళుతూ గురితప్పకుండా బాణాలను వదలగలిగినవారు) ప్రధాన పాత్ర వహించటం ప్రారంభించారు

గుప్తుల కాలంలో భూమిమీద వేసే పన్నుల సంఖ్య తగ్గింది వ్యాపారుల మీద వేసే పన్నుల సంఖ్య కూడా తగ్గింది భూమి పన్ను పంట దిగుబడిలో నాలుగవ భాగం నుంచీ ఆరవ భాగం వరకూ ఉండేది దీనికితోడు రాజుగారి సైన్యం గ్రామీణ ప్రాంతాలగుండా వెళ్తున్నప్పుడు ఆయా గ్రామాల ప్రజలు వారికి భోజన సౌకర్యాలు కలగచేయాలి గ్రామీణ ప్రాంతాలలోని ప్రభుత్వోద్యోగులకు గ్రామీణులు జంతువులనూ, ఆహార పదార్థాలనూ, బల్లలూ, కుర్చీలూ మొదలైన వస్తువులనూ సరఫరా చేయాలి మధ్యభారత దేశంలోనూ, పశ్చిమ భారతదేశంలోనూ ప్రజలు "విష్టి" (వెట్టి) అన్న చాకిరీని సైన్యానికీ, ప్రభుత్వోద్యోగులకూ చేయవలసి ఉండేది

అంతకు పూర్వపు ప్రభుత్వాల కాలాలలో కంటే గుప్తు లకాలంలో న్యాయాంగ వ్యవస్థ బాగా అభివృద్ధి చెందింది అనేక న్యాయశాస్త్ర గ్రంథాలు ఈ కాలంలో రచించబడ్డాయి మొదటిసారిగా సివిల్, క్రిమినల్ చట్టాలు స్పష్టంగా నిర్వచించ బడ్డాయి దొంగతనం, వివాహితుల వ్యభిచారం క్రిమినల్ నేరాలుగా పరిగణించబడ్డాయి ఆస్తులకు సంబంధించిన అన్నిరకాలైన తగాదాలూ సివిల్ చట్టం కిందికి వచ్చాయి వారసత్వాన్ని గురించి సవివరమైన చట్టాలు రూపొందించ బడ్డాయి అంతకు పూర్వంలాగే చట్టాలను అమలు చేయటం "వర్ణం" మీద ఆధారపడి ఉండేది చట్టాలను అమలు పరచటం రాజు బాధ్యతగా ఉండేది రాజు బ్రాహ్మణ పురోహితుల సహాయంతో న్యాయనిర్ణయం చేసేవాడు చేతివృత్తులవారూ, వ్యాపారులూ, ఇతరులూ ఏర్పరచుకున్న వృత్తిసంఘాలు – అవి ఏర్పరచుకున్న చట్టాలను అనుసరించేవి వైశాలిలోనూ, అలహాబాద్ సమీపంలోని భిటాలోనూ లభించిన సీళ్ళు గుప్తుల కాలంలో ఈ వృత్తి సంఘాలు మంచి దశలో ఉన్నట్టు సూచిస్తున్నాయి

గుప్తుల ఉద్యోగి వర్గం మౌర్యుల ఉద్యోగివర్గమంత విస్తృత మైంది కాదు గుప్తుల పరిపాలనలో అత్యంత ప్రధానమైన అధికారులను "కుమారామాత్యులు" అని పిలిచేవారు వీరిని రాజు వారి సొంతరాష్ట్రాలలో నియమించేవాడు బహుశా వీరికి నగదురూపంలో జీతాలను చెల్లించేవారు గుప్తులు వైశ్యులు కావటంచేత కాబోలు ఉద్యోగుల నియామకం పై వర్ణాలకు మాత్రమే పరిమితంగా ఉండేదికాదు అనేక అధికారాలు ఒకే ఉద్యోగి చేతిలో ఉండేవి ఉద్యోగాలు వంశ పారంపర్యంగా తరువాతి కాలంలో తయారయ్యాయి అందుచేత రాజు అధికారం తగ్గటం ప్రారంభించింది

గుప్తులు రాష్ట్రాల పరిపాలనకూ, స్థానిక పరిపాలనకూ ఒక విధానాన్ని రూపొందించారు సామ్రాజ్యాన్ని "భుక్తి"

అన్న విభాగాలుగా విభజించారు ప్రతి "భుక్తి"కీ "ఉపరిక" అన్న ఒక అధికారి ఉండేవాడు ప్రతి భుక్తినీ అనేక "విషయాలు"గా విభజించేవారు ప్రతి "విషయాని"కీ "విషయపతి" అన్న అధికారి ఉండేవాడు తూర్పు భారతదేశంలో విషయాన్ని కొన్ని "విధులు"గా విభజించేవారు అలాగే విధులను గ్రామాలుగా విభజించేవారు

గుప్తుల కాలంలో గ్రామాధికారికి అంతకు ముందు కంటే ఎక్కువ అధికారాలు వచ్చాయి అతడు గ్రామ పెద్దల సహకారంతో గ్రామ వ్యవహారాలను చూసేవాడు గ్రామాల పరిపాలనలోనూ, చిన్న పట్టణాల పరిపాలనలోనూ స్థానిక ప్రముఖులకు కూడా స్థానం ఉండేది వారి అనుమతి లేకుండా భూముల్ని అమ్మటం, కొనటం సాధ్యమయ్యేది కాదు

నగర పరిపాలనలో వృత్తిసంఘాలకు చెప్పుకోతగ్గ ప్రాధాన్యత ఉండేది చేతివృత్తులవారూ, వ్యాపారులూ, దస్తావేజులు రాసేవారూ – నగర పాలక సంఘంలో సభ్యులుగా ఉన్నట్టూ, నగరపరిపాలనలో పాలు పంచుకున్నట్టూ వైశాలిలో లభించిన ముద్రికలు నిరూపిస్తున్నాయి ఉత్తర బెంగాల్ (ఈనాటి బంగ్లాదేశ్)లోని కోటివర్షజిల్లాబోర్డులో ఆ జిల్లాలోని ప్రధాన వ్యాపారీ, ప్రధాన చేతివృత్తుల నిపుణుడూ సభ్యులుగా ఉండేవారు భూమి లావాదేవీలకు వారి అనుమతి తప్పకుండా అవసరమయ్యేది చేతివృత్తులవారూ, బాంకర్లూ వేరు వేరు వృత్తి సంఘాలను కలిగి ఉండేవారు భిటా, వైశాలీ నగరాల్లో అలాంటి వృత్తి సంఘాలు చాలా ఉండేవి మాళ్వలోని మందసోర్‌లోనూ, ఇందోర్‌లోనూ పట్టు నేతపని వాళ్లు సొంత వృత్తిసంఘాలను కలిగి ఉండేవారు పశ్చిమ ఉత్తర ప్రదేశ్‌లోని బులంద్‌షహర్‌లో నూనెగానుగలవారికి సొంత వృత్తిసంఘాలుండేవి ఈ వృత్తిసంఘాలకు – మరీముఖ్యంగా వ్యాపారుల వృత్తి సంఘాలకు కొన్ని రక్షణలుండేవి వారు తమ సభ్యుల అవసరాలను తీర్చగలిగేవారు ఆ సభ్యులు చట్టవ్యతిరేకమైన పనులుచేస్తే వారిని శిక్షించగలిగేవారు

ఇంతవరకూ చర్చించిన పరిపాలనా విధానం నేరుగా గుప్తరాజుల అధికారంకింద ఉన్న ఉత్తర బెంగాల్‌కు బీహార్‌కు, ఉత్తరప్రదేశ్‌కు, మధ్యప్రదేశ్ సరిహద్దు ప్రాంతాలకు మాత్రమే వర్తిస్తుంది ఈ ప్రాంతాలలో గుప్తరాజులు నియమించిన అధికారులు పరిపాలనను నిర్వహించేవారు కానీ గుప్తసామ్రాజ్యంలో ఎక్కువభాగం సామంత రాజుల పరిపాలనలో ఉండేది వీరిలో ఎక్కువమందిని సముద్రగుప్తుడు జయించాడు సామ్రాజ్య సరిహద్దులలోని సామంతులు మూడు బాధ్యతల్ని నిర్వహించేవారు 1 వారు చక్రవర్తి కొలువుకు స్వయంగా హాజరయ్యేవారు 2 అతనికి కప్పాలు కట్టేవారు 3 తమ కుమార్తెలను చక్రవర్తి కిచ్చి వివాహాలు జరిపించేవారు వాటికి ప్రతిఫలంగా వీరికి వారివారి ప్రాంతాలను పరిపాలించుకునే అధికారాన్ని చక్రవర్తి ఇచ్చేవాడు చక్రవర్తి ఉత్తరువులు గరుడ రాజముద్రికతో సామంతులకు ఇవ్వబడేవి అలా గుప్తరాజుల మధ్యప్రదేశ్‌లోనూ, ఇతర ప్రాంతాలలోనూ చాలా మంది కప్పం కట్టే సామంత రాజులు ఉండేవారు వీరి స్థాయి తక్కువ కావటంచేత వీరు చక్రవర్తికి ఫ్యూడల్ పాళెగాళ్ళుగా వ్యవహరించారు

గుప్త రాజుల కాలంలో అమలులోకొచ్చిన రెండవ ఫ్యూడల్ పరిణామం పురోహితులకూ, అధికారులకూ ఆర్థిక, పరిపాలక సంబంధమైన రాయితీలు ఇవ్వటం ఈ పరిణామాన్ని ప్రారంభించినవారు శాతవాహనులు ఇది గుప్త రాజుల యేలుబడిలో – మరీ ముఖ్యంగా మధ్యప్రదేశ్‌లో బాగా స్థిరపడి పోయింది వీరు మతాధికారులకు గ్రామదానాలు ఇచ్చారు చక్రవర్తి వసూలు చేసే అన్ని పన్నులనూ మతాధికారులు వసూలు చేసుకునే అధికారాన్ని కలిగి ఉండేవారు మతాధికారులకిచ్చిన గ్రామాలలోకి రాజప్రతినిధులూ, అధికారులూ ప్రవేశించటానికి వీలుండేదికాదు గ్రామదానాలు పొందిన మతాధికారులకు నేరస్తులను శిక్షించే అధికారం కూడా ఉండేది

ఉద్యోగులకు గుప్తులకాలంలో భూమి రూపంలో జీతాలు చెల్లించేవారా లేదా అన్నది సందేహాస్పదంగానే ఉంది పెద్ద మొత్తంలో బంగారు నాణాలు ఉండటం చేత ఉన్నతోద్యోగులకు రొక్కంరూపంలో జీతాలు చెల్లించేవారని ఆశించవచ్చు కానీ కొంతమందికి భూముల్ని కూడా ఇచ్చి ఉండవచ్చు

పరిపాలనా బాధ్యత ఎక్కువగా సామంత రాజుల చేతిలో ఉండటం చేత గుప్తులకు మౌర్యులకుండినంత పెద్ద ఉద్యోగ వర్గం ఉండవలసిన అవసరం లేకపోయింది గుప్తరాజ్యం ఆర్థిక వ్యవహారాలను పెద్దగా నియంత్రించక పోవటంచేత వారికి పెద్ద సంఖ్యలో ఉన్నతోద్యోగుల అవసరం కూడా లేకుండా పోయింది ప్రముఖ చేతివృత్తుల నిపుణులూ, వ్యాపారులూ, పెద్దలూ కూడా పరిపాలనలో పాల్గొనటంచేత పెద్ద సంఖ్యలో ఉద్యోగులు ఉండవలసిన అవసరం లేదు మొత్తంమీద మౌర్యులలాగా గుప్తులకు విస్తృతమైన పరిపాలనా యంత్రాంగం ఉండవలసిన అవసరం లేదు, లేదుకూడాను ఒకరకంగా చూస్తే వారి రాజకీయ విధానం ఫ్యూడల్ విధానంలా కనిపిస్తుంది

## వ్యాపార సరళులు, వ్యవసాయ విధానం

గుప్త సామ్రాజ్యంలోని అనేక భాగాలను దర్శించిన చైనాయాత్రికుడు ఫాహియాన్ కథనాన్ని పరిశీలిస్తే ఆనాటి ఆర్థిక జీవనాన్ని గురించి ఒక అభిప్రాయం ఏర్పడుతుంది అతడు మగధ రాజ్యంలో అనేక నగరాలున్నాయనీ, ధనవంతులు దానధర్మాలు చేయటం ద్వారా బౌద్ధమతాన్ని బలపరుస్తున్నారనీ చెప్పాడు

ప్రాచీన భారతదేశ చరిత్రలో అందరికంటే ఎక్కువ

బంగారు నాణాలను గుప్తులే ముద్రించారు వారు వేయించిన శాసనాల్లో వాటిని దీనారాలని పేర్కొన్నారు అవి రూపంలోనూ, బరువులోనూ క్రమతను కలిగి ఉన్నాయి వీటిలో అనేక రకాలూ, ఆ రకాలలో మళ్ళీ రకాలూ కూడా ఉన్నాయి వాటి మీద గుప్త రాజుల చిత్రాలతోపాటు వారికి కళలమీదా, యుద్ధం మీదా ఉన్న అభిమానం కూడా చిత్రించబడింది ఇవి బంగారు నాణాలే అయినా వీటిలోని బంగారం కుషానుల కాలంనాటి నాణాలలోని బంగారమంత పరిశుద్ధంగా లేదు ఇవి ఉద్యోగుల జీతాలను చెల్లించటానికీ, భూమిని అమ్మటానికీ కొనటానికీ ఉపయోగపడ్డాయి గుజరాత్‌ను ఆక్రమించుకున్న తరువాత గుప్తులు పెద్ద సంఖ్యలో వెండి నాణాలను ముద్రించారు ఇవి ప్రధానంగా స్థానిక లావాదేవీలకు ఉపయోగపడ్డాయి పశ్చిమ క్షాత్రపుల కాలంలో వెండి ప్రముఖ స్థానాన్ని కలిగి ఉండేది కుషానుల రాగి నాణాల సంఖ్యతో పోల్చి చూసినప్పుడు గుప్తులు ముద్రించిన రాగి నాణాలు చాలా తక్కువే సాధారణ ప్రజల్లో ద్రవ్యం యొక్క ఉపయోగం, గుప్తుల కాలంలో కుషానుల కాలంలో కంటే తక్కువగా ఉండేదని ఈ రాగి నాణాలు సూచిస్తున్నాయి

అంతకు పూర్వం కంటే గుప్తులకాలంలో దూర వ్యాపారం తగ్గింది క్రీ శ 550 వరకూ రోమన్ సామ్రాజ్యంలోని తూర్పు దేశాలతో భారతదేశానికి పట్టు ఎగుమతి వ్యాపారం ఉండేది ఆ తరువాత ఆ దేశాలు చైనా నుంచీ పట్టు ఉత్పత్తి చేసే విధానాన్ని నేర్చుకున్నాయి అందుచేత భారతదేశపు ఎగుమతి వ్యాపారం దెబ్బతిన్నది ఆరవ శతాబ్దం మధ్యభాగానికే భారత దేశపు పట్టుకు ఇతరదేశాలలో ఉన్న గిరాకీ తగ్గిపోయింది ఐదవ శతాబ్దం మధ్యకాలంలోనే గుజరాత్‌లోని లాట దేశం నుంచీ పట్టునేతగాళ్ళు మందసర్‌కు వలస పోయి, తమ వృత్తిని వదిలి పెట్టి, ఇతర వృత్తుల్ని స్వీకరించినట్టుగా ఆధారాలున్నాయి

గుప్త సామ్రాజ్యంలో – ముఖ్యంగా మధ్యప్రదేశ్‌లో స్థానిక సన్నకారు రైతులకు అపకారం జరిగేలా మతాధికార భూస్వామ్య వర్గం తయారైంది మతాధికారులకు, పురోహితులకు భూదానాలు ఇవ్వటం చేత అంతకు పూర్వం సాగులోలేని భూములు సాగులో కొచ్చాయి కానీ ఈ భూస్వామ్య వర్గాన్ని ప్రభుత్వం స్థానిక గిరిజన రైతుల మీద బలవంతంగా రుద్దింది. అందుచేత సన్నకారు రైతుల పరిస్థితి మరింత దీనంగా తయారైంది మధ్య భారతదేశంలోనూ, పశ్చిమ భారతదేశంలోనూ రైతులకు బలవంతపు వెట్టిచాకిరీ కూడా తప్పలేదు మొత్తంమీద కొత్తభూమి సాగులోకి వచ్చింది మధ్య భారతదేశంలోని గిరిజన ప్రాంతాల్లో భూదానాలు పొందిన బ్రాహ్మణులు వ్యవసాయంలోకి కొత్త విజ్ఞానాన్ని ప్రవేశపెట్టారు

## సామాజికాభివృద్ధి



దేవఘర్‌లో లభించిన వర–నారాయణుల ఆలయంలోని శిల్పాలు



గుప్తులకాలంలో నిర్మించిన దేవాలయం – సాంచి

పెద్ద మొత్తంలో బ్రాహ్మణులకు భూదానాలు చేయటం గుప్త రాజుల కాలంలో బ్రాహ్మణాధిక్యత కొనసాగటాన్ని సూచిస్తుంది గుప్తులు మౌలికంగా వైశ్యులే అయినా వాళ్ళను బ్రాహ్మణులు క్షత్రియులుగా పరిగణించారు గుప్త రాజులు దైవాంశ సంభూతులని బ్రాహ్మణులు ప్రకటించారు గుప్త రాజుల స్థానం ఆ విధంగా గట్టిపడింది వారు బ్రాహ్మణీయ వ్యవస్థను గట్టిగా సమర్థించారు అసంఖ్యాకమైన భూదానాల కారణంగా బ్రాహ్మణులు సంపన్నులయ్యారు వారు తమకు అనేక ప్రత్యేక సౌకర్యాలు కావాలని డిమాండు చేశారు సుమారు క్రి శ 5 వ శతాబ్దంలో రచించబడిన "నారద ధర్మశాస్త్రం" బ్రాహ్మణులు కోరిన ప్రత్యేక సౌకర్యాలను పేర్కొంది

ఐదవ శతాబ్దం చివర భారతదేశంలోకి వచ్చిన హూణులు చిట్టచివరకు 36 రాజపుత్ర వంశాలలో ఒకరుగా పరిగణించ బడ్డారు ఈ నాటికీ కొందరు రాజపుత్రులకు "హూణ" అన్న బిరుదం ఉంటుంది కులాల సంఖ్య పెరిగిపోవటానికి మరొక కారణం బ్రాహ్మణీయ మతంలోకి అనేక గిరిజన జాతుల్ని చేర్చుకోవటం భూదానాలు ఇవ్వటంద్వారా ఈ పద్ధతి కొనసాగింది గిరిజననాయకులకు గౌరవనీయమైన వంశవృక్షాలను సృష్టించారు కానీ వారి సాధారణ బంధువర్గానికి మాత్రం అలాంటి గౌరవం దక్కేదికాదు హిందూమతంలో కలిసిపోయిన తరువాత ప్రతి గిరిజన తెగా ఒక కొత్త కులంగా రూపొందింది



సారనాథ్‌లోని బుద్ధుని ప్రతిమ



అహిచ్ఛత్ర (బరైలీ జిల్లా) లోని యమున విగ్రహం

రెండు కారణాలచేత కులాలు అసంఖ్యాకమైన ఉప కులాలుగా చీలిపోయాయి విదేశీయులు పెద్ద సంఖ్యలో భారతీయ సమాజంలో లీనమైపోయారు ఒక్కొక్క కొత్త గుంపుకు చెందిన విదేశీయులు ఒక్కొక్క కులంగా పరిగణన పొందారు విదేశీయులు ప్రధానంగా దండయాత్రలకు వచ్చిన వారు కావటంచేత వారు క్షత్రియులుగా గుర్తింపు పొందారు

గుప్తుల కాలంలో శూద్రుల పరిస్థితి మాత్రం మెరుగైంది వారికి ఇతిహాసాలనూ, పురాణాలను వినే అర్హత లభించింది వారు "కృష్ణుడు" అన్న కొత్త దేవుణ్ణి పూజించటం కూడా సాధ్యమైంది వారికి కొన్ని కుటుంబ సంబంధమైన కర్మకాండల్ని చేసే అర్హత కూడా లభించింది వాటిని చేయించినందుకు పురోహితులకు దక్షిణలు లభించేవి ఈ పరిణామాల కన్నిటికీ కారణం శూద్రుల ఆర్థికస్థాయిలో

మార్పు రావటమే ఏడవ శతాబ్దంనుంచీ శూద్రుల్ని వ్యవసాయదారులుగా పరిగణించటం ప్రారంభమైంది అంతకు ముందు వారు కేవలం సేవకులుగా, వ్యవసాయకూలీలుగా, పై మూడు వర్ణాలవారికీ దాసులుగా, బానిసలుగా మాత్రమే ఉండేవారు

ఈ కాలంలో అస్పృశ్యుల సంఖ్య – మరీ ముఖ్యంగా చండాలుల సంఖ్య – పెరిగింది క్రీ పూ 5 వ శతాబ్దంలోనే చండాలులు అవతరించారు క్రీ శ 5 వ శతాబ్దానికి వారి సంఖ్య విపరీతంగా పెరిగింది వారి ఇబ్బందులు కూడా దారుణంగా ఉండటంచేత వారు ఫాహియాన్ దృష్టిని ఆకర్షించారు చండాలులు ఊరిబయట నివసించేవారనీ, మాంసం వ్యాపారం వారి వృత్తనీ అతడు చెప్పాడు ఊళ్ళోకి వచ్చే పైకులాలవారు వారికి దూరంగా తొలగి వచ్చేవారు వారు ఉపయోగించే బాట అశుభ్రంగా ఉండటంచేత పై కులాలవారు అలా ప్రవర్తించేవారు

గుప్తుల కాలంలో శూద్రులకులాగే స్త్రీలకు కూడా ఇతిహాసాలనూ, పురాణాలను వినే అర్హత లభించింది వారు కృష్ణుణ్ణి పూజించాలని సలహాలు కూడా చెప్పారు ఉన్నత వర్గాలకూ, వర్ణాలకూ చెందిన స్త్రీలకు స్వతంత్ర జీవనోపాధి గుప్తుల పూర్వం కానీ, గుప్తుల కాలంలో కానీ ఉండేది కాదు కింది రెండు కులాల స్త్రీలకు మాత్రమే ఆ సౌలభ్యం ఉండేది అందుచేత వారికి మాత్రమే చెప్పుకోదగ్గ స్వాతంత్ర్యం కూడా ఉండేది వైశ్య, శూద్ర స్త్రీలు వ్యవసాయపనులూ, ఇంటిపనులూ చేసేవారనీ, అందుచేత వారిమీద వారి భర్తల అజమాయిషీ ఉండేది కాదనీ చెబుతారు దీనికి వ్యతిరేకంగా పై వర్ణాల వారికి భూస్థితి పెరిగేకొద్దీ వారిలో బహుభార్యాత్వం కూడా పెరగటం ప్రారంభించింది ఈ పితృస్వామ్య వ్యవస్థలో పురుషులు స్త్రీలను తమ అధీనంలో ఉన్న వస్తువులలో ఒక వస్తువుగా చూడటం ప్రారంభించారు కాబట్టి భార్య తన భర్తతోపాటు పరలోకానికి కూడా వెళ్ళవలసి వచ్చింది క్రీ శ 510లో గుప్తులకాలంలోనే మొట్టమొదటి సతీసహగమనం పేర్కొనబడింది కానీ గుప్తుల తరువాత కాలానికి చెందిన కొన్ని ధర్మశాస్త్ర గ్రంథాలు భర్త చనిపోయినా, వధించబడినా, నపుంసకుడుగా ఉన్నా, సన్యసించినా, బహిష్కరించబడినా స్త్రీ పునర్వివాహం చేసుకోవచ్చని చెబుతున్నాయి

ఉన్నత వర్ణాల స్త్రీలు, పురుషులకంటే తక్కువ స్థితిలో ఉండటానికి వారు తమ జీవికకోసం పూర్తిగా పురుషులమీద ఆధారపడి ఉండటమే కారణం వారికి ఆస్తి హక్కులు ఉండేవి కావు కానీ వివాహ సందర్భంలో ఆవిడకు బహుమతులుగా లభించిన నగలూ, బట్టలూ మొదలైన వస్తువులు ఆవిడ ఆస్తిగా పరిగణించబడేవి గుప్తుల కాలంలోనూ, ఆ తరువాతా వచ్చిన ధర్మశాస్త్ర గ్రంథాలు ఈ బహుమతుల స్వభావాన్ని గణనీయంగా విస్తృతం చేశాయి స్త్రీకి తల్లిదండ్రుల నుంచీ వివాహసమయంలో లభించిన వస్తువులు మాత్రమే కాకుండా అత్తమామలనుంచీ లభించింది కూడా ఆమె సొంత ఆస్తే దాన్ని "స్త్రీధనం" అనేవారు ఆరవ శతాబ్దానికి చెందిన కాత్యాయనుడు అనే ధర్మశాస్త్రకారుడు, స్త్రీ తన స్త్రీధనంతో పాటు తన స్థిరాస్తిని కూడా అమ్మటం, కుదువ పెట్టటం చేయవచ్చునన్నాడు దీన్ని పరిశీలించిచూస్తే స్త్రీలకు కుటుంబ ఆస్తిలో నుంచీ పొలాలు కూడా లభించేవని తెలుస్తుంది కానీ సాధారణంగా భారతదేశంలో పితృస్వామిక వ్యవస్థ ఉన్న సమాజాలలో కూతురికి పొలాలలో భాగాన్ని ఇచ్చేవారు కారు

## బౌద్ధమతం పతనం



మధురలోని బుద్ధుని విగ్రహం

గుప్తులకాలంలో బౌద్ధమతానికి రాజాదరణ ఉండేదికాదు ఫాహియాన్ బౌద్ధమతం ఉన్నత స్థితిలో ఉన్నట్టు చెబుతాడు కానీ అశోకుని కాలంలోనో, కనిష్కుని కాలంలోనో ఉన్నట్టుగా గుప్తుల కాలంలో బౌద్ధమతం ఉండేదికాదు మరీ ముఖ్యంగా మగధ ప్రాంతంలో బౌద్ధమతం బాగా దెబ్బతిన్నది



అజంతాలోని అప్సరస చిత్రం

## భాగవత తత్వం పుట్టుక, అభివృద్ధి

భాగవత తత్వానికి కేంద్రం విష్ణుభక్తి ఇది మౌర్య రాజ్యానంతర కాలంలో ప్రారంభమైంది విష్ణువు వేదకాలంలో ఒక అప్రధాన దేవత అతడు సూర్యునికీ, గర్భోత్పత్తి ఆచారాలకూ (ఫర్టిలిటీరైట్స్) ప్రాతినిధ్యం వహించేవాడు క్రీ పూ రెండవ శతాబ్దంలో విష్ణువు నారాయణుడన్న మరో దేవతతో కలిపివేయబడ్డాడు ఆ తరువాత అతణ్ణి నారాయణ విష్ణువు అని పిలిచేవారు మొట్టమొదట నారాయణుడు అవైదిక గిరిజన దేవత అతణ్ణి "భగవత్" అని పిలిచేవారు అతని భక్తులని "భాగవతులు" అన్నారు ఈ దేవతను గిరిజన నాయకునికి ఆధ్యాత్మిక ప్రతిద్వంది గా సృష్టించారు గిరిజన నాయకుడు బహుమతులను స్వీకరించి, వాటిని భాగాలు పెట్టినట్టు నారాయణుడు కూడా భక్తులకు "భాగాలు" పంచుతాడని నమ్మేవారు దీనికి బదులుగా భక్తులు ప్రేమపూర్వకమైన "భక్తి"ని నారాయణునికి సమర్పిస్తారు విష్ణుభక్తులూ, నారాయణ భక్తులూ ఒకే గొడుగు కిందికి వచ్చారు అలాగే విష్ణువూ, నారాయణుడూ ఒకటయ్యారు వీరిలో విష్ణువు వైదిక దేవత నారాయణుడు అవైదిక సంబంధాలున్న దేవత అలా రెండు సంస్కృతులూ, రెండు రకాలైన ప్రజలూ, ఇద్దరు దేవతలూ కలిశారు ఆ తరువాత పశ్చిమ భారతదేశంలో నివసిస్తూ ఉండిన "వృష్ణి" తెగకు నాయకుడైన కృష్ణ – వాసుదేవునితో విష్ణువు ఐక్యం చేయబడ్డాడు "మహాభారత" ఇతిహాసం కూడా కృష్ణుడు విష్ణువేనని చెప్పటం కోసం సవరించి తిప్పి రాయబడింది అలా క్రీ పూ 200 నాటికి ఈ ముగ్గురు దేవతలూ, వారి భక్తులూ ఒకే సూత్రంగా కలిసిపోయారు దీనిఫలితంగానే భాగవతమూ, భాగవత తత్వమూ ఉద్భవించాయి

భాగవత తత్వంలో ప్రధానాంశాలు భక్తి, అహింస భక్తి గిరిజన నాయకుని పట్ల గిరిజనుడూ, రాజుపట్ల పౌరుడూ చూపించే విధేయత లాంటిది అహింస – అంటే జంతువుల్ని చంపక పోవటం – వ్యావసాయిక సమాజానికీ, అంతేకాకుండా – విష్ణువుతో ముడిపడివున్న "ఫర్టిలిటీరైట్స్" సంప్రదాయానికీ కూడా సరిపోయింది అందుచేత విష్ణుభక్తులు అతనికి నైవేద్యంగా బియ్యం, నువ్వులు మొదలైన వస్తువుల్ని పెట్టటం ప్రారంభించారు వీరిలో కొందరు జంతువుల్ని చంపటం ఇష్టంలేక శాకాహారులుగా మారిపోయారు

ఈ కొత్తమతం ఉదారంగా ఉండటం చేత విదేశీయుల్ని కూడా ఆకర్షించ గలిగింది శాతవాహనుల కాలంలోనూ, కుషానుల కాలంలోనూ ప్రాధాన్యతను సంతరించుకున్న చేతి వృత్తుల వారికీ, వ్యాపారులకూ ఈ మతం ఆకర్షణీయంగా కనపడింది కృష్ణుడు తన "భగవద్గీత"లో స్త్రీలూ, వైశ్యులూ, పాపజన్ములైన శూద్రులు కూడా తన శరణు వేడవచ్చునని బోధించాడు ఈ గ్రంథం వైష్ణవ బోధనల్ని చర్చించింది అలాగే "విష్ణుపురాణం", కొంతవరకూ "విష్ణుస్మృతి" కూడా భాగవత తత్వాన్ని (వైష్ణవ తత్వాన్ని) గురించి చర్చించాయి

గుప్తరాజుల కాలంలో భాగవత తత్వం మహాయాన బౌద్ధమతాన్ని తెరమరుగుకు నెట్టివేసింది భాగవత తత్వం అవతార తత్వాన్ని ప్రతిపాదించింది చరిత్ర విష్ణువు దశావతారాల లాగా వర్తులాకారంలో ఉంటుందన్న వాదనను ప్రవేశపెట్టింది సామాజిక వ్యవస్థకు హాని కలిగితే విష్ణువు తగిన రూపంలో అవతరిస్తాడని చెప్పింది ధర్మాన్నీ (అంటే వర్ణధర్మాన్ని), రాజరిక వ్యవస్థ రక్షణలో ఉన్న పితృస్వామిక వ్యవస్థనూ రక్షించటానికి విష్ణువు అవతరించటం అవసరమేనని చాలామంది నమ్మారు

క్రీ శ 6 వ శతాబ్ద కాలానికి విష్ణువు – బ్రహ్మ, ఈశ్వరులతోపాటు త్రిమూర్తులలో ఒకడయ్యాడు

కానీ వీరి ముగ్గురిలోనూ తన శక్తి సామర్థ్యాల కారణంగా ప్రధాన దేవుడుగా పరిగణనలోకి వచ్చాడు అరవ శతాబ్దం తరువాత వైష్ణవ భక్తి ప్రాశస్త్యాన్ని వివరిస్తూ, స్తుతిస్తూ అనేక గ్రంథాలు రాయబడ్డాయి వీటిలో ప్రధానమైంది "భాగవత పురాణం" ఈ గ్రంథంలోని కథను భాగవత పౌరాణికులు రోజుల తరబడి చెప్పేవారు మధ్యయుగాలలో తూర్పు భారతదేశంలో భాగవతాగ్రహారాలు వెలిశాయి ఆ గ్రామాలలో విష్ణుపూజ, విష్ణుగాథల ప్రవచనమూ జరిగేవి విష్ణుభక్తులకోసం "విష్ణు సహస్రనామం" వంటి స్తుతిమంత్రాలు రచించబడ్డాయి

కొందరు గుప్త రాజులు లయ (విధ్వంసం) కారుడైన శివునికి భక్తులు శివుడు ప్రథమశ్రేణి దేవతగా తరువాత కాలంలో రూపొందాడు కానీ, గుప్తయుగం తొలిరోజులలో విష్ణువుకున్న ప్రాధాన్యత శివునికి ఉండేదికాదు

గుప్తుల కాలం నుంచీ హిందూమతంలో విగ్రహారాధనా, దేవాలయాల నిర్మాణం సాధారణ పరిణామంగా రూపొందింది అనేక పండుగల్ని జరుపుకోవటం కూడా ప్రారంభమైంది వివిధ వర్గాల ప్రజలు జరుపుకునే వ్యావసాయిక పండుగలకు కూడా మతంరంగు పులిమారు అవికూడా పురోహితులకు మంచి ఆదాయాన్ని తెచ్చిపెట్టటం ప్రారంభించాయి

గుప్తరాజులు వివిధ మత సంప్రదాయాలను సహనంతో చూశారు వారు బౌద్ధుల్ని గానీ, జైనుల్ని గానీ హింసించినట్టు ఆధారాలు లేవు హిందూమతం యొక్క అనేక లక్షణాలను గ్రహించి బౌద్ధమతం తన స్వభావాన్ని మార్చుకోవటంకూడా అందుకు కారణం కావచ్చు



ఢిల్లీలోని ఇనుపస్తంభం

## కళలు

గుప్తుల యుగాన్ని ప్రాచీన భారతదేశ చరిత్రలో స్వర్ణయుగమంటారు ఆర్థిక విషయాల్లో ఇది సత్యం కాకపోవచ్చు ఎందుకంటే – గుప్తుల కాలంలోనే ఉత్తర భారతదేశంలో అనేక పట్టణాలు పతనం చెందాయి కానీ గుప్తుల వద్ద పెద్ద మొత్తంలో బంగారు నిల్వలుండేవి ఆ బంగారం ఎలా వచ్చేదో మనకు స్పష్టంగా తెలియదు వారు పెద్దసంఖ్యలో బంగారు నాణాలను ముద్రించారు రాజులూ, సంపన్నులూ తమ ఆదాయంలో కొద్దిభాగాన్ని కళాకారులనూ, సాహిత్యకారులనూ పోషించటం కోసం ప్రత్యేకించేవారు సముద్రగుప్తుడూ, రెండవ చంద్రగుప్తుడూ కళలనూ, సాహిత్యాన్నీ పోషించారు సముద్రగుప్తుడు తాను వీణ వాయిస్తున్నట్టుగా నాణాలను ముద్రించాడు రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో నవ రత్నాలన్న పేరుతో తొమ్మిదిమంది ప్రసిద్ధకవులూ, విద్వాంసులూ ఉండేవారని చెబుతారు

ప్రాచీన భారతదేశంలో కళ ప్రధానంగా మతం నుంచీ ఉత్తేజాన్ని పొందింది మనకు లభించిన అవశేషాలలో మతాతీతమైన కళకు ఉదాహరణలు స్వల్పంగా మాత్రమే ఉన్నాయి మౌర్యుల కాలంలోనూ, ఆ తరువాత కాలంలోనూ బౌద్ధమతం కళకు గొప్ప ఉత్తేజాన్నిచ్చింది గొప్ప రాతిస్తంభాలను చెక్కటం, రాతి గుహలను తొలవటం, ఉన్నతమైన స్తూపాలను నిర్మించటం ఆ కాలంలోనే జరిగాయి రాతి పునాదిమీద శంఖాకారంలో నిర్మించిన స్మృతిమందిరాలే స్తూపాలు ఆ కాలంలోనే బుద్ధుని విగ్రహాలను కూడా అసంఖ్యాకంగా చెక్కారు

రెండు మీటర్లకంటే ఎక్కువ ఎత్తు ఉన్న గుప్తుల కాలానికి చెందిన బుద్ధుని విగ్రహం లభించింది అది కంచుతో చేయబడింది భగల్పూర్ సమీపంలోని సుల్తాన్ గంజ్ అన్నచోట అది లభించింది పాహియాన్ తాను 25 మీటర్లకంటే ఎక్కువ ఎత్తు ఉన్న రాగి బుద్ధ విగ్రహాన్ని చూపినట్టుగా చెప్పాడు కానీ ఆ విగ్రహం ఇంతవరకూ లభించలేదు గుప్తులకాలంలో సారనాథ్‌లోనూ, మధురలోనూ అందమైన బుద్ధ విగ్రహాలను చెక్కారు కానీ గుప్తులకాలానికి చెందిన అత్యుత్తమ బౌద్ధకళ అజంతా చిత్రాలలో కనిపిస్తుంది

ఈ చిత్రాలు క్రీ శ మొదటి శతాబ్దం నుంచీ ఏడవ శతాబ్దం వరకూ చిత్రించబడినా వీటిలో ఎక్కువభాగం గుప్తుల కాలంలోనే చిత్రించబడ్డాయి ఇవి గౌతమ బుద్ధుని జీవితంలోనూ, అంతకు పూర్వం ఉన్న బుద్ధుల జీవితాల్లోనూ జరిగిన అనేక సంఘటనలను వర్ణిస్తాయి ఈ చిత్రాలు జీవిత వాస్తవికతతో తొణికిసలాడుతూ, అత్యంత సహజంగా ఉన్నాయి 14 శతాబ్దాల తరువాత కూడా ఈ చిత్రాల రంగులు వెలిసిపోలేదు కానీ గుప్తులే అజంతా చిత్రాలకు పోషకులని నిరూపించటానికి ఆధారాలు లేవు

గుప్తులు బ్రాహ్మణ మతాభిమానులు కావటంచేత మొట్ట మొదటిసారిగా వారి కాలంలో విష్ణువు, శివుడు మొదలైన హిందూదేవతల విగ్రహాలు లభించాయి కొన్ని చోట్ల మొత్తం దేవతావర్గమంతా చిత్రించబడింది వీటిలో ప్రధాన దేవతను మధ్యలో చిత్రించేవారు అప్రధాన దేవతలను ప్రధాన దేవత చుట్టూరా చిత్రించేవారు ప్రధాన దేవతను పెద్దగానూ, అప్రధాన దేవతలను చిన్నగానూ చిత్రించేవారు ఇది సమాజంలోని అసమానతనూ, హెచ్చుతగ్గుల వ్యవస్థనూ సూచిస్తుంది

వాస్తుశిల్పంలో గుప్తులు సాధించింది చాలా తక్కువే ఆ కాలానికి చెందినవి కొన్ని ఇటుకతో కట్టిన దేవాలయాలూ, ఒక రాతిదేవాలయం బయటపడ్డాయి కాన్పూర్ సమీపంలోని భితర్‌గావ్ లోనూ, ఘాజీపూర్‌లోని భితారీలోనూ, ఝాన్సీలోని దేవఘర్‌లోనూ బయటపడ్డ దేవాలయాలను ఈ సందర్భంలో పేర్కొనవచ్చు నలందాలోని బౌద్ధ విశ్వవిద్యాలయం క్రీ శ 5 వ శతాబ్దంలో స్థాపించబడింది నలందాలోని అత్యంత ప్రాచీనమైన ఇటుకల కట్టడం ఆ కాలానికి చెందిందే

## సాహిత్యం

లౌకిక సాహిత్యం అభివృద్ధి చెందటం గుప్తులకాలం యొక్క ప్రత్యేకత భాసుడు రాసిన పదమూడు నాటకాలూ, శూద్రకుడు రాసిన "మృచ్ఛకటికం" ఈ కాలానికి చెందినవే చితికిపోయిన, ఉత్తముడైన ఒక గృహస్తుని ఒక వేశ్య ప్రేమించడం "మృచ్ఛకటికం" కథావస్తువు ప్రాచీన నాటక సాహిత్యంలో ఉత్తమోత్తమ నాటకాలలో "మృచ్ఛకటికం" ఒకటి కానీ గుప్తుల కాలాన్ని అజరామరం చేసినవి కాళిదాసు కృతులు కాళిదాసు రాసిన "అభిజ్ఞాన శాకుంతలం" ప్రపంచంలోని నూరు అత్యుత్తమ సాహిత్య గ్రంథాలలో ఒకటిగా పరిగణించబడుతోంది ఈ నాటకం శకుంతలా దుష్యంతుల ప్రేమగాథను చెబుతుంది వారి కుమారుడైన భరతుడు ప్రసిద్ధుడైన రాజవుతాడు యూరోపియన్ భాషల్లోకి అనువాదం పొందిన తొలిపుస్తకాల్లో "అభిజ్ఞాన శాకుంతలం" కూడా ఒకటి అలాంటి మరొక పుస్తకం "భగవద్గీత" గుప్తుల కాలంలో రచింపబడిన నాటకాలను గురించి రెండు విషయాలు చెప్పవచ్చు 1 ఇవన్నీ కూడా సుఖాంత నాటకాలే వీటిలో దుఃఖాంత నాటకాలు లేవు 2 ఈ నాటకాల్లో పై వర్గానికీ, కింది వర్గానికీ చెందిన పాత్రలు ఒకేరకమైన భాషను మాట్లాడరు ఈ నాటకాల్లో వచ్చే శూద్రులూ, స్త్రీలూ ప్రాకృతం మాట్లాడతారు

ఇదే కాలంలోనే మత సాహిత్యం కూడా బాగా అభివృద్ధిచెందింది ఈ కాలానికి చెందిన అనేక గ్రంథాలకు బలమైన మత పక్షపాతం ఉంది "రామాయణం", "మహాభారతం" క్రీ శ 4 వ శతాబ్దానికి దాదాపు సంపూర్ణ రూపాన్ని ధరించాయి "రామాయణం" కైకేయి అనే సవతి తల్లి కుట్ర కారణంగా తండ్రి దశరథుని చేత 14 సంవత్సరాల కాలం అరణ్యాలకు బహిష్కరించబడిన శ్రీరాముని జీవితగాథ అతడు తండ్రి ఆజ్ఞను శిరసావహించి అయోధ్యను వదిలి అరణ్యాలకు వెళ్ళుతాడు అక్కడ అతని భార్య సీతను లంక రాజైన రావణుడు అపహరించుకుపోతాడు చిట్టచివరకు శ్రీరాముడు తన తమ్ముడు లక్ష్మణుని సాయంతో సీతను తీసుకువస్తాడు ఈ కథలో రెండు ప్రధానమైన నీతిమార్గాలున్నాయి మొదటిది కుటుంబ వ్యవస్థను ఆదర్శీకరించటం ఆదర్శకుటుంబ వ్యవస్థలో కుమారుడు తండ్రికీ, తమ్ముడు అన్నకూ, భార్య భర్తకూ అన్ని సందర్భాలలోనూ విధేయులుగా ఉంటారు రెండవది శ్రీరాముడు మంచికీ, రావణుడు చెడుకూ ప్రతీకలు చివర చెడుపై మంచి విజయం సాధిస్తుంది "మహాభారతం" కంటే "రామాయణం" ప్రజానీకం మీద ఎక్కువ మత నైతిక ప్రభావాన్ని చూపింది ముఖ్యమైన భారతీయ భాషల్లోనూ, ఆగ్నేయ ఆసియా భాషల్లోనూ "రామాయణం" కథలో మార్పులు కనిపిస్తాయి

"మహాభారతం" ప్రధానంగా కౌరవులు, పాండవులు అనే ఇద్దరు దాయాది వర్గాల మధ్య జరిగిన పోరాటానికి సంబంధించిన కథ ఈ కథ రాజరికానికీ బంధుత్వానికీ పొత్తు కుదరదని నిరూపిస్తుంది ధృతరాష్ట్రుడు పరిపాలిస్తున్న రాజ్యంలో పాండవులకు దాయభాగం ఉన్నా - కౌరవులు ఒక అంగుళం మేర భూమిని కూడా వారికి ఇవ్వమంటారు అందుచేత సోదరుల మధ్య సుదీర్ఘమైన యుద్ధం జరుగుతుంది అందులో శ్రీకృష్ణుడు పాండవులను బలపరుస్తాడు యుద్ధంలో కౌరవులు ఓడిపోతారు పాండవులు గెలుస్తారు ఈ కథకూడా చెడుమీద మంచియొక్క విజయాన్ని చాటుతుంది "భగవద్గీత" మహాభారతంలోని ఒక ప్రధాన భాగం తన వర్ణమూ, వర్గమూ నిర్దేశించిన

కర్తవ్యాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా అన్ని సందర్భాలలోనూ మానవుడు ఆచరించాలని "భగవద్గీత" బోధిస్తుంది

పురాణాలు ఇతిహాసాల దారిలోనే నడిచాయి తొలి పురాణాలు గుప్తుల కాలంలోనే రూపాన్ని పొందాయి సాధారణ ప్రజల విజ్ఞానాన్ని అభివృద్ధి చేయటం కోసం ఈ పురాణాలలో పురాణగాధలూ, వీరగాథలూ, నీతిబోధలూ ఉంటాయి ఈ కాలంలోనే "స్మృతులు" అనే ధర్మశాస్త్రాలు కూడా సంకలనం చేయబడ్డాయి ఇవి పద్య ఛందస్సులలో రాయబడ్డాయి ధర్మశాస్త్రాలకు వ్యాఖ్యానాలు రాయటం మాత్రం గుప్తుల తరువాత కాలంలో ప్రారంభమైంది

పాణిని, పతంజలి చేసిన కృషి ప్రాతిపదికగా గుప్తుల కాలంలో సంస్కృత వ్యాకరణం అభివృద్ధి చెందింది ఇదే కాలంలో అమరసింహుడు "అమరకోశా"న్ని కూర్చాడు అమర సింహుడు రెండవ చంద్రగుప్తుని ఆస్థానంలో ఉండిన విద్వాంసులలో ఒకడు సంప్రదాయ పద్ధతిలో సంస్కృతం నేర్చుకునే విద్యార్థులు ఈ నిఘంటువును నోటికి నేర్చుకునే వారు సాంప్రదాయిక సాహిత్య చరిత్రలో గుప్తుల యుగం ఉజ్వలమైన కాలం ఈ సాహిత్యం – అంతకుపూర్వం ప్రజాదరణ పొందుతూ ఉండిన లలితమైన శైలిస్థానంలో, పదాడంబరం ఉన్న శైలిని ప్రవేశపెట్టింది ఈ యుగం నుంచీ గద్యం కంటే పద్యానికి ప్రాధాన్యత పెరిగింది గుప్తుల రాజభాష నిస్సందేహంగా సంస్కృతమే ఈ కాలంలో ఎక్కువగా బ్రాహ్మణీయ సాహిత్యం వచ్చినా – లౌకిక, మతాతీత సాహిత్యం కూడా ఈ కాలంలోనే మొగ్గలు తొడగటం ప్రారంభించింది.

## సైన్సు, సాంకేతిక విజ్ఞానం

ఈ కాలంలోనే గణిత శాస్త్రంలో ప్రసిద్ధి పొందిన "ఆర్యభటీయం" ఉదయించింది దీన్ని రచించిన ఆర్యభట పాటలీపుత్రానికి చెందినవాడు ఈ గణిత శాస్త్రవేత్త అనేక రకాలైన గణితశాస్త్ర పద్ధతులను తెలిసిన వాడుగా ఉన్నాడు క్రీ శ 448లో అలహాబాదు జిల్లాలో గుప్తులు వేయించిన శాసనాన్ని పరిశీలిస్తే భారతదేశంలో 5 వ శతాబ్దానికే దశాంశ పద్ధతిని గురించి తెలుసునని అర్థమౌతుంది. ఆ కాలంలోనే ఖగోళ శాస్త్రం మీద "రోమక సిద్ధాంతం" అన్న గ్రంథం రచించబడింది ఈ గ్రంథం – దాని పేరు సూచిస్తున్నట్టుగా – రోమన్ సిద్ధాంతాల చేత ప్రభావితమైంది

ఇనుముతోనూ, కంచుతోనూ పనిచేసిన గుప్త రాజుల కాలంనాటి చేతివృత్తులవారు గొప్ప కళాకౌశలాన్ని ప్రదర్శించారు అభివృద్ధి చెందిన లోహవిజ్ఞానాన్ని ఉపయోగించి పెద్ద సంఖ్యలో బుద్ధుని కంచు విగ్రహాలను చేశారు ఇనుప వస్తువుల్ని గురించి చెప్పవలసి వస్తే ఢిల్లీలో మెహ్రోలీ ప్రాంతంలో ప్రతిష్ఠింపబడి వున్న ఇనుప స్థంభాన్ని అత్యుత్తమ ఉదాహరణంగా చెప్పాలి ఈ స్థంభం క్రీ శ 4 వ శతాబ్దంలో పోత పోయబడింది గత 15 శతాబ్దాలుగా దీనికి చిలుము పట్టలేదు ఇది ఆనాటి సాంకేతిక కార్మికుల గొప్పదనానికి నిదర్శనం సుమారు వంద సంవత్సరాల క్రితం వరకూ పాశ్చాత్య దేశాల్లో ఇంత పెద్ద ఇనుప స్థంభాన్ని ఎలా పోతపోయాలో తెలియదు కానీ తరువాతి కాలంలోని లోహకార్మికులు ఈ విజ్ఞానాన్ని కొనసాగించలేకపోవటమే విషాదం

★ ★ ★

# అధ్యాయం: 22

# తూర్పుభారతదేశంలో నాగరికత విస్తరణ

## నాగరికతా చిహ్నాలు

ఒక ప్రాంతంలోని ప్రజలు రాతను తెలిసినవారైతే, వారికి ఒక పన్నుల విధానమూ, శాంతిభద్రతల విధానమూ ఉంటే, వారి సమాజంలో సామాజిక వర్గాలూ, పురోహిత, పరిపాలనా విధులు నిర్వహించటం కోసం ప్రత్యేక నైపుణ్యం కలిగిన నిపుణులూ ఉంటే ఆ ప్రాంతాన్ని నాగరిక ప్రాంతమంటారు అన్నిటికంటే ముఖ్యంగా నాగరిక సమాజం – ఉత్పత్తి చేసేవారికి మాత్రమే కాకుండా, ఉత్పత్తితో సంబంధంలేని వారికి కూడా సరిపోయే ఆహారాన్ని ఉత్పత్తి చేయగలిగి ఉండాలి ఈ లక్షణాలన్నీ కలిసినప్పుడే నాగరికత రూపొందుతుంది ఈ లక్షణాలన్నీ చాలా ఆలస్యంగా తూర్పు భారతదేశంలోని విశాల ప్రాంతంలో కనిపించటం ప్రారంభించాయి క్రీ శ 4వ శతాబ్దం మధ్యకాలం వరకూ తూర్పు మధ్యప్రదేశ్‌లోనూ, దాన్ని అనుకొని ఉన్న ఒరిస్సాలోనూ, పశ్చిమబెంగాల్‌లోనూ, బంగ్లాదేశ్‌లోనూ, అస్సాంలోనూ నాగరికతకు సంబంధించిన ఎలాంటి ఆధారాలూ లభించలేదు

క్రీ శ 4 వ శతాబ్దం నుంచీ 7 వ శతాబ్దం వరకూ చాలా ముఖ్యమైన కాలం ఆ కాలంలో మధ్యప్రదేశ్‌లోనూ, ఒరిస్సాలోనూ, తూర్పు బెంగాల్‌లోనూ, బెంగాల్ ఆగ్నేయ ప్రాంతంలోనూ, అస్సాంలోనూ అభివృద్ధి చెందిన గ్రామీణ ఆర్థిక వ్యవస్థ విస్తరించటమూ, రాజ్యవ్యవస్థలూ, సామాజిక వర్గాలూ ఏర్పడటమూ జరిగాయి ఈ విషయాలను విశాల ప్రాంతంలో లభిస్తున్న గుప్త రాజుల శాసనాలు నిరూపిస్తున్నాయి ఈ శాసనాలలో ఎక్కువభాగం గుప్త శకాన్ని పరిగణనలోకి తీసుకొని సంవత్సరాలను లెక్కిస్తాయి ఇవి సామంత రాజులు – బౌద్ధులకూ, బ్రాహ్మణులకూ, వైష్ణవదేవాలయాలకూ, బౌద్ధారామాలకూ ఇచ్చిన భూదాన శాసనాలు ఈ దానాలను పొందినవారు అభివృద్ధి చెందిన నాగరికతను విస్తరింప చేయటంలోనూ, బలోపేతం చేయటంలోనూ కీలకమైన కృషిని చేశారు ప్రాంతాల వారీగా సమీక్షించటం ద్వారా ఈ పరిణామాన్ని చక్కగా అర్థం చేసుకోవచ్చు

## ఒరిస్సా, మధ్యప్రదేశ్ తూర్పు, దక్షిణ ప్రాంతాలు

అశోకుని కాలంలో కళింగ (మహానదికి దక్షిణంగా ఉన్న ఒరిస్సా సముద్రతీరప్రాంతం) ప్రాధాన్యతను సంతరించుకుంది కానీ అక్కడ ఒక బలమైన రాజ్యం క్రీ పూ మొదటి శతాబ్దం వరకూ ఏర్పడలేదు కళింగ రాజైన ఖారవేలుడు మగధ వరకూ తన రాజ్యాన్ని విస్తరింప చేశాడు క్రీ శ ఒకటి రెండు శతాబ్దాల్లో ఒరిస్సా రేవులనుంచి ముత్యాలూ, దంతాలూ, మస్లిన్‌ల వ్యాపారం బాగా జరిగింది భువనేశ్వర్‌కు 60 కి మీ దూరంలో ప్రాచీన కాలంలో కళింగ నగరి ప్రాంతమైన శిశుపాలఘర్ దగ్గర జరిగిన తవ్వకాల్లో అనేక రోమన్ వస్తువులు బయటపడ్డాయి అవి కళింగ, రోమన్ రాజ్యాల మధ్య వ్యాపారం ఉండటాన్ని సూచిస్తున్నాయి కళింగ నగరి ఖారవేలుని రాజధానిగా ఉండేది కానీ ఒరిస్సాలో ఎక్కువ భాగంలో, ముఖ్యంగా ఉత్తర ఒరిస్సాలో రాజ్య నిర్మాణమూ జరగలేదు, వ్యాపారమూ అభివృద్ధి చెందలేదు నాలుగవ శతాబ్దంలో సముద్రగుప్తుడు జయించిన ప్రాంతాలలో కోసల, మహాకాంతార ప్రాంతాలున్నాయి అవి కొంతవరకూ ఉత్తర, పశ్చిమ ఒరిస్సాలో భాగాలుగా ఉండేవి నాలుగవ శతాబ్దం రెండవ భాగం నుంచీ ఆరవ శతాబ్దం వరకూ ఒరిస్సాలో అనేక రాజ్యాలు తలెత్తాయి వాటిలో ఐదింటిని స్పష్టంగా గుర్తించవచ్చు వీరిలో అందరికంటే ముఖ్యమైనవారు "మాఠరలు" లేదా "పితృభక్తులు" ఉచ్ఛదశలో ఉన్నప్పుడు వీరు మహానది, కృష్ణానదుల మధ్య ఉన్న ప్రాంతాన్ని పరిపాలించారు వీరి రాజ్యంయొక్క పరిహద్దులలో ఉండిన సమకాలికులు వశిష్ఠులూ, నళులూ, మానులు వీరిలో వశిష్ఠులు కళింగ, ఆంధ్ర దేశాల సరిహద్దులో పరిపాలించారు నళ వంశపు రాజులు మహాకాంతార అరణ్య ప్రాంతాన్ని పరిపాలించారు మాన వంశపు రాజులు మహానదికి ఉత్తరంగా కోస్తా ప్రాంతాన్ని పరిపాలించారు వీరందరూ కూడా తమ సొంత పన్నుల విధానాన్నీ, పరిపాలనా విధానాన్నీ, సైనిక

విధానాన్నీ రూపొందించుకున్నారు నళ వంశపు రాజులూ, బహుశా మాన వంశపు రాజులూ తమ సొంత ద్రవ్యవిధానాన్ని కూడా కలిగి ఉండేవారు ఈ రాజులందరూ కూడా బ్రాహ్మణులను ప్రోత్సహించారు వారికి భూదానాలిచ్చారు ఇతర ప్రాంతాలనుండీ కూడా బ్రాహ్మణులను ఆహ్వానించారు వీరిలో చాలామంది రాజులు ఆధ్యాత్మిక శక్తికోసం మాత్రమే కాకుండా రాజకీయ బలంకోసమూ, దర్పంకోసమూ, వంశ పారంపర్య హక్కును భద్రం చేసుకోవటంకోసమూ వైదిక యజ్ఞాలను చేశారు

ఈ కాలంలో అభివృద్ధి చెందిన నాగరికత కళింగ తీరప్రాంతానికి మాత్రమే పరిమితంగా ఉండలేదు ఒరిస్సాలోని ఇతర ప్రాంతాలకు కూడా విస్తరించింది నళరాజులు ముద్రించిన బంగారు నాణాలు మధ్యప్రదేశ్‌లోని గిరిజన ప్రాంతమైన బస్తర్‌లో లభించటం గమనించదగ్గ విషయం దీన్ని పరిశీలిస్తే పెద్ద వ్యాపార లావాదేవీలకూ, పెద్ద ఉద్యోగుల జీతాలకూ బంగారు నాణాలను చెల్లించే విధానం అమలులో ఉండేదని అర్థమౌతుంది అలాగే మాన వంశపు రాజులు రాగి నాణాలను ముద్రించారు వాటిని చేతివృత్తులవారూ, సన్నకారు రైతులు కూడా ఉపయోగించి ఉండవచ్చు గ్రామీణ ప్రాంతాలలో కొత్త ఆదాయ పద్ధతులను సృష్టించుకొని ప్రతి రాజ్యమూ కూడా తన ఆర్థిక పరిస్థితిని మెరుగుపరచుకున్నది మాతర రాజులు మహేంద్ర పర్వత ప్రాంతాలలో “మహేంద్రభోగం” అన్న కొత్త జిల్లాను సృష్టించారు బహుశా ఈ జిల్లా నుంచి ఏనుగు దంతాలూ, ప్రభుత్వోద్యోగులకు బియ్యపు గంజి లభించేవి ఈ జిల్లా వెనుకబడ్డ ప్రాంతంలో ఉండి ఉండవచ్చు మాతర రాజులు బ్రాహ్మణులకు అగ్రహారాలను ఇచ్చారు ఆ గ్రామాలలోని భూముల మీద వచ్చే ఆదాయాన్ని బ్రాహ్మణులు మత, విద్యా కార్యక్రమాలమీద ఖర్చు పెట్టవలసి ఉండేది ఇతర ప్రాంతాలలో బ్రాహ్మణులు అగ్రహారాలమీద పన్ను చెల్లించవలసిన అవసరం ఉండేదికాదు కానీ ఒరిస్సాలో అగ్రహారాలమీద పన్నులుండేవి బ్రాహ్మణులకు భూదానాలను గిరిజన ప్రాంతాలలో, అరణ్య ప్రాంతాలలో, ఎఱ్ఱ రేగడి నేలలున్న ప్రాంతాలలో ఇవ్వటంచేత వారు మెరుగైన వ్యవసాయ పద్ధతులను ఆ ప్రాంతాలలో ప్రవేశ పెట్టారు ఆ వ్యవసాయ పద్ధతులు వాతావరణ పరిస్థితిని గురించి బ్రాహ్మణులకున్న జ్ఞానంమీద ఆధారపడి ఉండేవి సాధారణంగా సంవత్సరాన్ని మూడు భాగాలుగా విభజించేవారు ఒక్కొక్క భాగంలో నాలుగు నెలలుండేవి ఈ మూడు భాగాల ఆధారంగా కాలాన్ని లెక్కకట్టేవారు క్రీ శ 5 వ శతాబ్దం మధ్యభాగంలో మాతర రాజుల కాలంలో సంవత్సరాన్ని పన్నెండు చాంద్రమాసాలుగా విభజించటం ప్రారంభమైంది అంటే – వారికి వాతావరణ పరిస్థితులు బాగా అర్థమయ్యాయన్న మాట ఈ విజ్ఞానం వ్యవసాయ కార్యకలాపాలకు బాగా పనికి వచ్చింది

క్రీ పూ 3 వ శతాబ్దం నుంచీ ఒరిస్సా తీరప్రాంతంలోని ప్రజలకు రాత తెలుసుననటానికి ఎలాంటి సందేహమూ లేదు క్రీ శ 4 వ శతాబ్దం మధ్యభాగం వరకూ ఆ ప్రాంతపు శాసనాల్లో ప్రాకృతం ఉపయోగించబడింది ఆ తరువాత సంస్కృతం ఉపయోగించబడింది సంస్కృత శాసనాలు ఒరిస్సా సముద్రతీర ప్రాంతంలోనే కాకుండా మహానదికి ఉత్తర ప్రాంతంలో కూడా లభించటం విశేషం అలా సంస్కృతం, లిపి విజ్ఞానం ఒరిస్సాలోని ఎక్కువ భాగంలో విస్తరించి ఉండేవి ఆ కాలపు శాసనాలలో అత్యున్నత స్థాయికి చెందిన సంస్కృత శ్లోకాలు ఉన్నాయి సంస్కృతం బ్రాహ్మణీయ మతానికీ, సంస్కృతికీ మాత్రమే కాకుండా కొత్త ప్రాంతంలో ఆస్తి చట్టాలకూ, సామాజిక నియమాలకూ కూడా మాధ్యమంగా ఉపయోగపడింది శాసనాలలో పురాణాలలోనుంచీ, ధర్మశాస్త్రాలలోనుంచీ శ్లోకాలను ఉటంకించారు రాజులు తాము వర్ణధర్మానికి రక్షకుల మని ప్రకటించుకున్నారు గంగా మైదాన సంస్కృతికీ, స్థానిక ప్రజలకూ మధ్య ఉన్న సంబంధం ఎత్తి చూప బడింది ప్రయాగ వద్ద గంగా, యమునా నదుల సంగమ స్థానంలో స్నానం చేయటం పవిత్ర కార్యంగా పరిగణించబడింది యుద్ధాలలో గెలిచిన రాజులు కూడా ప్రయాగను దర్శించేవారు

## బెంగాల్

బెంగాల్‌కు సంబంధించి ఈనాడు బోగ్రా జిల్లాగా పిలవబడే ఉత్తర బెంగాల్ ప్రాంతంలో అశోకుని కాలంలోనే రాత అమలులో ఉన్నట్టుగా ఆధారాలు లభించాయి అనేక గ్రామాల్లో బౌద్ధ భిక్షువులకోసం నాణాలనూ, ఆహార పదార్థాలనూ దాచి వుంచే సంప్రదాయం ఉన్నట్టుగా ఒక శాసనం చెబుతోంది స్థానిక వ్యవసాయదారులు తమ పంటలో కొంత భాగాన్ని పన్నుల కోసమూ, దాన ధర్మాల కోసమూ ఉపయోగించే స్థితిలో ఉన్నట్టుగా స్పష్టంగా తెలుస్తోంది అంతేకాకుండా, ఈ ప్రాంతంలోని ప్రజలకు ప్రాకృతం తెలుసు వారు బౌద్ధమతాన్ని అనుసరించేవారు క్రీ పూ రెండవ శతాబ్దంలోనే బెంగాల్ ఆగ్నేయ ప్రాంతంలోని నవఖాలీ జిల్లాలోని ప్రజలకు ప్రాకృత భాషా, బ్రాహ్మీ లిపి తెలుసునని ఆ ప్రాంతంలో దొరికిన ఒక శాసనం తెలియజేస్తుంది కానీ క్రీ శ నాలుగవ శతాబ్దం వరకూ బెంగాల్‌లోని అధిక భాగాన్ని గురించి మనకేమీ తెలియదు నాలుగవ శతాబ్దం మధ్య భాగంలో బంకూరా జిల్లాలో దామోదర్ నదీతీరంలో పోఖర్నా రాజధానిగా “మహారాజ” అన్న బిరుదం ఉన్న ఒక రాజు పరిపాలించాడు అతనికి

సంస్కృతం తెలుసు అతడు విష్ణుభక్తుడు విష్ణు పూజకు బహుశా అతడు ఒక గ్రామాన్ని దానం చేశాడు కూడా

ఐదు, ఆరు శతాబ్దాల్లో గంగా, బ్రహ్మపుత్ర నదుల మధ్య ఈనాడు బంగ్లాదేశ్‌లో ఉన్న ప్రాంతంలో జన నివాసం స్థిరపడింది ఆ ప్రాంతం సంస్కృతం తెలిసిన ప్రాంతంగా కూడా ప్రసిద్ధి పొందింది క్రీ శ 550 తరువాత గుప్త రాజుల గవర్నర్లు (రాజప్రతినిధులు) స్వతంత్రించి బెంగాల్ ఉత్తర ప్రాంతాన్ని ఆక్రమించుకున్నారు మరికొంతభాగాన్ని కామరూప రాజులు ఆక్రమించుకొని ఉండవచ్చు స్థానిక సామంత రాజులు కూడా తమ సొంత పరిపాలనా వ్యవస్థను స్థాపించుకొని, సైనిక వ్యవస్థను అభివృద్ధి చేసుకున్నారు అందులో ఆశ్విక దళమూ, ఏనుగులూ, పదాతులూ ఉండేవారు నావలు కూడా ఉండేవి ఈ సైనిక బలాన్ని వారు శత్రువులతో పోరాడటానికీ, స్థానిక వ్యవసాయదారుల వద్దనుంచీ పన్నులు వసూలు చేయటానికీ ఉపయోగించేవారు క్రీ శ 600 సంవత్సరానికల్లా ఈ ప్రాంతాన్ని గౌడ ప్రాంతమని పిలిచేవారు అది స్వతంత్ర రాజ్యంగా ఉండేది ఈ రాజ్యాన్ని హర్షుని శత్రువైన శశాంకుడు పరిపాలించేవాడు

క్రీ శ. 432–33 నుంచీ ఒక శతాబ్దంపాటు పుండ్రవర్ధన భుక్తి ప్రాంతంలో వరసగా భూవిక్రయాలు జరిగాయి వాటికి సంబంధించిన రాగి శాసనాలు ఆ ప్రాంతంలో లభించాయి పుండ్రవర్ధన భుక్తి ప్రాంతమంటే ఈనాడు బంగ్లాదేశ్‌లో ఎక్కువగా ఉన్న ఉత్తర బెంగాల్ ప్రాంతం బంగారు దీనారాలు చెల్లించి ఆ భూముల్లో ఎక్కువ భాగాన్ని కొనుగోలు చేశారు భూముల్ని మత కార్యక్రమాలకు దానంగా ఇస్తే దాన్ని స్వీకరించినవారు పన్నులు కట్టవలసిన అవసరం ఉండేదికాదు గుప్తుల రాజప్రతినిధులు అధికారంలో ఉన్న కాలంలో స్థానిక పరిపాలనలో ప్రముఖ లేఖకులకూ, వ్యాపారులకూ, చేతివృత్తుల కళాకారులకూ, భూస్వాములకూ, ఇతరులకూ ఎలాంటి పాత్ర ఉండేదో ఈ పత్రాలు తెలుపుతున్నాయి ఈ అమ్మకపు పత్రాలు వివిధ సామాజిక వర్గాల అస్తిత్వాన్ని గురించీ, స్థానిక అధికారులను గురించీ మాత్రమే కాకుండా వ్యవసాయ విస్తరణను గురించికూడా విలువైన సమాచారాన్ని అందజేస్తాయి మత కార్యక్రమాలకోసం కొనుగోలు చేసిన భూమిలో ఎక్కువభాగం వ్యవసాయంకిందలేని బంజరుగా ఉండేది అందుచేత దానికి పన్ను కట్టవలసిన అవసరం ఉండేది కాదు ఈ పొలాలను అమ్మటం వెనక ఉన్న కారణాలు – వాటిని సాగులోకి తీసుకురావటమూ, జననివాసాన్ని ప్రోత్సహించటమూ అని, అనటానికి ఎలాంటి సందేహమూ లేదు

ఆగ్నేయ బెంగాల్‌లోని బ్రహ్మపుత్ర డెల్టా ప్రాంతాన్ని "సమతాత" అని పిలిచేవారు క్రీ శ నాలుగవ శతాబ్దంలో ఈ ప్రాంతం సముద్రగుప్తుని ఆధిపత్యాన్ని అంగీకరించవలసి వచ్చింది ఈ ప్రాంతంలోని కొంతభాగంలో జన నివాసం ఉండటం చేత కాబోలు అది గుప్త చక్రవర్తి దృష్టిని ఆకర్షించింది కానీ బహుశా ఈ ప్రాంతాన్ని పరిపాలించినవారు బ్రాహ్మణ మతావలంబకులైన రాజులు కారు అందుచేత వారు ఉత్తర బెంగాల్‌లో లాగా సంస్కృతాన్ని ఉపయోగించలేదు వర్ణవ్యవస్థను పాటించలేదు సుమారు క్రీ శ 525 తరువాత ఈ ప్రాంతంలో సమతాత, వంగ ప్రాంతాలు కలిసి ఒక సువ్యవస్థిత రాజ్యంగా ఏర్పడ్డాయి దాన్ని సమతాత దేశమని కానీ వంగదేశమని కానీ పిలిచేవారు ఈ దేశపు రాజులు ఆరవ శతాబ్దం రెండవ భాగంలో బంగారు నాణాలను ముద్రించారు వీరిలో హరదేవుడన్న రాజు కూడా ఉన్నాడు

దీనికితోడు ఏడవ శతాబ్దంలో ఈనాటి ఢాకా ప్రాంతంలో "ఖడ్గ" వంశపువారి రాజ్యం ఉండేది "ఖడ్గ" వంశీయులంటే ఖడ్గవిద్య నిపుణులని అర్థం ఇవికాక లోకనాథులన్న బ్రాహ్మణ సామంత రాజులు, రథులన్న మరొక వంశపు రాజులూ కోమిలా ప్రాంతంలో ఉండేవారు బెంగాల్ ఆగ్నేయ భాగంలోనూ, మధ్యభాగంలోనూ ఉండిన ఈ రాజులందరూ ఆరు, ఏడు శతాబ్దాల్లో భూదానాలు చేసినట్టుగా ఆధారాలున్నాయి ఒరిస్సా రాజులలాగా వీరుకూడా అగ్రహారాలను సృష్టించారు వీరు సంస్కృతాన్ని బాగా పోషించినట్టుగా వీరి శాసనాలు నిరూపిస్తాయి వీరి శాసనాల్లో చాలా నాజూకైన ఛందస్సులు కూడా కనిపిస్తాయి క్రీ శ ఏడవ శతాబ్దంలోనే తమ శత్రువుల వ్యవసాయ భూములనూ, గ్రామాలనూ వీరు ఆక్రమించుకున్నట్టుగా కూడా ఈ శాసనాలు పేర్కొంటాయి బెంగాల్, ఒరిస్సాల మధ్యప్రాంతంలో "దండభుక్తి" అన్న పేరుతో వీరు ఆర్థిక – పరిపాలనా వ్యవస్థ నొకదాన్ని ఏర్పరచారు "దండం" అంటే శిక్ష "భుక్తి" అంటే "అనుభవం" ఆ ప్రాంతంలోని గిరిజన జాతులవారిని హద్దుల్లో ఉంచటంకోసమూ, హద్దు దాటితే శిక్షించటంకోసమూ ఈ వ్యవస్థను ఏర్పాటు చేసి ఉండవచ్చు ఈ వ్యవస్థ సంస్కృత విద్యనూ, సంస్కృతినీ గిరిజన ప్రాంతాలలో ప్రచారం చేయటానికి కూడా దోహదం చేసి ఉండవచ్చు ఏడవ శతాబ్ద కాలానికి చెందిన "వర్ధమాన భుక్తి" (బర్ద్వాన్) అలాంటిదే కావచ్చు ఆగ్నేయ బెంగాల్ ప్రాంతంలో బౌద్ధారామానికి దానంగా ఇచ్చిన ఐదు భూఖండాలు బురదప్రాంతాలే అవి ఫరీద్‌పూర్ జిల్లాలో ఉండేవి వాటిమీద రాజ్యానికి ఎలాంటి పన్నులూ లభించేవి కావు అలాగే కోమిలా జిల్లాలో 200 మంది బ్రాహ్మణులకు విశాలమైన ప్రాంతం దానంగా ఇవ్వబడింది ఆ ప్రాంతంలో పుష్కలంగా జింకలూ, దుప్పులూ, అడవి దున్నలూ, పులులూ, పాములూ ఉండేవి కొత్తప్రాంతాలను ఆక్రమించుకోవటంకోసమూ, నాగరికతను వ్యాపింపచేయటంకోసమూ ఈ దానాలు జరిగాయని నిరూపించటానికి ఈ ఉదాహరణలు చాలు

ఐదవ శతాబ్దం మధ్యభాగంనుంచీ దాదాపు రెండు శతాబ్దాల కాలం బెంగాల్ చరిత్రలో గొప్ప మార్పులు వచ్చిన కాలం ఈ కాలంలో దాదాపు అరడజను రాజ్యా లేర్పడ్డాయి వీటిలో కొన్ని పెద్దవి, మరికొన్ని చిన్నవి, కొన్ని స్వతంత్ర మైనవి, మరికొన్ని కప్పాలు కట్టేవి కానీ ప్రతి రాజ్యమూ తన సొంత భూసైన్యాన్నీ, అశ్విక దళాన్నీ, ఏనుగులనూ, నావికాదళాన్నీ కలిగి ఉండేది, వాటికోసం ప్రత్యేక స్థావరాలనో, విజయప్రాంగణాలనో కలిగి ఉండేది ప్రతి రాజ్యానికీ సొంత ఆర్థిక, పరిపాలనా మండలాలుండేవి వారు పన్నులు వసూలు చేయటం, శాంతిభద్రతల్ని రక్షించటంలాంటి విధుల్ని నిర్వహించేవారు అందుకు తగిన ఉద్యోగి వ్యవస్థ వారికి ఉండేది వీరు యుద్ధాల ద్వారానూ, బౌద్ధులకూ, బ్రాహ్మణులకూ భూదానాలు ఇవ్వటం ద్వారానూ రాజ్య విస్తరణ చేసేవారు భూదానాలు ఎంతగా ఎక్కువైపోయాయంటే – వాటి వ్యవహారాలను పర్యవేక్షించటానికి "అగ్రహారిక" అన్న అధికారిని నియమించవలసి వచ్చింది భూదానాలు గ్రామాల విస్తరణకు దోహదం చేశాయి కొత్త హక్కుల్ని సృష్టించాయి సాధారణంగా భూమి కుటుంబాల అధీనంలో ఉండేది కానీ పొలాన్ని అమ్మటం, కొనటం స్థానిక సామాజిక సంఘాల పర్యవేక్షణలో జరిగేది అందులో ముఖ్యమైన చేతివృత్తులవారూ, వ్యాపారులూ, భూస్వాములూ, లేఖకులూ ప్రధాన సభ్యులుగా ఉండేవారు ఈ సంఘానికి అధికారం ఉన్నా – భూముల్ని అమ్మటం, కొనటం విషయంలో వీరు సాధారణ రైతుల్ని కూడా సంప్రదించేవారు ఈ సంఘాలు స్థానిక రాజ ప్రతినిధులకు కూడా సహకారాన్ని అందించేవి మొదట తెగకానీ, సమాజంకానీ భూమిని ఇవ్వగలిగేవి ఎందుకంటే – మొత్తం భూమిమీద హక్కు లభించినా, వారు తమ భూముల్ని దానం చేయగలిగిన అధికారం కలిగి ఉన్నా, సమాజమూ, తెగా తమ ఆధిపత్యాన్ని పూర్తిగా వదులుకోలేదు అప్పుడుకూడా వాటి మాటకు విలువ ఉండేది బహుశా మొదట సమాజమే మత కార్యకలాపాల కోసం మతాధికారులకు భూముల్ని ఇచ్చేది, పన్నుల్ని వసూలు చేసి రాజుకు చెల్లించేది అలా సైనిక, రాజకీయ కార్యకలాపాలు కొనసాగటానికి సహకరించేది తరువాత కాలంలో రాజు సమాజంనుంచీ కొంతభూమిని పొందాడు మరికొంతభూమిని బలవంతంగా ఆక్రమించుకున్నాడు తానే స్వయంగా భూదానాలు చేసే స్థితికి వచ్చాడు రాజుకు పన్నులు విధించే అధికారం ఉండేది అలాగే బంజరు భూములమీద హక్కు ఉండేది ప్రతి రాష్ట్రంలోనూ ఉన్న అధికారులకు అధికార భాషయిన సంస్కృతంతో పరిచయం ఉండేది అంతేకాకుండా, పురాణాలను గురించీ, ధర్మశాస్త్రాలను గురించీ కూడా వారికి పరిజ్ఞానం ఉండేది నాగరికత ఈ ప్రాంతంలో విస్తరించటంచేత ఈ కాలానికి ప్రత్యేక ప్రాధాన్యత ఉంది

## అస్సాం

బ్రహ్మపుత్రలోయలో తూర్పు పడమరలకు వ్యాపించి ఉన్న "కామరూపం" ఏడవ శతాబ్దంలో ప్రాధాన్యతను సంతరించుకుంది కానీ క్రీ శ నాలుగవ శతాబ్దం నుంచే జననివాసాలు ఉన్నట్టుగా గౌహతి సమీపంలోని అంబారీవద్ద జరిగిన తవ్వకాలు చెబుతున్నాయి అదే శతాబ్దంలో దావక ప్రాంతంనుంచీ సముద్రగుప్తుడు కప్పం స్వీకరించినట్టుగా ఆధారాలున్నాయి దావక ప్రాంతం కామరూపంలోని నవ్‌గాంగ్ జిల్లా కావచ్చు సముద్రగుప్తునికి తలవంచిన ఆ రాజులు గిరిజనులనుంచీ పన్నులు వసూలుచేసుకుంటూ ఉండినవారు కావచ్చు

అంబారీలో జరిగిన తవ్వకాలలో బయటపడ్డ జన నివాసాలు ఆరు, ఏడు శతాబ్దాలలో బాగా అభివృద్ధి చెందిన దశలో ఉన్నట్టుగా నిరూపిస్తాయి ఆ కాలపు శాసనాలు కూడా ఈ విషయాన్ని బలపరుస్తాయి కామరూప రాజులు "వర్మ" అన్న బిరుదాన్ని స్వీకరించారు ఈ బిరుదం భారతదేశంలోని ఉత్తర, మధ్య, పశ్చిమ ప్రాంతాల్లోనే కాకుండా బెంగాల్, ఒరిస్సా, ఆంధ్ర, తమిళనాడు ప్రాంతాల్లో కూడా ఉపయోగంలో ఉండేది వీరు బ్రాహ్మణులకు భూదానాలు ఇవ్వటంద్వారా తమ స్థానాన్ని సుస్థిరం చేసుకున్నారు ఏడవ శతాబ్దంలో భాస్కర వర్మ అన్నరాజు బ్రహ్మపుత్రలోయను మాత్రమే కాకుండా మరికొన్ని ఇతర ప్రాంతాలనుకూడా ఆక్రమించుకొని, ఆ రాజ్యానికి రాజయ్యాడు బౌద్ధమతం కూడా ఇక్కడ స్థానాన్ని సంపాదించుకొంది చైనా యాత్రికుడు హ్యూయాన్‌త్సాంగ్ కూడా ఈ రాజ్యాన్ని సందర్శించాడు

## రూపుదిద్దుకున్న దశ

తూర్పు భారతదేశంలోని వేరు వేరు ప్రాంతాలు వేరు వేరు సమయాల్లో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి కానీ అవి రూపుదిద్దుకున్న దశ మాత్రం నాలుగు – ఏడు శతాబ్దాల మధ్యకాలమే ఆ కాలంలో రాత, సంస్కృత పాండిత్యమూ, వైదిక కర్మకాండ, బ్రాహ్మణీయ సామాజిక వర్గాలు, రాజ్యవ్యవస్థ తూర్పుమధ్యప్రదేశ్‌లోనూ, ఉత్తర ఒరిస్సాలోనూ, పశ్చిమ బెంగాల్‌లోనూ, బంగ్లాదేశ్‌లోని ఎక్కువ ప్రాంతంలోనూ, అస్సాంలోనూ విస్తరించాయి గుప్త సామ్రాజ్యంతో ఏర్పడ్డ సాంస్కృతిక సంబంధాలు తూర్పు భారతదేశ ప్రాంతంలో నాగరికత విస్తరించటానికి ఎంతగానో తోడ్పడ్డాయి బెంగాల్ ఉత్తర భాగమూ, ఒరిస్సా వాయవ్య భాగమూ గుప్తుల పరిపాలన కిందికి వచ్చాయి తూర్పు భారతదేశంలోని ఇతర ప్రాంతాల్లో కూడా గుప్తసామ్రాజ్య

ప్రభావం ఉండేది దాన్ని ఆ ప్రాంతంలో గుప్త శకాన్ని ఉపయోగిస్తూ ఉండటంలో గుర్తించవచ్చు బెంగాల్ లో కొత్త సామంత రాజ్యాలు అవతరించాయి వారు తమ సైనిక స్థావరాల్లో పెద్ద సంఖ్యలో ఏనుగులనూ, అశ్విక దళాన్నీ, నావికాదళాన్నీ పోషించేవారు వారు ఈ స్థిర సైన్యాలను పోషించటం కోసం గ్రామీణుల నుంచీ పన్నులు వసూలు చేసేవారు మొదటిసారిగా ఈ ప్రాంతంలో ఐదు – ఆరు శతాబ్దాల్లో పెద్ద ఎత్తుల్లో రాత ప్రారంభమైంది సంస్కృత భాష ఉపయోగం పెరిగింది వర్ణసమాజం విస్తరించింది బౌద్ధమతం యొక్క ప్రాబల్యం అభివృద్ధి చెందింది శైవ, వైష్ణవ మతాల రూపంలో బ్రాహ్మణమతంకూడా విస్తరించింది భూమి మీద ఉమ్మడి అధికారం ఉండేదని నిరూపించటానికి అవసరమైన సాక్ష్యాధారాలు లభించాయి కానీ భూమి మీద వ్యక్తిగత అధికారంకూడా ఆ కాలంలో ఉండేది బంగారు నాణాలను చెల్లించి భూమిని కొనుక్కోవటానికి వీలుండేది ఈ అభిప్రాయాల ఆధారంగా అనాడు ఆహార ఉత్పత్తి ఆర్థిక విధానం తూర్పు భారతదేశంలో అమలులో ఉండేదని భావించవచ్చు ఆ ఆర్థిక విధానం ఇనుప కర్రున్న నాగలిని ఉపయోగించటంమీదా, నీరు పెట్టి సాగుచేసే వరిపంటమీదా, అనేక చేతిపనుల విజ్ఞానం మీదా ఆధారపడి ఉండేదని భావించవచ్చు వంగదేశంలో వరి నారు నాటటాన్ని గురించి కాళిదాసు ప్రస్తావించాడు కానీ ఆ అలవాటు వారికి మగధనుంచీ సంక్రమించిందో లేక వారే అభివృద్ధి చేసుకున్నదో మనకు తెలియదు బెంగాల్ ఉత్తర ప్రాంతంలో మంచి చెరుకును పండించేవారు ఆ ప్రాంతంలో తగినంత వ్యవసాయం ఉండేదని నిరూపించటానికి ఇవి ఆధారాలుగా ఉపయోగపడతాయి ఆ వ్యవసాయం ప్రజలనూ, ప్రభుత్వాన్నీ పోషించ గలిగేది జన నివాసం తక్కువగావున్న ప్రాంతాల్లోనూ, జన నివాసం అసలు లేని ప్రాంతాల్లోనూ – జన నివాసం అభివృద్ధి చెందటానికీ, విస్తరించటానికీ కూడా ఈ వ్యవసాయం దోహదం చేసింది ఒక ప్రధాన అధికార కేంద్రం ఆధారంగా రాజుల, రాజవంశాల, సామంత రాజుల పట్టికను కాలక్రమంలో తయారు చేయటం సాధ్యం కాదు కానీ తూర్పు భారతదేశంలోని సుదూర ప్రాంతాలలో సాంస్కృతిక విస్తరణా, నాగరిక విస్తరణా జరిగాయనటానికి ఎలాంటి సందేహమూ లేదు

గుప్త సామ్రాజ్యం యొక్క అవనతీ, పతనమూ, సామ్రాజ్యానికి వెలుపల ఉన్న ప్రాంతాల్లో చెప్పుకోదగ్గ అభివృద్ధి జరగటమూ దాదాపు ఒకేకాలంలో జరిగాయి జనసంఖ్య తక్కువగా ఉండి, గిరిజన నాయకుల పరిపాలనలో ఉన్న మారుమూల ప్రాంతాలు చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకున్నాయి పశ్చిమ బెంగాల్ లోనూ, ఉత్తర ఒరిస్సాలోనూ, మధ్యప్రదేశ్ లోని ఛోటానాగపూర్ పీఠభూమి ప్రాంతంలోనూ వ్యవసాయానికీ, జననివాసానికీ అంతగా అనుకూలంగా లేని ఎర్రరేగడి భూములకు ఇది వర్తిస్తుంది బంగ్లాదేశ్ లో వర్షపాతం ఎక్కువగా ఉన్న ఒండ్రు మట్టి ప్రాంతాలకూ, బ్రహ్మపుత్రలోయకూ ఈ సూత్రం అంతకంటే బాగా వర్తిస్తుంది

* * *

## అధ్యాయం: 23

# హర్షుడు - అతని కాలం

### హర్షుని రాజ్యం

ఉత్తరప్రదేశ్, బీహార్ తమ అధికార కేంద్రంగా గుప్తులు భారతదేశంలోని ఉత్తర, పశ్చిమ ప్రాంతాలను దాదాపు 160 సంవత్సరాల కాలం పరిపాలించారు వారి పరిపాలన క్రీ శ 6 వ శతాబ్దం మధ్యకాలం వరకూ కొనసాగింది వీరి తరువాత ఉత్తర భారతదేశం చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయింది క్రీ శ 500 తరువాత కాశ్మీర్, పంజాబ్, పశ్చిమ భారతదేశ ప్రాంతాల్లో శ్వేతహూణులు తమ ఆధిపత్యాన్ని స్థాపించుకున్నారు ఉత్తర, పశ్చిమ భారతదేశ ప్రాంతాలలో గుప్తసామ్రాజ్యాన్ని అరడజను మంది సామంతరాజులు పంచుకొని స్వతంత్రంగా పరిపాలించటం ప్రారంభించారు హర్యానాలోని స్థానేశ్వర్‌ను రాజధానిగా పరిపాలిస్తున్న ఒక రాజవంశీయులు క్రమక్రమంగా తమ అధికారాన్ని ఇతర సామంత రాజ్యాల మీదికి విస్తరింప జేశారు ఈ విజయాన్ని సాధించిన రాజు పేరు హర్షవర్ధనుడు (క్రీ శ. 606 – 647)

హర్షవర్ధనుడు తన అధికార కేంద్రాన్ని కనోజ్‌కు మార్చి, తన అధికారాన్ని అన్ని దిశలకూ వ్యాపింప జేశాడు ఏడవ శతాబ్దానికల్లా పాటలీపుత్రం పతనం కావటం ప్రారంభించి కనోజ్ ప్రాముఖ్యతను సంతరించుకుంది ఇది ఎలా సాధ్యమైంది? పాటలీపుత్రం ప్రాభవం వ్యాపారం మీదా, ద్రవ్య ఆర్థిక విధానాన్ని విస్తృతంగా ఉపయోగించటం మీదా ఆధారపడి ఉండేది నాలుగు జలమార్గాల గుండా నాలుగుదిక్కుల నుంచీ నగరంలోకి ప్రవేశించే వ్యాపారులు తాము తెచ్చే సరుకుల మీద పన్నులు చెల్లించేవారు

వ్యాపారం తగ్గిపోగానే రొక్కం చెలామణీ తగ్గిపోయింది అధికారులకూ, సైనికులకూ భూమి రూపంలో జీతాలను చెల్లించటం ప్రారంభమైంది ఇలా ఆ నగరం తన ప్రాముఖ్యతను పోగొట్టుకుంది అధికారం స్కంధావారాలకు మారింది సైనికంగా ముఖ్యమైన ప్రాంతాలకూ, విశాల భూభాగాలకూ ప్రాధాన్యత పెరిగింది కనోజ్ ఇలాంటి ప్రాంతాలలో ఒకటి ఇది ఉత్తర ప్రదేశ్‌లోని ఫరూకాబాద్ జిల్లాలో ఉంది క్రీ. శ ఆరవ శతాబ్దం ఉత్తరార్థం నుంచే ఈ నగరం ప్రాధాన్యతను సంతరించుకుంది కనోజ్ ప్రాముఖ్యతను పొందటం ఉత్తర భారతదేశంలో ఫ్యూడల్ యుగానికి ప్రారంభంగా చెప్పవచ్చు. పాటలీపుత్రం ప్రాధాన్యతలో ఉన్న కాలం ఫ్యూడల్ యుగానికి పూర్వకాలం మాత్రమే మైదాన ప్రాంతాలలో కోటల నిర్మాణం చాలా కష్టసాధ్యమైన కార్యంగా ఉండేది కానీ కనోజ్ ఎత్తయిన ప్రాంతంలో ఉండటం చేత ఆ నగరం చుట్టూరా కోటను నిర్మించటం సాధ్యమైంది అది నదీలోయలో ఉండటం చేత ఏడవ శతాబ్ద కాలానికి దాని చుట్టూరా కోట నిర్మించబడింది లోయలో తూర్పు పడమరల్లో ఉన్న ప్రాంతాలను తమ అధీనంలో ఉంచుకోవటంకోసం అవసరమైతే సైన్యాలను నదీ మార్గంలోనూ, భూ మార్గంలోనూ పంపటానికి అవకాశం ఉండేది

హర్షుని ఆస్థాన కవి అయిన బాణభట్టు రాసిన "హర్ష చరిత్ర" ఆధారంగా హర్షుని పరిపాలనా కాలంలోని తొలి దశను మనం పునర్నిర్మించుకోవచ్చు దీనికి అనుబంధంగా క్రీ శ ఏడవ శతాబ్దంలో భారతదేశానికి వచ్చి ఇక్కడ పదిహేను సంవత్సరాలు గడిపిన హువాన్‌త్సాంగ్ కథనాన్ని స్వీకరించాలి హర్షుని శాసనాలు కూడా అనేక రకాల పన్నులనూ, అనేకమంది ఉద్యోగులనూ పేర్కొంటాయి

హర్షుణ్ణి చిట్టచివరి గొప్ప హిందూ చక్రవర్తి అని పేర్కొంటారు కానీ అతడు గొప్ప విశ్వాసం ఉన్న హిందువూకాదు, మొత్తం భారతదేశాన్ని పరిపాలించనూ లేదు అతని అధికారం కాశ్మీరులేని ఉత్తర భారతదేశానికి మాత్రమే పరిమితంగా ఉండేది రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, బీహార్, ఒరిస్సా సరాసరి అతని యాజమాన్యంలో ఉండేవి కానీ అతని పలుకుబడి మరింత విస్తృత ప్రాంతంలో చెలామణీ అయ్యేది అతని సామ్రాజ్యపు సరిహద్దుల్లో ఉన్న రాజ్యాలు కూడా అతని సార్వభౌమాధికారాన్ని అంగీకరించాయని చెప్పవచ్చు కానీ తూర్పున గౌడ దేశపు రాజైన శశాంకుడు

హర్షునికి సవాలుగా పరిణమించాడు అతడు శైవుడు అతడు బోధివృక్షాన్ని నరికి వేయించాడు క్రీ శ 619లో శశాంకుడు మరణించటంతో అలాంటి ఆగడాలు ఆగాయి కానీ హర్షుని దక్షిణ దిగ్విజయాన్ని నర్మదాతీరంలో చాళుక్య రాజైన పులకేసి ఆపాడు అతడు కర్ణాటకలోని బిజాపూర్ జిల్లాలోని బాదామి అన్న పట్టణాన్ని రాజధానిగా చేసుకొని ఆధునిక మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాల్లోని అధిక భాగాన్ని పరిపాలించాడు దీన్నితప్ప హర్షుడు మరే ఇతర ఆటంకాన్నీ ఎదుర్కోలేదు భారతదేశంలోని అధిక భాగంలో అతడు ఉన్నంతలో వీలైనంత రాజకీయ ఐక్యతను సాధించగలిగాడు

## పరిపాలనా విధానం

హర్షుడు గుప్తులు అనుసరించిన పరిపాలనా విధానాన్నే అనుసరించాడు లేదంటే అతని పరిపాలనా కాలంలో అధికార వికేంద్రీకరణా, ఫ్యూడలిజం అధిక మయ్యాయి అతని సైన్యంలో ఒక లక్ష గుర్రాలూ, అరవైవేల ఏనుగులూ ఉన్నట్టుగా చెబుతారు ఇది మనకు ఆశ్చర్యాన్ని కలగచేస్తుంది ఎందుకంటే, దక్షిణ దేశంలో కొద్దిభాగాన్ని తప్ప మొత్తం భారతదేశాన్ని పరిపాలించిన గుప్తులు 30,000 గుర్రాలనూ, 9000 ఏనుగులనూ మాత్రమే కలిగి ఉండేవారు యుద్ధ కాలంలో తన సామంత రాజుల సహకారాన్ని పూర్తిగా పొంది ఉంటేనే హర్షుడు అంత పెద్ద సైన్యాన్ని సేకరించి, పోషించ గలిగి ఉండేవాడని చెప్పవచ్చు ప్రతి సామంత రాజూ తనవంతు గుర్రాలనూ, ఏనుగులనూ సరఫరా చేయటం చేతనే చక్రవర్తి సైన్యం అంత పెద్దదిగా ఉండేదని తెలుస్తోంది

రాజ్యానికి ప్రత్యేకసేవలు అందించినందుకుగాను పురోహిత వర్గానికి భూదానాలు ఇవ్వటం కొనసాగుతూనే వచ్చింది దీనికితోడు హర్షుడు ఉద్యోగులకు కూడా భూముల్ని ఇచ్చే ఉత్తరువుల్ని జారీ చేసినట్టుగా భావిస్తున్నారు అంతకు ముందు ఇవ్వబడ్డ భూదానాలలో లాగే వీటిలో కూడా పురోహిత వర్గానికి కొన్ని పన్నులలో రాయితీలుండేవి చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ హర్షుని కాలంలో ప్రభుత్వాదాయం నాలుగు భాగాలుగా విభజించబడేదని చెప్పాడు మొదటి భాగం రాజు సొంత ఖర్చుకు ఉపయోగించబడేది రెండవ భాగం పండిత పోషణకు ఉపయోగించబడేది మూడవభాగం ఉద్యోగి వర్గం మీద ఖర్చయ్యేది నాలుగోభాగం మత కార్యకలాపాల మీద ఉపయోగించబడేది మంత్రులకూ, ఉన్నతాధికారులకూ కూడా భూముల్ని ఇచ్చేవారు ప్రభుత్వాధికారులకు భూముల్నిచ్చే ఫ్యూడల్ సంప్రదాయం హర్షునితోనే ప్రారంభమైనట్టుగా అనిపిస్తోంది అందుచేతనే కాబోలు హర్షుని పరిపాలనాకాలంలో ఎక్కువగా నాణాలు విడుదల కాలేదు

హర్షుని సామ్రాజ్యంలో శాంతిభద్రతల రక్షణ బాగా ఉండేది కాదు హుయాన్‌త్సాంగ్ నేరాలకు కఠినమైన శిక్షలుండేవని చెబుతాడు కానీ అతనికి ప్రభుత్వం ఎంతో శ్రద్ధతో రక్షణ కల్పించినా అతణ్ణి దొంగలు దోచుకున్నారు దోపిడీ దేశద్రోహం తరువాత గొప్ప నేరంగా పరిగణించ బడేది దోపిడీ దొంగలకు శిక్షగా కుడి చేతిని నరికేసేవారు కానీ బౌద్ధమతం ప్రభావం వల్ల శిక్షల్లోని కాఠిన్యం కొద్దిగా తగ్గినట్టు కనిపిస్తుంది దాని ప్రభావంతోనే నేరగాళ్ళకు జీవిత ఖైదు విధించటం ప్రారంభమైంది

## హుయాన్‌త్సాంగ్ కథనం

చైనా యాత్రికుడు హుయాన్‌త్సాంగ్ రావటం చేత హర్షుని పరిపాలనాకాలం గొప్ప ప్రాముఖ్యతను సంతరించుకుంది అతడు క్రీ శ 629లో చైనా నుంచి బయలుదేరి భారతదేశానికి వచ్చాడు భారతదేశంలో చాలా కాలం ఉన్న తరువాత అతడు క్రీ శ 645లో చైనాకు తిరిగి వెళ్ళాడు బీహారులోని నలందా (నాలంద) విశ్వవిద్యాలయంలో విద్యాభ్యాసం చేయటం కోసమూ, బౌద్ధమత గ్రంథాలను సేకరించటం కోసమూ హుయాన్‌త్సాంగ్ భారతదేశానికి వచ్చాడు అతడు హర్షుని ఆస్థానంలో చాలా కాలం గడిపాడు భారతదేశంలో విస్తృతంగా పర్యటించాడు అతని ప్రభావం వల్లనే హర్షుడు బౌద్ధమతానికి మద్దతుదారు అయ్యాడు, ఆ మత ప్రచారం కోసం గొప్పగా దానాలు చేశాడు హుయాన్‌త్సాంగ్ హర్షుని ఆస్థానాన్ని గురించీ, ఆ కాలపు జీవితాన్ని గురించీ వివరంగా చెప్పాడు ఫాహియన్ కథనం కంటే హుయాన్‌త్సాంగ్ కథనం ఎక్కువ వివరంగా ఉంటుంది అతని కథనం ఆ కాలపు ఆర్థిక, సామాజిక జీవితాన్ని గురించే కాకుండా, ఆనాటి మత శాఖల్ని గురించి కూడా మనకు ఎన్నో వివరాలను తెలియజేస్తుంది

అతని కథనం ప్రకారం పాటలీపుత్రం పతనావస్థలో ఉండేది వైశాలి పరిస్థితి కూడా అలాగే ఉండేది గంగా మైదానంలో ప్రయాగ, కనోజ్ అభివృద్ధి పథంలో ఉండేవి బ్రాహ్మణులూ, క్షత్రియులూ నిరాడంబరమైన జీవితాన్ని గడిపేవారు రాజబంధువులూ, పురోహితులూ ఆడంబరంగా జీవించేవారు పై రెండు వర్గాలలో కూడా వర్గతారతమ్యం ఉండేదని హుయాన్‌త్సాంగ్ కథనం తెలియచేస్తుంది వీరిలో అధికసంఖ్యాకులు వ్యవసాయాన్ని జీవనాధారంగా స్వీకరించి ఉండవచ్చు హుయాన్‌త్సాంగ్ శూద్రులను వ్యవసాయదారులుగా పేర్కొంటాడు ఇది చాలా ముఖ్యమైన విషయం అంతకు పూర్వం గ్రంథాలన్నీ శూద్రులను పై మూడు వర్ణాలవారికీ భృత్యులుగా మాత్రమే పేర్కొన్నాయి హుయాన్‌త్సాంగ్ పాకీపని వారూ, తలారులూ మొదలైన

అంటరాని వారిని కూడా చూశాడు వారు ఊరిబయట నివసించే వారు ఉల్లిపాయలూ, తెల్లపాయలూ (వెల్లుల్లి) తినేవారు వారు ఊళ్లోకి వస్తున్నప్పుడు గట్టిగా అరిచి, తాము వస్తున్నట్టుగా చెప్పేవారు ఇతరులు వారినుంచి దూరంగా తప్పుకోవటానికి అవకాశం కల్పించేవారు

## బౌద్ధమతం, నలందా విశ్వవిద్యాలయం



నలందాలోని స్థూపం అవశేషాలు

హువాన్‌త్సాంగ్ భారతదేశానికి వచ్చిన కాలంలో బౌద్ధ మతంలో 18 శాఖలుండేవి ప్రాచీన బౌద్ధ కేంద్రాలు పతనావస్థలో ఉండేవి అనాటి ప్రసిద్ధ బౌద్ధ కేంద్రం నలందా బౌద్ధ భిక్షువుల కోసం అక్కడ గొప్ప విశ్వవిద్యాలయం ఉండేది అందులో 10,000 మంది విద్యార్థులుండేవారట వారందరూ బౌద్ధభిక్షువులే వీరికి అక్కడ మహాయాన బౌద్ధమతాన్ని బోధించేవారు నలందాలోని అన్ని మట్టి దిబ్బల్నీ తవ్వలేదు కానీ తవ్విన చోట్లలో చక్కని భవన సముదాయం బయటపడింది క్రీ శ 5 వ శతాబ్దం నుంచీ దాదాపు 700 సంవత్సరాల కాలం ఈ భవనాలను కట్ట టమూ, మరమ్మత్తులు చేయటమూ కొనసాగుతూ వచ్చింది ఇంతవరకూ బయటపడ్డ భవన సముదాయంలో 10,000 మందికి వసతి సౌకర్యం లేదు క్రీ శ 670లో ఇ-త్సింగ్ అన్న మరో యాత్రికుడు నలందాను సందర్శించి అందులో 3000 మంది విద్యార్థులున్నారని పేర్కొన్నాడు ఈ సంఖ్య నమ్మదగినదిగా కనిపిస్తోంది ఇంతవరకూ తవ్వకం జరగని మట్టి దిబ్బలలో తవ్వకాలు జరిగినా అక్కడ బయటపడే భవనాలలో 10,000 మంది భిక్షువులకు వసతి సౌకర్యం ఉండే అవకాశం లేదు హువాన్‌త్సాంగ్ కథనం ప్రకారం నలందా ఆరామం వందగ్రామాల పన్నుల మీద ఆధారపడేది ఇ-త్సింగ్ ఆ గ్రామాల సంఖ్య రెండు వందలన్నాడు మొత్తం మీద హర్షవర్ధనుని కాలంలో నలందా గొప్ప బౌద్ధారామంగా ఉండేదనటానికి ఎలాంటి సందేహమూ లేదు

హర్షుడు సహనం కలిగిన మత విధానాన్ని అనుసరించాడు అతడు మొదట శైవుడే అయినా ఆ తరువాత బౌద్ధమతానికి గొప్ప అభిమాని అయ్యాడు అతడు అచంచలమైన బౌద్ధమతాభిమాని కావటం చేత మహాయాన సూత్రాలను విస్తృతంగా ప్రచారం చేయుటం కోసం కనోజ్‌లో ఒక సదస్సును ఏర్పాటు చేశాడు ఆ సదస్సుకు హువాన్‌త్సాంగ్, కామరూప రాజైన భాస్కర వర్మమాత్రమే కాకుండా ఇరవైఒక్క దేశాల రాజులూ, అనేక శాఖలకు చెందిన వేలాదిమంది భిక్షువులూ పాల్గొన్నారు వీరికి వసతి కల్పించటం కోసం వేయిమందికి సరిపడా రెండు పెద్ద పందిళ్ళను వేయించారట కానీ అన్నిటికంటే ప్రధానమైన కట్టడం ఒక పెద్ద బురుజు దాని మధ్యలో బంగారంతో చేసిన బుద్ధ విగ్రహాన్ని ఉంచారు ఈ విగ్రహం హర్షవర్ధనుడు ఎంత ఎత్తున్నాడో అంత ఎత్తు ఉండేదట హర్షుడు ఈ విగ్రహాన్ని పూజించి అన్నసంతర్పణ చేశాడట ఈ సదస్సులో మహాయాన బౌద్ధమతం ప్రాశస్త్యాన్ని గురించి చర్చ జరిగిందట దాన్ని హువాన్‌త్సాంగ్ ప్రారంభించి ఉపన్యసించి, తన వాదాలను పూర్వపక్షం చేయమని శ్రోతలను సవాల్ చేశాడట ఐదు రోజుల పాటు ఎవరూ ముందుకు రాలేదట ఈ లోగా హువాన్‌త్సాంగ్‌ను హత్య చేయటానికి అతని భావజాల శత్రువులు కుట్ర పన్నారట దాన్ని గురించి తెలుసుకున్న హర్షుడు హువాన్‌త్సాంగ్‌కు చిన్న హాని చేయటానికి ప్రయత్నించినా వారి తలలు తీయిస్తానని బెదిరించాడట ఇంతలో బురుజుకు నిప్పంటుకోవటం, హర్షుణ్ణే అంతమొందించటానికి ప్రయత్నించటం జరిగాయట అప్పుడు హర్షుడు 500 బ్రాహ్మణులను బంధించాడట కొంతమందిని దేశ బహిష్కారం చేశాడట మరికొంతమందికి మరణశిక్ష విధించాడట

ఈ విషయాలను పరిశీలిస్తే హర్షుడు ఇతరులు చెబుతున్నంత మతసహనం కలిగిన వాడు కాదని తెలుస్తోంది కనోజ్ సదస్సు తరువాత హర్షుడు ప్రయాగలో మరొక పెద్ద సదస్సును నిర్వహించాడు అతని సామంత రాజులూ, మంత్రులూ, రాజబంధువులూ ఆ సదస్సుకు హాజరయ్యారు అందులో బుద్ధ విగ్రహానికి పూజలు జరిగాయి హువాన్‌త్సాంగ్ ఉపన్యాసాలిచ్చాడు ఈ సదస్సు చివర హర్షుడు విరివిగా దానధర్మాలు చేశాడు తన సొంత బట్టలు తప్ప అన్నిటినీ దానం చేసేశాడు హర్షుణ్ణి హువాన్‌త్సాంగ్ గొప్పగా కీర్తించాడు హర్షుడు హువాన్‌త్సాంగ్ పట్ల ఎంతో ప్రేమాభిమానాలు చూపించాడు అతని సహకారంతో హువాన్‌త్సాంగ్ సామ్రాజ్యంలోని అనేక ప్రాంతాలలో పర్యటించగలిగాడు

తన రాజపోషకుణ్ణి గురించి బాణభట్టు చాలా గొప్పగా పొగిడాడు "హర్ష చరిత్ర"లో అతడు ఉపయోగించిన అలంకారిక

శైలి, తరువాత కాలపు కవులకు ఆదర్శంగా మారిపోయింది హర్షుడు సాహిత్య పోషకుడు మాత్రమే కాదు – "ప్రియదర్శిక", "రత్నావళి", "నాగానందం" అన్న మూడు నాటకాలను రాసిన రచయిత కూడా బాణభట్టు హర్షునిలో గొప్ప కవితా శక్తి ఉందని చెప్పాడు తరువాత కాలపు విద్వాంసులు కొందరు హర్షుణ్ణి సాహిత్య చక్రవర్తి అని కీర్తించారు కానీ మధ్యయుగానికి చెందిన కొందరు విద్వాంసులు అతని గ్రంథకర్తృత్వాన్ని శంకించారు ధావకుడు అన్న రచయిత ఆ గ్రంథాలను రాసి ప్రతిఫలాన్ని ఆశించి హర్షుని పేర వాటిని చెలామణీ చేశాడని వారు భావించారు హర్షుడు కొన్ని భాగాలను రాసి ఉండవచ్చు సామెత చెప్పినట్టు రాజకవులు ఎగం కవులే ప్రాచీన, మధ్యయుగాల్లో ఇతర ఘనకార్యాలతోపాటు సాహిత్య ఘనకార్యాలు కూడా రాజులకు ఆపాదించబడ్డాయి సముద్రగుప్తుని కాలంలో ప్రారంభమైన ఈ అలవాటు హర్షుని కాలానికి స్థిరపడిపోయింది రాజుయొక్క స్థానానికి అతని శత్రువుల్లోనూ, ప్రజల్లోనూ స్థిరత్వాన్నీ, విశ్వసనీయతనూ, గొప్పపేరు ప్రతిష్ఠలనూ కల్పించటం ఇందులోని ఉద్దేశమని విస్పష్టంగా తెలుస్తూనే ఉంది

★ ★ ★

## అధ్యాయం: 24

# ద్వీపకల్పంలో కొత్తరాజ్యాల పుట్టుక, గ్రామీణ నాగరికత విస్తరణ

### కొత్తదశ

వింధ్య పర్వతాలకు దక్షిణాన సుమారు క్రీ శ 300–750 సంవత్సరాల మధ్యకాలంలో రెండవ చారిత్రక దశ ప్రారంభమైంది మొదటి చారిత్రక దశలో (సుమారు క్రీ పూ 200 – క్రీ శ 300 మధ్యకాలం) ప్రారంభమైన కొన్ని విధానాలు రెండవ దశలో కూడా కొనసాగాయి మొదటి దశలో కనిపించని మరికొన్ని కొత్త పరిణామాలు రెండవ దశలో ప్రారంభమయ్యాయి మొదటి దశలో దక్కన్ పీఠభూమిలో శాతవాహనులూ, తమిళనాడులోని దక్షిణ జిల్లాలలో తమిళరాజ్యాలూ అభివృద్ధి చెందటాన్ని చూశాము ఆ కాలంలో ఉత్తర తమిళనాడు, దక్షిణ కర్ణాటక, మహారాష్ట్రలో కొంత ప్రాంతము, మహానదీ గోదావరి నదుల మధ్య ప్రాంతము తమ ప్రాంతాలకు బయటున్న రాజ్యాల అధికారాన్ని అంగీకరించాయి ఈ ప్రాంతాలలో సొంత, స్థానిక రాజ్యాలు ఉండేవి కావు ఈ ప్రాంతాలలో మాత్రమే కాకుండా విదర్భ ప్రాంతంలో కూడా క్రీ శ 300–600 సంవత్సరాల మధ్యకాలంలో సుమారు రెండు డజన్ల రాజ్యాలు అవతరించాయి వీటిని గురించి ఈ రాజ్యాలు వేయించిన దాన శాసనాలు తెలియజేస్తున్నాయి

ఏడవ శతాబ్దం ప్రారంభానికి కంచిలో పల్లవులూ, బాదామిలో చాళుక్యులూ, మధురలో పాండ్యులూ బలమైన రాజులుగా అవతరించారు మొదటి చారిత్రక దశ వివిధ చేతివృత్తుల అభివృద్ధికీ, దేశీయవిదేశీయ వ్యాపారానికీ, నాణాల విస్తృత ఉపయోగానికీ, నగరాల అభివృద్ధికీ ప్రసిద్ధి చెందింది వ్యాపారమూ, నగరాలూ, ద్రవ్య ఆర్థిక విధానమూ రెండవ దశలో పతనావస్థలో ఉన్నట్టుగా కనిపిస్తోంది ఈ విషయాన్ని అధికసంఖ్యలో పన్నులు కూడా లేకుండా బ్రాహ్మణులకు ఇచ్చిన భూదానాలు నిరూపిస్తున్నాయి ఈ భూదానాలు దానం చేయబడిన భూములు కొత్తగా సాగులోకి రావటాన్ని తెలియచేస్తున్నాయి ఈ ప్రాంతాలలో మొదటిసారిగా జన నివాసాలు కూడా ఏర్పడ్డాయి వ్యవసాయ ఆర్థిక విధానం విస్తరించటం ఈ కాలంలో ఎక్కువగా జరిగింది

ఈ కాలంలో బ్రాహ్మణీయ మతం విజయయాత్రను గూడా గమనించవచ్చు మొదటి దశలో ఆంధ్రలోనూ, మహారాష్ట్రలోనూ అసంఖ్యాకమైన బౌద్ధ ఆరామాలు కనిపిస్తాయి దక్షిణ తమిళనాడు ప్రాంతంలోని గుహల్లో లభించిన రాతలు – ఆ ప్రాంతంలో జైన, బౌద్ధ మతాలుండేవని సూచిస్తున్నాయి కానీ జైనమతం కర్ణాటకకే పరిమితంగా ఉండేది దక్షిణ భారత ద్వీపకల్పంలో మొత్తంమీద వైదిక మతం బలంగా ఉండేది ఆనాటి రాజులు అసంఖ్యాకమైన వైదిక యజ్ఞాలను చేసినట్టుగా ఆధారాలున్నాయి ఈ దశలోని తమిళనాడులో పల్లవుల ఆధిపత్యంలోనూ, కర్ణాటకలో బాదామి చాళుక్యుల ఆధిపత్యంలోనూ శివునికీ, విష్ణువుకూ రాతితో దేవాలయాలు నిర్మించటం కూడా ప్రారంభమైంది రెండవదశ ప్రారంభమయ్యే కాలానికి దక్షిణ భారతదేశం "మెగాలిత్"ల ప్రాంతం కాదు క్రమక్రమంగా అది దేవాలయాల భూమిగా పరిణామం చెందటం అప్పుడే ప్రారంభమైంది

రాజులూ, విద్యావంతులూ ఉపయోగిస్తూ ఉండిన భాషలో కూడా మార్పులు వచ్చాయి ఆంధ్రలోనూ, కర్ణాటకలోనూ లభించిన అశోకుని శిలా శాసనాలను వదిలిపెట్టినా క్రీ పూ రెండవ శతాబ్దం నుంచీ క్రీ శ మూడవ శతాబ్దం వరకూ ఈ ప్రాంతంలో లభించిన శాసనాలు ఎక్కువగా ప్రాకృతంలోనే ఉన్నాయి తమిళనాడులో లభించిన బ్రాహ్మీశాసనాల్లో కూడా ప్రాకృత పదాలున్నాయి కానీ

క్రీ శ నాలుగవ శతాబ్దానికల్లా దక్షిణభారత ద్వీపకల్పంలో సంస్కృతం అధికార భాషగా రూపొందింది శాసనాలు ఎక్కువగా ఆ భాషలోనే రాయబడ్డాయి

దక్కన్ రాజ్యాలు-దక్షిణ భారతదేశం

ఉత్తర మహారాష్ట్రలోనూ, విదర్భ (బీరార్)లోనూ శాతవాహనుల తరువాత వాకాటకులు అధికారానికొచ్చారు

# దక్కన్ పీఠభూమి దక్షిణ భారతదేశం
## (క్రీ శ 300-750)




R Narmada
R Tapi
R Mahanadi
నాగపూర్
ఎల్లోరా
అజంతా
ఇండియా
ముంబయి
R Godavari
R Krishna
హైదరాబాద్
నాగార్జునకొండ
వెంగి
అరేబియా సముద్రము
ఐహొళె
బాదామి
పట్టడకల్
గుంటూరు
ధరణికోట
బంగాళాఖాతం
R Tungabhadra
బనవాసి
చెన్నై
కంచి
మహాబలిపురం
R Cauveri
ఉరయ్యూరు
కావేరీపట్టణం
మధురై
హిందూ మహాసముద్రం
Ancient Site
Modern Town

వీరు స్థానికులు స్వయంగా బ్రాహ్మణులైన వాకాటకులు బ్రాహ్మణులకు విరివిగా భూదానాలు చేసినట్టుగా వారు వేయించిన రాగిరేకుల శాసనాలు నిరూపిస్తున్నాయి వారు బ్రాహ్మణీయ మతానికి గొప్ప పోషకులు వారు అనేక యజ్ఞయాగాలను కూడా చేశారు వీరి రాజకీయ చరిత్రకు దక్షిణ భారతదేశంలోకంటే ఉత్తర భారతదేశంలోనే ఎక్కువ ప్రాధాన్యత ఉందని చెప్పవచ్చు రెండవ చంద్రగుప్తుడు తన కుమార్తె ప్రభావతిని వాకాటక రాజకుటుంబంలో ఇచ్చి వివాహం చేసినట్టుగా ఇంతకుముందే తెలుసుకున్నాం అలా అతడు వాకాటకుల సహాయాన్ని పొంది, క్రీ శ నాలుగవ శతాబ్దం చివరి పాదంలో గుజరాత్‌నూ, దాని పరిసరప్రాంతాలనూ శకక్షాత్రపుల నుంచి గెలుచుకున్నాడు వాకాటక రాజ్యం ఉత్తర భారతదేశం నుంచీ దక్షిణ భారతదేశానికి బ్రాహ్మణీయ మత భావాలు విస్తరించటానికి ఒక వాహికగా ఉపయోగపడిందని కూడా చెప్పవచ్చు



బాదామిలోని గుహాలయం

వాకాటక రాజ్యం పతనమైన తరువాత బాదామి చాళుక్యుల పరిపాలన ప్రారంభమైంది దక్కన్ పీఠభూమిలోనూ, దక్షిణ భారతదేశంలోనూ బాదామి చాళుక్యులు క్రీ శ 757 వరకూ సుమారు రెండు శతాబ్దాల కాలం గొప్ప పాత్రను నిర్వహించారు ఆ తరువాత వారిని వారి సామంత రాజులైన రాష్ట్రకూటులు జయించారు చాళుక్యులు తాము బ్రహ్మవంశీయులమనీ, మనువంశీయులమనీ, చంద్రవంశీయులమనీ చెప్పుకున్నారు తమ పూర్వీకులు అయోధ్యను పరిపాలించారని కూడా ప్రకటించుకున్నారు ఇవన్నీ కూడా ప్రతిష్ట కోసమో, ప్రామాణికత కోసమో చెప్పుకున్నవే కానీ సత్యాలు కావు వీరు స్థానిక కన్నడిగులు వీరు బ్రాహ్మణుల ఆశీర్వాదంతో రాజవంశీకులయ్యారు

వీరు పశ్చిమ దక్కన్ ప్రాంతంలో క్రీ శ 6 వ శతాబ్దం ప్రారంభంలో తమ రాజ్యాన్ని స్థాపించారు కర్ణాటకలో బిజాపూర్ జిల్లాలో ఉన్న వాతాపి లేదా బాదామి వీరి రాజధాని తరువాత కాలంలో వీరి వంశీకులు శాఖోపశాఖలుగా ఇతర ప్రాంతాలకు వెళ్లినా ప్రధాన శాఖకు చెందినవారుమాత్రం రెండు శతాబ్దాల కాలం వాతాపిలోనే ఉన్నారు ఆ కాలంలో దక్కన్‌లో బాదామి చాళుక్యులకంటే బలమైన సామ్రాజ్యం మరొకటి లేదు వీరి తరువాత మధ్యయుగాల చివర విజయనగర రాజ్యం ఉదయించేవరకూ అంత బలమైన సామ్రాజ్యం మరొకటి రాలేదు

శాతవాహన సామ్రాజ్య శిధిలాలలోనుంచీ భారత ద్వీపకల్పం తూర్పు ప్రాంతంలో – కృష్ణా, గుంటూరు జిల్లాల ప్రాంతంలో ఇక్ష్వాకు రాజ్యం ఉదయించింది వీరొక స్థానిక తెగకు చెందినవారు కావచ్చు వీరు తమ వంశప్రాచీనతను స్థాపించుకోవటానికి ఇక్ష్వాకులన్న పేరును స్వీకరించారు వీరి పరిపాలనా కాలానికి చెందిన అనేక అవశేషాలు ధరణికోటలోనూ, నాగార్జునకొండలోనూ బయటపడ్డాయి కృష్ణా – గుంటూరు ప్రాంతంలో భూదానాలు చేసే సంప్రదాయాన్ని వీరే ప్రారంభించారు అలాంటి అనేక తామ్రశాసనాలు ఆ ప్రాంతంలో లభించాయి

పల్లవులు ఇక్ష్వాకులను మోసంచేసి అధికారానికి వచ్చారు "పల్లవం" అంటే సంస్కృతంలో తీగ ఇది "తొండై" అన్న తమిళపదానికి సమానార్థకం పల్లవుల తొండైనాడులో అధికారాన్ని స్థాపించుకున్న స్థానిక తెగవారు కావచ్చు "తొండైనాడు" అంటే "తీగల ప్రాంతం" "పల్లవ" అన్న పదానికి "దోపిడీ దొంగ" అన్న అర్థం కూడా ఉండటం చేత వారికి నాగరికులు కావటానికీ, ప్రజామోదాన్ని పొందటానికీ కొంతకాలం పట్టింది పల్లవుల అధికారం ఉత్తర తమిళనాడుకూ, దక్షిణ ఆంధ్రప్రాంతానికీ కూడా విస్తరించింది వారు తమ రాజధానిని కంచి (ఆధునిక కాంచీపురం)లో ఏర్పాటు చేసుకున్నారు వారి పరిపాలనా కాలంలో కంచి దేవాలయాల పట్టణంగా, వేద విద్యాకేంద్రంగా అభివృద్ధి చెందింది తొలినాటి పల్లవులు క్రీ శ 4 వ శతాబ్దంలో ఉత్తర కర్ణాటకలో తమ రాజ్యాన్ని స్థాపించుకున్న కదంబులతో ఘర్షణకు దిగారు వీరు తాము బ్రాహ్మణులమని చెప్పుకున్నారు, సాటి బ్రాహ్మణులకు విరివిగా దానధర్మాలు చేశారు

కదంబ రాజ్యాన్ని స్థాపించిన రాజు మయూరశర్మ అతడు కంచిలో విద్యాభ్యాసం చేశాడనీ, అతణ్ణి ఎందుచేతనో అక్కణ్ణుంచి తరిమేశారనీ చెబుతారు అతడు తనకు జరిగిన అవమానానికి కుమిలిపోతూ, అరణ్యంలో సైనిక స్థావరాన్ని ఏర్పాటుచేసి, గిరిజనులను సమీకరించి వారి సహకారంతో పల్లవ రాజ్యాన్ని కూలదోశాడు తరువాతి కాలంలో పల్లవులు ప్రతీకారం తీర్చుకున్నారు కానీ కదంబుల రాజ్యాన్ని

గుర్తించారు మయూర శర్మకు రాజ చిహ్నాలను ప్రధానం చేశారు మయూర శర్మ 18 అశ్వమేధ యాగాలను చేశాడని చెబుతారు అతడు బ్రాహ్మణులకు విరివిగా గ్రామదానాలు చేశాడు కదంబులు ఉత్తర కన్నడ జిల్లాలోని వైజయంతి లేదా బనవాసిని రాజధానిగా చేసుకొని పరిపాలన సాగించారు

పల్లవులకు సమకాలికులైన ప్రసిద్ధ రాజులలో గాంగులు కూడా ఉన్నారు క్రీ శ నాలుగవ శతాబ్దంలో వీరు దక్షిణ కన్నడ జిల్లాలో తమ రాజ్యాన్ని స్థాపించారు వీరి రాజ్యం తూర్పున పల్లవ రాజ్యానికీ, పశ్చిమాన కదంబుల రాజ్యానికీ మధ్య ఉండేది కళింగను పరిపాలించిన గాంగులు వేరనీ, వీరు వేరనీ సూచించటం కోసం వీరిని పశ్చిమ గాంగులనీ, మైసూరు గాంగులనీ కూడా పిలుస్తారు చాలా కాలం వరకూ వీరు పల్లవులకు సామంతులుగా ఉండేవారు వీరి రాజధాని కోలారు అక్కడున్న బంగారు గనుల కారణంగా వీరు అక్కడ రాజ్యాన్ని స్థాపించుకోగలిగి ఉండవచ్చు

పశ్చిమ గాంగులు అధికంగా జైనులకు దానాలు చేశారు కదంబులు కూడా జైనులకు దానాలు చేశారు కానీ, వారు ఎక్కువగా బ్రాహ్మణుల వైపే పక్షపాతాన్ని వహించారు పల్లవులు పన్నులు లేకుండా అనేక గ్రామాలను ప్రధానంగా బ్రాహ్మణులకు దానం చేశారు తొలినాటి పల్లవులు వేయించిన పదహారు దానశాసనాలు లభించాయి వీటికి పూర్వం కాలోలు – వేయించిన కొన్ని శాసనాలు ప్రాకృత భాషలో రాతిబండల మీద చెక్కబడ్డాయి కానీ ఎక్కువ భాగం శాసనాలు సంస్కృతంలో, రాగిరేకుల మీదనే చెక్కబడ్డాయి బ్రాహ్మణులకిచ్చిన గ్రామాలు ఎలాంటి పన్నులూ చెల్లించవలసిన అవసరం ఉండేది కాదు ఆ గ్రామాల ప్రజలు రాజ్యానికి వెట్టి చాకిరీ చేయాల్సిన అవసరం కూడా ఉండేదికాదు ఆ గ్రామలలోని రైతుల వద్దనుంచీ బ్రాహ్మణులు తమ సొంత ప్రయోజనాల కోసం పన్నుల్ని వసూలు చేసుకునేవారని అనిపిస్తోంది నాలుగవ శతాబ్దంలో పల్లవులు బ్రాహ్మణులకిచ్చిన గ్రామాలకు 18 రకాల మినహాయింపులుండేవి వారు భూమిశిస్తు చెల్లించ నవసరం లేదు రాజ్యానికి వెట్టిచాకిరీ చేయాల్సిన అవసరం లేదు గ్రామంలోని రాజోద్యోగులకు సరుకులు సరఫరా చేయాల్సిన అవసరం లేదు రాజభటులూ, రాజప్రతినిధులూ, ఆ గ్రామ వ్యవహారాలలో జోక్యం చేసుకోవటానికి వీలులేదు

పల్లవులూ, కదంబులూ, బాదామి చాళుక్యులూ, వారి సమకాలికులూ యజ్ఞయాగాలను గొప్పగా బలపరిచారు వారు అశ్వమేధం, వాజపేయం మొదలైన యాగాలను నిర్వహించారు అవి వారి స్థానాన్ని సుస్థిరం చేశాయి, పురోహిత వర్గాలకు గొప్ప సిరిసంపదల్ని సమకూర్చి పెట్టాయి అలా బ్రాహ్మణ వర్గం వ్యవసాయదారుల శ్రమతో అభివృద్ధి చెంది, ఒక ప్రధాన శక్తిగా రూపొందింది వీరు వ్యవసాయదారులవద్దనుంచీ అన్ని పన్నులనూ తామే స్వయంగా వసూలు చేసుకొనేవారు అంతేకాకుండా, రాజుల వద్దనుంచీ పెద్ద మొత్తంలో ఆ పన్నులను వాపస్ పొందేవారు

క్రీ శ 300–750 మధ్యకాలం భారతద్వీపకల్పంలో రాజ్యవ్యవస్థ అభివృద్ధి చెందటంలోనూ, వ్యవసాయ విస్తరణ లోనూ చాలా ముఖ్యమైన కాలం కానీ చేర, చోళ, పాండ్యరాజ్యాల తరువాత ద్వీపకల్పం దక్షిణ భాగంలో ఏం జరిగిందో మనకు తెలియదు మనకు తెలిసిన ఒకే ఒక ప్రధాన సంఘటన ఆరవ శతాబ్దంలో వచ్చిన కాలాభ్ర రాజుల తిరుగుబాటు అది పల్లవుల మీద మాత్రమే కాకుండా వారి ఇరుగు పొరుగు రాజులమీదకూడా తీవ్రమైన ప్రభావాన్ని చూపింది కాలాభ్ర రాజులు దుర్మార్గులైన పరిపాలకులు వారు అనేక మంది రాజులను పదవీ భ్రష్టుల్ని చేసి, తమిళనాడు మీద తమ అధిపత్యాన్ని స్థాపించుకున్నారు వీరు అనేక గ్రామాలలో అంతకు పూర్వం బ్రాహ్మణుల కివ్వబడిన "బ్రహ్మదేయం" హక్కుల్ని రద్దు చేశారు కాలాభ్ర రాజులకు బౌద్ధ మతాభిమానం ఉన్నట్టుగా అనిపిస్తోంది వీరి తిరుగుబాటు ఎంత బలంగా, విస్తృతంగా ఉండేదంటే వారిని అణచటంకోసం పాండ్యులూ, పల్లవులూ, బాదామి చాళుక్యులూ సంఘటితంగా పోరాడవలసి వచ్చింది ఒక సంప్రదాయ కథనం ప్రకారం కాలాభ్రరాజులు చేర, చోళ, పాండ్య రాజుల్ని చెరబట్టారు ఈ వివరాలన్నీ కూడా కాలాభ్రరాజుల తిరుగుబాటు చాలా విస్తృతంగా ఉండేదనీ, దాని ఫలితాలు తమిళనాడు వెలుపల కూడా కనిపించాయనీ తెలుపుతాయి కాలాభ్రరాజులు రద్దు చేసిన బ్రాహ్మణ భూదానాలను వారిని ఓడించిన ఐక్యసంఘటన రాజులు పునరుద్ధరించటం కాలాభ్ర రాజుల తిరుగుబాటు దక్షిణ భారతదేశంలోని రాజకీయ, సామాజిక వ్యవస్థ మీదనేనని నిరూపిస్తోంది

దక్షిణ భారతదేశంలోని దక్షిణ భాగంలో రాజులు క్రీ శ 300–500 మధ్యకాలంలో బ్రాహ్మణులకు భూదానాలు ఇచ్చారు అలాగే వీరులకు కూడా – వారు చూపిన శౌర్యసాహసాలకు గుర్తింపుగా భూదానాలు ఇచ్చినట్టుగా సంగం గ్రంథాలు తెలియజేస్తాయి ఈ భూదానాలు పల్లవుల కాలంలో దక్షిణ అంధ్రప్రాంతంలోనూ, తమిళనాడులోనూ వ్యవసాయ విస్తరణకు దోహదం చేశాయి ఈ పరిణామం మూడవ శతాబ్దంలో ప్రారంభమైంది పల్లవుల కాలంలోనే కాకుండా ఈనాడు మనకు పేర్లు తెలియని దక్షిణ దేశరాజుల కాలంలో కూడా వ్యవసాయ విస్తరణ జరిగిందనటానికి సందేహం లేదు



మహాబలిపురంలోని రాతి రథాలయాలు



కంచిలోని కైలాసనాథ దేవాలయం

## పల్లవులు, చాళుక్యుల మధ్య సంఘర్షణ

దక్షిణ భారత ద్వీపకల్పం రాజకీయ చరిత్రలో క్రీ శ 6 – 8 శతాబ్దాల మధ్య అత్యంత ఆసక్తికరమైన అంశం – కంచి పల్లవులకూ, బాదామి చాళుక్యులకూ మధ్య ఆధిక్యత కోసం జరిగిన పోరాటం మధుర, తిరునల్వేలి జిల్లాలను పరిపాలిస్తూ ఉండిన పాండ్యులు ఈ పోరాటంలోకి బలహీనమైన మూడవ శక్తిగా ప్రవేశించారు పల్లవులూ, చాళుక్యులూ ఇద్దరూ బ్రాహ్మణీయ మతాభిమానులే అయినా, యజ్ఞయాగాలు చేసినా, బ్రాహ్మణులకు భూదానాలు చేసినా ప్రతిష్టకోసమూ, దోపిడీకోసమూ, రాజ్య విస్తరణ కోసమూ సంఘర్షణ పడ్డారు కృష్ణా, తుంగభద్రానదుల మధ్య ఉన్న ప్రాంతంలో తమ ఆధిపత్యాన్ని స్థాపించుకోవటానికి ఇద్దరూ పోటీ పడ్డారు ఈ నదుల పరీవాహక ప్రాంతమే ఆ తరువాత విజయనగర, బహమనీ రాజ్యాలమధ్య వివాదకారణంగా మారింది దక్కన్‌లోని అనేక రాజ్యాలకూ, దక్షిణ దేశ దక్షిణ ప్రాంతానికీ సహజ సరిహద్దుగా ఉన్న తుంగభద్రను దాటటానికి పల్లవులు అనేకసార్లు ప్రయత్నించారు ఫలితం ఇటూ, అటూ మొగ్గుతూ ఈ వివాదం చాలాకాలం కొనసాగింది

ఈ సుదీర్ఘ సంఘర్షణలో మొదటి ముఖ్యమైన సంఘటన, సుప్రసిద్ధ చాళుక్య రాజైన రెండవ పులకేశి (609–642) కాలంలో జరిగింది అతని ఆస్థానకవి అయిన రవికీర్తి రాసిన 'ఐహోళే ప్రశస్తి' ఆధారంగా అతణ్ణి గురించి మనకు తెలుస్తోంది సంస్కృతంలో వారు సాధించిన కవితా రామణీయకానికి ఆ ప్రశస్తి ఉదాహరణం ఇందులో అతిశయోక్తులున్నా పులకేశి జీవితాన్ని గురించి తెలుసుకోవటానికిది విలువైన ఆధారం అతడు కదంబుల రాజధాని అయిన బనవాసిని జయించాడు మైసూరు గాంగులు, తన సార్వభౌమాధికారాన్ని అంగీకరించేలా చేశాడు నర్మదానది ఒడ్డున హర్షుని అడ్డుకొని ఓడించి అతడు దక్కన్‌లోకి రాకుండా నిరోధించాడు పల్లవులతో చేసిన యుద్ధంలో పులకేశి దాదాపు పల్లవ రాజధానిలోకి ప్రవేశించగలిగాడు తమ సామ్రాజ్యంలోని ఉత్తర ప్రాంతాలను పులకేశికి సమర్పించి పల్లవులు సంధి చేసుకున్నారు క్రీ శ 610లో అతడు కృష్ణా, గోదావరి నదుల మధ్యప్రాంతాన్ని (వేంగి) జయించాడు ఇక్కడ తన వంశ ప్రతినిధులను రాజులుగా ప్రతిష్ఠించాడు వీరు వేంగికి చెందిన తూర్పు చాళుక్యులుగా ప్రసిద్ధులయ్యారు పల్లవ రాజైన నరసింహ వర్మ (క్రీ శ 630–668) పశ్చిమ చాళుక్య రాజధానైన వాతాపిని క్రీ శ 642లో ఆక్రమించుకున్నాడు పల్లవులతో జరిగిన ఈ యుద్ధంలో రెండవ పులకేసి బహుశా చనిపోయాడు నరసింహవర్మ "వాతాపికొండ" (వాతాపిని జయించినవాడు) అన్న బిరుదును స్వీకరించాడు అతడు చోళులనూ, చేరులనూ, పాండ్యులనూ, కాలాభ్ర రాజులనూ కూడా జయించాడని చెబుతారు

ఏడవ శతాబ్దం చివర ఈ పోరాటంలో కాస్త విరామం కనిపిస్తుంది మళ్ళీ ఎనిమిదవ శతాబ్దం మొదటి భాగంలో ఈ పోరాటం ప్రారంభమైంది చాళుక్యరాజైన రెండవ విక్రమాదిత్యుడు (క్రీ శ 733–745) కంచిని మూడుసార్లు కొల్లగొట్టి, నేలమట్టం చేశాడని చెబుతారు ఇతడు 740లో పల్లవులను పూర్తిగా ఓడించాడు ఈ విజయంతో పల్లవుల ఆధిపత్యం దక్షిణ దేశంలో అంతరించిపోయింది కానీ వారి రాజవంశం మాత్రం నామమాత్రంగా మరో శతాబ్దంపాటు కొనసాగింది పల్లవుల మీద సాధించిన విజయాన్ని పశ్చిమ చాళుక్యులు ఎక్కువకాలం అనుభవించలేకపోయారు ఎందు

కంటే, వారి పరిపాలనను 757లో రాష్ట్రకూటులు అంతం చేశారు

## దేవాలయాలు

వైదిక యజ్ఞ యాగాలను చేయటం, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను (ముఖ్యంగా చివరి ఇద్దరిని) పూజించటం అధికం కావటం ప్రారంభించాయి ఏడవ శతాబ్దం నుంచీ ఆళ్వారులు విష్ణుభక్తిని ప్రచారం చేయటం ప్రారంభించారు శైవసంప్రదాయానికి నాయనార్లు ఇలాంటి సేవనే చేశారు ఏడవ శతాబ్దంనుంచీ దక్షిణ భారతదేశంలో మతకార్యక్రమాలలో, భక్తి – గొప్ప పాత్రను నిర్వహించటం ప్రారంభించింది అందుకు ఆళ్వారులు, నాయనార్లు ఎంతగానో దోహదం చేశారు

ఏడు, ఎనిమిది శతాబ్దాల్లో పల్లవ రాజులు అనేక రాతి దేవాలయాలను నిర్మించారు వాటిలో అత్యంత ప్రధానమైనవి మద్రాసుకు 65 కి మీ దూరంలో మహాబలిపురం (మామల్లపురం)లో ఉన్న రాతిరథ దేవాలయాలు వీటిని ఏడవ శతాబ్దంలో పల్లవ రాజైన నరసింహవర్మ నిర్మించాడు ఇతడే రేవుపట్టణమైన మహాబలిపురాన్ని కూడా నిర్మించాడు ఇక్కడున్న సముద్రతీరదేవాలయం చాలా ప్రసిద్ధమైంది అది ఒక రాతిలో చెక్కింది కాదు, వేరుగా నిర్మించబడిన అంతస్తుల దేవాలయం ఇది వీటికి తోడు పల్లవులు తమ రాజధాని అయిన కంచిలో ఇలాంటి అంతస్తులున్న గోపుర దేవాలయాలను ఎన్నో నిర్మించారు వీటిలో చాలా చక్కనిది ఎనిమిదవ శతాబ్దంలో నిర్మించిన కైలాసనాథ దేవాలయం క్రీ శ 610 ప్రాంతంలో బాదామి చాళుక్యులు ఐహొలెలో అనేక దేవాలయాలు నిర్మించారు ఐహొలెలో దాదాపు 70 దేవాలయాలున్నాయి దేవాలయాల నిర్మాణం ఇరుగు పొరుగు పట్టణాలైన బాదామిలోనూ, పట్టడకల్ లోనూ కూడా కొనసాగింది ఏడు, ఎనిమిది శతాబ్దాలలో నిర్మించబడ్డాయి వీటిలో అత్యంత ప్రసిద్ధమైనవి 680 ప్రాంతంలో నిర్మించబడిన పాపనాథ దేవాలయం, 740 ప్రాంతంలో నిర్మించబడిన విరూపాక్ష దేవాలయం మొదటి దేవాలయానికి 30 మీటర్ల పొడవున్నా, ఎత్తు తక్కువగా ఉత్తర భారతదేశం శైలిలో ఉన్న గోపురం ఉంది రెండవ దేవాలయం పూర్తిగా దాక్షిణాత్యశైలిలో నిర్మించబడింది దీనికి 40 మీటర్ల పొడవూ, అంతస్తులు కలిగిన ఎత్తైన శిఖరమూ ఉన్నాయి దేవాలయం గోడలమీద రామాయణ గాథ అందంగా చిత్రించబడింది

ఈ దేవాలయాలను తొలి రోజుల్లో ఎలా నిర్వహించేవారో మనకు తెలియదు ఎనిమిదవ శతాబ్దం తరువాత దేవాలయాలకు మాన్యాలు ఇవ్వటం దక్షిణ భారతదేశంలో ఒక అలవాటుగా పరిణమించింది దానికి సంబంధించిన శాసనాలను దేవాలయం గోడలమీదనే చెక్కించేవారు కానీ సాధారణ ప్రజల మీద విధించిన పన్నులతోనే దేవాలయాలను నిర్మించేవారనటానికి సందేహం లేదు ఈ డబ్బుతోనే దేవాలయాలను నిర్వహించటం కూడా చేసేవారు కర్ణాటకలో చాళుక్యుల కాలంలో కొన్ని దేవాలయాలను జైన వ్యాపారులు నిర్మించారు సాధారణ ప్రజానీకం ధాన్యమూ, కల్లూ అర్పించి గ్రామదేవతల్ని పూజించేవారు అలాంటి వారుకూడా ఈ దేవాలయాలకు – ప్రతిష్ఠను పెంచుకోవటం కోసమూ, మత సంబంధమైన కోరికల్ని తీర్చుకోవటంకోసమూ దాన ధర్మాలు చేసి ఉండవచ్చు

## రైతాంగంమీద బరువులు, బాధ్యతలు

యుద్ధాలను నిర్వహించటం కోసమూ, కళల్నీ సాహిత్యాన్నీ పోషించటంకోసమూ, మతాన్ని ప్రచారం చేయటం కోసమూ, ఉద్యోగి వర్గాన్ని భరించటం కోసమూ ఎంతో ధనం కావలసి వచ్చేది ఆ ధనాన్ని వ్యవసాయదారులే ఇవ్వవలసి ఉండేది రైతుల మీదపడ్డ భారం యొక్క స్వభావం విదర్భ, మహారాష్ట్రులకు చెందిన వాకాటకుల కాలంలోనూ, దక్షిణ ఆంధ్ర, ఉత్తర తమిళనాడుకు చెందిన పల్లవుల కాలంలోనూ దాదాపు ఒకేరకంగా ఉండేది పంటల రూపంలో వసూలు చేసే భూమి పన్ను మాత్రమే కాకుండా రాజు తృణధాన్యాలనూ, బంగారాన్ని కూడా వసూలు చేసేవాడు వీటికి తోడు చక్కెరనూ, కల్లునూ ఇచ్చే తాడిచెట్ల మీద కూడా అధికారాన్ని కలిగి ఉండేవాడు భూమిలో ఉన్న అన్నిరకాలు విలువైన వస్తువులూ రాజుకే చెందేవి పువ్వులూ, పాలూ, కలపా, గడ్డి మొదలైన వస్తువుల్ని కూడా రైతులు రాజుకు చెల్లించవలసి ఉండేది రాజు వీరి చేత బరువుల్ని కూలి చెల్లించకుండా మోయించేవాడు రాజుకు “విష్టి” అన్న పేరుతో బలవంతపు సేవను, వెట్టిచాకిరిని కూడా రైతులు చేయవలసి ఉండేది

రాజోద్యోగులు పన్నుల్ని వసూలు చేయటానికో, నేరస్తుల్ని శిక్షించటానికో, సైనిక పటాలాలతోనో గ్రామాలకు వచ్చినపుడు గ్రామీణ సమాజం అనేక బాధ్యతల్ని భరించవలసి వచ్చేది వారికి బళ్ళూ, ఎద్దులూ, మంచాలూ, బొగ్గులూ, కుంపట్లూ, పాత్రలూ మొదలైన వస్తువులతోపాటు సేవకుల్ని కూడా సమకూర్చ వలసి ఉండేది

ఈ పట్టికను చూస్తే రైతుల శ్రమనూ, పంటనూ రాజ్యం ఎలా దోచుకునేదో అర్థమౌతుంది క్రీ శ 4వ శతాబ్దం నుంచీ బ్రాహ్మణులు పొందిన 18 రకాల మినహాయింపుల్లో రైతులు చెల్లించ వలసిన అనేక వస్తువులుండేవి కాలక్రమేణా రైతుల మీద భారం పెరగటం ప్రారంభించింది

## గ్రామీణ విస్తరణ

రైతులవద్దనుంచీ ఇన్ని వస్తువులనూ, సేవలనూ ఆశిస్తున్నా డంటే రైతులకు వాటిని ఇవ్వగల తాహతు ఉందని అర్థం వ్యవసాయ ఉత్పత్తులలో అభివృద్ధి లేకపోతే ఈ వసూళ్ళు సాధ్యమయ్యేవి కావు ఈ కాలంలోనే వింధ్యకు అవతలవైపున క్రొత్త రాజ్యాల స్థాపన కూడా జరిగింది ప్రతి రాజ్యానికీ కొన్ని చిన్న చిన్న సామంత రాజ్యాలుండేవి అలా ప్రతి రాజ్యంలోనూ కొన్ని చిన్న రాజ్యాలుండేవి రాజ్యాలు పెద్దవైనా, చిన్నవైనా, స్వతంత్రమైనవైనా, సామంతరాజ్యాలైనా ప్రతి రాజ్యానికి సొంతసైన్యం మాత్రం తప్పకుండా ఉండవలసి వచ్చేది అలాగే ఈ రాజ్యాలకు సొంత పన్నుల విధానమూ, ఉద్యోగి వర్గమూ, పెద్ద సంఖ్యలో పురోహిత వర్గమూ ఉండేవి వీటికి అవసరమైన ఆర్థిక వనరుల్ని ప్రతి రాజ్యమూ తన గ్రామీణ పునాది నుంచే సేకరించుకోవలసి ఉండేది గ్రామీణ సమాజాలు విస్తరించకుండా, వ్యవసాయ ఉత్పత్తులు అభివృద్ధి చెందకుండా కొత్త రాజ్యాలు అవతరించటం సాధ్యమయ్యేది కాదు గిరిజన ప్రాంతాలలో బ్రాహ్మణులకు భూదానాలు ఇవ్వబడ్డాయి గిరిజన రైతాంగంవారి వద్దనుంచీ పశువుల్ని రక్షించుకోవలసిన అవసరాన్ని గురించీ, మెరుగైన వ్యవసాయ పద్ధతులను గురించీ తెలుసుకున్నారు కొన్ని ప్రాంతాలలో కూలీల సంఖ్య తక్కువగా ఉండేది అలాంటి ప్రాంతాలలో ఆర్థిక పరిస్థితి సక్రమంగా ఉండటం కోసం కొంతమంది కౌలుదార్లనూ, పాలెవాళ్ళనూ బ్రాహ్మణులుగా మార్చివేశారు ఈ విషయాన్ని తొలి పల్లవుల నాటి శాసనాలు తెలియ జేస్తున్నాయి ఏది ఏమైనా బ్రాహ్మణులకు భూదానాలు ఇవ్వటం చేత కొత్త వ్యవసాయ పద్ధతులు విస్తరించాయి, గ్రామీణ సమాజాలు పరిమాణంలో పెరిగాయి

ఈ దశలో దక్షిణ భారతదేశంలో మూడు రకాలైన గ్రామాలను గమనించవచ్చు అవి "ఊరు", "సభ", "నగరం" ఊరు సాధారణమైన గ్రామం అందులో అన్ని వ్యవసాయ కులాల వారూ జీవించేవారు బహుశా ఆ గ్రామంలోని భూమిని ఉమ్మడిగా అనుభవించేవారు వారి వద్దనుంచీ పన్నుల్ని వసూలు చేయటం, వారి తరఫున పన్నుల్ని కట్టటం గ్రామ పెద్ద బాధ్యతగా ఉండేది ఇలాంటి గ్రామాలు ఎక్కువగా దక్షిణ తమిళనాడులో ఉండేవి "సభలు" అని పిలవబడే గ్రామాలలో బ్రాహ్మణులకు దానంగా ఇవ్వబడిన "బ్రహ్మదేయాలు", "అగ్రహారాలు" భాగంగా ఉండేవి ఇందు లోని బ్రాహ్మణ యజమానులకు వ్యక్తిగత హక్కులుండేవి కానీ భూమిని సామూహికంగా అనుభవించేవారు "నగరం"లో అనేక చేతివృత్తులవారూ, వ్యాపారులూ జీవించేవారు నగరంలో వారి మాటకే చెల్లుబాటు ఉండేది బహుశా వ్యాపారం తగ్గుముఖం పట్టటం చేత వ్యాపారులు గ్రామాలకు తరలి వెళ్ళి ఉండవచ్చు చాళుక్య పరిపాలన ఉండిన ప్రాంతాలలో గ్రామ పరిపాలనా బాధ్యతను "మహాజనులు" అన్న గ్రామ పెద్దలు వహించేవారు సుమారు క్రీ శ 300–700 మధ్యకాలంలో గ్రామీణ విస్తరణా, గ్రామీణ పరిపాలన అభివృద్ధి చెందినట్టుగా, భూమి అంతకుముందు కంటే ఎక్కువగా వ్యవసాయం కిందికి తెచ్చినట్టుగా చక్కని ఆధారాలున్నాయి

## సామాజిక నిర్మాణం

ఈ కాలంలో అభివృద్ధి చెందిన సామాజిక నిర్మాణాన్ని గురించి చూచాయగా చెప్పవచ్చు సమాజంలో యాజమాన్యం రాజులచేతిలోనూ, పురోహితుల చేతిలోనూ ఉండేది చాలా మంది రాజులు స్థానిక తెగలకు చెందినవారే కానీ వారు పురోహితులకు పుష్కలమైన కానుకలిచ్చి తమను క్షత్రియులుగానో, బ్రాహ్మణులుగానో ప్రకటింపచేసుకున్నారు పురోహితులు వీరికి గౌరవనీయమైన వంశవృక్షాలను సృష్టించి – ప్రాచీన సూర్య, చంద్ర వంశాలతో లంకె పెట్టేవారు ఈ విధానం వల్ల కొత్తరాజులకు ప్రజల్లో గౌరవ మర్యాదలు ఏర్పడేవి పురోహితులు ప్రధానంగా బ్రాహ్మణులే కానీ కొంతమంది జైన, బౌద్ధ భిక్షువులు కూడా పురోహితులుగా వ్యవహరించేవారు భూదానాలు విరివిగా లభించటం చేత ఈ కాలంలో పురోహితుల గౌరవ, ప్రతిష్టలూ, అధికారమూ పెరిగాయి పురోహితులు, రాజులు తరువాత వ్యవసాయ దారులు వచ్చేవారు వారు అనేక కులాలకు సంబంధించిన వారుగా ఉండేవారు బ్రాహ్మణీయ వ్యవస్థలో అందరినీ కలిపి శూద్రులనేవారు వ్యవసాయదారులూ, చేతివృత్తులవారూ పైవారికి తమ సేవల్ని చెల్లించకపోతే అది పరంపరాగతంగా వస్తున్న ధర్మాన్ని తప్పటంగా పరిగణించేవారు దాన్ని కలియుగంగా అభివర్ణించేవారు అలాంటి సమయంలో రాజు దోక్యం చేసుకొని ఆ ధోరణిని అణచివేసి రాజులకూ, పురోహితు లకూ అనుకూలంగా ఉన్న సంప్రదాయాలను స్థాపించాలి అందుచేతనే వాకాటక, పల్లవ, కదంబ, పశ్చిమ గాంగ రాజులు "ధర్మమహారాజ" అన్న బిరుదాన్ని స్వీకరించారు కలియుగ అధర్మ లక్షణాలు పెచ్చుపెరిగిపోతే – వాటిని నిర్మూలించి, ధర్మాన్ని రక్షించటానికి అవతరించినవాడని పల్లవ వంశ మూలపురుషుడైన సింహవర్మను కీర్తించారు బహుశా ఆనాటి సామాజిక వ్యవస్థను తలకిందులు చేయటానికి ప్రయత్నించిన కాలాభ్ర రాజులను అణచివేయటంచేత సింహవర్మను అలా పొగడి ఉండవచ్చు

★ ★ ★

## అధ్యాయం: 25

# తత్వశాస్త్రంలో పరిణామాలు

### జీవిత గమ్యాలు

రాజ్యమూ, వర్ణసామాజిక వ్యవస్థా బలంగా స్థిరపడ్డ తరువాత ప్రాచీన తత్వవేత్తలు మానవుడు నాలుగు గమ్యాలు లేదా లక్ష్యాల కోసం ప్రయత్నించాలని ప్రతిపాదించారు అవి – "అర్థం" (ఆర్థిక వనరులు), "ధర్మం" (సామాజిక వ్యవస్థలోని నియమాలు), "కామం" (శారీరక సుఖాలు), "మోక్షం" (ముక్తి) వీటిని వివరిస్తూ, విశ్లేషిస్తూ వారు రచనలు చేశారు ఆర్థిక విషయాలను గురించి కౌటిల్యుడు రాసిన ప్రసిద్ధ గ్రంథం "అర్థశాస్త్రం" వివరిస్తుంది రాజ్యాన్నీ, సమాజాన్నీ నియంత్రించే చట్టాలు ధర్మశాస్త్రాలకు లోబడి ఉండేవి కామసూత్రాలలో శారీరక సుఖాలు చర్చించబడ్డాయి ఈ మూడు విజ్ఞాన శాఖలూ కూడా ప్రాథమికంగా భౌతిక జీవితానికీ, భౌతిక జీవిత సమస్యలకూ సంబంధించినవి ఇవి అరుదుగామాత్రమే మోక్షాన్ని గురించి ప్రస్తావించాయి కానీ దర్శనాలలో మోక్షాన్ని గురించి చర్చించటం ప్రధాన వస్తువు మోక్షమంటే జన్మ పునర్జన్మల వలయంనుంచీ విడుదల పొందటం ఈ విషయాన్ని మొట్టమొదట ప్రతిపాదించిన వాడు గౌతమబుద్ధుడు తరువాత కాలంలో దీన్ని బ్రాహ్మణీయ తత్వవేత్తలు నొక్కి చెప్పారు

క్రీస్తుశకం ప్రారంభంలో ఆరు తత్వశాస్త్ర ధోరణులు ప్రారంభమయ్యాయి అవి – సాంఖ్యం, యోగం, న్యాయం, వైశేషికం, మీమాంస, వేదాంతం

### సాంఖ్యం

సాంఖ్యం అంటే ఎంచటం లేదా లెక్కపెట్టటం ఇది మొదట అవతరించినట్టు అనిపిస్తోంది ప్రపంచాన్ని సృష్టించటానికి ఏ దివ్యశక్తీ అవసరం లేదని సాంఖ్యం మొదట విశ్వసించింది ప్రపంచం పుట్టటానికీ, పరిణామం చెందటానికీ భగవంతుని కంటే ప్రకృతే ఎక్కువ పాత్రను వహిస్తుంది ఇది హేతుబద్ధమైన, శాస్త్రీయమైన దృక్పథం క్రీ శ నాలుగవ శతాబ్దంలో ప్రకృతికి సాంఖ్యతత్వంలో పురుషుడు తోడయ్యాడు ప్రపంచం యొక్క పుట్టుక వీరిద్దరికీ ఆపాదించబడింది కాబట్టి సృష్టి వీరిద్దరి సంయుక్త ప్రయత్నమని నూతన సిద్ధాంతం చెప్పింది కాబట్టి మొదట సాంఖ్య తత్వం భౌతిక తత్వమని చెప్పవచ్చు తరువాత కాలంలో అది ఆధ్యాత్మికంగా మార్పు చెందింది మొత్తం మీద మానవుడు నిజమైన జ్ఞానాన్ని పొందటం ద్వారా ముక్తిని పొందవచ్చునీ, అంతటితో అతని బాధ అంతమౌతుందనీ ఈ తత్వం చెబుతుంది ఈ జ్ఞానాన్ని ఇంద్రియజ్ఞానం ద్వారా, అనుమానం (ఇన్‌ఫరెన్స్) ద్వారా, శబ్దం (వినికిడి) ద్వారా పొందవచ్చు ఈ పద్ధతి శాస్త్రీయ ఆలోచనకు నమూనా వంటిది

### యోగం

యోగశాస్త్రం ప్రకారం ధ్యానం ద్వారానూ, శారీరక వ్యాయామం ద్వారానూ మోక్షాన్ని సాధించవచ్చు భోగాలనూ, ఇంద్రియాలనూ, శరీరావయవాలనూ అదుపులో ఉంచుకోవటం ఈ పద్ధతిలో చాలా ముఖ్యం మోక్షాన్ని సాధించటంకోసం ఆసనాలూ, ప్రాణాయామం నిర్దేశించబడ్డాయి ఈ పద్ధతుల ద్వారా ప్రాపంచిక వ్యవహారాలనుంచీ మానవుని మనస్సు దూరమౌతుందన్న నమ్మకం ఈ పద్ధతిలోని ప్రధాన విశ్వాసం అప్పుడు ఏకాగ్రత కుదురుతుంది ప్రాచీన కాలంలో శరీరనిర్మాణ శాస్త్రంలో వచ్చిన కొంత అభివృద్ధిని ఈ ఆసనాలు సూచిస్తుండటంచేత వీటికి ప్రాముఖ్యత ఉంది. కానీ అవి ప్రాపంచిక సమస్యలనుంచీ పలాయనాన్ని కూడా సూచిస్తున్నాయి

### న్యాయం

న్యాయం ఒక తార్కిక పద్ధతిగా అభివృద్ధి చేయబడింది ఈ సిద్ధాంతం ప్రకారం జ్ఞానాన్ని సంపాదించటం ద్వారా మోక్షాన్ని సాధించవచ్చు ఒక సిద్ధాంతంలోని

లేదా ప్రతిపాదనలోని సత్యాన్ని అనుమానంద్వారా, వినికిడి ద్వారా, ఉపమాన ప్రమాణంద్వారా తెలుసుకోవచ్చునన్నది ఈ ధోరణిలో మరింత ముఖ్యమైన అంశం వీరు తర్కాన్ని ఎలా ఉపయోగిస్తారో ఈ కింది ఉదాహరణలో ఇవ్వబడింది

1 పర్వతంలో అగ్ని ఉంది
2 ఎందుకంటే అందులోంచి పొగవస్తోంది
3 వంటింటిలోని పొయ్యిలోలాగా ఎందులోంచి పొగ వస్తుందో అందులో అగ్ని ఉంటుంది

వీరు తర్కాన్ని ఉపయోగించటం భారతీయ విద్వాంసులను ప్రభావితం చేసింది ఆ తరువాత వారు తర్కబద్ధమైన, క్రమబద్ధమైన ఆలోచనను అలవాటు చేసికున్నారు

## వైశేషికం

వైశేషికతత్వం "ద్రవ్యాల"ను గురించిన చర్చకు ప్రాధాన్యత నిస్తుంది వారు ప్రత్యేకతలకూ, ప్రత్యేకతలు కలిసిన మొత్తానికీ (అగ్రిగేట్) మధ్య తారతమ్యం ఉందని భావిస్తారు పంచభూతాలైన భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశం ఒకదానితో మరొకటి కలిసినప్పుడు కొత్త వస్తువులు పుడతాయి వైశేషిక తత్వం అణుసిద్ధాంతాన్ని ప్రతిపాదించింది దాని ప్రకారం భౌతిక వస్తువులన్నీ అణువుల సమ్మేళనంతో ఏర్పడతాయి అలా వైశేషికులు భౌతిక శాస్త్రం భారతదేశంలో పుట్టటానికి కారణభూతులయ్యారు కానీ వీరి శాస్త్రీయ దృక్పథం భగవంతునిలోనూ, ఆధ్యాత్మికతలోనూ వీరికున్న విశ్వాసం వల్ల పలచబడిపోయింది ఈ తత్వం క్రమంగా స్వర్గం మీదా, ముక్తిమీదా తన దృష్టిని కేంద్రీకరించింది

## మీమాంస

మీమాంస అన్న పదానికి తర్కం, విశ్లేషణం అని అర్థం కానీ ఇందులో తర్కాన్ని వివిధ వైదిక కర్మల్ని సమర్థించటానికి ఉపయోగించారు ముక్తి వైదిక కర్మల్ని ఆచరించటం వల్లనే వస్తుందని చెప్పారు మీమాంస ప్రకారం శాశ్వత సత్యం వేదాలలో ఉంది స్వర్గాన్నీ, ముక్తినీ సాధించటమే మీమాంస లక్ష్యం పూర్వజన్మ పుణ్యకర్మలు ఉన్నంత కాలమే మానవుడు స్వర్గసుఖాలను అనుభవిస్తాడు అవి అయిపోయిన తరువాత అతడు మళ్ళీ భూమికి తిరిగి వస్తాడు కానీ అతడు ముక్తిని సాధించగలిగితే జనన మరణాల వలయం నుంచి పూర్తిగా బయటపడతాడు

మీమాంస – ముక్తిని సాధించటానికి వైదిక యజ్ఞ యాగాలను ఆచరించాలని గట్టిగా చెబుతుంది వాటిని ఆచరించటానికి పురోహిత వర్గం సహకారం కావాలి వర్ణవ్యవస్థలోని హెచ్చుతగ్గులనూ, వాటి మధ్య సామాజికంగా ఉన్న దూరాన్ని మీమాంస చట్టబద్ధం చేసింది మీమాంస ద్వారా బ్రాహ్మణులు వైదిక కర్మలు నిర్వహించటంలో తమ ఆధిపత్యాన్నీ, సమాజంలోని హెచ్చు తగ్గులను కొనసాగించటానికీ ప్రయత్నించారు

## వేదాంతం

వేదాంతమంటే వేదాల చివరి భాగం క్రీ పూ రెండవ శతాబ్దంలో బాదరాయణుడు సంకలనం చేసిన "బ్రహ్మసూత్రాలు" దీనికి ఆధారగ్రంథం ఆ తరువాత దీనిమీద రెండు వ్యాఖ్యానా లొచ్చాయి క్రీ శ 9 వ శతాబ్దంలో శంకరుడూ, 12వ శతాబ్దంలో రామానుజుడు "బ్రహ్మసూత్రాల"మీద వ్యాఖ్యానాలు రాశారు శంకరుని అభిప్రాయం ప్రకారం బ్రహ్మకు ఎలాంటి గుణాలూ లేవు అతడు జ్ఞానం ప్రధాన మోక్షసాధనమని కూడా భావించాడు కానీ రామానుజుని అభిప్రాయం ప్రకారం భక్తి నిజమైన మోక్షమార్గం

వేదాంతాన్ని తొలి ఉపనిషత్తులలోనే చూడవచ్చు వేదాంతం ప్రకారం "బ్రహ్మ" మాత్రమే సత్యం తక్కిన ప్రపంచమంతా మిథ్య ఆత్మ, బ్రహ్మ ఒక్కటే – వేరువేరు కాదు కాబట్టి మానవుడు ఆత్మజ్ఞానాన్ని పొందటంద్వారా బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు అదే ముక్తి లేదా మోక్షం ఆత్మ, బ్రహ్మ అనంతమైనవి వాటికి చావు లేదు ఇలాంటి దృక్పథం స్థిరత్వాన్ని ప్రోత్సహిస్తుంది మార్పును వ్యతిరేకిస్తుంది ఆధ్యాత్మికంగా సత్యమైనది, భౌతికంగా, సామాజికంగా కూడా సత్యమేనన్న అభిప్రాయాన్ని కలగజేస్తుంది

కర్మసిద్ధాంతం కూడా వేదాంతంతో లంకె కుదుర్చుకుంది గత జన్మల్లో మానవుడు చేసిన మంచి చెడ్డల ఫలితాలను ఈ జన్మలో అనుభవించాలని అర్థం వేదాంతంలో మాత్రమే కాకుండా హిందూ మతంలోని ఇతర మార్గాలలో కూడా పునర్జన్మ సిద్ధాంతం ఒక ముఖ్యమైన అంశమైపోయింది అంటే – మానవులు ప్రాపంచిక, సామాజిక కారణాల వల్ల బాధలకు గురి కారనీ, అందుకు మనకు తెలియని, మన స్వాధీనంలో లేని కారణాలేవో ఉంటాయనీ ఈ సిద్ధాంతం చెబుతుంది

## భౌతిక ప్రాపంచిక దృక్పథం

మొత్తం మీద ఇంతవరకూ చర్చించిన ఆరు తత్వశాస్త్ర మార్గాలూ భావవాద ప్రాపంచిక దృక్పథాన్ని ప్రచారం చేశాయి అవన్నీకూడా మోక్షానికి మార్గాలే సాంఖ్య, వైశేషిక మార్గాలు భౌతిక వాద ప్రాపంచిక దృక్పథాన్ని ప్రతిపాదించాయి తొలి సాంఖ్య తత్వవేత్తలలో ఒకడైన

కపిలుడు మానవుడి జీవితాన్ని ప్రకృతి శక్తులు తీర్చిదిద్దుతాయి కానీ, దైవిక శక్తి కాదని చెప్పాడు బుద్ధుని కాలానికి చెందిన సంప్రదాయ విరోధులైన అజీవకుల బోధనలలో కూడా భౌతిక వాద లక్షణాలు కనిపిస్తాయి కానీ చార్వాకుడే భౌతిక వాద తత్వశాస్త్రానికి ప్రధాన వ్యాఖ్యాత ఈ తత్వ శాస్త్రం "లోకాయతం" అన్న పేరుతో ప్రసిద్ధి పొందింది లోకాయతం అంటే సాధారణ ప్రజానీకం నుంచీ గ్రహించిన భావాల సముదాయం ప్రపంచంతో (లోకం) దగ్గరి సంబంధం కలిగి ఉండవలసిన అవసరాన్ని లోకాయతం నొక్కి చెప్పింది పరలోకాన్ని గురించి తనకు నమ్మకం లేదని కూడా లోకాయతం చెప్పింది లోకాయత వాదంలోని అనేక సిద్ధాంతాలను చార్వాకునికి ఆపాదిస్తారు అతడు అధ్యాత్మిక మోక్షాన్ని అన్వేషించటానికి వ్యతిరేకి అతడు మానవాతీత, దైవిక శక్తిని తిరస్కరించాడు ఇంద్రియాలకు గోచరంగా ఉన్న వస్తువుల అస్తిత్వాన్ని మాత్రమే అతడు గుర్తించాడు "బ్రహ్మ"లో అతనికి నమ్మకం లేకపోవటాన్ని ఈ వాదం సూచిస్తుంది బ్రాహ్మణులు తాము దక్షిణల్ని సంపాదించుకోవటంకోసం కర్మకాండ ఆచారాలను సృష్టించారని చార్వాకుడు చెప్పాడు వీటినన్నిటినీ వదిలిపెట్టి చార్వాకుడు అప్పుచేసి నెయ్యి తాగ మన్నాడనీ, విలాసంగా జీవించమన్నాడనీ మాత్రమే ఇతరులు ప్రచారం చేశారు వాస్తవానికి చార్వాకుని గొప్పదనం అతడు భౌతిక వాద ప్రాపంచిక దృక్పధానికి చేసిన దోహదంలో ఉంది మానవాతీత, దైవిక శక్తులను తిరస్కరించి మానవుణ్ణే అన్ని కార్యకలాపాలకూ కేంద్రంగా అతడు భావించాడు

క్రీ పూ 500, క్రీ శ 300 మధ్యకాలంలో ఆర్థిక వ్యవస్థా, సామాజిక వ్యవస్థా విస్తరిస్తున్న కాలంలో భౌతిక వాదానికి ప్రాధాన్యతనిచ్చే తాత్విక దృక్పథాలు అభివృద్ధి చెందాయి గంగా మైదానంలోనూ, ఇతర ప్రాంతాలలోనూ ప్రకృతికి వ్యతిరేకంగా పోరాడి, కొత్త జన నివాసాలను ఏర్పాటు చేసుకోవటంలోనూ, రోజువారీ జీవితాన్ని గడపటంలోనూ ఎదురైన సమస్యలు, ఇనుము మీద ఆధారపడ్డ వ్యవసాయ విజ్ఞానమూ, ద్రవ్య ఆర్థిక విధానమూ చేతివృత్తులు అభివృద్ధి చెందటానికి దోహదం చేశాయి ఈ కొత్త వాతావరణం శాస్త్రీయమైన, భౌతికమైన జీవిత దృక్పథానికి దారి చూపాయి ఇది చార్వాకుని తత్వశాస్త్రంలోనూ, ఇతర సాంప్రదాయిక తాత్విక దృక్పథాలలోనూ ప్రతిఫలించాయి

క్రీ శ 5 వ శతాబ్దానికల్లా భావవాద తత్వశాస్త్రం భౌతిక వాద తత్వశాస్త్రాన్ని తెరమరుగుకు పంపివేసింది భావవాద తత్వవేత్తలు భౌతిక వాదాన్ని నిరంతరంగా విమర్శిస్తూ వచ్చారు వారు ముక్తికి మార్గంగా వైదిక కర్మల్నీ, యజ్ఞయాగాలనూ గట్టిగా సిఫారసు చేశారు ప్రాపంచిక వ్యవహారం దైవిక శక్తుల కారణంగానే కొనసాగుతుందని చెప్పారు ఈ దృక్పథం శాస్త్రీయ అన్వేషణనూ, హేతు వాద ఆలోచననూ అడ్డుకుంది మేధావులు కూడా పురోహితులకూ, యోధులకూ ఉన్న ప్రత్యేక సౌకర్యాలను ప్రశ్నించలేకపోయారు భావవాద తత్వశాస్త్రంలోనూ, ముక్తివాదాల తాత్విక ధోరణుల్లోనూ కూరుకుపోయిన ప్రజలు వర్ణసమాజం యొక్క అసమానతలకూ, రాజు ప్రాతినిధ్యం వహించే రాజ్యాధికారానికీ నిస్సహాయంగా లొంగిపోయారు

★ ★ ★

# అధ్యాయం: 26

# ఆసియా దేశాలతో భారతదేశ సాంస్కృతిక సంబంధాలు

మధ్యయుగాల ధర్మశాస్త్రవేత్తలూ, వ్యాఖ్యాతలూ - సముద్రాన్ని ఎవరూ దాటకూడదన్న నిబంధన విధించారు అంటే - బయట ప్రపంచంతో సర్వసంబంధాలనూ తెంచుకున్నారన్న అర్థం వస్తుంది కానీ అది సత్యంకాదు హరప్పా కాలం నుంచీ కూడా భారతీయులు ఇతర ఆసియా దేశాలతో సంబంధాలను కొనసాగిస్తూనే వచ్చారు భారతీయులు మెసపొటేమియా నగరాలకు వెళ్ళారు క్రీ పూ 2400 - 1700 కాలానికి చెందిన భారతీయ ముద్రికలు (సీళ్ళు) ఆ నగరాలలో లభించాయి క్రీస్తుశకం ప్రారంభం నుంచీ కూడా భారతీయులు చైనాతో, ఆగ్నేయ ఆసియాతో, పశ్చిమ ఆసియాతో, రోమన్ సామ్రాజ్యంతో వ్యాపార సంబంధాలను కలిగి ఉన్నారు భారతీయ భూ మార్గాలు చైనా పట్టుమార్గం (చైనీస్ సిల్క్‌రూట్)తో ఎలా సంధించబడి ఉన్నాయో మనం ఇదివరకే చూశాం రోమన్ సామ్రాజ్యంలోని తూర్పు దేశాలతో భారతదేశానికుండిన వ్యాపార సంబంధాలను గురించి కూడా చర్చించాం దీనికితోడు ఇరుగు పొరుగు దేశాలలో జన నివాసాలను గుర్తించిన చోట్లకు భారతదేశం నుంచి మతప్రచారకులూ, ఆక్రమణదారులూ, వ్యాపారులూ కూడా వెళ్ళారు

బౌద్ధమత ప్రచారంతో భారతదేశానికీ శ్రీలంక, బర్మా, చైనా, మధ్య ఆసియా దేశాలకూ సంబంధాలు అభివృద్ధి చెందాయి బహుశా క్రీ పూ 3 వ శతాబ్దంలో అశోకుని పరిపాలనా కాలంలో బౌద్ధమత ప్రచారకులు శ్రీలంకకు వెళ్ళారు క్రీ పూ 2, 3 శతాబ్దాలకు చెందిన చిన్న చిన్న బ్రాహ్మీ శాసనాలు శ్రీలంకలో లభించాయి కాలక్రమాన బౌద్ధమతం శ్రీలంకలో స్థిరపడిపోయింది క్రీ శ తొలి శతాబ్దాలలో బౌద్ధమతం భారతదేశం నుంచీ బర్మాకు వ్యాపించింది బర్మా దేశీయులు బౌద్ధమతంలో తెరవాదం అన్నశాఖను అభివృద్ధి చేశారు బుద్ధునికి అనేక దేవాలయాలు నిర్మించారు అనేక విగ్రహాలను ప్రతిష్ఠించారు అంతేకాకుండా బర్మా, శ్రీలంకలకు చెందిన బౌద్ధులు భారతదేశంలోని గొప్ప బౌద్ధసాహిత్యాన్ని సృష్టించారు ఈ పాళీగ్రంథాలను సంకలనం చేయటం, వ్యాఖ్యానం రాయటం శ్రీలంకలో జరిగింది బౌద్ధమతం భారతదేశం నుంచీ అదృశ్యమైపోయినా, బర్మాలోనూ, శ్రీలంకలోనూ దానికి పెద్ద సంఖ్యలో అనుయాయులుండేవారు, ఈనాడు కూడా ఉన్నారు

కనిష్కుని కాలం నుంచీ భారతీయ మత ప్రచారకులు చైనా, మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్థాన్ దేశాలకు తమ మతాన్ని ప్రచారం చేసుకోవటానికి వెళ్ళారు బౌద్ధమతం - చైనా నుంచీ కొరియా, జపాన్ దేశాలకు విస్తరించింది చైనానుంచీ బౌద్ధగ్రంథాల కోసమూ, తాత్విక సిద్ధాంతాల కోసమూ ఫాహియాన్, హువాన్‌త్సాంగ్ వంటి యాత్రికులు భారతదేశానికి వచ్చారు ఈ సంబంధం రెండు దేశాలకూ లాభదాయకంగానే పరిణమించింది టున్-హువాంగ్‌లో ఒక బౌద్ధ జనపదం వెలిసింది అది ఎడారి గుండా వ్యాపార బృందాలు ప్రయాణం చేయటానికి నాంది పలికింది చైనా నుంచీ భారతీయులు పట్టు తీయటం నేర్చుకున్నారు భారతదేశం నుంచీ చైనీయులు బౌద్ధ చిత్రకళను నేర్చుకున్నారు

ఆ కాలంలో మరో రెండు బౌద్ధమత కేంద్రాలు ఆఫ్ఘనిస్థాన్, మధ్య ఆసియా ఆఫ్ఘనిస్థాన్‌లో అనేక బౌద్ధ విగ్రహాలూ, విహారాలూ బయటపడ్డాయి ఆఫ్ఘనిస్థాన్ ఉత్తర ప్రాంతంలోని బెగ్రాం, బామియాన్ ప్రాంతాలు అలాంటి అవశేషాలకు ప్రసిద్ధి చెందాయి బెగ్రాం దంతం మీద చేసే చెక్కటం పనికి ప్రసిద్ధి చెందింది అది కుషానుల కాలంలో భారతదేశంలో ఉండిన అలాంటి కళను పోలి ఉంటుంది బామియాన్‌లో ఒకేరాతిలో చెక్కిన అత్యంత ఉన్నతమైన బౌద్ధ విగ్రహం ఉంది అది క్రీస్తుశకం తొలి శతాబ్దులలో



బామియాన్ (ఆఫ్ఘనిస్థాన్‌లోని) లోని బుద్ధుని విగ్రహం

చెక్కబడింది బామియాన్‌లో సహజమైనవి, సహజం కానివీ కొండ గుహలు వేలాదిగా ఉన్నాయి వీటిలో బౌద్ధ భిక్షువులు నివసించేవారు క్రీ శ 7 వ శతాబ్దం వరకూ ఆఫ్ఘనిస్థాన్‌లో బౌద్ధమతం కొనసాగింది ఆ తరువాత ఇస్లాంలోకి మార్చబడింది

సోవియట్ యూనియన్‌లోని మధ్య ఆసియా రిపబ్లిక్‌లలో కూడా సరిగ్గా ఇలాగే జరిగింది ఈ ప్రాంతాలలో జరిగిన తవ్వకాలలో అనేక బౌద్ధారామాలూ, స్థూపాలూ, శాసనాలూ, భారతీయ భాషల్లో ఉన్న రాతప్రతులూ అనేక చోట్ల లభించాయి కుషానుల పరిపాలన విస్తరించటం ఫలితంగా ఖరోష్టిలిపిలో రాసిన ప్రాకృతం మధ్య ఆసియా ప్రాంతాలకు విస్తరించింది ఆ ప్రాంతాలలో ప్రాకృత శాసనాలూ, రాతప్రతులూ అనేకం లభించాయి ఇవి క్రీ శ 4 వ శతాబ్దానికి చెందినవి బౌద్ధమత రక్షణకూ, ప్రచారానికీ, పరిపాలనా వ్యవహారాలకూ, నిత్యవ్యవహారానికీ కూడా ఇలాంటి భాషే ఉపయోగించబడింది మధ్య ఆసియాలో కూడా బౌద్ధమతమే ప్రధాన మతంగా ఉంటూ వచ్చింది క్రీ శ 7 వ శతాబ్దం చివర ఆ స్థానాన్ని ఇస్లాం ఆక్రమించింది

ఆగ్నేయ ఆసియా దేశాలకూ కూడా భారతీయ సంస్కృతి విస్తరించింది కానీ అందుకు మాధ్యమం బౌద్ధమతం కాదు ఒక్క బర్మాకు తప్ప ఇతరదేశాలకు బ్రాహ్మణీయ ఆచారాల ద్వారా భారతీయ సంస్కృతి వ్యాపించింది బర్మాలోని పెగూ, మౌల్‌మైన్ ప్రాంతాలను సువర్ణ భూమి అనేవారు బరూచీ, బెనారస్, భగల్పూర్‌లకు చెందిన వ్యాపారులు బర్మాతో వ్యాపారం చేసేవారు గుప్తుల కాలానికి చెందిన బౌద్ధ అవశేషాలు బర్మాలో పెద్ద మొత్తంలోనే లభించాయి క్రీ శ మొదటి శతాబ్దం నుంచే భారతదేశం జావాతో, ఇండొనేషియాతో సంబంధాలను ఏర్పరచుకుంది ప్రాచీన భారతీయులు ఈ ద్వీపాలను "సువర్ణద్వీపాలు" అని పిలిచేవారు క్రీ శ 56లో జావాలో మొట్టమొదటి భారతీయ జననివాసం వెలిసింది రెండవ శతాబ్దంలో అనేక చిన్నచిన్న భారతీయ రాజ్యాలు ఏర్పడ్డాయి కానీ క్రీ శ 5 వ శతాబ్దంలో పాహియాన్ జావా ద్వీపాన్ని సందర్శించినప్పుడు అక్కడ బ్రాహ్మణీయ మతాన్ని ప్రజలు అనుసరిస్తూ ఉండటాన్ని గమనించాడు క్రీస్తుశకం తొలిశతాబ్దాలలో సుమత్రాలో పల్లవులు వలసల్ని ఏర్పాటు చేసుకున్నారు కాలక్రమాన ఈ వలసలన్నీ శ్రీవిజయ సామ్రాజ్యంలో లీనమైపోయాయి ఈ సామ్రాజ్యం క్రీ శ 5 వ శతాబ్దం నుంచి 10 వ శతాబ్దం వరకూ బలమైన సామ్రాజ్యంగా, హిందూ సంస్కృతికి కేంద్రంగా విలసిల్లింది జావా, సుమత్రాలలోని హిందూ జనపదాలు, హిందూ సంస్కృతి నలువేపులకూ విస్తరించటానికి దోహదం చేశాయి కొత్త కొత్త హిందూజనపదాలు ఏర్పడటం కొనసాగుతూనే వచ్చింది

ఈనాడు – వియత్నాం, కాంబోడియా, లావోస్ అన్న మూడు దేశాలుగా విడిపోయిన ఇండో – చైనాలో భారతీయులు, కాంభోజ, చంప అన్న రెండు బలమైన రాజ్యాలను స్థాపించారు వీటిలో కాంభోజ రాజ్యం ఆధునిక కాంబోడియాతో సరిపోతుంది అది క్రీ శ 6 వ శతాబ్దంలో స్థాపించబడింది ఈ దేశాల రాజులు శైవులు వాళ్ళు కాంభోజ రాజ్యాన్ని సంస్కృత విద్యాకేంద్రంగా అభివృద్ధి చేశారు ఆ భాషలో అనేక శాసనాలను వేశారు

కాంభోజ రాజ్యపు శివార్లలో – చంపా ప్రాంతంలో (దక్షిణ వియత్నాం, ఉత్తర వియత్నాం ఉత్తర శివార్లు) వ్యాపారులు కాలనీలను ప్రారంభించారు చంప రాజ్యపు రాజుకూడా శైవుడే అక్కడ కూడా అధికార భాష సంస్కృతమే వేదాలనూ, ధర్మశాస్త్రాలనూ అధ్యయనం చేయుటంలో ఈ దేశానికి గొప్ప పేరుండేది

హిందూ మహాసముద్రంలోని భారతీయ జననివాసాలు పదమూడవ శతాబ్దం వరకూ ఉన్నత స్థితితో కొనసాగాయి

ఈ కాలంలో వారు స్థానిక ప్రజలతో బాగా కలిసి పోయారు వీరు నిరంతరంగా కలిసి జీవించటం చేత కొత్త కళా, భాషా, సాహిత్యమూ రూపొందాయి రూపొందిన గొప్ప కళాఖండాలు ఈ దేశాలలో మనకు కనిపిస్తాయి అత్యుత్తమ బౌద్ధ దేవాలయం భారతదేశంలో కాకుండా ఇండొనేషియాలోని బొరోబొదూర్‌లో ఉండటం ఆశ్చర్యమే ది ప్రపంచంలోని అతి పెద్ద బౌద్ధదేవాలయం ఇది క్రీ శ 8 వ శతాబ్దంలో నిర్మించబడింది 436 బుద్ధప్రతిమల్ని ఆ దేవాలయంలో చిత్రించారు

కాంబోడియాలోని అంకోర్వత్ దేవాలయం బోరో బొదూర్ దేవాలయం కంటే పెద్దది ఇది మధ్యయుగాలలో నిర్మించబడినా కళా వైభవంలో దీన్ని ఈజిప్టియన్, గ్రీక్ నిర్మాణాలతో పోల్చవచ్చు దీని గోడల మీద రామాయణ, మహాభారత గాథలు చిత్రించబడ్డాయి ఇండొనేషియాలో రామాయణానికి చాలా ప్రసిద్ధి ఉంది రామాయణం గాథ మీద అనేక జానపద నాటకాలు రచించబడి, ప్రదర్శింపబడుతున్నాయి ఇండొనేషియా భాషలో అనేక సంస్కృత పదాలున్నాయి



బోరోబుదూర్‌లోని దేవాలయ దృశ్యం

శిల్పకళను గురించి ఆలోచిస్తే థాయిలాండ్‌కు చెందిన బుద్ధుని శిరస్సు, కాంభోజ రాజ్యానికి చెందిన మరొక బుద్ధుని శిరస్సు, జావాకు చెందిన అనేక కంచు విగ్రహాలూ భారతీయ, స్థానిక కళా సంప్రదాయాల ఉత్తమ సమ్మేళనానికి ఉదాహరణలుగా నిలుస్తాయి చిత్రకళలో శ్రీలంకలోనూ, చైనా సరిహద్దులోని టున్ హువాంగ్ గుహల్లోనూ అజంతా చిత్రాలతో పోల్చదగిన చిత్రాలున్నాయి

భారతీయ సంస్కృతిని విస్తరింప చేయటానికి మతం మాత్రమే దోహదం చేసిందని భావించటం పొరపాటు మత ప్రచారకులను వ్యాపారులూ, విజేతలూ బలపరిచారు మధ్య ఆసియాతోనూ, ఆగ్నేయ ఆసియాతోనూ సంబం ధాలు ఏర్పడటంతో వ్యాపారం కీలకపాత్ర వహించింది ఆగ్నేయ ఆసియాలోని కొన్ని ప్రాంతాలను సువర్ణ భూమి, సువర్ణ ద్వీపం అని పిలవటం భారతీయుల సువర్ణ కాంక్షను తెలియజేస్తోంది వ్యాపారం సరుకుల మార్పిడికి మాత్రమే కాకుండా సాంస్కృతికాంశాల మార్పిడిని కూడా ప్రోత్సహిం చింది ఇతర దేశాల సాంస్కృతికాభివృద్ధికి భారతీయులు మాత్రమే దోహదం చేశారని భావించటం కూడా పొరపాటే సాంస్కృతికాభివృద్ధి రెండు వైపులకూ రాకపోకలున్న రహ దారి భారతీయులు బంగారు నాణాలను ముద్రించే కళను గ్రీకులనుంచీ, రోమన్ల నుంచీ నేర్చుకున్నారు చైనా నుంచీ పట్టు ఉత్పత్తిని తెలుసుకున్నారు ఇండొనేషియా నుంచి తమలపాకులు పండించటం నేర్చుకున్నారు ఇరుగుపొరుగు దేశాలనుంచీ ఎన్నో తెలుసుకున్నారు అలాగే పత్తిని పండిం చటం భారతదేశం నుంచీ చైనాకూ, మధ్య ఆసియాకూ విస్తరించింది కళల్లో, మతంలో, లిపిని రూపొందించటంలో, భాషలో భారతీయుల సహకారం ఎక్కువ విలువైంది కానీ ఏ దేశంలో కూడా భారతీయ సంస్కృతికి ప్రతిరూపం వంటి సంస్కృతి రూపొందలేదు ఎన్ని విదేశీప్రభావాలు పడినా భారతదేశం ఎలా స్వయం వ్యక్తిత్వాన్ని నిలుపుకొని, పోషించుకోగలిగిందో అలాగే ఆగ్నేయ ఆసియాలోని ప్రతి దేశమూ భారతీయ, స్థానిక సాంస్కృతికాంశాలను మిళితం చేసుకొని, తన సొంత సంస్కృతిని రూపొందించుకోగలిగింది

★ ★ ★

# అధ్యాయం: 27

# ప్రాచీనదశనుంచి మార్పు

## సామాజిక సంకట పరిస్థితి, భూసంబంధాలలో మార్పులు

ప్రాచీన భారతీయ సమాజాన్ని మధ్యయుగ సమాజంగా మార్చివేసిన ప్రధాన కారణం భూదానాలు చేసే సంప్రదాయం ఈ సాంప్రదాయం ఎలా ప్రారంభమైంది? ఈ దానాలు చేసినవారు ప్రధానంగా రాజులు వారికి మత గౌరవం కావాలి దానాలు తీసుకున్నవారు ప్రధానంగా పురోహితులు, సన్యాసులు మత కార్యకలాపాలను నిర్వహించటానికి వీరికి ధనం కావాలి కానీ ఈ భూదానాల సంప్రదాయం ప్రాచీన సామాజిక వ్యవస్థలో తీవ్రమైన సంకట పరిస్థితి ఏర్పడటం చేత నిజంగా అమలులోకొచ్చింది వర్ణసమాజం వైశ్యుల మీదా, శూద్రులమీదా ఆధారపడేది వీరిలో వైశ్యులు వ్యవసాయదారులు, శూద్రులు కూలీలు ప్రభుత్వాధికారులు వైశ్యుల వద్ద నుంచీ వసూలు చేసిన పన్నులతో రాజులు ఉద్యోగులకూ సైనికులకూ జీతాలు చెల్లించేవారు పురోహితులకు సంభావన లిచ్చేవారు, విలాస వస్తువులనూ, ఇతర వస్తువులనూ వ్యాపారుల వద్ద నుంచీ, పెద్ద పెద్ద చేతివృత్తుల నిపుణుల వద్దనుంచీ కొనుక్కునేవారు కానీ క్రీ శ మూడు, నాలుగు శతాబ్దాలలో చాలా తీవ్రమైన క్లిష్టపరిస్థితిని సమాజం ఎదుర్కోవలసి వచ్చింది అనాటి పురాణ గ్రంధాలు – అనాటి ప్రజలు తమ వర్ణధర్మాలను వదిలిపెడుతున్నారని బాధపడ్డాయి కింది వర్ణాలవారు పై వర్ణాలవారి స్థాయినీ, ధర్మాలనూ గర్వంగా అనుసరించటం ప్రారంభించారట పన్నులు కట్టటాన్నీ వెట్టిచాకిరినీ తిరస్కరిస్తున్నారట ఇది వర్ణ సంకరానికి దారి తీస్తూ ఉందట ఉత్పత్తి చేస్తున్నవారిమీద పన్నుల బరువు పెరగటం, ఆంక్షలు అధికం కావటం, రాజులు వారికి ఎలాంటి రక్షణా కల్పించకపోవటం – వారు వర్ణతారతమ్యాల మీద తిరగబడటానికి కారణాలు క్రీ శ మూడు, నాలుగు శతాబ్దాల నాటి పురాణ గ్రంధాలలో వీటిని కలియుగ లక్షణాలనీ, ఆ కాలాన్ని కలియుగమనీ అన్నారు

ఈ సంకట పరిస్థితిని అధిగమించటానికి అనేక ప్రయత్నాలు జరిగాయి దాదాపు అదే కాలానికి చెందిన "మనుధర్మశాస్త్రం" వైశ్యులూ, శూద్రులూ తమ విధుల్ని దాటటానికి అనుమతించ కూడదని గట్టిగా చెబుతుంది దీనికోసం బలవంతపు విధానాలను కూడా అనుసరించి ఉండవచ్చు ఈ సంకట పరిస్థితిని అధిగమించటానికి చేసిన ముఖ్యమైన ప్రయత్నం పురోహితులకూ, ఉద్యోగులకూ జీతాలకు బదులుగా భూముల్ని ఇవ్వటం పన్నులు వసూలు చేయటం, శాంతిభద్రతల్ని రక్షించటం వంటి బాధ్యతలను – ఆయా గ్రామాలను దానం పొందిన వారికే అప్పజెప్పే సౌకర్యం ఈ విధానం వల్ల వచ్చింది వారు నియమాలను ఉల్లంఘించిన రైతుల్ని అక్కడికక్కడే దండించేవారు ఈ విధానం వల్ల కొత్త భూములు సాగులోకొచ్చాయి ఆక్రమించుకున్న గిరిజన ప్రాంతాలలో బ్రాహ్మణులను ప్రతిష్టించటం ద్వారా గిరిజనులకు బ్రాహ్మణీయ జీవిత విధానాన్ని నేర్పే వీలు కలిగింది అలాగే వారికి రాజుకు లోబడి ఉండటం, పన్నుల్ని కట్టటం కూడా నేర్పే అవకాశం వచ్చింది

## భూస్వాముల అభివృద్ధి

క్రీ శ 5 వ శతాబ్దం నుంచీ భూదానాలు ఎక్కువయ్యాయి వీటిని రాజులు బ్రాహ్మణులకు ఎలాంటి పన్నులూ లేకుండా ఇచ్చారు దానం ఇవ్వటానికి పూర్వం రాజు వసూలు చేసుకుంటూ ఉండిన పన్నులన్నీ దానం పొందిన బ్రాహ్మణులకు బదిలీ అయ్యాయి దీనికితోడు ఆ గ్రామాల పరిపాలన కూడా బ్రాహ్మణులకే అప్పగించబడింది ఈ దాన గ్రామాలలోకి ప్రభుత్వోద్యోగులూ, రాజ ప్రతినిధులూ ప్రవేశించ కూడదు క్రీ శ 5 వ శతాబ్దం వరకూ నేరస్తుల్ని శిక్షించే హక్కు రాజులు ఉంచుకునేవారు ఆ తరువాత ఆ అధికారం కూడా దానం పొందిన బ్రాహ్మణులకే ఇవ్వబడింది అలా బ్రాహ్మణులు తాము దానంగా పొందిన గ్రామాలలో పన్నులు వసూలు చేసుకోవటమేకాక, నేరస్తుల్ని శిక్షించే హక్కునూ, శాంతిభద్రతల్ని రక్షించే బాధ్యతను కూడా కలిగి ఉండేవారు ఈ గ్రామాలు బ్రాహ్మణులకు శాశ్వతంగా ఇవ్వబడ్డాయి

అందుచేత గుప్తుల తరువాత – రాజు అధికారం బాగా తగ్గటం ప్రారంభించింది మౌర్యుల కాలంలో పన్నుల్ని విధించటం, వసూలు చేయటం రాజప్రతినిధులు చేసేవారు శాంతిభద్రతల్ని కూడా వారే రక్షించేవారు కానీ భూదానాల కారణంగా రాజాధికారం చెల్లుబాటుకాని అనేక ప్రాంతాలు తయారయ్యాయి

ప్రభుత్వోద్యోగులకు కూడా భూదానాలు ఇవ్వటం చేత రాజాధికారం మరింతగా బలహీనపడిపోయింది మౌర్యుల కాలంలో ప్రభుత్వోద్యోగులందరికీ జీతాలను డబ్బు రూపంలోనే సాధారణంగా చెల్లించేవారు ఈ పద్ధతి కుషానుల కాలంలో కూడా కొనసాగింది వారు పెద్ద సంఖ్యలో రాగి, బంగారు నాణాలను ముద్రించారు ఈ పద్ధతి గుప్తుల కాలంలో కూడా బలహీనంగా కొనసాగింది బంగారు నాణాలను బహుశా సైనికోద్యోగులకూ, ఉన్నతోద్యోగులకూ జీతాలు చెల్లించటానికి ఉపయోగించేవారు క్రీ శ 6 వ శతాబ్దం తరువాత ఈ పద్ధతి పూర్తిగా మారిపోయింది ఆ శతాబ్దానికి చెందిన ధర్మశాస్త్రాలు ప్రభుత్వసేవకు ప్రతిఫలంగా భూమిని ఇవ్వాలని చెప్పాయి కాబట్టి హర్షవర్ధనుని కాలం నుంచీ ప్రభుత్వోద్యోగుల జీతాలను వారు వసూలు చేసుకునే భూమి పన్ను రూపంలో చెల్లించేవారు రాజ్యాదాయంలో నాలుగవ భాగాన్ని ఉన్నతోద్యోగుల కోసం ప్రత్యేకించేవారు గవర్నర్లకూ, మంత్రులకూ, న్యాయాధిపతులకూ వారి సొంత ఖర్చులకోసం భూముల్ని కేటాయించేవారు ఈ పరిణామాలన్నీ ఏకమై, రాజు అధికారాన్ని దెబ్బతీసే స్వలాభాపేక్ష ప్రారంభమైంది

## నూతన వ్యవసాయ విధానం

ఆ కాలంలోనే వసాయవిధానంలోముఖ్యమైన మార్పు రావటం కనిపిస్తుంది భూదానాలు పుచ్చుకున్నవారు సొంతంగా వ్యవసాయం చేయలేకపోయారు సొంతంగా పన్నుల్ని వసూలుచేసుకోలేక పోయారు కాబట్టి వ్యవసాయం కౌలుదార్లకు అప్పగించవలసి వచ్చింది వీరికి భూమితో సంబంధం ఉండేది కానీ, ఆ భూమికి వీరు యజమానులు కారు భారతదేశంలోని ఆరామాలు తమ భూముల్ని పాలేర్లచేతా, ఇతరుల చేతా సాగు చేయిస్తున్నాయని చైనా యాత్రికుడు ఇ–త్సింగ్ చెప్పాడు హువాన్‌త్సాంగ్ శూద్రులను వ్యవసాయ దారులన్నాడు అంటే – వారు బానిసలుగానో, కూలీలుగానో భూమిని సాగుచేయటం లేదన్నమాట వారు భూమిని తాత్కాలికంగా ఆక్రమించుకొని ఉండవచ్చు ఈ పరిణామం ఉత్తర భారతదేశంలో మానవులు తొలుతగా స్థిరనివాసం ఏర్పరచుకున్న ప్రాంతాలలో వచ్చింది

గిరిజన ప్రాంతాలలో గ్రామదానాలు ఇచ్చినప్పుడు వ్యవసాయదారుల్ని దానాలు పొందిన మతాధికారుల అధీనంలో ఉంచారు వీరు సాధారణంగా బ్రాహ్మణులై ఉండేవారు ఎందుకంటే, ఐదు – ఆరు శతాబ్దాలనుంచీ విరివిగా భూదానాలు పొందినవారు బ్రాహ్మణులే పర్వతప్రాంతాల లోనూ, ఒరిస్సా, దక్కన్ వంటి వెనకబడ్డ ప్రాంతాలలోనూ కౌలుదార్లూ, రైతులూ భూముల్ని వదిలి వెళ్ళకూడదని ఆరవ శతాబ్దం నుంచి నిబంధనను కూడా విధించారు ఉత్తర భారతదేశంలో చేతివృత్తులవారూ, రైతులూ దాన గ్రామాలను వదలి వెళ్లకూడదని శాసించారు అక్కణ్ణుంచీ ఈ అలవాటు గంగా మైదానానికి పాకింది కాబట్టి వారు ఒక గ్రామం నుంచీ మరో గ్రామానిక్కూడా వెళ్ళలేకపోయారు ఉన్న గ్రామంలోనే ఉండి, ఆ గ్రామాలను దానంగా పొందిన వారి అవసరాలన్నిటినీ తీర్చవలసి వచ్చింది

## తగ్గుముఖం పట్టిన వ్యాపారం, పట్టణాలు

క్రీ శ 6 వ శతాబ్దం నుంచీ వ్యాపారం తీవ్రంగా తగ్గుముఖం పట్టింది మూడవ శతాబ్దంలోనే రోమన్ సామ్రాజ్యంలోని పశ్చిమ దేశాలతో వ్యాపారం ఆగిపోయింది ఆరవ శతాబ్దంలో ఇరాన్‌తోనూ, బైజాంటియంతోనూ పట్టువస్త్రాల వ్యాపారం ఆగిపోయింది భారతదేశం చైనాతోనూ, ఆగ్నేయ ఆసియాతోనూ వ్యాపారాన్ని కొనసాగిస్తూ వచ్చింది కానీ ఆ వ్యాపారంలోని లాభాలను దళారీలుగా పనిచేసిన అరబ్బులే పొందారు ముస్లిం పూర్వయుగంలో అరబ్బులు భారత దేశం నుంచీ ఎగుమతి వ్యాపారాన్ని తమ గుత్తాధిపత్యంలో ఉంచుకున్నారు ఆరవ శతాబ్దం తరువాత దాదాపు 300 సంవత్సరాల కాలం వ్యాపారం క్రమక్రమంగా తగ్గుముఖం పట్టటాన్ని ఆ కాలంలో బంగారు నాణాలు పూర్తిగా లేకపోవటం సూచిస్తుంది బంగారు నాణాలు లేకపోవటం ఉత్తర భారతదేశంలోనేకాక దక్షిణ భారతదేశంలో కూడా జరిగింది

వ్యాపారం తగ్గుముఖం పట్టటంతో పట్టణాలు శిథిలం కావటం ప్రారంభించాయి శాతవాహనుల కాలంలోనూ, కుషానుల కాలంలోనూ పశ్చిమభారతదేశంలోనూ, ఉత్తర భారతదేశంలోనూ పట్టణాలు అభివృద్ధి చెందాయి గుప్తుల కాలంలో కూడా కొన్ని పట్టణాలు అలా కొనసాగాయి కానీ గుప్తుల అనంతరం ఉత్తర భారతదేశంలో అనేక ప్రాచీన వ్యాపార పట్టణాలు శిథిలమైపోయాయి హర్యానాలోని అనేక పట్టణాలూ, తూర్పుపంజాబ్‌లోని అనేక పట్టణాలూ, పురానా ఖిల్లా (ఢిల్లీ), మధుర, హస్తినాపూర్ (మీరట్), శ్రావస్తి (ఉత్తరప్రదేశ్), కోశాంబి (అలహాబాద్ సమీపం), రాజఘాట్ (వారణాసి), చిరండ్ (శరణ్ జిల్లా), వైశాలీ, పాటలీపుత్రం మొదలైన పట్టణాలు గుప్తుల కాలంలోనే శిథిలం కావటం ప్రారంభమైనట్లుగా, గుప్తుల కాలం తరువాత

పూర్తిగా అదృశ్యమై పోయినట్లుగా ఆ ప్రాంతాలలో జరిగిన తవ్వకాలు నిరూపిస్తున్నాయి చైనా యాత్రికుడు హువాన్‌త్సాంగ్ బుద్ధుని జీవితంతో సంబంధం ఉన్న కొన్ని నగరాలను పవిత్రమైనవిగా భావించాడు కానీ అవి శిథిలమైపోయినట్లుగా, దాదాపు ఖాళీగా ఉన్నట్లుగా పేర్కొన్నాడు భారతీయ ఎగుమతులకు అవకాశాలు తగ్గటం చేత చేతివృత్తులవారూ, వ్యాపారులూ గ్రామీణ ప్రాంతాలకు తరలి వెళ్ళి, వ్యవసాయాన్ని వృత్తిగా గ్రహించారు ఐదవ శతాబ్దం చివర కొంతమంది పట్టు నేతగాళ్ళు పశ్చిమ తీరం నుంచీ మాళ్వ ప్రాంతంలోని మంద్‌సోర్‌కు వలస పోయి, ఇతర వృత్తుల్ని స్వీకరించినట్టుగా ఆధారాలున్నాయి పట్టణాలూ, వ్యాపారమూ శిథిలం కావటం చేత గ్రామాలు తమకు కావలసిన నూనె, ఉప్పు, సుగంధద్రవ్యాలు, బట్టలూ మొదలైన వస్తువుల్ని తామే సమకూర్చుకోవలసి వచ్చింది అందుచేత ఉత్పత్తి కేంద్రాలు చిన్నవైపోయి, తమ అవసరాలకు మాత్రమే పరిమితంగా ఉండిపోయాయి

క్రీ శ 6 వ శతాబ్దం తరువాత సామాజిక నిర్మాణంలో కూడా కొన్ని మార్పులు వచ్చాయి ఉత్తరభారతదేశంలోని గంగా మైదానంలో వైశ్యులు స్వతంత్ర రైతులుగా పరిగణించ బడేవారు కానీ భూదానాలు – రాజుకూ, రైతుకూ మధ్య భూస్వాములను సృష్టించాయి అందుచేత వైశ్యులు శూద్రులతో సమానమైపోయారు ఇలా ప్రాచీన బ్రాహ్మణీయ వ్యవస్థలో మార్పు వచ్చింది ఈ మార్పు చెందిన సామాజిక వ్యవస్థ ఉత్తర భారతం నుంచీ బెంగాలుకూ, దక్షిణ భారతదేశానికీ విస్తరించటం ప్రారంభించింది దీనికి కారణం అరవ శతాబ్దం నుంచీ బ్రాహ్మణుల కిచ్చిన భూదానాలే కేంద్రానికి దూరంగా ఉన్న ప్రాంతాలలో బ్రాహ్మణులూ, శూద్రులు అన్న రెండు వ్యవస్థలు మాత్రమే ప్రధానంగా కనిపించేవి

## వర్ణవ్యవస్థలో మార్పులు

తరచుగా అధికారాన్ని చేజిక్కించుకోవటమూ, భూదానాలూ – అనేక రకాల భూస్వాముల్ని తయారుచేశాయి భూమినీ, అధికారాన్నీ చేజిక్కించుకున్న వ్యక్తి సమాజంలో కూడా ఉన్నత స్థానంకోసం సహజంగానే ప్రయత్నించాడు అతడు కింది వర్ణానికి చెందినవాడే అయినా అతనికి ఉదారంగా యజమానులు భూమిని ఇచ్చేవారు దీనివల్ల సమస్యలు ఉత్పన్నమయ్యేవి అతడు ఆర్థికంగా ఉన్నత స్థితిలో ఉన్నా, సామాజికంగానూ, కర్మకాండ విషయంలోనూ తక్కువ స్థాయిలో ఉండేవాడు అంతవరకూ ధర్మశాస్త్రాల ప్రకారం, వ్యక్తుల సామాజిక స్థాయి వర్ణంమీద ఆధారపడి ఉండేది సమాజం నాలుగు వర్ణాలుగా విభజించబడి ఉండేది అందులో పైస్థానంలో బ్రాహ్మణులూ, కిందిస్థానంలో శూద్రులూ ఉండేవారు ఒక వ్యక్తికున్న ఆర్థికమైన హక్కులు కూడా అతని వర్ణంమీదే ఆధారపడి ఉండేవి కాబట్టి పరిస్థితులు మారిన తరువాత కొత్త భూస్వామ్య వర్గానికి ఇవ్వవలసిన స్థానాన్ని గురించి ధర్మశాస్త్ర గ్రంథాలలో మార్పులు చేయవలసి వచ్చింది క్రీ శ ఆరవ శతాబ్దానికి చెందిన వరాహమిహిరుడన్న జోతిష్కుడు వర్ణాన్నిబట్టి వారు నివసించే ఇళ్ళ పరిమాణాన్ని నిర్ణయించాడు ఇది ఒకరకంగా పాత ఆచారమే అతడు పాలకులస్థాయిని బట్టి వాళ్ళ ఇళ్ళ కొలతల్నికూడా నిర్ణయించాడు అలా ప్రాచీన సమాజంలో వర్ణాన్నిబట్టి ఇన్నిటినీ వర్గీకరించేవారు

## సాంస్కృతికాభివృద్ధి

దాదాపు ఆరు ఏడు శతాబ్దాల్లో తరువాతి కాలంలో కర్ణాటక, మహారాష్ట్ర, రాజస్థాన్, ఒరిస్సా, తమిళనాడు మొదలైన పేర్లతో ప్రసిద్ధమైన సాంస్కృతిక ప్రాంతాలు ఏర్పడటం ప్రారంభమైంది ఈ సాంస్కృతిక సముదాయాల ప్రత్యేక వ్యక్తిత్వాలను విదేశీయులూ, స్వదేశీయులు కూడా గుర్తించారు చైనా యాత్రికుడు హువాన్‌త్సాంగ్ అనేక జాతీయ సముదాయాల (జాతుల)ను గుర్తించాడు ఎనిమిదవ శతాబ్దానికి చెందిన జైన గ్రంథాలు 18 ముఖ్యమైన జాతులను పేర్కొన్నాయి అవి 16 జాతుల భౌతిక, శారీరక లక్షణాలను కూడా అభివర్ణిస్తాయి వారు మాట్లాడే భాషల నమూనాలను పేర్కొని, వారి వ్యక్తిత్వాన్ని గురించి కొన్ని సంగతులు చెబుతాయి క్రీ శ ౪ వ శతాబ్దానికి చెందిన నాటక రచయిత విశాఖ దత్తుడు వివిధ ప్రాంతాలలో నివసిస్తున్న వివిధ ప్రజలను గురించీ, వారి ఆచారాలను గురించీ, వస్త్రధారణను గురించీ, భాషల్ని గురించీ చెబుతాడు

ఆరు–ఏడు శతాబ్దాలు సంస్కృత సాహిత్య చరిత్రలో కూడా అంతే ప్రధానమైనవి క్రీ శ రెండవ శతాబ్దం నుంచికూడా సంస్కృతం పాలకవర్గాలచేత ఉపయోగించ బడుతూ వచ్చింది పాలకుల జీవిత సరళిలో ఆడంబరం, వారి భాషలో పదాడంబరం పెరుగుతూ వచ్చింది ఏడవ శతాబ్దం నుంచీ వచనంలోనూ, పద్యంలోనూ పదాడంబరం సర్వసాధారణమై పోయింది సాంప్రదాయిక సంస్కృత విద్వాంసులు అలా రాయటానికి ఇప్పటికీ ఇష్టపడతారు ఈ శైలికి అత్యంత చక్కని ఉదాహరణం బాణుని రచన బాణుని వచన రచనను అనుకరించటం కష్టమే అయినా – మధ్యయుగంలో అది సంస్కృత రచయితలకు నమూనాగా నిలిచింది వారు బాణునిలా ఆడంబరంగా, అలంకారికంగా రాయటానికి ప్రయత్నించారు

క్రీ శ ఏడవ శతాబ్దం నుంచీ భారతదేశ భాషా చరిత్రలో గొప్ప అభివృద్ధి ప్రారంభమైంది తూర్పు భారతదేశం

నుంచి వచ్చిన బౌద్ధ గ్రంథాలు, బెంగాలీ, అస్సామీ, మైథిలీ, ఒరియా, హిందీ భాషలు మొలకెత్తుతూ ఉండటాన్ని తెలిగా చూపుతాయి అదేకాలానికి చెందిన జైన ప్రాకృత గ్రంథాలు గుజరాతీ, రాజస్థానీ భాషలు రూపొందుతూ ఉండటాన్ని సూచిస్తాయి దక్షిణదేశంలో అత్యంత ప్రాచీనమైన భాష తమిళం కానీ కన్నడం అదేకాలంలో అభివృద్ధి చెందింది తెలుగు, మలయాళ భాషలు తరువాత వచ్చాయి ప్రతి ప్రాంతమూ ఒంటరిదై పోవటంచేత తనదే అయిన భాషను అభివృద్ధి చేసుకుంది గుప్త సామ్రాజ్యం కూలిపోయాక అనేక చిన్న రాజ్యాలు ఏర్పడ్డాయి అవి దేశం మొత్తం మీద సాగుతూ ఉండిన సంబంధాలనూ, సమాచార ప్రసారాన్నీ భగ్నం చేశాయి వ్యాపారం తగ్గుముఖం పట్టటంచేత వివిధ ప్రాంతాల మధ్య సమాచార సంబంధాలు దెబ్బతిన్నాయి ఈ పరిస్థితి ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందటానికి దోహదం చేసింది

క్రీ శ ఏడవ శతాబ్దంలోనూ, ఆ తరువాత కాలంలోనూ ప్రాంతీయభాషల లిపులు ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందాయి మౌర్యులకాలానికీ, గుప్తులకాలానికీ మధ్య లిపిలో మార్పులు వచ్చినా ఒకే లిపి కొనసాగుతూ వచ్చింది దాదాపుగా ఒకే లిపి దేశమంతా ఉపయోగించబడుతూ ఉండేది గుప్తులకాలం నాటి లిపిని బాగా తెలుసుకున్న వ్యక్తి ఆ కాలంలో దేశంలోని వివిధ ప్రాంతాలలో ఉన్న శాసనాలను ఇబ్బంది లేకుండా చదవగలడు కానీ అలాకాకుండా ఏడవ శతాబ్దం నుంచీ ప్రతి ప్రాంతానికీ ఒక లిపి ఉద్భవించింది అందుచేత లిపులన్నిటితో పరిచయం లేకపోతే గుప్తుల కాలం తరువాత వేసిన శాసనాలను చదవటం సాధ్యంకాదు

## భక్తి, తాంత్రికత

ఏడు–ఎనిమిది శతాబ్దాల నుంచీ ప్రతి ప్రాంతమూ తనదే అయిన శిల్పకళనూ, దేవాలయ నిర్మాణ కళనూ అభివృద్ధి చేసుకుంది ముఖ్యంగా దక్షిణ భారతదేశం శిలాలయాల భూమిగా మారిపోయింది దేవతల రూపాలను చెక్కటానికి వారు రాతినీ, కంచునూ ఉపయోగించారు కంచు విగ్రహాల తయారీ పెద్ద ఎత్తులో జరగటం ప్రారంభించింది హిమాలయ ప్రాంతాలలో కూడా అక్కడక్కడా కంచు విగ్రహాలు కనిపించినా, దక్షిణ దేశంలోని బ్రాహ్మణీయ దేవాలయాలలో వాటి ఉపయోగం ఎక్కువగా ఉండేది అలాగే తూర్పు భారతదేశంలో బౌద్ధదేవాలయాలలోనూ, ఆరామాలలోనూ కంచువిగ్రహాలను అధికంగా ఉపయోగించేవారు భారతదేశం మొత్తం మీద పూజించబడే దేవతల్లో దాదాపు మార్పులు లేకపోయినా వారిని విగ్రహాలుగా చెక్కే విధానంలో మాత్రం ప్రాంతాలనుబట్టి మార్పులుండేవి

గుప్తుల అనంతరకాలంలో మతంలో కూడా మార్పులు వచ్చినట్టుగా తెలుస్తోంది హిందూ దేవతల్ని వారి స్థాయిని బట్టి హెచ్చు తగ్గుల వ్యవస్థలో సర్దారు సమాజం ఆచార వ్యవహారాల ఆధారంగానూ, భూస్థితి ఆధారంగానూ, సైనికశక్తి ఆధారంగానూ అసమ వర్గాలుగా విభజించ బడినట్టుగా, దేవతల్ని కూడా అసమ వర్గాలుగా విభజించి స్థాయీభేదాలు ఏర్పాటు చేశారు విష్ణువు, శివుడు, దుర్గ ఇతర దేవతలకంటే పై స్థాయిలో ఉంచబడ్డారు ఇతర దేవుళ్ళు, దేవతలూ వారికంటే తక్కువ స్థాయివారైపోయి, వారికి సేవకులై పోయారు బ్రహ్మనూ, గణపతినీ, విష్ణువునూ, శక్తినీ, శివుణ్ణీ పూజించే ఆచారం బాగా ఉండేది వీరిని "పంచదేవతలు" అనేవారు దేవాలయంలో శివుణ్ణో మరో దేవుణ్ణో ప్రతిష్ఠించేవారు ఆ ప్రధాన దేవాలయం చుట్టూరా నలుగురు అప్రధాన దేవతలకు నాలుగు అప్రధాన దేవాలయాలు నిర్మించేవారు అలాంటి దేవాలయాలను "పంచాయతనాలు" అని పిలిచేవారు ఇంద్రుడు, వరుణుడు, యముడు మొదలైన వైదిక దేవతల్ని రక్షకభటుల స్థాయికి దిగజార్చేశారు మధ్యయుగాలలో వాస్తవిక సామాజిక వ్యవస్థను పోలిన దేవతల వ్యవస్థ స్పష్టంగా కనిపిస్తుంది తల్లి దేవత ఇతర దేవతల కంటే ఉన్నత స్థితిలో ఉండటం కూడా ఈ వ్యవస్థలో చాలా వాటిలో కనిపిస్తుంది

జైన, శైవ, వైష్ణవ సన్యాస వ్యవస్థల్లో కూడా ఐదు మెట్లు ఏర్పడ్డాయి అందరికంటే పైస్థాయిలో ఉన్న సన్యాసిని "ఆచార్యుడు" అనేవారు అతని పట్టాభిషేకం రాజు పట్టాభిషేకంలాగే జరిగేది

క్రీ శ ఏడవ శతాబ్దం నుంచీ భక్తి సంప్రదాయం భారతదేశమంతా – ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో – విస్తరించింది భగవంతునికి అన్నీ సమర్పించి, ప్రసాదాన్ని గ్రహించటాన్ని భక్తి అంటారు ఈ పద్ధతిలో భక్తుడు తన్ను తాను సంపూర్ణంగా భగవంతునికి సమర్పించుకునేవాడు ఈ పద్ధతిలో భగవంతునికీ, భక్తునికీ ఉన్న సంబంధాన్ని భూస్వామికీ, కౌలుదారుకూ ఉన్న సంబంధంతో పోల్చవచ్చు ఎలాగైతే కౌలుదారు అనేక సేవల్ని చేసి భూస్వామి నుంచీ భూమినీ, తనకు రక్షణనూ ప్రతిఫలంగా పొందుతాడో అలాగే భక్తుడు భగవంతుని మీద సంపూర్ణంగా ఆధారపడతాడు భారతదేశంలో ఫ్యూడలిజం చాలా కాలం కొనసాగటం చేత భక్తి సంప్రదాయం భారత సంప్రదాయంలో కూరుకుపోయింది

తంత్రవాదం లేదా తాంత్రికత అభివృద్ధి చెందటం క్రీ శ 6 వ శతాబ్దం తరువాత భారతీయ మతరంగంలో వచ్చిన ఆశ్చర్యకరమైన పరిణామం క్రీ శ ఐదు – ఏడు శతాబ్దాల కాలంలో అనేకమంది బ్రాహ్మణులకు నేపాల్, అస్సాం, బెంగాల్, ఒరిస్సా, మధ్యభారత్, దక్కన్ ప్రాంతాలలో భూములు ఇవ్వబడ్డాయి దాదాపు ఇదే

కాలంలోనే తాంత్రిక గ్రంథాలూ, తాంత్రిక దేవాలయాలూ, తాంత్రిక కర్మలూ కనిపించటం ప్రారంభించాయి తంత్ర వాదం స్త్రీలనూ, శూద్రులనూ ఆహ్వానించింది మాంత్రిక కర్మలకు గొప్ప ప్రాధాన్యతనిచ్చింది వాటిలో కొన్ని అంతకు పూర్వం కూడా ఉపయోగంలో ఉండి ఉండవచ్చు కానీ క్రీ శ 6 వ శతాబ్దం ప్రాంతంలో తంత్రవాదం వాటిని స్థిరీకరించి, తమ గ్రంథాలలో వాటిని వర్ణించింది భౌతికమైన కోరికల్ని తీర్చుకోవటం కోసమూ, శారీరకమైన సుఖాలను పొందటం కోసమూ, రోగాలనూ, నొప్పులనూ పోగొట్టుకోవటం కోసమూ భక్తులు తాంత్రిక కర్మల్ని ఆచరించేవారు పెద్ద సంఖ్యలో ఆదిమ వాసుల్ని బ్రాహ్మణీయ మతంలోకి చేర్చుకోవటం చేత తంత్రశాస్త్రం పుట్టిందన్నది తేటతెల్లమైన విషయం ఆదిమవాసుల ఆచారాలనూ, మంత్రతంత్రాలనూ, ప్రతీకలనూ బ్రాహ్మణులు గ్రహించారు వాటికి అధికారముద్రవేసి తమ గ్రంధాలలో పొందుపరచారు వాటిని ప్రోత్సహించారు క్రమక్రమంగా తమ ధనిక పోషకుల కోసం బ్రాహ్మణులూ, పూజారులూ, పురోహితులూ వీటిని వక్రీకరించారు తంత్రవాదం జైన, బౌద్ధ, శైవ, వైష్ణవ శాఖల్లోకి కూడా ప్రవేశించింది ఏడవ శతాబ్దం నుంచీ మధ్యయుగాల దాకా ఇది బాగా వర్ధిల్లింది భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో లభించిన మధ్యయుగాల గ్రంధాలు తంత్రవాదాన్నీ, జ్యోతిషాన్నీ చర్చిస్తాయి ఇవి రెండూ కూడా ఈ గ్రంథాలలో ఒక దానితో మరొకటి పూర్తిగా కలిసిపోయాయి

మొత్తంమీద క్రీ శ అరు, ఏడు శతాబ్దాల్లో పరిపాలనా వ్యవస్థలోనూ, ఆర్థిక వ్యవస్థలోనూ, భాషలోనూ, లిపిలోనూ, మతవ్యవహారాలలోనూ కొన్ని ప్రధానమైన మార్పులు వచ్చాయి ఈ కాలంలో ప్రాచీన భారతీయ జీవితంలోని ముఖ్యమైన లక్షణాలు మధ్యయుగాల జీవిత లక్షణాలుగా మార్పు చెందటం ప్రారంభించాయి ఈ లక్షణాలను మొత్తంగా రాజుకూ, రైతుకూ మధ్య భూస్వామిని ఉంచే నూతన సామాజిక వ్యవస్థకూ, ఆర్థిక వ్యవస్థకూ నాంది పలికాయి అంతకు ముందు ప్రభుత్వాధికారులు నిర్వహిస్తూ ఉండిన పరిపాలనను భూస్వాములు నిర్వహించటం ప్రారంభించారు రోమన్ సామ్రాజ్య పతనం తరువాత క్రీ శ 6 వ శతాబ్దంలో యూరోపియన్ దేశాల్లో భూస్వాములు అధికారాలను చేజిక్కించుకోవటానికీ, భారతదేశంలో అదేకాలంలో వచ్చిన పరిణామాలకూ పోలికలున్నాయి అటు రోమన్ సామ్రాజ్యాన్నీ, ఇటు గుప్త సామ్రాజ్యాన్నీ కూడా హూణులు కూలద్రోయటానికి ప్రయత్నించారు హూణుల, దురాక్రమణదారులైన ఇతర తెగలవారి ఒత్తిడి చాలా ఎక్కువగా ఉండటం చేత యూరప్‌లో స్వతంత్ర రైతులు రక్షణకోసం భూస్వాములను ఆశ్రయించవలసి వచ్చింది కానీ భారతదేశం మీద హూణుల దండయాత్ర ఇలాంటి పరిణామాలకు దారితీయలేదు

యూరోపియన్ సమాజంలో లాగా భారతీయ సమాజంలో బానిసలను ఉత్పత్తిలో ఉపయోగించేవారుకారు భారతదేశంలో ఉత్పత్తి చేయటం, పన్నులు చెల్లించటం ఎక్కువగా రైతుల మీదా, చేతివృత్తుల వారిమీదా, వ్యాపారుల మీదా, వ్యవసాయ కూలీల మీదా పడేది వీరిని వైశ్యులనీ, శూద్రులనీ వర్గీకరించేవారు ఈ వ్యవస్థకు వ్యతిరేకంగా తిరుగుబాటు లక్షణాలు అక్కడక్కడా కనిపిస్తాయి అందుచేత ఉత్పత్తిదారుల వద్దనుంచీ నేరుగా పన్నులు వసూలు చేయటం కష్టమైపోయింది అందుచేత వివిధ ఉద్యోగులకు భూముల్ని జీతాలకు బదులుగా ఇవ్వటం ఎక్కువై పోయింది యూరప్‌లో చర్చికి ఇచ్చినట్టుగా భారతదేశంలో తొలి భూదానాలు బ్రాహ్మణులకు ఇవ్వబడ్డాయి

క్రీ శ 6 వ శతాబ్దం తరువాత యూరప్‌లోనూ, భారతదేశంలోనూ చేతివృత్తులూ, వ్యాపారమూ పడిపోవటం ప్రారంభించాయి క్రీ శ ఐదవ శతాబ్దం తరువాత యూరప్‌లోనూ, భారతదేశంలోనూ పట్టణాలు పతనం కావటం ప్రారంభించాయి ఈ రెండు ప్రాంతాలలోనూ వ్యవసాయ విస్తరణ జరిగింది కొత్త జన నివాసాలు వచ్చాయి యూరప్‌లోనూ, భారతదేశంలోనూ ప్రాచీన యుగం ముగిసిన తరువాత సామాజిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో భూస్వాములు ఒక ప్రబలమైన శక్తిగా రూపొందారు వారు భూమిని మత కార్యకలాపాలకు తమ అధీనంలో ఉంచుకున్నా, సొంత ఉపయోగానికి ఉంచుకున్నా సామాజిక, మత, కళారంగాలలో కీలకమైన పాత్రను నిర్వహించారు క్రీ శ ఏడవ శతాబ్దం తరువాత యూరప్‌లోనూ, భారతదేశంలోనూ ఇదే పరిణామక్రమం కనిపిస్తుంది

★ ★ ★

# అధ్యాయం: 28

# సామాజిక పరిణామక్రమం

వేదయుగానికి పూర్వం సమాజం ఎలా ఉండేదో అధ్యయనం చేయటానికి అనాటి గ్రంథాలేవీ లేవు పాత రాతియుగంలో అక్కడక్కడ మానవులు కొండ ప్రాంతాలలో చిన్న చిన్న బృందాలుగా జీవించేవారని పురాతత్వ శాస్త్రం చెబుతోంది వారి ఆహారం – వారు వేటాడిన జంతువులు, అడవులలో లభించే పళ్ళు, కందమూలాలు రాతియుగం అంతంలో, లోహయుగం ప్రారంభంలో మానవులు ఆహారాన్ని పండించటం, ఇళ్ళలో నివసించటం నేర్చుకున్నారు కొత్త రాతియుగం, రాగియుగం మానవులు మెరక ప్రాంతాలలో కొండలకూ, నదులకూ దగ్గరగా జీవించారు కాలక్రమాన సింధూనదీ పరీవాహక ప్రాంతంలో వ్యవసాయ గ్రామాలు వెలవటం ప్రారంభించాయి అవి చివరగా హరప్పా ప్రాంతపు నగర నాగరికతగా వర్ధిల్లాయి అందులో పెద్దవీ, చిన్నవీ ఇళ్ళు ఉండేవి హరప్పా నాగరికత అదృశ్యమై పోయాక నగర నాగరికత మరొక వేయి సంవత్సరాల కాలం భారత ఉపఖండంలో అభివృద్ధి చెందలేదు

## గిరిజన, పశుపాలక దశలు

రుగ్వేదకాలం నుంచీ సామాజిక చరిత్రను తెలుసుకోవటానికి మనం లిఖిత ఆధారాలను కూడా ఉపయోగించవచ్చు రుగ్వేదసమాజం మౌలికంగా పశుపాలక సమాజమని చెబుతారు ఆ కాలపు ప్రజలు పాక్షికంగా సంచారజీవనులు వారి ప్రధానమైన సంపద పశువులూ, గుర్రాలు "గా" (ఆవు) అన్న పదం రుగ్వేదంలోని తొలి భాగాలలో 176 సార్లు ఎదురౌతుంది గోవులే సంపద ధనవంతుణ్ణి "గోమత" అనేవారు గోధనం కోసం యుద్ధాలు జరిగేవి గోవుల్ని రక్షించటం రాజు ప్రధాన బాధ్యత కావటం చేత అతణ్ణి "గోప", లేక "గోపతి" అనేవారు కుటుంబ పోషణకు ఆవు కేంద్రబిందువు కూతుర్ని "దుహిత" అనేవారు అంటే – పాలు పితికే వ్యక్తి అని అర్థం వేదకాలపు ప్రజలకు గోవులతో ఎంత దగ్గర సంబంధం ఉండేదంటే – వారికి బర్రెలు ఎదురైనప్పుడు వాటిని "గోవల" (ఆవు వెంట్రుకలవంటి వెంట్రుకలు కలది) అని పిలిచేవారు ఆవులను వ్యవసాయానికి ఉపయోగించిన ప్రస్తావనలు రుగ్వేదంలో చాలా కొద్దిగా – ముఖ్యంగా చివరి భాగాలలో మాత్రమే ఉన్నాయి కాబట్టి రుగ్వేద కాలపు ప్రజల ప్రధాన జీవనాధారం పశుపాలనేనని చెప్పవచ్చు

అలాంటి సమాజం తన జీవితావసరాలకు మించి ఉత్పత్తి చేయగలిగేదికాదు తెగలసభ్యులు తమ నాయకులకు అరుదుగా మాత్రమే బహుమతులు ఇవ్వగలిగేవారు నాయకులకూ, రాజులకూ యుద్ధాలలో దోచుకున్న సొమ్మే ప్రధాన ఆదాయంగా ఉండేది వారు తమ శత్రుతెగలను దోచుకునేవారు తమకు లోబడివున్న తెగలనుంచీ కప్పం వసూలు చేసేవారు అలా వసూలు చేసిన కప్పాన్ని "బలి" అని పిలిచేవారు తెగలోని బంధువులు నాయకుడితో విశ్వాసపూరితంగా ప్రవర్తించేవారు తమకు తాముగా బహుమతుల్ని ఇచ్చేవారు అందుకు ప్రతిఫలంగా అతడు వారికి నాయకత్వం వహించి, యుద్ధాలలో విజయ పరంపరవైపు నడిపించేవాడు, రక్షణ కల్పించేవాడు వేదకాలంలో నాయకుడు స్వీకరించే బహుమతులూ, గౌరవమూ సంప్రదాయంగా కూడా మార్పు చెంది ఉండవచ్చు కానీ యుద్ధాలలో ఓడించబడిన శత్రుతెగలు తప్పకుండా కప్పం చెల్లించవలసి ఉండేది అందులో ముఖ్యమైన వాటా రాజుల తరఫున పూజలు చేసినందుకుగాను పూజారులకు అందేది

రుగ్వేదంలో ఒకచోట పూజారులకూ, రాజులకూ, యాగాలు చేసేవారికీ మాత్రమే సంపదను ఇవ్వమని దేవుణ్ణి ప్రార్థించే మంత్రం ఉంది ఇది అసమ పంపకంకోసం చేసిన ప్రయత్నాన్ని సూచిస్తోంది సాధారణ ప్రజానీకం – సైనిక, నాయకత్వ కారణాలచేత తమ నాయకులకు తమంతకు తాముగానే ఉత్పత్తిలో ఎక్కువభాగాన్ని ఇచ్చేవారు కానీ రాజులూ, పురోహితులూ మరింత ఎక్కువగా సాధారణ ప్రజానీకం వద్దనుంచీ గుంజుకోవాలనుకునేవారు తెగలోని సాధారణ సభ్యులు ఉత్పత్తిలో కొంత భాగాన్ని పొందేవారు దీన్ని "అంశ" అని పిలిచేవారు రాజులూ, వారి తెగపెద్దలూ హాజరయ్యే జానపద సమావేశాలలో ఈ పంపకం జరిగేది

రుగ్వేదంలోని తొలి భాగాలలో చేతివృత్తులవారూ, వ్యవసాయదారులూ, పురోహితులూ, యోధులూ కనిపించినా ఆనాటి సమాజం మొత్తంమీద గణ, పశుపాలక, సంక్షేమ సమాజమే అది పాక్షికంగా సంచార సమాజం కూడానని చెప్పవచ్చు యుద్ధాలలో దోచుకున్న వస్తువులూ, పశువులూ వారి ప్రధాన సంపదలు పశువులనూ, స్త్రీ బానిసలనూ ఆ కాలంలో బహుమతులుగా ఇచ్చేవారు తృణ ధాన్యాలను బహుమతిగా ఇవ్వటం ఉండేది కాదు ఎందుకంటే, ఆ కాలంలో తృణధాన్యాల ఉత్పత్తి చెప్పుకోదగ్గ స్థాయిలో ఉండేది కాదు అందుచేత యుద్ధాలలో దోచుకున్న సంపద తప్ప – రాజులకూ, పురోహితులకూ మరొక రకమైన ఆదాయం ఉండేది కాదు ఆ కాలంలో ఉన్నతమైన బిరుదుల్ని ధరించే అవకాశం ఉండేది కానీ, ఉన్నతమైన సామాజిక స్థాయి కలిగిన వర్గాలు ఉండే అవకాశం ఉండేది కాదు రాజులూ, పురోహితులూ ఇంటి పనులకు స్త్రీ బానిసల్ని ఉపయోగించేవారు కానీ వారి సంఖ్యమాత్రం ఎక్కువగా ఉండేది కాదు రుగ్వేద సమాజంలో శూద్రులన్న పేరుతో సేవక వ్యవస్థ ఉండేది కాదు

## వ్యవసాయం, ఉన్నతవర్గాల పుట్టుక

వేదకాలపు ప్రజలు ఆఫ్ఘనిస్తాన్, పంజాబ్‌ల నుంచీ ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతానికి చేరుకున్న తరువాత వారు ప్రధానంగా వ్యవసాయదారులైపోయారు వేదయుగం మలిభాగంలో దాదాపు రెండు, మూడు శతాబ్దాలకాలం అవిచ్ఛిన్నంగా జనపదాలు ఏర్పడటాన్ని గమనించవచ్చు ఇవి ప్రాదేశిక రాజ్యాలు ఏర్పడటానికి దారి చూపాయి వ్యవసాయదారుల వద్దనుంచీ, ఇతరుల వద్దనుంచీ వసూలు చేసిన కౌలుతో రాజులు యజ్ఞయాగాలు చేసేవారు తమ పురోహితులకు దక్షిణలు ఇచ్చేవారు మలివేదయుగంలో వ్యవసాయదారులు పన్నులను రాజబంధువులకూ, యోధులకూ చెల్లిస్తే, వారు రాజుకు చెల్లించేవారు. దీనికితోడు వ్యవసాయదారులు పురోహితులకు దక్షిణలు కూడా చెల్లించవలసి ఉండేది. వారు కమ్మరులకూ, రథాలు తయారు చేసేవారికీ, వడ్రంగులకూ ఆహారాన్ని సరఫరా చేయాల్సిన బాధ్యతను కూడా కలిగి ఉండేవారు. వారు అప్పుడప్పుడే అభివృద్ధి చెందుతున్న యోధుల వర్గానికి సహాయపడేవారు. కానీ మలివేదయుగపు వ్యవసాయదారుడు పట్టణాలూ, వ్యాపారమూ అభివృద్ధి చెందటానికి దోహదం చేయలేకపోయాడు. ఇవి బుద్ధుని కాలంలో ప్రముఖంగా అభివృద్ధి చెందాయి కానీ అతని కాలంలో కూడా లోహంతో చేసిన నాణాలను ఉపయోగించటం ప్రారంభం కాలేదు

వేదయుగ సమాజాలు పన్నుల విధానాన్ని గానీ, వృత్తిసైనిక వ్యవస్థను గానీ ప్రారంభించలేదు రాజ బంధువులే తప్ప పన్నులు వసూలు చేసే అధికారులు ఉండేవారు కారు రాజుకు పన్ను చెల్లించటానికీ, దేవునికి మొక్కుబడి చెల్లించటానికీ మధ్య పెద్ద తేడా ఉండేది కాదు కొంతకాలం తరువాత పశుపాలక సమాజపు గణసైన్యం స్థానంలో వ్యవసాయిక సమాజపు రైతులసైన్యం ఏర్పడింది మలివేదయుగంలో వ్యవసాయదారులను "బలం" అనేవారు అశ్వమేధయాగపు గుర్రాన్ని రక్షించటానికి బయలుదేరే సైన్యంలో క్షత్రియ సైన్యంతోపాటు, గిరిజన రైతుల 'బలం' కూడా ఉండేది క్షత్రియులు విల్లమ్ములూ, డాళ్ళూ ధరించేవారు వారు సేనాధిపతులుగా, నాయకులుగా వ్యవహరించేవారు వ్యవసాయదారుల "బలం" వారి వెంట కర్రలు మాత్రమే ధరించి సాధారణ సైన్యంగా అనుసరించేది యుద్ధాలలో గెలిచినప్పుడు క్షత్రియ నాయకులు, వైశ్యసైనికులతో కలిసి ఒకే పాత్రలో భోజనం చేయాల్సి ఉండేది కానీ పురోహితులు మాత్రం ఆచారాన్ని తూచా తప్పకుండా పాటించాలనే వారు వైశ్యులు (వ్యవసాయదారులు) క్షత్రియనాయకులకు లోబడి ఉండాలని పట్టుబట్టేవారు

ఆ దశలో గిరిజనులు పన్ను చెల్లించే వ్యవసాయదారులుగా పరిణామం చెందటం తక్కువగా ఉండేది కర్రనాగలిని ఉపయోగించటం చేతా, యజ్ఞయాగాదులలో విచక్షణా రహితంగా పశువుల్ని బలి ఇవ్వటం చేతా తమ అవసరాలకు మించి ఎక్కువగా పండించలేకపోయేవారు అందుచేత వారు సక్రమంగా పన్నులు కూడా చెల్లించ లేకపోయేవారు అంతేకాకుండా, రాజులు రైతులకు ఆనాటికింకా దూరమై పోలేదు గణ సంప్రదాయం ప్రకారం రాజులు వ్యవసాయాన్ని విస్తరింపజేయాలి వీలైతే నాగలి కూడా పట్టాలి అందుచేత వైశ్యులకూ, రాజన్యులకూ మధ్య పెద్ద అగాధం ఉండేదికాదు రాజబంధువులూ, యోధులూ వ్యవసాయదారులమీద పరిపాలన సాగించినా – శత్రువులతో పోరాడటానికి వ్యవసాయదారుల సైన్యం మీద ఆధారపడవలసి వచ్చేది అందుచేత గణంలోని రైతుల అనుమతి లేకుండా భూముల్ని ఇతరులకు ఇవ్వటం సాధ్యమయ్యేది కాదు అందుచేత రాజుల పరిస్థితి కాస్త ఇబ్బందికరంగా ఉండేది పాలకులకూ పాలితులకూ మధ్య కచ్చితమైన తారతమ్యాలు అభివృద్ధి చెందటానికి వీలు లేకుండా ఉండేది

## వర్ణ ఉత్పత్తివిధానం, ప్రభుత్వం

చేతివృత్తుల్లో, వ్యవసాయంలో ఇనుప పరికరాలు ఉపయోగించటం ప్రారంభం కావటంతో అంతో ఇంతో సంక్షేమ సమాజంగా ఉన్న వైదిక సమాజం, పూర్తిగా వ్యావసాయిక సమాజంగా, వర్గసమాజంగా మార్పు చెందటం ప్రారంభించింది ఇది దాదాపు క్రీ శ 6 వ శతాబ్దంలో ప్రారంభమైంది

మధ్యగంగా మైదానంలోని అడవుల్ని తగలబెట్టటం ద్వారానూ, ఇనుప గొడ్డళ్ళతో నరకటం ద్వారానూ నిర్మూలించిన తరువాత ప్రపంచంలోని అత్యంత సారవంతమైన ప్రాంతాలలో ఒక ప్రాంతం సాగులోకి వచ్చింది జన నివాసానికి తగినట్టుగా రూపొందింది ఇప్పుడు అక్కడ అసంఖ్యాకంగా పల్లెలూ, పట్టణాలూ వెలిశాయి పెద్ద పెద్ద ప్రాదేశిక రాజ్యాలు ఏర్పడి, క్రమంగా మగధసామ్రాజ్యం ఏర్పడింది ఇనుపకర్రు ఉన్న నాగలీ, కొడవళ్ళూ, ఇతర పనిముట్లూ ఉపయోగించటం చేత రైతులు తమ అవసరాలకు మించిన ధాన్యాన్ని పండించగలిగారు రైతులకు చేతివృత్తులవారి సహకారం అవసరమైంది వారు వ్యవసాయదారులకు పనిముట్లు, బట్టలు మొదలైనవి సరఫరా చేసేవారు వారు రాజులకూ, పురోహితులకూ ఆయుధాలూ, విలాసవస్తువులూ కూడా సరఫరా చేసేవారు ఉత్పాదనా నైపుణ్యం వేదకాలంలోకంటే దాని తరువాత చాలా ఎక్కువగా అభివృద్ధి చెందింది

కొత్త ఉత్పత్తి నైపుణ్యమూ, బలప్రయోగం చేయగల సామర్థ్యమూ కొందరికి విశాలమైన భూములను సంపాదించి పెట్టాయి వాటిని సాగు చేయటానికి పెద్దసంఖ్యలో బానిసలూ, కూలీలూ అవసరమయ్యారు వేదకాలంలో వ్యవసాయాన్ని కుటుంబ సభ్యులే సొంతంగా చేసుకునే వారు వేదసాహిత్యంలో జీతగాణ్ణి సూచించే పదం లేదు బుద్ధుని యుగంలో బానిసలూ, కూలీలూ (జీతగాళ్ళు) వ్యవసాయంలో పాల్గొనటం సాధారణ విషయంగా మారిపో యింది మౌర్యుల కాలంలో వీరు విశాలమైన ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల్లో పనిచేసేవారు బహుశా కళింగ యుద్ధం నుంచీ అశోకుడు తీసుకు వచ్చిన 1,50,000 మంది యుద్ధఖైదీలు వ్యవసాయ క్షేత్రాలకూ, గనులకూ కూలీలుగా పంపబడ్డారేమో కానీ, ప్రాచీన కాలంలో భారతదేశంలో బానిసలు ఎక్కువగా ఇంటిపనులకే పరిమితంగా ఉండేవారు సాధారణంగా ఉత్పత్తిలో బానిసల, కూలీల సహాయాన్ని పొందుతున్న చిన్నరైతులు ప్రధానపాత్ర వహించేవారు

కొత్త నైపుణ్యాన్ని ఉపయోగించి రైతులూ, చేతివృత్తుల కళాకారులూ, కూలీలూ, బానిసలూ తమకు అవసరమైనదాని కంటే ఎక్కువ ఉత్పత్తి చేసేవారు అందులో అధికభాగాన్ని రాజులూ, పురోహితులూ తీసుకునేవారు క్రమం తప్పకుండా వసూళ్ళు జరగటం కోసం పరిపాలనా సంబంధమైన, మత సంబంధమైన పద్ధతుల్ని రూపొందించేవారు రాజు పన్నుల్ని నిర్ణయించటానికీ, వసూలు చేయటానికీ అధికారుల్ని నియమించేవాడు కానీ రాజుకు అణగి, మణగి ఉండాల్సిన అవసరాన్ని గురించీ, రాజుకూ, పురోహితులకూ పన్నులూ, బహుమతులూ చెల్లించాల్సిన బాధ్యతను గురించీ ప్రజలకు నచ్చచెప్పాల్సిన అవసరం కూడా ఉండేది ఈ ప్రయోజనం కోసం వర్ణ వ్యవస్థ రూపొందించబడింది

దాని ప్రకారం మొదటి మూడు వర్ణాలనుంచీ నాలుగవ వర్ణాన్ని మతకర్మలు వేరు చేస్తాయి ద్విజులు వేదాధ్యయనానికీ, ఉపనయనానికీ అర్హులు నాలుగవ వర్ణం వారైన శూద్రులకు ఆ అర్హతలు లేవు వారు పై మూడు వర్ణాలవారికీ సేవకులు మాత్రమే కొంతమంది ధర్మశాస్త్రకారులు బానిసత్వాన్ని శూద్రులకే ప్రత్యేకించారు కాబట్టి ద్విజుల మధ్యనే తారతమ్యాలు ఏర్పడ్డాయి బ్రాహ్మణులు నాగలి పట్టటాన్ని తిరస్కరించారు శారీరక శ్రమను అసహ్యించుకోవటం ప్రారంభించారు వారి అసహ్యం ఎంతదాకా వెళ్ళిందంటే – వారు కొన్ని రకాల శారీరక శ్రమ చేసేవారిని అంటరానివారుగా చూడటం ప్రారంభించారు శారీరక శ్రమనుంచి ఎంత దూరంగా ఉంటే అంత పవిత్రత వారికి ఆపాదించబడింది వైశ్యులు ద్విజులే అయినా వారు వ్యవసాయదారులు, చేతివృత్తుల కళాకారులు, తరువాత వ్యాపారులు కానీ వారే అందరికంటే ఎక్కువ పన్నులు చెల్లించేవారుకూడా క్షత్రియులకూ, బ్రాహ్మణులకూ అవసరమైన ధనం వారు చెల్లించే పన్నులనుంచే లభించేది వ్యవసాయదారుల వద్దనుంచీ పన్నులనూ, చేతివృత్తులవారినుంచీ సుంకాలనూ వసూలు చేసి పురోహితులకూ, ఉద్యోగులకూ ధనరూపంలోనో, వస్తు రూపంలోనో ప్రతిఫలం చెల్లించే అధికారాన్ని వర్ణవ్యవస్థ క్షత్రియునికి ఇస్తుంది

పనికి చెల్లించే ప్రతిఫలమూ, ఆర్థిక హక్కులూ వర్ణాన్నిబట్టి వేరువేరుగా ఉండేవి అప్పుతీసుకున్న డబ్బు మీద బ్రాహ్మణుడు రెండు శాతమూ, క్షత్రియుడు మూడు శాతమూ, వైశ్యుడు నాలుగు శాతమూ, శూద్రుడు ఐదు శాతమూ వడ్డీ చెల్లించవలసి ఉండేది ఏదో ఒక పనిచేస్తేతప్ప శూద్ర అతిథులకు అన్నం పెట్టేవారు కారు ధర్మశాస్త్ర గ్రంథాల విధించిన ఈ నియమాలు తు–చ త ప్పకుండా అమలుజరిగి ఉండకపోవచ్చు కానీ సమాజం విధించిన నియమాలు ఎలా ఉన్నాయో తప్పకుండా ఇవి సూచిస్తాయి

పురోహితులూ, క్షత్రియులూ కూడా వ్యవసాయదారులూ, చేతివృత్తులవారూ చెల్లించే పన్నుల మీదా, కొళ్ళమీదా, సుంకాలమీదా జీవించటంచేత – సమాజం యొక్క ఉమ్మడి మిగులు ధనాన్ని పంచుకోవటం విషయంలో వారికి కలహాలు జరుగుతూ వచ్చాయి సమాజంలో అత్యున్నత స్థాయి తమదేనని ప్రకటించుకున్న బ్రాహ్మణుల అహంకారం క్షత్రియులను బాధపెట్టింది కానీ వారు వైశ్యులకూ, శూద్రులకూ వ్యతిరేకంగా మాత్రం కలిసిపోయేవారు బ్రాహ్మణుల సహకారం లేకుండా క్షత్రియులూ, క్షత్రియుల సహకారం లేకుండా బ్రాహ్మణులూ అభివృద్ధి చెందలేరని ప్రాచీన గ్రంథాలు గట్టిగా చెబుతాయి వారిద్దరూ ఒకరితో మరొకరు సహకరించుకుంటేనే ఇద్దరూ కలిసి లోకాన్ని ఏలవచ్చు

## సామాజిక సంకటస్థితి, భూస్వామ్య వర్గాల అవతరణ

గంగామైదానంలోనూ, దాని పరిసరప్రాంతాలలోనూ ఈ విధానం కొన్ని శతాబ్దాలపాటు ఎలాంటి ఇబ్బందులూ లేకుండా కొనసాగింది అ ప్రాంతంలో అనేక పెద్ద రాజ్యాలు కూడా అవతరించాయి క్రీ శ రెండవ శతాబ్దంలో వ్యాపారమూ, నగర జీవితమూ కూడా గొప్పగా అభివృద్ధి చెందాయి ఈ దశలో కళలు కూడా అపూర్వంగా అభివృద్ధి చెందాయి పాత విధానం క్రీ శ మూడవ శతాబ్దంలో శిఖరాగ్రాలకు చేరుకుంది అప్పటిలో ఆ విధానంలో ఉన్న అభ్యుదయ లక్షణాలు పాతబడి పోయాయి దాదాపు అదే కాలంలో పాత జీవిత విధానం సంకటస్థితిలో పడిపోయింది క్రీ శ మూడు నాలుగు శతాబ్దాలలో రాయబడిన పురాణాలలో కలియుగాన్ని వర్ణించే భాగాలలో ఆ సంకటస్థితి ఏమిటో వర్ణించ బడింది కలియుగం యొక్క లక్షణం “వర్ణసంకరం” రావటం అంటే వైశ్యులూ, శూద్రులూ వారి ధర్మమైన వ్యవసాయాన్ని కొనసాగించమని తిరుగుబాటు చేసి ఉండవచ్చు వైశ్య వ్యవసాయదారులు పన్నులు కట్టటాన్ని తిరస్కరించి ఉండవచ్చు శూద్రులు తమ సేవల్ని అందించటానికి అంగీకరించక పోయి ఉండ వచ్చు అంతేకాకుండా వివాహాలలోనూ, ఇతర సామాజిక సంబంధమైన వ్యవహారాలలోనూ వారు వర్ణం నిర్ణయించిన సరిహద్దుల్ని దాటి ఉండవచ్చు ఈ పరిస్థితిని అధిగమించటానికి ధర్మశాస్త్రగ్రంధాలు “దండనీతి”ని ఉపయోగించాలన్నాయి వైశ్యులూ, శూద్రులూ తమ విధుల్ని దాటనీయకుండా చేయాలని చెప్పాడు మనువు వర్ణవ్యవస్థకు రక్షకులుగా, పునఃప్రతిష్ఠాపకులుగా రాజులు వ్యవహరించారు

కానీ వ్యవసాయదారులు పన్నులు చెల్లించేలా చేయటానికీ, కూలీలచేత పని చేయించటానికి దండనీతి ఒకటే చాలలేదు రాజప్రతినిధుల ద్వారా పన్నులు వసూలు చేసి, ఆ డబ్బును పురోహితులకూ, సైనికోద్యోగులకూ, ఇతరులకూ అందచేయటం కంటే — పన్నులు వసూలు చేసే అధికారాన్ని సరాసరి పురోహితులకూ ఇతరులకూ అప్పగించటం సులువైన పద్ధతని రాజ్యం గుర్తించింది ఈ పద్ధతి వేదకాలంలో ఉన్న పద్ధతికి పూర్తిగా భిన్నమైంది పురోహితులకూ, బహుశా వారి నాయకులకూ, రాజులకూ భూమిని ఇచ్చే అధికారం అనాడు గణానికి మాత్రమే ఉండేది కొత్త పద్ధతిలో రాజు ఆ అధికారాన్ని గుంజుకున్నాడు గణంలోని ప్రముఖ సభ్యులకు భూముల్ని దానం చేసే అధికారాన్ని సంపాదించుకున్నాడు ఈ దానాలు పొందినవారికి ఆ గ్రామాల్లో శాంతిభద్రతల్ని రక్షించే బాధ్యత కూడా అప్పగించబడింది ఇలా రాజ్యం ఆర్థిక, పరిపాలనా సమస్యల్ని పరిష్కరించేది కొత్త రాజ్యాలూ, విస్తరిస్తున్న రాజ్యాలూ ఎక్కువ పన్నులు కావలసిన పరిస్థితిలో పడ్డాయి ఆ పన్నుల్ని వెనకబడ్డ గిరిజన ప్రాంతాలనుంచీ వసూలు చేయటానికి వీలుండేది కానీ గిరిజనులు నూతన వ్యవసాయ పద్ధతుల్ని అనుసరించేలాగా, తమకు విధేయులుగా ఉండేలాగా వారిని మార్చవలసి ఉండేది ఈ సమస్యను సాహసవంతులైన బ్రాహ్మణులకు గిరిజన ప్రాంతాల్లో భూముల్ని ఇవ్వటం ద్వారా రాజులు పరిష్కరించారు వీరు గిరిజనుల్ని మచ్చిక చేసుకొని, క్రమశిక్షణలో పెట్టగలిగినవారుగా ఉండేవారు

వెనకబడ్డ ప్రాంతాల్లో బ్రాహ్మణులకూ, ఇతరులకూ భూదానాలు ఇవ్వటం చేత వ్యవసాయ పంచాంగ విజ్ఞానం విస్తరించింది అయుర్వేదం గురించి అందరికీ తెలిసింది మొత్తం మీద వ్యవసాయ ఉత్పత్తి బాగా పెరిగింది రాత, ప్రాకృత, సంస్కృత భాషలూ కూడా విస్తరించాయి అంతకు పూర్వం వ్యాపారులూ, జైన, బౌద్ధసన్యాసులూ కొంత పని చేసినా భూదానాలవల్ల దక్షిణాదికీ, తూర్పు భారతదేశపు సరిహద్దులకూ నాగరికత వ్యాపించింది భూదానాలు ఆదిమ వాసులైన వ్యవసాయదారుల్ని పెద్ద సంఖ్యలో హిందూమతం పరిధిలోకి తీసుకువచ్చాయి వీరు ఆ తరువాత శూద్రులుగా పరిగణించబడ్డారు అందుచేతనే మధ్యయుగాలకు చెందిన తొలి గ్రంధాలలో శూద్రులు వ్యవసాయదారులుగా పేర్కొనబడ్డారు మరోవైపున భూదానాలు మరీ ముఖ్యంగా అభివృద్ధి చెందిన ప్రాంతాలలో స్వతంత్రులైన వైశ్య వ్యవసాయదారుల స్థాయిని దిగజార్చాయి అందుచేత ఆర్థికంగా, సామాజికంగా గుప్తుల కాలంనుంచీ ఒకరికొకరు దగ్గరయ్యారు కానీ భూదానాల ప్రధాన ఫలితం — రైతుల ఉత్పత్తి మీద జీవించే భూస్వామ్య వర్గం తయారు కావటం క్రీ శ ఐదు — ఆరు శతాబ్దాలలో ఫ్యూడలిజం అన్న నూతన సామాజిక వ్యవస్థ రూపొందటానికి ఇది పునాది వేసింది

ఫ్యూడల్ వ్యవస్థలో వ్యవసాయదారుల స్త్రీలస్థాయీ, క్షత్రియ స్త్రీలస్థాయీ పతనం కావటం ప్రారంభించింది మధ్యయుగాల ప్రారంభానికే రాజస్థాన్‌లో సతీసహగమనం సర్వసాధారణమైపోయింది కానీ దిగువ వర్గాల స్త్రీలకు ఆర్థిక కార్యకలాపాలలో పాల్గొనే స్వాతంత్ర్యమూ, పునర్వివాహం చేసుకునే స్వాతంత్ర్యమూ ఉండేవి

## ఉపసంహారం

కాబట్టి ప్రాచీన భారతీయ సమాజాన్ని ఒకే పేరుతో పిలవటం సాధ్యం కాదు అది పరిణామం చెందుతున్న పద్ధతిని బట్టి అనేక పేర్లు ఉపయోగించాలి పాత రాతియుగం నాటి ఆహార సేకరణ సమాజం — కొత్తరాతియుగం, రాగియుగాల

నాటి ఆహార ఉత్పత్తి సమాజంగా మార్పు చెందింది మొదట వ్యవసాయ సమాజాలుగా ఉన్నవి తరువాత హరప్పా పద్ధతి నగర సమాజాలుగా పరిణామం చెందాయి ఆ తరువాత గుర్రాలనూ, గోవులనూ మేపుకునేవారి సమాజం వచ్చింది "ఋగ్వేదం" ఆ కాలంలో పశుపాలన ప్రధానంగా ఉన్న గణ సమాజం ఉన్నట్టు చూపుతుంది మలివేదయుగంలో ఈ పశుపాలక సమాజం వ్యవసాయ సమాజంగా మార్పు చెందింది కానీ ఆ సమాజం అనుసరించిన వ్యవసాయ పద్ధతుల వల్ల పంట దిగుపడి ఎక్కువగా ఉండేది కాదు అందుచేత పాలకులు వ్యవసాయదారులవద్దనుంచీ ఎక్కువగా వసూళ్ళు చేసుకోగలిగేవారుకారు వేదకాలం తరువాత వర్గసమాజం స్పష్టంగా ఏర్పడింది దీనినే వర్ణవ్యవస్థ అంటారు ఈ సామాజిక వ్యవస్థ మొదట వైశ్యులూ, ఆ తరువాత వైశ్యులూ, శూద్రులూ కలిసి చేసే ఉత్పత్తిమీద ఆధారపడి ఉండేది మొత్తంమీద బుద్ధునికాలంనుంచీ గుప్తుల కాలంవరకూ సమాజం పెద్ద ఒడుదుడుకులు లేకుండా కొనసాగింది తరువాత అంతర్గత కల్లోలాలవల్ల ఆ సమాజంలో మార్పులు వచ్చాయి రాజులు పురోహితులకూ, ఉద్యోగులకూ భూదానాలు ఇవ్వటం ప్రారంభించారు అందుచేత రాజులకూ, రైతులకూ మధ్య ఒక భూస్వామ్యవర్గం రూపొందింది ఇది వైశ్యుల స్థాయిని దిగజార్చి, వర్ణవ్యవస్థలో మార్పుల్ని తీసుకువచ్చింది

* * *

## అధ్యాయం: 29

# సైన్సు, నాగరికతల వారసత్వం

### మతం

మానవుడు ప్రకృతితో చేసిన పోరాటం చెప్పుకోదగ్గ పరిణామాలకు దారితీసింది అడవులూ, కొండలూ, గట్టి నేలలూ, కరువులూ, వరదలూ, జంతువులూ విసిరిన సవాళ్ళను మానవుడు జయించవలసి వచ్చింది మానవుడు తన జీవిక కోసం ఆ పని చేయక తప్పలేదు ఈ క్రమంలోనే అతడు సాంకేతిక పరిజ్ఞానాన్ని అభివృద్ధి చేశాడు శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచుకున్నాడు కొన్ని సందర్భాలలో కొన్ని సమస్యలకు పరిష్కారమే లేకుండా పోయింది ప్రకృతి శక్తుల విలాసం అర్థమేకాకుండా పోయింది అందుచేత మానవులు వాటితో సర్దుబాటు చేసుకోవలం వచ్చింది వారు తమ ప్రయత్నాలమీదనే కాకుండా భూసారం మీదా, తగిన సమయానికి వాన రావటం మీదా, ఇతర ప్రకృతి వరాలమీదా కూడా ఆధారపడవలసి వచ్చింది ప్రకృతిలోని సంపదా, ప్రకృతిలోని విరోధ భావమూ, మానవుల్ని మతాన్ని గురించీ, మానవాతీత శక్తుల్ని గురించీ ఆలోచించేలా చేశాయి

ప్రాచీన భారతదేశంలో బ్రాహ్మణ మతం లేదా హిందూ మతం ప్రధానమతంగా అభివృద్ధి చెందింది అది సమాజాన్నీ, కళలనూ, సాహిత్యాన్నీ ప్రభావితం చేసింది హిందూమతం తోపాటు భారతదేశంలో జైన మతం, బౌద్ధమతం కూడా పుట్టాయి క్రైస్తవమతం భారతదేశానికి క్రీ శ మొదటి శతాబ్దం ప్రాంతంలోనే వచ్చినా అది ప్రాచీన భారతదేశంలో ముందుకు సాగలేకపోయింది జపాన్‌కూ, మధ్యఆసియాకూ విస్తరించినా భారతదేశంలో పుట్టిన బౌద్ధమతం కాలక్రమాన తన జన్మస్థానం నుంచీ అదృశ్యమైపోయింది కాని తన విస్తరణలో బౌద్ధమతం తనతోపాటు భారతీయ చిత్రకళనూ, భాషాసాహిత్యాలను ఇరుగుపొరుగు దేశాలకు తీసుకుపోయింది జైనమతం భారతదేశంలోనే ఉండి కళలూ, సాహిత్యమూ అభివృద్ధి చెందటానికి దోహదం చేసింది ఈ నాటికీ జైనమతానికి చాలా మంది అనుయాయులున్నారు – ముఖ్యంగా రాజస్థాన్, గుజరాత్, కర్ణాటక రాష్ట్రాల్లోని వ్యాపార వర్గాలలో

### వర్ణవ్యవస్థ

చాలా ప్రత్యేకమైన పద్ధతిలో భారతదేశంలో మతం సామాజిక వర్గాలు ఏర్పడటానికి దోహదం చేసింది ఇతర ప్రాచీన సమాజాలలో వివిధ సామాజిక వర్గాల విధులను రాజ్యం అమలుపరిచే చట్టం నిర్ణయించింది కానీ భారతదేశంలో వర్ణధర్మాలను రాజ్యమూ, మతమూ కూడా ఆమోదించాయి పురోహితుల, యోధుల, వ్యవసాయదారుల, సేవకుల విధుల్ని దైవిక శక్తులు నిర్ణయించాయని చెప్పబడే చట్టం నిర్ణయించేది ఆ విధుల్ని నిర్వహించనివారిని నేరస్థులుగా పరిగణించి లౌకిక శిక్షలు విధించేవారు వారు పూజలనూ, కర్మకాండలనూ కూడా చేయాలి అవి వర్ణాన్ని బట్టి మారుతుండేవి ప్రతి వర్ణానికీ ప్రత్యేకమైన సామాజిక సంబంధమైన గుర్తింపు మాత్రమేకాకుండా, కర్మకాండ సంబంధమైన గుర్తింపు కూడా ఉండేది క్రమక్రమంగా చట్టమూ, మతమూ వర్ణాలనూ, కులాలనూ (జాతులను) వంశపారంపర్యంగా స్థిరీకరించాయి ఇవన్నీ కూడా వైశ్యులు పంటలు పండిస్తూ, పన్నులు చెల్లిస్తూ ఉండటానికీ, శూద్రులు – పై వర్ణాలవారికి సేవలు చేస్తూ ఉండటానికీ చేయబడ్డాయి అలా ఉన్నప్పుడు మాత్రమే బ్రాహ్మణులు పురోహితులుగా, క్షత్రియులు పాలకులుగా ఉండటానికి వీలయ్యేది పని విభజన ఉండటం చేతా, అందుచేత పనిలో ప్రావీణ్యత లభించటం చేతా వర్ణవ్యవస్థ మొదట సామాజిక, ఆర్థికాభివృద్ధికి నిస్సందేహంగా దోహదం చేసింది అది రాజ్యవ్యవస్థ అభివృద్ధి చెందటానికి కూడా కృషిచేసింది ఉత్పత్తి చేసే కులాలూ, సేవచేసే వర్ణాలూ – ఆయుధాలు ధరించే అధికారం లేకుండా చేయబడింది క్రమక్రమంగా ఒక వర్ణం మరొక వర్ణం మీదికి పురికొల్పబడింది అందుచేత పీడితులు ఏకమై తమను పీడిస్తున్న వర్గాల మీద తిరుగుబాటు చేసే అవకాశమే లేకుండా పోయింది

ప్రతి వారూ తమ ధర్మాన్ని తాము నిర్వహించి తీరాలన్న భావం ప్రతి వర్గం (వర్ణం) వారి మనస్సులోనూ జీర్ణమై పోయేలా చేయబడింది అందుచేత ఎవరూ ధర్మాన్ని వ్యతిరేకించాలని సాధారణంగా బావించేవారు కారు "భగవద్గీత" ప్రతివారూ తమ ధర్మాన్ని నిర్వర్తించటంలో చనిపోవటమే మంచిదనీ, ఇతరుల ధర్మాన్ని ఆచరించటానికి ప్రయత్నించటం ప్రమాదకరమనీ బోధించింది తక్కువ వర్ణాలవారు మరో లోకంలోనో, మరో జన్మలోనో మెరుగైన జీవితం లభిస్తుందన్న గట్టి నమ్మకంతో ఈ జన్మలో కష్టపడి పని చేసేవారు అలా ఉత్పత్తి చేసే రైతులకూ, వారి ఉత్పత్తిని అనుభవించే బ్రాహ్మణులకూ, క్షత్రియులకూ, ఉద్యోగులకూ, పెద్ద వ్యాపారులకూ మధ్య ఉద్రిక్తతలు తగ్గిపోవటానికి ఈ నమ్మకం దోహదం చేసింది అందుచేత ప్రాచీన భారతదేశంలో కింది వర్గాల ప్రజల మీద ఎక్కువగా బలప్రయోగం చేయవలసిన అవసరం లేకుండా పోయింది గ్రీసులోనూ, రోమ్‌లోనూ కొరడా ఝుళిపిస్తే బానిసలు చేసినంత పనిని ప్రాచీన భారతదేశంలో వైశ్యులూ, శూద్రులూ తమంతకు తాముగా చేశారు అందుకు కారణం బ్రాహ్మణుల బోధనలూ, వర్ణవ్యవస్థే!

## తత్వశాస్త్ర వ్యవస్థలు

భారతీయ మేధావులు ప్రపంచాన్ని మాయ అని నమ్మి ఆత్మకూ, పరమాత్మకూ ఉన్న సంబంధాన్ని గురించి లోతుగా ఆలోచించారు ఈ సమస్యను గురించి ప్రపంచంలోని ఏ ఇతర దేశపు తత్వవేత్తలూ ఇంత లోతుగా తర్కించలేదు తత్వ శాస్త్రానికీ, ఆధ్యాత్మిక తత్వానికీ ప్రాచీన భారతదేశం చేసిన సేవ ప్రసిద్ధమైంది అయితే భారతీయులు భౌతికవాద ప్రాపంచిక దృక్పథాన్ని కూడా అభివృద్ధి చేశారు భారతీయులు అభివృద్ధి చేసిన ఆరు తాత్విక దృక్పథాలలోని (షడ్దర్శనాలు) కపిలుని సాంఖ్య దర్శనంలో భౌతికవాద ఛాయలున్నాయి కపిలుడు క్రీ పూ 580లో జన్మించాడు వాస్తవిక జ్ఞానంద్వారా ఆత్మ ముక్తిని సాధిస్తుందని అతడు నమ్మాడు వాస్తవిక జ్ఞానం పరిశీలన ద్వారా, తర్కం ద్వారా, పదాల ద్వారా లభిస్తుందని అతడు చెప్పాడు సాంఖ్యదర్శనం భగవంతుని ఉనికిని గుర్తించదు సాంఖ్య దర్శనం ప్రకారం ప్రపంచాన్ని ప్రకృతి సృష్టించిందే కానీ భగవంతుడు కాదు ప్రపంచాన్నీ, మానవ జీవితాన్నీ ప్రకృతి శక్తులు మాత్రమే నడిపిస్తాయి

భౌతికవాద తత్వశాస్త్రానికి క్రీ పూ 6 వ శతాబ్దం ప్రాంతంలో నివసించిన చార్వాకుడు అందరికంటే ఎక్కువ దోహదం చేశాడు అతడు ప్రతిపాదించిన తత్వశాస్త్రానికి "లోకాయుతం" అని పేరు మానవుడు తన ఇంద్రియాల సహాయంతో అనుభవించలేని వస్తువుకు అస్తిత్వం లేదన్నాడతడు అంటే – భగవంతుడు లేడని అర్థం కానీ వ్యవసాయమూ, చేతివృత్తులూ, నగర జీవితమూ పతనం కావటంతో – భావవాద ప్రాపంచిక దృక్పథం ముందుకొచ్చింది భావవాద దృక్పథం ప్రపంచం మాయనీ, అజ్ఞానమనీ బోధించింది ప్రపంచాన్ని త్యజించి, మోక్షం కోసం కృషి చేయమని ఉపనిషత్తులు ప్రబోధించాయి ఆధునిక సాంకేతిక విజ్ఞానం సృష్టించిన సమస్యల్ని పరిష్కరించుకోలేని పాశ్చాత్య మేధావులు ఉపనిషత్తులను ఆమోదిస్తున్నారు సుప్రసిద్ధ జర్మన్ తత్వవేత్త స్కోపెన్‌హోర్ (Schopenhauer) తన తత్వశాస్త్ర పద్ధతిలో వేదాలకూ, ఉపనిషత్తులకూ స్థానం కల్పించాడు ఉపనిషత్తులు తన్ను ఈ జీవితంలో ఊరడించాయనీ, చనిపోయిన తరువాత కూడా అవి ఊరడిస్తాయనీ అతడు చెప్పేవాడు

## హస్తకళలూ, సాంకేతిక విజ్ఞానం

భౌతిక సంస్కృతిలో భారతీయులు ఎలాంటి అభివృద్ధీ సాధించలేదని భావించటం తప్పు వారు అనేక ఉత్పత్తి రంగాలలో విజ్ఞానాన్ని సాధించారు భారతీయ కళాకారులు రంగులు అద్దటంలోనూ, రకరకాల రంగులు తయారు చేయటంలోనూ గొప్ప నైపుణ్యాన్ని కలిగి ఉండేవారు భారతీయులు తయారు చేసిన సహజ వర్ణాలు కాంతివంతంగా ఉండేవి, గొప్ప మన్నిక కలిగిఉండేవి అందుకు సాక్ష్యంగా అజంతా చిత్రాలు ఇప్పటికీ అప్పటిలాగే ఉన్నాయి

అలాగే భారతీయులు ఉక్కును తయారుచేయటంలో గొప్ప నిపుణులు ఈ సాంకేతిక విజ్ఞానం మొదట భారత దేశంలోనే కనుక్కోబడింది భారతదేశంలో తయారైన ఉక్కు చాలా ప్రాచీన కాలంలోనే ఇతర దేశాలకు ఎగుమతి అయ్యేది తరువాతి కాలంలో ఆ ఉక్కును "ఊట్జ్" అని పిలిచేవారు భారతదేశంలోని కమ్మరులు తయారు చేసిన కత్తుల్ని పోలిన వాటిని ప్రపంచంలో ఏదేశంలోనూ తయారు చేయగలిగేవారు కారు ఆసియానుంచీ యూరప్ వరకూ ఆ కత్తులకు గొప్ప గిరాకీ ఉండేది

## పరిపాలనా వ్యవస్థ

భారతీయులు సువిశాల సామ్రాజ్యాన్ని పరిపాలించ గలిగారనీ, సంక్లిష్ట సమాజం సృష్టించిన సమస్యల్ని పరిష్కరించుకోగలిగారనీ కౌటిల్యుని "అర్థశాస్త్రం" సందేహాలకు చోటు లేకుండా నిరూపిస్తుంది భారతదేశంలో అశోకుని వంటి గొప్ప రాజు పుట్టాడు అతడు కళింగ యుద్ధంలో గెలిచినా, శాంతి సామరస్యాల విధానాన్ని అనుసరించాడు అశోకుడే కాదు – అనేకమంది భారతీయ రాజులు మత

సామరస్యాన్ని పాటించారు ఇతర మతాలకు చెందిన ప్రజల అభీష్టాలను గౌరవించాలని గట్టిగా చెప్పారు అంతేకాదు, గ్రీస్‌తోపాటు భారతదేశంలో మాత్రమే ఒక రకమైన ప్రజాస్వామ్య వ్యవస్థను గురించి ప్రయోగాలు జరిగాయి

## సైన్సు, గణితం

భారతదేశం సైన్సుకు ప్రధానమైన దోహదం చేసింది ప్రాచీన కాలంలో మతమూ, సైన్సూ విడదీయటానికి వీలు లేనంతగా కలిసిపోయి ఉండేవి గ్రహాలను దేవుళ్ళని భావించటం చేతా, వాటి గమనాన్ని జాగ్రత్తగా గమనించటం చేతా భారతదేశంలో ఖగోళ శాస్త్రం గొప్ప అభివృద్ధిని సాధించింది వాటి గమనం మీద రుతువులు ఆధారపడి ఉండటం చేతా, రుతువులకు సంబంధించిన ఎరుక వ్యవసాయ కార్యకలాపాలకు అవసరం కావడంచేత కూడా గ్రహాలను గురించి తెలుసుకోవలసివచ్చింది ప్రాచీన కాలంలో బ్రాహ్మణులు వైదిక ప్రార్ధనలనూ, మంత్రాలనూ అత్యంత నిర్దుష్టంగా పలకాలన్న నిబంధనను విధించటంచేత వ్యాకరణశాస్త్రమూ, భాషాశాస్త్రమూ అభివృద్ధి చెందాయి వాస్తవానికి భారతీయుల శాస్త్రీయ దృష్టియొక్క మొదటి ఫలితం సంస్కృత వ్యాకరణ రచన క్రీ పూ 4 వ శతాబ్దంలో పాణిని సంస్కృత భాషాసూత్రాలను క్రమబద్ధీకరించి "అష్టాధ్యాయి" అన్న వ్యాకరణ గ్రంథాన్ని రాశాడు

క్రీ పూ 3 వ శతాబ్దం ప్రాంతంలో గణిత శాస్త్రం, ఖగోళశాస్త్రం, వైద్యశాస్త్రం స్వతంత్రంగా అభివృద్ధి చెందటం ప్రారంభించాయి గణిత శాస్త్రంలో భారతీయులు మూడు గొప్ప విజయాలను సాధించారు అవి 1 సంజ్ఞామానాన్నీ 2 దశాంశపద్ధతినీ 3 సున్ననూ కనుగొనటం దశాంశ పద్ధతిని మనం ఉపయోగిస్తున్నట్టుగా క్రీ శ ఐదవ శతాబ్దంలో తొట్టతొలి ఆధారం లభిస్తుంది భారతీయ సంజ్ఞామానాన్ని అరబ్బులు తీసుకొని, దాన్ని పాశ్చాత్య దేశాలకు విస్తరింప చేశారు భారతీయ సంజ్ఞలను అరబ్బులు "హిందసా" అంటారు కానీ పాశ్చాత్యులు వాటిని అరబిక్ సంఖ్యలంటారు ఈ సంజ్ఞలు పాశ్చాత్య దేశాలకు విస్తరించటానికి పూర్వం అనేక శతాబ్దాలుగా భారతదేశంలో ఉపయోగంలో ఉండేవి క్రీ పూ 3 వ శతాబ్దంలో వేయించిన అశోకుని శాసనాల్లో కూడా ఇవి కనిపిస్తాయి

దశాంశ పద్ధతిని మొట్టమొదట ఉపయోగించిన వారు భారతీయులే సుప్రసిద్ధ గణిత శాస్త్రవేత్త ఆర్యభట్ట (క్రీ శ 476 – 500)కు దశాంశ పద్ధతిని గురించి తెలుసు బౌద్ధభిక్షువుల ద్వారా చైనీయులు దీన్ని నేర్చుకున్నారు దశాంశపద్ధతిని భారతీయుల వద్దనుంచీ అరబ్బులు నేర్చుకొంటే, వారి వద్దనుంచీ పాశ్చాత్యులు నేర్చుకున్నారు

క్రీ పూ రెండవ శతాబ్దం ప్రాంతంలో భారతీయులు సున్నను కనుగొన్నారు దాన్ని కనుగొన్న నాటినుంచీ సున్నను గణితశాస్త్రవేత్తలు ఒక ప్రత్యేక సంఖ్యగా పరిగణిస్తూ వచ్చారు అంక గణితంలో దాన్ని అలాగే ఉపయోగిస్తూ వచ్చారు అరేబియాలో సున్నను అలా ఉపయోగించటం క్రీ శ 873 నుంచీ కనిపిస్తుంది అరబ్బులు సున్నను భారతదేశం నుంచీ స్వీకరించి, యూరప్‌కు విస్తరింప చేశారు బీజగణితం (ఆల్జీబ్రా) అభివృద్ధికి గ్రీకులూ, భారతీయులు కూడా కృషి చేశారు పశ్చిమ యూరోపియన్ దేశాలు బీజగణిత విజ్ఞానాన్ని గ్రీస్‌నుంచీ గ్రహించలేదు – భారతదేశంనుంచి గ్రహించిన అరబ్బులనుంచి గ్రహించారు

భారతదేశంలోని వాయవ్య ప్రాంతంలో కొలతల్ని గురించీ, క్షేత్రగణితాన్ని గురించీ చక్కని పరిజ్ఞానం ఉండేదని హరప్పా నిర్మాణాలు నిరూపిస్తున్నాయి చివరగా వేదకాలపు ప్రజలు ఈ విజ్ఞానఫలితాలను అందుకొని ఉండవచ్చు క్రీ పూ ఐదవ శతాబ్దానికి చెందిన "శుల్వసూత్రాలు" అన్న గ్రంథంలో కొలతల విజ్ఞానం కనిపిస్తోంది క్రీ పూ రెండవ శతాబ్దంలో ఆపస్తంబుడు యజ్ఞవేదికలు నిర్మించటానికి ఒక క్షేత్ర గణిత గ్రంథాన్ని రాశాడు దాని ఆధారంగా రాజులు యజ్ఞాలు చేయటం కోసం యజ్ఞవేదికలను నిర్మించేవారు ఆ గ్రంథం గురుకోణమూ, సమకోణమూ, లఘుకోణము అన్న మాటల్ని నిర్వచిస్తుంది త్రికోణ వైశాల్యాన్ని కనుక్కునే సూత్రాన్ని తయారుచేశారు అది త్రికోణమితికి దారితీసింది ఈ కాలానికి చెందిన అత్యంత ప్రసిద్ధమైన గ్రంథం "సూర్య సిద్ధాంతం" అలాంటి గ్రంథం తూర్పు దేశాలలో ఆనాటికి రాలేదు

సుప్రసిద్ధ ఖగోళ శాస్త్రవేత్తలైన ఆర్యభట్ట, వరాహమిహిరుడు ఐదు, ఆరు శతాబ్దాలకు చెందినవారు గ్రహాల స్థితిని ఆర్యభట్ట బాబిలోనియన్ పద్ధతిలో లెక్కకట్టాడు అతడు చంద్ర సూర్య గ్రహణాలకు కారణాలను కనుగొన్నాడు భూమి పరిధిని అతడు ఊహాశక్తితో కనుగొన్నాడు ఆ లెక్క సరైందేనని ఈ నాటికీ భావించబడుతోంది అతడు సూర్యుడు నిలకడగా ఉంటాడనీ, భూమి పరిభ్రమిస్తుందనీ కూడా చెప్పాడు ఆర్యభట్ట రాసిన పుస్తకం పేరు "ఆర్యభట్టీయం"

వరాహమిహిరుని ప్రసిద్ధ గ్రంథం పేరు "బృహత్ సంహిత" అది క్రీ శ ఆరవ శతాబ్దంలో వచ్చింది అతడు చంద్రుడు భూమిచుట్టూ పరిభ్రమిస్తాడనీ, భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తుందనీ చెప్పాడు అతడు గ్రహాల గమనాన్నీ, ఇతర భూగోళ శాస్త్ర సమస్యలనూ అభివర్ణించటానికి అనేక గ్రీకు పదాలను ఉపయోగించాడు గ్రీకుల విజ్ఞానం భారతీయ ఖగోళ శాస్త్రాన్ని ప్రభావితం చేసింది కానీ భారతీయులు

ఆ శాస్త్రాన్ని ముందుకు తీసుకువెళ్ళారు దాన్ని గ్రహాలను పరిశీలించటంలో ఉపయోగించుకున్నారు

అనువర్తిత శాస్త్రరంగంలో భారతీయులు రసాయన శాస్త్రం అభివృద్ధికి చాలా కృషి చేశారు భారతీయ రంగు అద్దకం నిపుణులు వెలిసిపోని రంగుల్ని తయారు చేశారు వారు నీలిరంగును సృష్టించారు భారతీయ కమ్మరులు ఎలా ప్రపంచంలో మొదటిసారిగా ఉక్కును తయారుచేశారో ఇంతకుపూర్వమే చర్చించాం

## వైద్యశాస్త్రం

ప్రాచీన భారతీయ వైద్యులు శరీర శాస్త్రాన్ని అధ్యయనం చేశారు వారు రోగనిర్ధారణ చేసి, ఆ రోగాలకు మందుల్ని నిర్ణయించే ప్రయత్నాన్ని చేశారు వైద్యశాస్త్రం ప్రస్తావన మొదటిసారిగా "అధర్వవేదం"లో వస్తుంది ఇతర ప్రాచీన సమాజాలలోలాగే ప్రాచీన భారతీయ సమాజంలోకూడా మందులు మంత్రాలతో, తంత్రాలతో కలిసి ఉండేవి అందుచేత వైద్యశాస్త్రం శాస్త్రీయ మార్గంలో అభివృద్ధి చెందలేదు

క్రీ శ రెండవ శతాబ్దంలో వైద్య శాస్త్రరంగంలో ఇద్దరు ప్రసిద్ధ విద్వాంసులు పుట్టారు వారు శుశ్రుతుడు, చరకుడు శుశ్రుతుడు తాను రాసిన "శుశ్రుత సంహిత"లో కంటిలోని శుక్లాన్ని ఎలా శస్త్రచికిత్సతో తీసివేయవచ్చో చెప్పాడు అలాగే మూత్రాశయంలో రాళ్ళకూ, ఇతర జబ్బులకు కూడా శస్త్ర చికిత్సలు చెప్పాడు శస్త్రచికిత్సలో ఉపయోగించే 121 పరికరాలను పేర్కొన్నాడు చికిత్సలో అతడు ఆహారానికీ, పరిశుభ్రతకూ ప్రాధాన్యత నిచ్చాడు

చరకుని "చరక సంహిత" భారతీయ వైద్యశాస్త్రానికి విజ్ఞాన సర్వస్వం వంటిది ఈ గ్రంధం అనేక రకాల జ్వరాలనూ, కుష్టు వ్యాధినీ, హిస్టీరియానూ (మిర్గి), క్షయనూ వర్ణనాత్మకంగా చర్చిస్తుంది కానీ చరకునికి బహూశా ఈ వ్యాధులలో కొన్ని అంటురోగాలని తెలియక పోవచ్చు అతని గ్రంధంలో అనేక ఓషధుల పేర్లు పేర్కొనబడ్డాయి భారతీయ వైద్యశాస్త్రాన్ని అధ్యయనం చేయటానికి మాత్రమే కాకుండా – ప్రాచీన కాలపు వృక్ష సంపదను గురించీ, రసాయనిక శాస్త్రాన్ని గురించీ కూడా ఈ గ్రంథం ద్వారా తెలుసుకోవచ్చు తరువాతి కాలంలో భారతీయ వైద్యశాస్త్రం చరకుడు వేసిన బాటలోనే ముందుకు నడిచింది

## భూగోళ శాస్త్రం

ప్రాచీన కాలపు భారతీయులు భూగోళ శాస్త్రం అధ్యయనానికి కూడా కొద్దిగా దోహదం చేశారు వారికి భారతదేశం అవతల ఉన్న దేశాలకు సంబంధించిన పరిజ్ఞానం దాదాపు ఉండేది కాదు కానీ భారతదేశంలోని నదులనూ, పర్వతాలనూ, పుణ్యక్షేత్రాలనూ పురాణాలు పేర్కొన్నాయి చైనాను గురించీ, యూరోపియన్ దేశాలను గురించీ వారికి తెలిసినా – అవి ఎక్కడున్నాయో, ఎంత దూరంలో ఉన్నాయో వారికి స్పష్టంగా తెలియదు

తొలి రోజుల్లో ప్రాచీన భారతీయులు నౌకాయానాన్ని గురించి కొంత విజ్ఞానాన్ని సంపాదించారు పడవలు తయారు చేసే నైపుణ్యానికి దోహదం చేశారు కానీ ప్రధాన అధికార కేంద్రాలు సముద్రతీరానికి చాలా దూరంలో ఉండటం చేతా, సముద్రం మీదనుంచి ప్రమాదం వస్తుందన్న భయం లేకపోవటంచేతా భారతీయ రాజులు నౌకాయానాన్ని గురించి ప్రత్యేకశ్రద్ధ తీసుకోలేదు

## కళలు, సాహిత్యం

ప్రాచీన భారతీయ శిల్పులూ, కళాకారులూ ఎంతో అందమైన కళాఖండాలను సృష్టించారు అశోకుడు చెక్కించిన ఏకశిలా స్తంభాలు నునుపుకూ, మెరుపుకూ ప్రసిద్ధి చెందాయి వాటి నునుపూ, మెరుపూ ఎన్ పి బి డబ్లియు పాత్రలతో సమానంగా ఉంటుంది ఆనాటి కళాకారులు వాటిని ఎలా సాధించారో ఈనాటికీ అర్ధంకాని విషయమే మౌర్యుల కాలంనాటి నునుపు చేసిన స్తంభాల మీద జంతువుల విగ్రహాలను నిలిపేవారు అలాంటి జంతువుల్లో ముఖ్యమైంది సింహం ఆ సింహం బొమ్మనే భారతప్రభుత్వం జాతీయ చిహ్నంగా అంగీకరించింది అజంతా గుహాలయాలనూ, సుప్రసిద్ధమైన దాని కుడ్యచిత్రాలను కూడా మన ప్రాచీన కళాకారుల ప్రతిభకు చిహ్నాలుగా పేర్కొనాలి

ఒకరకంగా అజంతా ఆసియా చిత్రకళకు జన్మస్థానం అక్కడ దాదాపు 30 గుహాలయాలున్నాయి వీటి నిర్మాణ కాలం క్రీ పూ రెండవ శతాబ్దం నుంచీ క్రీ శ ఏడవ శతాబ్దం వరకూ ఆ గుహలలో చిత్రాల రచన క్రీ శ రెండవ శతాబ్దంలో ప్రారంభమైంది వాటిలో ఎక్కువభాగం గుప్తుల కాలానికి చెందినవి ఆ చిత్రాల వస్తువులు బుద్ధుని జాతక గాధల నుంచీ, ఇతర మూలాలనుంచీ గ్రహించబడ్డాయి అజంతాలో భారతీయ కళాకారుల నైపుణ్యాన్ని ప్రపంచ కళాభిమానులంతా ప్రశంసించారు అజంతా చిత్రాలలోని రేఖల్లో, వర్ణాలలో కనిపించే నైపుణ్యం యూరోపియన్ దేశాలలో క్రీ శ 14–16 శతాబ్దాలలో వచ్చిన పునరుజ్జీవన కాలం వరకూ కనిపించదు భారతీయ కళలు భారతదేశానికే పరిమితం కాలేదు – అవి ఒకవైపున మధ్యఆసియాకూ, చైనాకూ, మరో వైపున ఆగ్నేయ ఆసియాకూ విస్తరించాయి భారతీయ శిల్పకళ ఆఫ్ఘనిస్థాన్‌కూ, మధ్యఆసియాలోని ఇరుగుపొరుగు

దేశాలకూ వ్యాపించటానికి కేంద్రబిందువు గాంధార దేశం భారతీయ శిల్పకళలోని కొన్ని అంశాలు మధ్యఆసియా, గ్రీకు కళలోని కొన్ని అంశాలతో సమ్మేళనం పొంది, గాంధార శిల్పకళ రూపొందింది బుద్ధుని మొట్టమొదటి రూపశిల్పం ఈ శైలిలోనే తయారైంది బుద్ధుని ముఖ కవళికలు భారతీయ పద్ధతిలోనే ఉన్నా – తల పరిమాణం, విధానం, వస్త్రధారణా గ్రీకు పద్ధతిలో ఉన్నాయి దక్షిణ భారతదేశంలో కట్టిన దేవాలయాలు ఆగ్నేయ ఆసియాలో దేవాలయాల నిర్మాణానికి నమూనాలుగా పని చేశాయి కాంబోడియాలోని అంకోర్వత్‌లోనూ, జావాలోని బోరోబుదూర్‌లోనూ ఉన్న దేవాలయాలను గురించి ఇంతకుముందే తెలుసుకున్నాం

## విద్యావ్యవస్థ

మన ప్రాచీన విద్యారంగంలో నలందాలోని బ్రహ్మాండమైన భిక్షుకారామాన్ని పేర్కొనవచ్చు అది భారతదేశంలోని వివిధ ప్రాంతాలనుంచీ మాత్రమే కాకుండా టిబెట్ నుంచీ, చైనా నుంచి కూడా విద్యార్థులను ఆకర్షించేది పరీక్షలలో ప్రమాణాలు చాలా కఠినంగా ఉండేవి ద్వారపండితుడు (ద్వారం వద్ద ఉన్న విశ్వవిద్యాలయ విద్వాంసుడు) పెట్టిన పరీక్షలో నెగ్గినవారికి మాత్రమే ఆ విశ్వవిద్యాలయంలో ప్రవేశం ఉండేది చదువుకూ, తత్వశాస్త్రానికీ, ధ్యానానికీ అంకితమైన వేలాది బౌద్ధ భిక్షువుల నివాసంగా, బోధనాలయంగా ఆ విశ్వవిద్యాలయం విలసిల్లింది అలాంటి విద్యాలయాల్లో అది మొదటిది కూడా

సాహిత్యరంగంలో భారతీయులు ఋగ్వేదానికి జన్మనిచ్చారు అది ఇండో–ఆర్యన్ సాహిత్యంలో మొట్టమొదటి గ్రంథం దాని ఆధారంగానే ఆర్యసంస్కృతి స్వభావాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం జరిగింది గుప్తుల కాలంలో కాళిదాసు గ్రంథాలు వచ్చాయి అతడు రాసిన "అభిజ్ఞాన శాకుంతలం" ప్రపంచంలోని అన్ని ముఖ్యమైన భాషల్లోకీ అనువాదమైంది

★ ★ ★

# Bibliography

## General

B N Dutt, *Studies in Indian Social Polity,* Calcutta, 1944

J Allan T W Haig and H H Dodwell *The Cambridge shorter History of India, Part I Ancient India* Delhi, 1958

A L Basham (ed ) *A Cultural History of India* Oxford 1975

– *The Wonder that was India* London 1954

D M Bose & Others, *Concise History of Science in India,* New Delhi, 1971

J Filliozat (tr ) P Spratt *Political History of India from the Earliest Times to the 7th Century A D* Calcutta, 1957

A Ghosh, *An Encyclopaedia of Indian Archaeology* two vols New Delhi 1989

D N Jha, *Ancient India. An Introductory Outline,* New Delhi 1977

D D Kosambi *An Introduction to the Study of Indian History* Bombay 1956

– *The Culture and Civilisation of Ancient India in Historical Outline* London 1965

H C Raychaudhuri, *Political History of Ancient India,* 7th edn Calcutta 1972

H G Rawlinson *India A Short Cultural History,* London, 1937

K A Nilakanta Sastri & G Srinivasachari *Advanced History of India,* New Delhi 1970

R S Sharma *Aspects of Political Ideas and Institutions in Ancient India,* 2nd edn Delhi 1968

– *Perspectives in Social and Economic History of Early India* New Delhi 1983

B K. Thapar, *Recent Archaeological Discoveries in India,* UNESCO Publication Tokyo 1985

Romila Thapar, *A History of India,* Vol I Penguin, 1966

R S Tripathi *History of Ancient India* Delhi 1960

Sir Mortimer Wheeler & A L Basham, *Oxford History of India* (Revised) Part I Oxford, 1958

## Chapter 2 - Modern Historians of Ancient India

C H. Philips (ed ) *Historians of India, Pakistan and Ceylon,* London 1961

– *Problems of Historical Writing in India* Delhi, 1963

## Chapter 3 Types of Sources and Historical Construction

J Filliozat, (tr ) P Spratt, *Political History of India from the Earliest Times to the 7th Century A D* Calcutta, 1957

## Chapter 4 - The Geographical Setting

C.C Davies *Historical Atlas of the Indian Peninsula,* London 1956

B Subba Rao *The Personality of India,* 2nd edn Baroda, 1958

## Chapter 5 - The Stone Age The Early Man

**Chapter 6 Chalcolithic Farming Cultures**

**Chapter 7 The Harappan Culture Bronze Age Civilisation**


D.P Agarwal *Copper Bronze Age* New Delhi 1971

B & R Allchin *The Rise of Civilization in India and Pakistan* Cambridge 1982

Walter A Fairservis Jr *The Roots of Ancient India,* New York 1971

A Ghosh *City in Early Historical India* Simla 1973

D H Gordon, *The Prehistoric Background of Indian Culture,* Bombay 1958

J Marshall *Mohenjo Daro and the Indus Civilization,* 3 vols London 1931

S Piggott *Prehistoric India* 2nd edn Baroda, 1958

R E M Wheeler, *Early India and Pakistan* London 1959

- *The Indus Civilization* 3rd edn Cambridge 1968
- *Civilization of the Indus Valley and Beyond,* London 1966


**Chapter 8 - Advent of the Aryans and the Age of the Rig Veda**

**Chapter 9 - The Later Vedic Phase Transition to the State and Social Orders**


Jogiraj Basu *India of the Age of the Brahmanas* Calcutta 1969

E Benveniste (tr) E Palmer *Indo European Language and Society* London 1973

A.A Macdonell & A B Keith *Vedic Index of Names and Subjects* London 1912

E.J Rapson (ed) *Cambridge History of India,* Vol I Cambridge 1922

R S Sharma *Material Culture and Social Formations in Ancient India* Delhi 1983

- *Origin of the State in India* Bombay 1989

Vibha Tripathi *The Painted Grey Ware An Iron Age Culture of Northern India,* Delhi 1976


**Chapter 10 - Jainism and Buddhism**


W Rahul *What the Buddha Taught,* Bedford 1959

A K Warder, *Indian Buddhism,* Varanasi, 1970

C.J Shah *Jainism in Northern India (c 800 B C 526 A.D)* Bombay 1932

R S Sharma, *Material Culture and Social Formations in Ancient India,* Delhi 1983


**Chapter 11 Territorial States and the First Magadhan Empire**


H C Raychaudhuri *Political History of Ancient India,* Calcutta, 1972 Part II Chapters I & II


**Chapter 12 Iranian and Macedonian Invasions**


E.J Rapson (ed) *Cambridge History of India* Vol I Cambridge 1922 Chapters XIV to XVI


**Chapter 13 State and Varna Society in the Age of the Buddha**


A N Bose, *Social and Rural Economy of Northern India,* 2 vols Calcutta 1942 45

D R Chanana, *Slavery in Ancient India* New Delhi 1960

Richard Fick *The Social Organisation in North West India in Buddha s Time* Calcutta 1920

Narendra Wagle *Society at the Time of the Buddha* Bombay 1966


**Chapter 14 The Age of the Mauryas**

### Chapter 15 Significance of the Maurya Rule

B M Barua *Ashoka and His Inscriptions* Calcutta 1955

D R Bhandarkar, *Ashoka,* Calcutta 1932

G M Bongard Levin *Mauryan India,* Delhi 1985

R P Kangle *The Kautilya Arthasastra A Critical Edition with a Glossary,* Bombay 1960

R K Mookerji *Chandragupta Maurya and His Times,* Banaras 1960

– *Ashoka* London 1928

K A Nilakanta Sastri (ed ) *Age of the Nandas and Mauryas,* Banaras 1952

Romila Thapar *Ashoka and the Decline of the Mauryas* Oxford 1961

R E M Wheeler *Early India and Pakistan* London 1959

### Chapter 16 Central Asian Contacts and their Results

*Central Asia in the Kushan Period* 2 vols Moscow 1974 75

B Chattopadhyay *Age of Kushans A Numismatic Study,* Calcutta 1976

A K Narain *The Indo Greeks,* Oxford 1957

B N Puri, *India under the Kushans, Bombay,* 1965

B N Mukherjee *The rise and fall of the Kushana Kmfire,* Calcutta 1988

### Chapter 17 - The Age of the Satavahanas

K A Nilakanta Sastri, *A History of South India,* 4th Madras, 1976

K.A Nilakanta Sastri (ed ) *A Comprehensive History of India,* Vol II *The Mauryas and Satavahanas* Bombay 1957

R.S Sharma *Aspects of Political Ideas and Institutions in Ancient India* Delhi, 1968 Chapter XIV

G Yazdani (ed ) *The Early History of the Deccan* Oxford 1960

### Chapter 18 - The Dawn of History in the Deep South

V Kanakasambhai Pillai *The Tamils Eighteen Hundred Years Ago* Madras, 1904

K A Nilakanta Sastri *A History of South India,* 4th edn Madras 1976, Chapters VIII & IX

Suvira Jaiswal *Origin and development of Vaishnavisus and idn* Delhi, 1981

### Chapter 19 - Crafts, Trade and Towns in the Post Maurya Age

G L Adhya, *Early Indian Economics Studies in the Economic Life of Northern and Western India C 200 B C 300 A.D* Bombay, 1966

P L Gupta *Roman Coins from Andhra Pradesh,* Hyderabad, 1965

W Schoff *The Periplus of the Erythrean Sea,* 1912

R E M Wheeler, *Rome Beyond the Imperial Frontiers,* London 1954

### Chapter 20 - The Rise and Growth of the Gupta Empire

### Chapter 21 - Life in the Gupta Age

J F Fleet, *Inscriptions of the Early Gupta Kings,* London, 1888, Chapters II III

S R Goyal *The History of the Imperial Guptas,* Allahabad, 1967

